# శృంగార శ్రీనాథము

గ్రంథకర్త :

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి



శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళి

సంపాదకులు

డా॥ వేటూరి ఆనందమూర్తి



మణిమంజరి ప్రచురణలు

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్

హైదరాబాదు

*Sri Prabhakara Sampurna Grandhavali-2*
**Manimanjari Prachuranalu**
**Sringara Sreenadhamu**
By the late Sri Veturi Prabhakara Sastri

First Edition 1923
Second Edition 1985
Copies 1000

Title Design : Seela Veerraju



**Price Rs 50/—**
(For members Rs 25/—)

*Published by* :
**Manimanjari Prachuranalu**
Veturi Prabhakara Sastri Memorial Trust, Hyderabad

*Printed at*
Master Art Printers
1-1-694/2/A, Gandhinagar
Hyderabad-500380.

శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళి–౧

# శృంగార శ్రీనాథము

గ్రంథకర్త

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి



గ్రంథ ప్రశంస

డా॥ వాసిలి వెంకటలక్ష్మీనరసింహారావు

డా॥ ముక్కామల రాధాకృష్ణశర్మ



మణిమంజరి ప్రచురణలు

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్

హైదరాబాదు.



## వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్‌వారి

# మణిమంజరి ప్రచురణలు

(శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి గ్రంథములు)

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రబంధ రత్నావళి | 15/- | సభ్యులకు 8/- |
| | **Prabandharatnavali 15-00 Proc, Dr. Public Libraries 11550/Te/300/1727.** | | |
| 2. | నీతినిధి | 18/- | 9/- |
| | **Neeti Nidhi - 18/- Proc. Dr Public Libraries R-C-No. 5-E1 84 dt. 4-4-84** | | |
| 3. | తంజావూరి ఆంధ్ర రాజుల చరిత్ర | 10/- | 5/- |
| 4. | కామధేనువు కథ | 10/- | 5/- |

(ఇప్పుడే వెలువడినవి)

| | | | |
|---|---|---|---|
| 5. | కుమారసంభవము వ్యాఖ్య—విమర్శ: పాఠపరామర్శ | 25/- | 12/- |
| 6. | శృంగార శ్రీనాథము (పునర్ముద్రణము) | 50/- | 25/- |
| 7. | వేటూరివారి పీఠికలు—I (పునర్ముద్రణము) | 60/- | 30/- |

[ట్రస్టు సభ్యులకు సగము ధరకే ఎప్పటికప్పుడు అచ్చయిన గ్రంథము లందజేయబడును.]

"మణిమంజరి" విశేష సంచికలు (ఒక్కొక్కటి) 15/- మొత్తము (1నుండి10వరకు) పది సంచికలు.

**Manimanjari - 15/- Proc. Dr. Public Libraries.**
**R-c-No. 2-E 1/82 dt. 21-7-82.**
**Proc. Dr. School Education, Hyderabad.**
**R-C-No. 1672/64/82 dt. 28-7-82.**
***Recommended for Schools & Colleges.***

ప్రతులకు : విచారించు

మేనేజింగ్ ట్రస్టీ; వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్
2–2-16/15/D/1, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్–500013



శ్రీరస్తు

# శృంగార శ్రీనాథము

## శ్రీనాథ చరిత్రము.

కర్త:

వేటూరి ప్రభాకరశాస్త్రి

---

వేటూరి శంకరశాస్త్రిచే

ప్రకటింపఁబడినది.

---

ప్రథమ ముద్రణ 2000 ప్రతులు.

 వెల రు. 2.

బెజవాడ: ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్ (లిమిటెడ్) యందు

క. కోదండరామయ్యచే ముద్రింపఁబడియె—1923.

**M. Venkatarangaiya**, M. A.
Professor of History and Economics.

Maharaja's College.
Vizianagram.
17-9-1924

ఆర్యా,

మీరు రచించిన 'శృంగార శ్రీనాథ'మను గ్రంథమును రెండవపర్యాయము చదివిముగించి ఈ యుత్తరము వ్రాయుచున్నాను. అట్టి గ్రంథమిదివరకు మన భాషలో నెవరుగాని రచించి యుండలేదని నా దృఢాభిప్రాయము. ఈ కార్యమును కొనసాగించుటలో మీరు గావించిన పరిశోధన పరిశ్రమ వర్ణనాతీతములు. మీతోడి పరిచయ భాగ్యము నాకిదివరకు కలుగకపోయినను మీ గంథ పఠనము వలన నాకు కలిగిన పరమానందమును సూచించుటకై నేనీ యుత్తరమును వ్రాయుచున్నాను. ఈ పర్యాయము నేను చెన్నపట్టము వచ్చినప్పుడు మీ దర్శనము చేసెదను. మీ నుండి ఎన్నియో క్రొత్త విషయములను నేర్చుకొనవలయునని కుతూహలపడుచున్నాను.

చిత్తగించవలెను.

ఇట్లు,
తమ విధేయుడు
మామిడిపూడి వెంకటరంగయ్య

# మనవి

శ్రీ ప్రభాకర సంపూర్ణ గ్రంథావళిలో రెండవ కుసుమముగా ఇప్పుడీ "శృంగార శ్రీనాథము" పునర్ముద్రింపబడినది. ఈ గ్రంథము తొలి అచ్చు కూర్పు 1922-28లో జరిగినది. దానికి శ్రీముక్త్యాల సంస్థానాధీశ్వరులు నాడొసగిన ద్రవ్యసహాయ మొకింత తోడుపడినది. అట్లే అరవైమూడేండ్ల పిదప అమూల్య మైన ఈ చారిత్రక పరిశోధన గ్రంథమును పునర్ముద్రణకు తెచ్చుటలో నేటికి ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువా రొసగిన ఆర్థికసహాయమును కొంత చేయూత నిచ్చినది. అట్టి ద్రవ్యసహాయమే వేళకందనిచో నాటికీ నేటికీ ఈ గ్రంథ ప్రకట నము అసాధ్యమే అయ్యెడిది.

నాడు శ్రీప్రభాకరులు తమ తొలిపలుకులో నిట్లు వ్రాసిరి.

"ఈ గ్రంథమును నేను ఐదియేండ్లకుఁ బూర్వము రచించి యచ్చునకుఁ దెచ్చుటకై యత్నించుటలో నప్పు డంతరిశప్రాయమయ్యెను. ఆగొడవ నిప్పుడు తడవనేల? తడవయినను నేఁడిట్లు ప్రచురింపగల్గినందుకయి సంతోషించు చున్నాడను.....

చరిత్రభాగమని గ్రంథవిమర్శభాగమని యీ గ్రంథమును దొలుత రెండు భాగములుగా రచియించితిని. కాని గ్రంథ బాహుళ్యముచే ఇపుడు ప్రథమ భాగము మాత్రమే ప్రకటించితిని. విమర్శ భాగము వేరొక గ్రంథముగా వెల్ల డింప వలసియున్నది. తొలుత నే నీ ప్రథమ భాగమున వ్రాసిన విషయములు కొన్ని .... గ్రంథము పెద్దదియగుచున్నదన్న భీతిచే....అనేకాంశముల నచ్చ నందు హ్రస్వీకరించితిని. అనుబంధమునఁ జూపఁదగిన చరిత్ర సాధనముల నెన్నిటినో యట్టె పెట్టితిని...."

సుప్రసిద్ధులగు గ్రంథకర్తలకు వేళకు తగిన ద్రవ్యసహాయమందకను అచ్చువేసికొనుట కవకాశములు లేకను అపూర్వ రచన లెన్ని యెట్లు ప్రణష్టమై పోవుచుండినవో, నేటికిని పోవుచున్నవో, యెరుగుటకి 'శృంగార శ్రీనాథము'ను ఒక గొప్ప ఉదాహరణముగా పేర్కొనవచ్చును.

ప్రభాకరులు శృంగార శ్రీనాథమును 1912 ప్రాంతములోనే చరిత్ర భాగమనీ-గ్రంథవిమర్శ భాగమనీ రెండు విభాగములుగా ఒక గొప్ప పరిశోధన గ్రంథమును రచించిరి. గ్రంథమునైతే రచించిరిగానీ ముద్రించుటకు సొమ్మేది? ఆ ప్రయత్నమున కొన్నేండ్లేగాదు మొత్తము గ్రంథమే నష్టమైపోయినది. ఇది శ్రీ శాస్త్రిగారే (1922లో) అందిచ్చిన సమాచారము. పరిశోధకులు వారి తొలి పలుకును జాగ్రత్తగా పరిశీలింపవలసియున్నది.

నిరుత్సాహ నిహతులైనను రచయిత తామే గనుక వారే తిరిగి యెట్లో గ్రంథమున తొలివిభాగమును మాత్రము పునర్నిర్మించగలిగినట్లున్నారు; అదీ అప్పటికి కూర్పదగిన విధమున. ఫలితముగా వెలువడినదే ముద్రింపబడిన గ్రంథ భాగము. దాని రెండవ భాగమును తిరిగి వారు నాడు పునర్నిర్మించనూ లేదు. అచ్చుకు తేవలసిన ఆవశ్యకము కలుగలేదు. అనంతరకాలమున వారి దృష్టి యోగమార్గమునను ఆర్తులైనవారి నాడుకొనుటలోనూ లగ్నమై 'సాహిత్యాది వ్యవహారములకు సుదూరమైన కార్యకలాపము'లందు నిష్ఠమై యుండినది. కనుక తొలినాటి వారి ఇచ్ఛ పిదప నెరవేరనూలేదు.

ప్రణష్టమై పోయినది పోగా గ్రంథరూపమున నేడు మనకు దక్కినదింత మాత్రమే.నాడు చేజారిపోయిన సంపూర్ణ గ్రంథ మది ఏనాటికైన లభించునేని అది ఆంధ్రుల యదృష్టము!

జరిగిన విషయ మిది కదా మరి యెరిగినవా రేమందురో విందమని శ్రీ ప్రభాకరుల కడగొట్టు సోదరు లిద్దరినీ-పినతండ్రులు పూజ్యులు డా॥ చంద్రశేఖర శాస్త్రి (85 సం॥) గారినీ, డా॥ శంకరశాస్త్రి (88 సం॥)గారినీ-మొన్న కలిసి (5-10-85 నాడు)అడిగితిని. వారు పలికిన సాక్ష్యానికి సారాంశమిది.

'అన్నయ్య వెస్లీ మిషన్ హైస్కూలులో ఉద్యోగం విరమించి ప్రాచ్యలిఖిత పుస్తకాలలో చేరిన కాల మది. స్కూలు వదలి క్రొత్త ఉద్యోగంలో ప్రవేశించే సందర్భంలో అప్పటి హెడ్మాష్టరు జె.యస్.ఎం. హూవర్ అన్నయ్యమీదిఅభిమానంతో ఆయనకొక 'అలెగ్జాండ్రా' పెన్ను బహూకరించారు ఏర్పాటుసభ పెట్టి. ఆ విషయం ప్రస్తావిస్తూ ఆ బంగారు పాళీ కలంతో అన్నయ్య అప్పుడు కళ్లేపల్లికి, నాన్నకు, ఓ ఉత్తరం రాశాడుకూడా. ఆ కలాన్ని అన్నయ్య ప్రీతితో వాడుకొనే

వాడు. దాంతోనే అన్నయ్య అరటిమొవ్వల్లాంటి తెల్లటి కాగితాంమీద శృంగార శ్రీనాథం రాస్తుండేవాడు. గురుజాడ అప్పారావుగారి కొడుకు రామదాసు కిచ్చాడు అన్నయ్య ఆ పుస్తకాన్ని అచ్చువేయించే ఏర్పాటుచేస్తావంటే. ఆయన అశ్రద్ధ వల్ల అదికాస్తాపోయింది. అపవీ సాగలేదు "

అప్పారావుగారికి, ప్రభాకరశాస్త్రిగారికి, రామదాసుగారికి మైత్రి బాగా ఉండే దనీ, వారిమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలూ బాగాసాగేవనీ ఉత్తరాలూ బోలెడుండేవనీ వారే చెప్పారు. ఆ లేఖలను ఎవరు తీసుకొన్నారో ఏమైవవోగానీ ఈనాడు మా సేకరములో అవి ఏవీ మిగలలేదు. విజయనగరంలో అప్పారావు వంతులుగారి యింటి నుండి శ్రీ చల్లా సూర్యనారాయణగారికి (18-10-1911) వ్రాసిన లేఖ ఒకటి మాకిమధ్య లభ్యమైనది. (చూ. మణిమంజరి 9-పు, 112) ఆఫీసుపనిమీద నాడు వారాప్రాంతాలకు వెళ్ళి కొన్నాళ్ళక్కడ ఉన్నట్లు తెలుస్తున్నది. ఆ సమీప కాలంలోనే మదరాసులో రామదాసుగారికి శాస్త్రిగారీ గ్రంథాన్ని ఇచ్చిన సంఘ టన జరిగియుండును.

ఆనాడు కూపర్ ఏమి ఉద్దేశించి ఆ బంగారుపాళీ కలాన్ని ప్రభాకరుల కిచ్చినాడోకానీ పాశ్చాత్య సాహిత్య విమర్శలోని ప్రామాణికతను వంతరించు కొని స్వర్ణపేటికలో నిక్షేపించుకోదగిన గొప్ప విమర్శ పరిశోధన గ్రంథం తెలుగు వాఙ్మయరంగాన వెలసినది. జాన్ మోర్లే సంపాదకత్వంలో వెలువడిన "English men of letters" అనే గ్రంథమాలికలోని గ్రంథకుసుమాలతో శృంగార శ్రీనాథము పోటీపడే రీతినున్నదని విజ్ఞులానాడే ఈ గ్రంథమును ప్రశంసించినారు.

మరి ప్రభాకరుల అంతర్యామి నిర్దేశమెట్టిదోకాని బ్రదుకు సాగించుకొనుట కేర్పడిన వాఙ్మయ సేవలో 'అరకుఱుపు సాగునట్లు పనిచేయుటకే మెసలనిచ్చినది గాని అంతకెక్కువగ పనిచేయుటకుగాని అంతకెక్కువగ సాధించుటకుగాని' ఆయ నకు చోటియ్యకేపోయెను. పర్యవసానముగా వాఙ్మయరంగమున 'క్రీడావినోద మనుభవింపవలెనని కొండంత కోరిక చెలరేగుచున్నను ఆదినుండి కూడ దాని కభ్యంతరములు, ప్రతిషేధములు తఱచుగా నడ్డుతగులుచు నిరుత్సాహమునేగొల్పు చుండినవి.

శ్రీ శాస్త్రిగారి జీవితమది యోగ వాఙ్మయ మార్గముల సంగమ స్థానము. ఉభయరంగములందును వారికృషి మౌలికము, బహుముఖీనము, చిరస్మరణీయము.

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టువారు రెండేండ్లలో రానున్న ప్రభాకర శతజయంతి వత్సరము (1988)కేగా శ్రీవారి గ్రంథముల నన్నిటిని పునర్ముద్రింప తలంపుగొని కృషిచేయుచున్నారు. అచ్చుకిచ్చిన నాలుగు గ్రంథము లలో శృంగార శ్రీనాథము, వేటూరివారిపీఠికలు ముగిసినవి. వ్యాసమంజరి, చాటుపద్య మణిమంజరి అచిరకాలములోనే వెలువడనున్నవి. సహృదయులైన పాఠకుల సహకారమున, తెలుగువారి ఔదార్యముమూలమున, వ్యవస్థను పటిష్ఠ మొనరించుకొని తక్కినవాటినీ త్వరలో ప్రకటింపగల్గుదుమనియే విశ్వసించు చున్నాము.

1984 ఆరంభములోనే ఆరంభించినా అనివార్యకారణాలవలన ముద్ర ణము ముగించుటకెంతో ఆలస్యము జరిగినది. అందుకు మన్నింపు కోరుతూ ఈ విషయమున మాతో సహకరించినవారికందరికిని కృతజ్ఞతాభివందనము లర్పించు చున్నాము. ముఖ్యముగా మేము కోరినవెంటనే అంగీకరించి గ్రంథమును గూర్చి ప్రశంసారూపమైన పరిచయవ్యాసములు వ్రాసి పంపిన మిత్రులు డా॥ వానిలి వేంకట లక్ష్మీనరసింహారావుగారికిని, డా॥ ఎం. రాధాకృష్ణశర్మగారికిని మా ధన్యవాదములు మా కోరికను మన్నించి గ్రంథమును అచ్చుకిచ్చేముందు ప్రథమ ముద్రణము నొకమారు చూచి ముద్రణ స్ఖాలిత్యములను సరిపరచి తోడ్పడిన మిత్రులు డా॥ రవ్వా శ్రీహరిగారికి మా కృతజ్ఞతలు. గ్రంథమును ముద్రించు తరి బాధ్యతను వహించి తమ ప్రెస్సులో అచ్చుపని మెచ్చుపనిగా నిర్వహించిన చిరంజీవి వానిలి వసంతకుమార్‌గారికి మా అభివందనలు.

అడిగిన వెంటనే యథావకాశము ఆర్థికసహాయ మందించిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖవారికిని, ప్రత్యేకముగా, సహృదయులైన శ్రీ పి.వి.ఆర్.కె ప్రసాద్ IAS గారికిని, శ్రీ ఈరంకి వెంకటసుబ్బారావు గారికిని మా కృతజ్ఞతాభివందనము లర్పిస్తున్నాము. ఇలాగే మణిమంజరి ప్రచుర ణలను చదివి మెచ్చి ట్రస్టువారు చేపట్టిన కార్యభారమున పాలుపంచుకొని సత్యులై సహాయ సహకారము లందిస్తున్న మిత్రులందరికిని మా వందనములు.

భవదీయుడు,

—వేటూరి ఆనందమూర్తి

గ్రంథ సంపాదకుడు

# తొలిపలుకు

శ్రీనాథుఁడు శృంగారప్రియుఁడు. కావుననే తనకావ్యమునఁ గాతఁడు శృంగారనైషధమని పేరిడినాఁడు. ఆయన కభిమతమగుటచే నీగ్రంథమున కావిధముననే నేనును శృంగారశ్రీనాథమని పేరిడితిని. ఇది నిక్కమగు చరిత్ర గ్రంథ మనఁ గాదు. చరిత్రగ్రంథమనఁ జెప్పఁబడు విషయములెల్ల నవియట్లే నడచినవని నిరూపింపఁ దగియుండవలెను. అందుకులుగా దొరకిన చరిత్ర సాధనములకుఁ బొందిక కల్పించి సంభావ్యముగా శ్రీనాథునిచరిత్రము నిందు నేను సంధానించితిని. ఇందలి విషయములెల్ల నిట్లే నడచిన వనఁగాదు. కాని, యుపలబ్ధము లయిన చరిత్రసాధనముల కవి యవిరోధములయి యనుకూలము లయి సంభావ్యములయి యుండఁగలవని మాత్రను జెప్పనగును. ఈ కారణముచే శ్రీనాథచరిత్రమనుట పసిగా నుండదని తలఁచి విడిచి పయిపేరు నయికొంటిని. శృంగార మీగ్రంథము పేరనేగాని లో నెక్కడను గానరాదు. ఈ పేరు నేతిబీర వంటిదే.

చరిత్రభాగమని గ్రంథవిమర్శభాగమని యీగ్రంథమును దొలుత రెండు భాగములుగా రచియించితిని. కాని గ్రంథబాహుళ్యముచే నిపుడు ప్రథమభాగము మాత్రమే ప్రకటించితిని. విమర్శభాగము వేఱొక గ్రంథముగా వెల్లడింపవలసి యున్నది. తొలుత నే నీప్రథమభాగమున వ్రాసిన విషయములు కొన్ని యిటీవల శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు మొదలగువా రాంధ్రుఁచరిత్రము మొదలగు వానియందు వేఱుగా నెఱిఁగి వెల్లడించిరి. అట్టివానిఁగొన్నింటి నిందు సంక్షేపించితిని; చర్వితచర్వణమేలయని. మఱియు గ్రంథము పెద్దదియగు

చున్నదన్న భీతిచే రెడ్డిరాజులచరిత్రము మొదలగు విషయములం దపూర్వముగా నేను వ్రాసిన యనేకాంశముల నచ్చవందు ప్రస్వీకరించితిని.*

అనుబంధమునఁ జూపఁదగిన చరిత్రసాధనముల నెన్నిటినో యచ్చొ పెట్టితిని. ఇతరత్ర ముద్రితములయిన శ్రీనాథశాసనాదులను నేనిందు విడనాడితిని. ప్రసక్తములయిన చాటుధారలను బెక్కింటిఁ బరిత్యజించితిని. అవికొన్ని చాటు పద్యమణిమంజరి ప్రథమ ద్వితీయభాగములందున్నవి. పెక్కుపద్యములిప్పు డచ్చున కెక్కరానివిగా నున్నవి. "శ్రీనాథుని శృంగార వర్తనము" అనుపేర రచించిన ప్రకరణము నిందు ముద్రింపక మూలనుంచితిని.

ఈగ్రంథమునకు వలయు ప్రధానసాధనముల నేను ప్రాచ్యలిఖితపుస్తక భాండారమునందే పరిగ్రహించితిని. మఱియు శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు, మానవల్లి రామకృష్ణకవిగారు, జయంతి రామయ్య పంతులుగారు, వేపారామేశం పంతులు గారు, కొవ్వూజు లక్ష్మణరావుపంతులు గారు, రంగ స్వామి సరస్వతిగారు, ననువారి తోడ్పాటునుగూడఁ గొంత పడసితిని. శ్రీ వీరభద్రరావుగా రంధ్రుల చరిత్రమున శ్రీనాథ విషయము వ్రాయుచేకాక వేఱుగా శ్రీనాథుని చరిత్రమును గూడ విరచించిరి. కడచిన సంవత్సరమున నే నీగ్రంథమును ముద్రించుటకు పునః పరిశోధనము చేయుచు శ్రీ వీరభద్రరావు గారి యొద్దనుండి వారు రచించిన శ్రీనాథచరిత్రము గైకొంటిని. వారి గ్రంథము నాకుఁగొన్ని పట్టులందు గొప్పసాహాయ్యము చేసినది. శ్రీ రామకృష్ణకవిగారు వారికడనున్న యపూర్వశాసన సంచయమును బదియేండ్లకుఁబూర్వము నాకొక మాఱొసఁగిరి. రెడ్లచరిత్రవిషయము లందుఁ గొన్ని యపూర్వాంశములను దాని వలన నేను గ్రహింపఁగలిగితిని. ఇటీవల నా శాసనములు దాక్షారామాది స్థలములనుండి దొరతనమువారు గైకొనివచ్చిరి. కొన్ని ప్రాచ్యలిఖిత పుస్తక శాలలోఁగూడ నున్నవి. పదియేండ్లకుఁబూర్వము శ్రీ జయంతిరామయ్యపంతులు

---

* రెడ్లచరిత్రమింక నేంతయేని వ్రాయవలసియున్నది. వ్రాసినదానిఁ గూడ నేనిందు విడనాడితిని అది ప్రత్యేకగ్రంథముగా వెల్వరఁదగినది. ఒకనెల కాలేదు. నేనును నామిత్రుఁడు వి. యస్. శర్మ బి. యె., బి యల్. గారును, రెడ్లతామ్రశాసనములు రెండుకలవనివిని, గుంటూరునుండి తూములూరు కొల్లిపర

గారికడ నుండి నేనొకశాసనము వ్రాఁతప్రతినిగైకొని (పేజీ 127 చూ. అను బంధముకూడ చూ.) గ్రంథమున నుదాహరించితిని. ప్రాచ్యలిఖితపుస్తకాలంలో నది తప్పులతో నున్నది. దానిఁబట్టి యిటీవల నాశాసనముఁగూర్చి మతభేదము లేర్పడినవి. ఇప్పుడా శాసనశిలయున్న చోటి కరిగి నేను దానిపాఠములను స్పష్టపఱుచుకొనివచ్చితిని. అది శ్రీరామయ్యపంతులుగారు నాకొసంగిన పాఠము ప్రకారమువనే కలదు. బహుకాలమునకు ముందే నిర్దుష్టముగా నా శాసనమును రామయ్యపంతులుగారు వ్రాసికొని వచ్చియుండుట నాకనుకూలమయ్యెను. ఇండియను ఆంటిక్వెరీ, ఎపిగ్రాఫికాఇండికా, శాసనపరిశోధకుల రిపోర్టులు, మొదలగు చరిత్రసాధనములు నడిగినప్పుడెల్ల న్యాయమూర్తి వేపా రామేశం పంతులుగారు నాకొసఁగుచు వచ్చిరి. ఆంధ్రుల చరిత్రములు కవుల చరిత్రములు పరిషత్పత్రికలు, తాము రచించిన వ్యాసములు, కడచిన వత్సరము తడవుకాలము నాకడ నుండనిచ్చియుఁ గొన్ని చరిత్రాంశములందుఁ జర్చించియు శ్రీ కె. వి. లక్ష్మణరావుపంతులుగారు నాకు సాహాయ్యముచేసిరి. మూడేండ్లకుముందు దొరతనమువారి నిదేశమున శ్రీ రంగసామిసరస్వతిగారు శాసనములకొఱకును, నేను గ్రంథములకొఱకునునయి గుంటూరుమండలమునఁగలసి సంచరించితిమి. అప్పుడు శ్రీనాథశాసనములు కొన్ని క్రొత్తవి దొరకినవి. మఱికొన్ని విషయములందుఁగూడ సరస్వతిగారి సాహాయ్యమును నేను బడసితిని. ఇట్టి యుపకారములకయి పయివారియెడఁ గృతజ్ఞతాబద్ధుఁడనగుచున్నాఁడను. నాపుట్టుకకుఁగూడఁ బూర్వమే యంధ్రకవిచరిత్రముఁగూర్చి యధికముగాఁ బరిశ్రమించి మంచి గ్రంథము రచించినవారగుటచే వీరేశలింగముపంతులుగారి నిక్కడ విను తించుచున్నాఁడను. వారు కీర్తిశేషులు.

---

యను గ్రామములకు నిప్పులుచెఱుగుచున్న వేసవిగాడ్పులలో వెడలి విచారించితిమి. తూములూరులో నొకగొప్ప తామ్రశాసన మొక కోమటిబిడ్డని యింటనున్నది. ఎంతవేఁడినను నాతఁడాశాసనమును జూపినవాఁడుగాఁడు. లేదు పొమ్మనెను. నేఁడు కాదనెను. కరగించితిననెను. ఏమేమో అనెను. మేమేమిచేయఁగలము! తూములూరులో దొరికిన తామ్రశాసనము నాయింటివారు చూడఁగూడదని, కీడు వచ్చునని పెద్దగోతిలో పూడిచి పెట్టిరని తెలిసినది. అలసి తిరిగి వచ్చితిమి:

ఈ గ్రంథమును నేను పదియేండ్లకుఁ బూర్వము రచించి యచ్చువఱకుఁ దెచ్చుటకై యత్నించుటలో నప్పుడంతరితప్రాయమయ్యెను. ఆగొడవ యిప్పుడు తడవనేల? తడవయినను నేఁడిట్లు ప్రచురింపఁగల్గినందుకయి పరితోషించుచున్నాఁడను.

శ్రీ ముక్త్యాలసంస్థానాధీశ్వరులగు శ్రీ రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరుజమీందారుగారు నా యీ గ్రంథస్థితి నెఱిఁగి నిర్వ్యాజముగాఁ గొంతద్రవ్యము నొసఁగి శీఘ్రతరముగా నీగ్రంథము ముద్రితమగునట్లు చేసిరి. సత్త్వమధురస్వభావులయిన శ్రీవారికి నాయురారోగ్యరాజ్యాభ్యుదయసిద్ధిగా నీశ్వరుని బ్రార్థించుచు వారియెడఁ గృతజ్ఞతాబద్ధుఁడ నగుచున్నాఁడను.

ఈ గ్రంథము మొదటి నలువదియైదుపుటలు మద్రాసునను కడమవి బెజవాడను ముద్రితమయినవి. బెజవాడలో వడివడిగా నాపరోక్షమున గ్రంథముద్రణము సాధ్యమగునంతవఱకుఁ జక్కఁగా జరిపిన యాంధ్రగ్రంథాలయముద్రాలయము వారిని సంభావించుచున్నాఁడను. ప్రధానప్రమాదములు కొన్ని సరిపఱిచితిమి. ఇంక నెన్నియున్నవో! ఎఱిఁగినవారు తెలుపుదురేని ద్వితీయముద్రణమున సవరించుకొందును.

పెదకళ్లేపల్లి,
రుధిరోద్గారి నిజజ్యేష్ఠము.

వేటూరి ప్రభాకరశాస్త్రి.

# విషయసూచిక

## ప్రథమ ప్రకరణము



## ద్వితీయ ప్రకరణము



## తృతీయ ప్రకరణము

సప్తమ ప్రకరణము



అష్టమ ప్రకరణము

నవమ ప్రకరణము



అనుబంధము

డా॥ వి.వి.యల్. నరసింహారావు, డైరెక్టర్,
ఆం. ప్ర. ప్రాచ్యలిఖిత గ్రంథాలయ-పరిశోధనాలయము,
హైదరాబాద్-1.

# ప్రభాకర శ్రీనాథము

"లోక నౌకకు కవీశ్వరులే కర్ణధారులు"

"బహుదేశములు తిరిగి, బహు శాస్త్రముల నెఱిగి, రసవత్కవిత రచించి రాజాధిరాజుల పూజలు గొని, విద్వద్గోష్ఠులం దాఱి తేఱి, విద్యావివాదములందు విజయము లంది, భువనభరితకీర్తియై, పూర్ణపూరుషాయుష జీవియై, దివిజ కవివరు గుండియలు దిగ్గురనునట్లు స్వర్లోక ప్రస్థానము సలిపిన" "శ్రీనాథ కవిసార్వభౌముని వంటివాడు, ప్రఖ్యాత చరిత్రుడు—ఆంధ్ర కవీశ్వరులం దింకొకడగపడడు."

యథాశక్తి యథోపలబ్ధి ఆసుకవీంద్రుని చరిత్రము విపరించుటయే "శృంగారశ్రీనాథ" గ్రంథకర్త శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తద్గ్రంథ రచనమున ఉద్దేశించిన లక్ష్యము.

గ్రంథ మీనాటిది కాదు; అరు దశాబ్దులుగా తెలుగునాట శ్రీనాథుని చరిత్రముపై రుచులు పెంచిన గ్రంథము. చిరపరిచితమైన తద్గ్రంథమునకు ప్రకృత మిది పునర్ముద్రణము. ప్రథమ ముద్రణము 1923 లో. వ్రాతప్రతి 1912 నాటికే సిద్ధమైయున్నట్లు తెలియుచున్నది.

విక్కు మరపిన ఇట్టి ప్రసిద్ధ గ్రంథములకు పరిచయవాక్యము లనావశ్యకములు. కాని గ్రంథకర్త ప్రతిభాపాండిత్యములకు వారసుడగు తత్పుత్రుడును, నాకు కూర్మి మిత్రుడును అగు ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారు నా యెడగల ప్రత్యయమును పురస్కరించుకొని ఈ పరిచయ వాక్యములు వ్రాయుపని నప్పగించిరి.

## గ్రంథనామము :

శ్రీనాథుడు 'నైషధీయ చరితము' తెనిగించి దానికి 'శృంగారనైషధ'మని పేరు పెట్టెను. అట్లే శ్రీ శాస్త్రిగారు శ్రీనాథ చరిత్రము ప్రచురింప తలపెట్టి ఈ గ్రంథమునకు "శృంగారశ్రీనాథ" మని పేరుపెట్టిరి. శృంగారనైషధము, శృంగార శాకుంతలము మొదలగు పేరులవలె నిదియు హృదయ రంజకముగా నున్నది. కాని శ్రీనాథుడు కేవల శృంగారియా? అను సందేహమున నిది తా వీయకపోలేదు. 'శ్రీనాథుడు శృంగారియా?' అను నొక గ్రంథమే వెలువడుట సువిదితము.

శ్రీ శాస్త్రిగారు గ్రంథమున వాక్యముగనే శ్రీనాథుడు పరమ శృంగారి యను భావమును వ్యక్తపరిచిరి. "నిరంతరము దేశాటనము సేయుచు విషయ లౌల్యమున వర్తించుచు వచ్చినవాడగుటచే నితనికి సంసారమునం దర్హమగు నానందము లభింపకపోయెడి దేమో యని సంశయము కల్గుచున్నది." (పుట 29) "శ్రీనాథునికి వైషయిక వాంఛ లత్యున్నతములు. భోగపరాయణతమెండు ప్రౌఢ నిర్భర వయః పరిపాక కాల మగుటచే నాత డప్పుడు('భీమఖండ' రచన నాటికి) శృంగారరస సముద్రమున తెప్పదేలుచున్నాడు." (పుట 133) అంతమాత్రమున శ్రీనాథుని జీవితమంతయు శృంగారమయమని చెప్పలేము. శ్రీశాస్త్రిగారును అట్లు చెప్పలేదు. మీదు మిక్కిలి "శ్రీనాథుని కద్వైతమందే తాత్పర్యము. అయినను శైవమతమునం దభిమాన విశేషము కలదు." (పుట 24) "ఎంత శృంగారియైనను చిరుతనాటినుండియు శైవమతాసక్తి గల్గియే యుండెననుటకు పండితారాధ్యచరిత్ర రచన మొక తార్కాణము. (పుట 63) పెక్కుమా ర్లాతడు పంచ బహ్మషడంగ మంత్రములతో ప్రాసాద పంచాక్షరిని స్మరించు చుండును." (పుట 24) అనియు స్పష్టముగా నాతని ఆత్మతత్వము నావిష్క రించినారు ఇంతకును మానవస్వభావమున రాగయోగములును రక్తిముక్తులును సహజ లక్షణములే యగుటచే రసజ్ఞులగు కవులయం దవి భక్తి కంగములగుట మిక్కిలియు సహజము లగుచుండును. శ్రీనాథుడు చవిచూచిన దుదాత్త శృంగారము అది భోజుని శృంగార ప్రకాశమున చెప్పబడిన-ఉదాత్త శృంగారము పురుషార్థ పరాయణుడైన జీవికి శాశ్వతీయము మోక్షమునకు మొందరి మెట్టనునది మరపరాని సత్యము. శ్రీనాథు డీరహస్య మెరిగిన ప్రౌఢ

కనుక యథోచిత శృంగార సంభావన మాతని కనివార్యమే యయ్యెను. ప్రకాశకరు లది పసిపట్టి ఆతని చరిత్రమునకు 'శృంగార శ్రీనాథ'మని పేరు పెట్టుట సముచితమే. అంతేకాక 'అలంకార' మను సర్థాంతరముగల శృంగార శబ్దము మనోజ్ఞార్థమును స్ఫురింపజేయుచు హృదయ రంజకమైన శ్రీనాథుని చరిత్రముగల గ్రంథమని స్పష్టముచేయుచున్నది. శ్రీశాస్త్రిగారన్నట్లు శృంగార మీ గ్రంథమున నేతిబీరలో నేయి వంటిదే.

ఈ దృష్టితో చూచినచో గ్రంథమునందు శ్రీనాథుని శృంగార విషయము లల్పములై చారిత్రిక విషయము లనల్పముగ గోచరించును. ప్రథమ ప్రకరణము శ్రీనాథుని కులగోత్రాదికముతోడను, ద్వితీయప్రకరణము రెడ్డిరాజుల విశేషముల తోడను తృతీయ చతుర్థములు రాజాశ్రయ గ్రంథ రచనాది విశేషములతోడను, పంచమము కనకాభిషేకముతోడను, షష్ఠము కర్ణాటదేశాటనాదికముతోడను, సప్తమము కాశీఖండ రచనాది విశేషములతోడను, అష్టమము పల్నాటి వీర చరిత్రాది రచనా విశేషములతోడను నిండి, యావద్గ్రంథము చారిత్రిక విశేషముల తోడను రచనా విశేషములతోడను గూడియున్నది.

గ్రంథము పేరు పెంపుల ముచ్చట ముగించి గ్రంథస్థ విషయమును పరామర్శించుట మేలు.

గ్రంథస్థ విషయ పరామర్శ :

శ్రీనాథుని జన్మస్థలము గురించియు. జననకాలము గురించియు గ్రంథముల రచనాకాలమును గురించియు శ్రీ శాస్త్రిగారు స్పష్టమైన అభిప్రాయములు వెలువరించిరి. చెప్పదలచిన అంశములను సందేహాస్పదముగ చెప్పు నలవాటు వారికి లేనేలేదు.

శృంగారనైషధ రచనాకాలము : "పెదకోమటి వేమారెడ్డి రాజ్యమునకు వచ్చిన తర్వాతనే (క్రీ. శ. 1408 తర్వాతనే) శ్రీనాథుడు క్రీ. 1410, 1415 ప్రాంతముల శృంగార నైషధమును రచించెనని నేను నిశ్చయించుచున్నాను." (పుట 78)

హర విలాస రచనాకాలము : "హర విలాసము శ్రీనాథుని యవ్వన కాలపు గ్రంథ మనుటను నేనంగీకరింపను. మఱియు నది కొండవీటి జీవిత కాలమందే రచింపబడిన దనుటను గూడ నంగీకరింపజాలను" (పుట 80)

శ్రీనాథ పినవీరనలు సమకాలికులని వ్రాసిన గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారి వ్రాత నుటంకించుచు శాస్త్రిగా రిట్లు వ్రాసిరి. "శ్రీ శ్రీరామమూర్తి పంతులుగారు వ్రాయగూడని వ్రాత వ్రాసినారు. ఆ యవప్రథ యడగార్ప దగినది" (పుట 90)

శ్రీ శాస్త్రిగారు తమ యభిప్రాయముల నింత కృతనిశ్చయముతో వ్రాయు నలవాటు గలవారు. ఖండితముగ చెప్ప వీలుగాని యంశములను "కొంచె మించు మించుగ" నని తామే పేర్కొనుట గుర్తింపదగిన యంశము.

శ్రీనాథుని "జన్మకాల మాంగ్ల శాకాబ్దము లు సహస్రమును మూడు నూర్లు చనిన మీద నెన్నడేను కొంచెమించు మించుగననగు"నని చెప్పిరి. (పుట 8) డాక్టరు కొర్లపాటి శ్రీరామమూర్తిగారు తమ 'శ్రీనాథుడు' గ్రంథమున శాస్త్రిగారి 'యించు మించు'ను పాతిక సంవత్సరములు ముందువకు నెట్టి శ్రీనాథుని జనన కాలము క్రీ 1360 అని నిర్ణయించిరి. ఈ పాతిక సంవత్సరములే శృంగారనైషధ రచనా కాలమునకును అన్వయించుటచే తత్కాలమును క్రీ 1395 అని నిర్ణయించుటకు వీలుకలిగెను.

శ్రీనాథుని గ్రంథరచనాకాల నిర్ణయమునకు మిక్కిలి తోడ్పడినది ఆతని "చిన్నారి పొన్నారి చిఱుత కూకటి" పద్యము (కా. ఖం, 1–7). చిఱుత కూకటులు మొలచు కాలమేది? నూనూగు మీసాలు పొడము వయసేది? నిండు జవ్వన మనగా నెన్నేండ్ల ప్రాయము? ప్రౌఢనిర్భర వయః పరిపాక మనగా నిక్కచ్చిగా నెన్నేండ్లు? .... ఇట్టి ప్రశ్నములకు జవాబులు చెప్ప గొనుచు చేయు పరిగణనము ఉజ్జాయింపు లెక్కయే కాని నిక్కచ్చిగా నిన్నేండ్లని చెప్పుటకు వీలుపడునదికాదు. 'ప్రాయమింతకు మిగుల గైవ్రాలకుండ' అనునప్పుడును 'కైవ్రాలుట యనగా కేలు వంగుటయా? వాలుటయా?' అని ప్రశ్నించుకొని తెల్పుకొను జవాబులును నట్టివే. ఒక మహాకవి కవితాధోరణిలో వర్ణనాత్మకముగ చెప్పిన సందర్భము సూచనామాత్రమేకాని ఖచ్చితముగ నిన్ని యేండ్లని చెప్పునది కాదు. దానిని పట్టుకొని లాగి ఖచ్చితముగ కాలనిర్దేశము చేయుటకంటె కొంచెమించుగ స్థూల నిర్దేశము చేయుటే సరసము, సమంజసము. శ్రీ శాస్త్రిగా రట్టి ప్రయత్నమే చేసిరి.

శ్రీనాథుని జన్మస్థల నిర్ణయమునకు తోడ్పడు పద్యభాగము "వారిధి తటీ కాల్పట్టణాధీశ్వరున్" అనునది; భీమఖండము నందలిది. ఇందలి కాల్‌పట్టణము -'కాలిపట్టణము', 'కాలీపట్టణము', 'కాళీపట్టణ'ముగా మార్పులుచెంది 'కాళీ పట్నము'గా పిలువబడుచున్నది. మచిలీపట్నమునకు తూర్పున సముద్రతీరమున నీగ్రామ మిప్పుడును గలదు. కాళీపట్నము నింటిపేరుగలవారు కూడ మచిలీ పట్నము మొదలైన తావుల వలువురు నేటికిని గలరు. కాళీపట్నమునకు పది మైళ్ళ దూరమున 'కలపట' మను గ్రామము కూడ గలదు. 'కాల్‌పట్టణ'మనగా 'కాళీపట్టణమో'. 'కలపట'మో కావచ్చును. శాస్త్రిగారి మొగ్గ కాళీపట్టణముపై పే నున్నట్లు తెలియును. కాని శ్రీనాథుడు పేర్కొన్న గ్రామము కలపటము కూడ కావచ్చునని పేర్కొని, సందిగ్ధముగనే వదలిపైచిరి. (పుట 8) కృతనిశ్చ యము లేని తావుల నిట్లు వదలుటయు పరిశోధకుల చిత్తశుద్ధికి నిదర్శనము.

పరిశోధన ప్రవణులగు శాస్త్రిగారి జీవితమంతయు దాదాపు దానికే వినియుక్తమైనట్లు కనిపించును. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ మున పండితులుగా మువ్వది యేండ్లు చేసిన కృషి యంతయు అట్టిదే. జనవ పురాణ, ఉద్భటారాధ్య చరిత్ర, హరవిలాస, క్రీడాభిరామ, రంగనాథరామాయణ, సుగ్రీవ విజయాది గ్రంథముల పరిష్కారము ప్రత్యేకముగ పేర్కొనదగిన యంశము. ప్రాచీన తాళపత్ర పరిశీలన సమయమున బయల్పడిన చాటువులే అనేకములు 'చాటుపద్య మణిమంజరి' కెక్కినవి. శ్రీనాథుని చాటువులు అట్లు ప్రచారము నందినవే.

శ్రీనాథ చాటువులలో పెక్కు లింకను పంభ్యములే అలబ్ధ గంథములలో మరుత్తరాట్చరిత్రయు, శాలివాహన సప్తశతియు, పండితారాధ్యచరిత్రమును, ధనంజయ విజయమును, నందనందనచరిత్రము, వల్లభాభ్యుదయమును గలవు. ఈ గ్రంథములు పూర్తిగా కాలగర్భమునుండి బయల్వడినచో శ్రీనాథుని గురించి అనేకవిషయములింకను తెలియగలవు. ఉపలబ్ధగ్రంథములైన శృంగారనైషధ, హరవిలాస, భీమఖండ, కాశీఖండ, శివరాత్రి మాహాత్మ్యాదులవలననే శ్రీనాథుని కవితామూర్తి విరాణ్మూర్తియై అచ్చెరువు గొల్పుచున్నది. తర్క వ్యాకరణ సాంఖ్య జ్యోతిషాద్యనేక శాస్త్రప్రవీణుడగు ఆ పండితకవి ప్రభాకరశాస్త్రిగారి పరి శోధనకు ప్రధానపురుష డగుటలో అచ్చెరువులేదు.

వైదర్భీ మార్గము :

సర్వగుణ సమాకలితమైన వైదర్భీ రీతిలో ఇతరగుణము లన్నియు నంతర్భవించుననుట భావము కలవాడు శ్రీనాథుడు. ఐహంగుణ ప్రస్తావముగం నైషధీయ చరిత శ్లోకములను కొన్నిటిని సంక్షిప్తపరిచి అతడు వైదర్భిని మాత్రమే ఆదరించుట గుర్తింపగలము. నలునకు సరస్వతి చింతామణి మంత్ర మువదేశించిన సందర్భములోని ఈక్రింది శ్లోకము పరిశీలనార్హము.

'గుణా మాస్థానీం నృపతిలక నారీతి విదితాం
రస స్ఫీతా మంత స్తవ చ తవ వృత్తే చ కవితుః
భవిత్రీ వైదర్భీ మధిక మధికంఠం రచయితుం
పరీరంభ క్రీడాచరణ శరణా మన్వహ మహమ్. [నై.చ. 14-88]

ఇందలి గుణ రీతి రస వృత్త వైదర్భీ పరీరంభ (శ్లేషము) శబ్దసందర్భ ములు కావ్య శాస్త్రోక్త పరిభాషా సందర్భములే; శ్లిష్టములై కథ కన్వయించు చున్నవి. ఇంతటి గంభీరార్థము గల సందర్భమును శ్రీనాథుడు సంక్షిప్తపరిచి ఒక్క వైదర్భితో తృప్తిపడినాడు.

"వైదర్భివోలె కవితా వైదర్భి నరేంద్ర నీకు వశమయ్యెడు మా ర్యోదయవేళ జపింపు కృతాదరమున నస్మదీయమగు మంత్రంబున్"
(శృం. నై. 6.24)

కవితా వైదర్భిని వలచినవారి ప్రత్యయ మిట్లేయుండు ననిపించును. శ్రీనాథకవితా వైదర్భికి ముగ్ధులైన శాస్త్రిగారు 'శృంగార శ్రీనాథము' చరిత్రాంశ ములతో పాటు శ్రీనాథుని కవితా వైదుష్యములనుకూడ వైదర్భి మార్గముననే హృదయంగమముగా వివరించిరి.

తృతీయ ప్రకరణమందలి 'శ్రీనాథుడు : విద్యాధికారి' అను వంశము నందును, పంచమ ప్రకరణమందలి 'కనకాభిషేకము, డిండిమభట్టారకులు' మొదలగు సందర్భములలోను శాస్త్రిగారు శ్రీనాథుని విద్యావైదుష్యములకు అక్షర సీరాజన మర్పించుచు చరిత్రాంశములను పొందుపరిచిరి. ప్రౌఢ దేవరాయని కొలువులో ప్రవేశించుట శ్రీనాథునకు దుస్సాధముకాగా

"ప్రౌఢ దేవేంద్రరాయభూపాలవరుని
సమ్ముఖంబున దయచూడు మమ్ము సుకవి!"

అని శ్రీనాథు డభివర్ణించినట్లుకలదు. ముమ్మసుకవి సాహాయ్యముతోనే శ్రీనాథుడు ప్రౌఢరాయుని సభయందు ప్రవేశింపగల్గెను. ముమ్మకవి చరిత్ర పరిశీలింపగా నాతడు పండార్వేయ సంప్రదాయమునకు చెందినవాడుగా కన్పట్టును. ఆతడు 'సుకవి' యనియు సహృదయుడనియు శ్రీనాథుడు గుర్తించెను. సభాప్రవేశ సందర్భమున పలికిన పద్యములు (పుటలు 156, 157) శ్రీనాథుని ఆత్మ ప్రత్యయమునకు అత్యంత ప్రబల సాక్ష్యములు. శ్రీ శాస్త్రిగా రీసందర్భమునను సాహితీ సౌరభము గుబాళించునట్లు వర్ణించిరి.

"అఖండ పండితుడగు డిండిమభట్టారకునితో డీకొని వాదించి యోడించి యాతని లోహడిండిమమును పగులగొట్టించి మన శ్రీనాథ కవీశ్వరుడు తానార్జించిన యశోడిండిమము నాంధ్ర మండలమం దెల్ల నెడతెగక సార్వకాలము మ్రోగించుచున్నాడు".

"నాటి కాలమున పండితు లెట్లు నిరంకుశులై డీకొనుచుండెడివారో స్వతంత్రులగు నప్పటి రాజులు విద్యాప్రియులై వారియం దెంత గౌరవప్రపత్తులు కలిగి సత్కారము లొనర్చుచుండెడివారో తలంచితిరా!" (పుట 168) శాస్త్రిగారి యీ హెచ్చరికతో గూడిన సంప్రశ్నము సార్వకాలికమై అన్వయించును.

పరిశీలనార్హ విషయములు :

శ్రీనాథుడు సర్వజ్ఞసింగభూపాలుని సందర్శించిన సందర్భము కవిసార్వభౌముని పాండిత్యమునకే కాక లౌక్యమునకును నిదర్శనమే. సింగభూపాలుని ప్రస్తుతించు శ్రీనాథుని పద్యమునకు రెండర్థములు చెప్పు ధోరణి కొంత అతిమాత్రమనిపించును. (పుట 181) ఇది శ్రీనాథు డుద్దేశించినది కాకపోవచ్చును సింగభూపాలుని సాహిత్య సౌభాగ్యమును శ్రీనాథుడు మనసార అభినందించియే యుండును.

"అహో సాహిత్య సౌభాగ్యం శ్రీ సింగధరణీపతేః" ఇత్యాదిగా చమత్కార చంద్రికలో విశ్వేశ్వర సరస్వతిచే ప్రస్తుతింపబడిన నవనవోన్మేష ప్రజ్ఞ గలవాడు సింగభూపతి. అట్టివానిని మనసార ప్రస్తుతింపకున్నచో అది శ్రీనాథుని అర్హపమునకు వెలితియే...

సర్వజ్ఞ సింగభూపాలుని చరిత్ర నన్వేషించి, శ్రీ శాస్త్రిగారు వివరించిన తీరు మిక్కిలి మనోజ్ఞముగా నున్నది. చారిత్రికాంశములలో శ్రీ శాస్త్రిగారి అభిప్రాయములతో భేదించినవారును గలరు.

“రసార్ణవ సుధాకర కర్త సింగభూపతియు, శ్రీనాథునిచే దర్శింపబడిన సింగభూపతియు భిన్నులు. మొదటివానికి సర్వజ్ఞ బిరుదము లేదు. వారిరువురు తాతా మనుమలు. తాత శక. 1320 ప్రాంతమునను మనుమడు శక. 1370 ప్రాంతమునను నున్నవారగుదురు. మల్లినాథుడు, శ్రీనాథుడు, పోతరాజు సర్వజ్ఞ సింగభూపతిని దర్శించిరి” (శృ. శ్రీ. పుట 179)

‘సర్వజ్ఞ సింగభూపాలు’డను వ్యాసములో డా॥ టి. వి. కృష్ణారావుగారు మరికొన్ని విశేషములను తెలిపిరి. “సర్వజ్ఞ బిరుదాంకితుడు, పండిత పక్షపాతి అయిన ప్రభువు కవులకూ, పండితులకూ ఆశ్రయ మివ్వకుండా ఉంటారా? విశ్వేశ్వర కవిచంద్రుడు, బొమ్మకంటి అప్పయార్యుడు ఇతని ఆస్థాన కవులు. శ్రీనాథు డాప్రభువును సందర్శించి సమ్మానం పొందారు.

బమ్మెర పోతన ఇతని కాలములో వాడేననీ భోగినీ దండకం ఇతనికే అంకితమిచ్చాడనీ కొందరు భావిస్తున్నారు. ఇది కేవలం భ్రాంతి. పోతనామాత్యుడు మూడవ సింగభూపాలునకు మాత్రమే సమకాలికుడు” (‘నవతోరణము’ పుట—101).

ఈ యంశములు సుదూరము పరిశీలింపదగినవి.

మూడవ సింగభూపాలు డనగా చినసింగభూపతియను నామాంతరముగల వేదగిరి యగునా? వెలుగోటివారి వంశచరిత్రమున ప్రసక్తుడగు నీ వేదగిరి రసార్ణవసుధాకరకారుని నాల్గవ కుమారుడు కావలెను. కాని ఇతనికి చినసింగభూపతియను నామాంతరము కేవలం కల్పితమని శ్రీ శాస్త్రిగారు సోపపత్తికముగా నిరూపించినారు. (పుట—188). అగుటచే పోతన రెండవ సింగభూపాలుడగు సర్వజ్ఞ బిరుదాంకితునకే సమకాలికుడని భావింపదగియున్నది.

పోతన శ్రీనాథులు బావమరదులను కథకు ఆకరము మృగ్యము.

"కమ్మని గ్రంథంబొక్కటి యిమ్ముగ నే నృపతికైనఁ గృతి యిచ్చినఁ గో
కొమ్మని యీయరె యర్థం బిమ్మహి దున్నంగ నేల యిట్టి మహాత్మల్ ?"

(పుట—182)

ఇందలి మహాత్ముడు పోతనయే యనుటయు నిర్ధారితమైనయంశము కాదు. అందువలననే శ్రీ శాస్త్రిగారు ఇది "శ్రీనాథుడు చెప్పినదిగా వినవచ్చు" పద్య మని మాత్రమే చేర్కొనిరి

శ్రీనాథుని చాటుకవితా సరస్వతి-దేశిసాహితి :

శ్రీనాథుని చాటువులు చారిత్రికదృష్టితో చూచినను, కవితాదృష్టితో చూచినను చాటుకవితకే మకుటాయమానము లనిపించును ఆ మహాకవి లోకజ్ఞతకు అయన చాటువు లన్నియు నిదర్శనములే. ఆశువుగాచెప్పిన ఆ పద్యములలో ప్రతిపదమును పరివృత్త్యసహిష్ణువై పరమచమత్కారభాజనముగా నుండుట ఒక విశేషము. పల్నాటిసీమను గూర్చి చెప్పిన పద్యములలోని భావములు వైయక్తికములు. చెప్పదలచుకొన్నది తెగవేసి చెప్పుట శ్రీనాథుని తత్త్వము. కవులకు చిల్లిగవ్వ యీయని మెతుకు దొరలను గూర్చి యేమన్నాడు ? "కుతుకల కోయు దొంగలకు .... మతకపు లంజె తొత్తులకు .... మల్లాదార్లకున్ కొతక యిత్తు; రింతె; కవికోటుల కిత్తురె ? చత్తు; రంతెపో మెతుకు దొరల్" అన్నాడు (పుట—188). ఇట్టి చాటువులు చరిత్ర దృష్టితో చూచినప్పుడుగాని, సాంఘిక దృష్టితో చూచినప్పుడుగాని అమూల్య నిక్షేపములే యనిపించును. మొరసరాష్ట్ర విస్తారముగా గలిగి మొరవరాజ్యమని చెప్పబడు కర్నాట మండలమును గూర్చి చెప్పిన పద్యములును అట్టివే (పుట —204). పల్నాట తాను విడిదిచేసిన ఒక పురోహితునిల్లు అశుభ్రముగా నుండుట చూచి అచ్చట పురోహితుల కొంపలే అంత అనునట్లు వ్రాసిన పద్యమును అట్టిదే (పుట—208).

ఇట్టి పద్యముల నుదాహరించుచు శ్రీ శాస్త్రిగారు వడివంతలేని శ్రీనాథ చాటు కవితా సరస్వతిని సహృదయహృదయకేదారముల ప్రవహింపజేసిరి.

ప్రాచీనమగు తెలుగుసాహిత్యములో శ్రీనాథుని రచనలు పండిత పామరులెల్లరి వలడిలచుచున్నవి నున్నవి. మార్గపద్ధతిలో రచింపబడిన పద్యకృతులే కాక దేశి పద్ధతిలో రచింపబడిన ద్విపదకృతులు, పాటలు, పదములు మొదలైనవే యిందుకు

నిదర్శనము. సార్వజనీనమైన శ్రీనాథ సరస్వతిని శ్రీ శాస్త్రిగారు శ్రద్ధాభక్తులతో లోకమునకు నివేదించిరి. పల్నాటి వీరచరిత్రము, కాటమరాజు కథ మొదలైన రచనలనుగూర్చి కూడ వివరించిరి. సులభశైలిలో రచింపబడిన పెక్కు చాటు పద్యములవలెనే శ్రీనాథుని పదరచనలు కూడ సర్వజన బోధకముగా నుండు సులభశైలిలోనే రచింపబడుట విశేషము. శ్రీనాథుడు ప్రౌఢ కవితా మార్గము కాని, అనుసరింపని కవితాప్రక్రియగాని ఆనాటికి లేదన్నచో అత్యుక్తి కానేరదు. ఈ అంశమును వివరించుటకే శ్రీ శాస్త్రిగారు శ్రీనాథుని దేశి సాహిత్యమునుకూడ క్షోదక్షమముగ పరిశీలించిరి.

## గ్రంథపరిష్కరణము-శాస్త్ర విధి :

పల్నాటి వీరచరిత్రము నిర్దుష్టముగా ప్రచురింపవలసిన అక్కర యెంతేని గలదని శాస్త్రిగారిఆవేదనము నిర్దుష్టమునగా మూలప్రతులను సంస్కరించు పంద ర్భములలో మూలమేదో సంస్కరణమేదో స్పష్టముగా తెలుపుటయని భావము. శ్రీ అక్కిరాజు ఉమాకాంత పండితులు ప్రచురించిన పల్నాటిచరిత్రము (బాలచంద్రుని కథ)ఈ దృష్టితో చూచిన శాస్త్రిగారికి తృప్తినింపలేదు. "ఈగ్రంథ సంపాదకులు యథేచ్ఛముగా గ్రంథమును మార్చిరి. కొంత చేర్చిరి. ఆ మార్పులు చేర్పులు భిన్నగా తెలుపరయిరి" (పుట-209) అని చెప్పుచు గ్రంథ పరిష్కార విషయమున పరిష్కర్త అవలంబింపవలసిన పద్ధతులను శ్రీ శాస్త్రిగారిట్లు ప్రవచించిరి.

"ప్రాచీన గ్రంథములను ముద్రించునప్పుడు గ్రంథకర్తల రచనములను మార్పకుండుట న్యాయ్యము. కవి ప్రయుక్త పాఠము గుర్తింప కుదురనప్పుడు గ్రంథకర్త మతానురోధమున నుచిత సంస్కారము చేయదగును. గ్రంథపాతము లున్నప్పుడు కథాసమన్వయమునకై పూరణములు సయితము చేయదగును. ఆ పూరణము లేవో తెలియదగినట్లు చిహ్నితములుగా నుండవలెను." (పుట-209)

శాస్త్రిగారి ఈ సూచన ప్రాచీన గ్రంథపరిష్కర్తలగు ప్రస్తుత పరిశోధకు లెల్లరికిని అవశ్య మనుసరణీయము.

శాస్త్రిగారు పరిష్కరించి ప్రచురించిన పలు గ్రంథములు తాము ప్రవచించిన పరిష్కార సూత్రమునకు విధేయములుగనే యున్నవి.

గ్రంథ కర్తృత్వ విషయమున శాస్త్రిగారవలంబించెడు పద్ధతి అంతర్బహిస్సాక్ష్యములు రెండును సేకరించుకొనుచు బ్రహ్మభేద్యముగా కట్టుచుండును. 'క్రీడాభిరామ' కర్త శ్రీనాథుడేయని శాస్త్రిగారి కృతనిశ్చయము ఇందు కెన్నియో ఉపపత్తులు చూపిరి. "ఈ గ్రంథము శ్రీనాథుని కృతియయి వెల్లడి కాగలిగినందుల కెంతయు సంతోషించుచున్నాడను. ఇందు పల్నాటి వీరచరిత్ర పాటలు, పంబవాండ్ర పాటలు మొదలగునవి వర్ణించుచుపట్టున చూపట్టు కవితోత్సాహమును బట్టి చూడగా శ్రీనాథుని కట్టి రచన మిక్కిలి దుచితమయినట్లు తోచుచున్నది. అత డిట్టి రచనలెన్నో రచించినట్లైతిహ్యములు గలవు" (పుట-282)

క్రీడాభిరామ గ్రంథమునందు వినుకొండ వల్లభరాయడే తత్కర్తయని చెప్పబడియున్నది. ఆముక్తమాల్యదయందును కృష్ణరాయడే తత్కర్తయని చెప్పబడియున్నది. ఆత్మస్తుతి దోష మంటకుండుటకై తన్ను బివర్ణించు పద్యములు పెద్దన మనుచరిత్రనుండి సందర్భశుద్ధితో కృష్ణరాయి డుద్ధరించుకొనినాడు. వల్లభరాయడు గ్రంథాంతమందైనను ఇట్టి జాగరూకత వహించినవాడు కాడు. హరిహరరాయ రత్నభాండాగారాధ్యక్ష పుత్రుడగు నీతడు పలువురు రాజకవులకు వలెనే తన కృతిని సందిగ్ధ కర్తృత్వమునుండి సంరక్షించుకొనలేక పోయెను. హర్షభోజు లదృష్టశాలులు.

**విషయ నిరూపణ విధి-రచనావధి :**

శ్రీ శాస్త్రిగారు చెప్పదలచిన విషయము కుండబ్రద్దలు గొట్టినట్లు చెప్పుదురు. చారిత్రకాంశముల విషయమున డొంకతిరుగుళ్లు పనికిరావనియు వారి అభిప్రాయము. కావ్యమందలి ధ్వనివలెకాక చరిత్ర సత్యములు వాచ్యములుగానుండుటయే క్షేమము శాస్త్రిగారు సత్కవియయ్యును చరిత్రాంశములు వివరించుతావుల కవితాధోరణి నవలంబింపక పొడిపొడి తేటతెనుగు మాటలలో ఖండితముగ చెప్పుదురు. ఇది మెచ్చుకొనదగిన యంశము. "శృంగార శ్రీనాథ" మంతయు ఇందుకు నిదర్శనమే.

శ్రీనాథుడు మార్గదేశి పద్ధతులలో మనోజ్ఞకృతు లనేకము రచించుటయేకాక పెదకోమటి వేమభూపాలు నొద్ద విద్యాధికారిగా నున్న కాలమున శాసనకృతులను గూడ రచించియున్నాడు. ఫిరంగిపురశాసనము వానిలో మకుటాయ

మానము. శ్రీశాస్త్రిగారు శ్రీనాథశాసనకృతులను పరీక్షించినతీరు శ్రీనాథ సమగ్ర విద్యామూర్తి నావిష్కరించునదిగా నున్నది.

**అలబ్ధమగు అపూర్వ కృతి :**

శ్రీనాథకృతులలో ననేకములు కాలగర్భమున కలిసిపోయినవి. లభించిన గ్రంథములే విశ్వరూప ప్రదర్శన సమర్థములై యున్నవి. మరుత్తరాట్చరిత్రాదుల వలె మరుగున పడిన గ్రంథములు మరికొన్నియు గల వనిపించును. పదునారవ శతాబ్ద్యంతమున వీపూరి వేంకటాచార్యుడు రచించిన "విశ్వకర్మపురాణ' మను పద్యకావ్యము నవతారికలో ఈ క్రింది పద్యము కలదు.

> "శ్రీనాథుం డొనరించె నంచు విబుధుల్ చెప్పన్ ధరన్ విన్నదే
> కా నెందున్ గన మా జగద్గురుని సత్కారుణ్య దివ్యప్రభా
> వానూన స్థిర శేముషీమహిమ" – [వి.క.పు. అవతారిక]*

'వేంకటాచార్యునికంటె పూర్వులు ఎవరేని విశ్వకర్మ పురాణము రచించినవారున్నారా ? యను సందియము తీర్చుటకై పై పద్యము చెప్పబడినది." విశ్వకర్మ వృత్తమునే శ్రీనాథుడు గ్రంథముగా రచించినట్లు పెద్దలుచెప్పగా వినియుంటి" వని చెప్పుచు ఆ గ్రంథము కనిపించుటలేదనియు చెప్పెను. సందర్భము ననుసరించి పై పద్యమందలి జగద్గురుడు విశ్వకర్మయని స్పష్టము. ఇంతకును పై పద్యకావ్యకర్త ఎవ్వరోకాదు, ప్రౌఢ దేవరాయల ఆస్థాన కవియై శ్రీనాథునిచే సుకవిగా ప్రస్తుతింపబడిన ముమ్మనకు పిమ్మట నాల్గవ తరము వాడగు వీపూరి వేంకటాచార్యుడు. ఈతడు తన విశ్వకర్మపురాణములో స్వీయ వంశావతారము వర్ణించుచు విశ్వకర్మమూలపురుషుడుగా గల ఆయవ గోత్రజులలో నాగన తరువాత ముమ్మన నాల్గవ తరమువాడని చెప్పెను. ఇతడే ప్రౌఢదేవరాయల యొద్ద ఆస్థానకవిగను ధర్మాధికారిగను ఉండి శ్రీనాథుడు రాయలకొలువు ప్రవేశించుటకు సాయపడినముమ్మన. ముమ్మనను గూర్చి విశ్వకర్మ పురాణమున నిట్లున్నది.

"ఆ ముమ్మన నిజకవితా శేముషి మెప్పించి యందె సింధుర తురగ స్తోమంబుల భూషణముల గ్రామంబుల ప్రౌఢదేవరాయల వలనన్" (వి.క.పు)*

---

*డా. కొండూరు వీరరాఘవాచార్యులు : శ్రీ వీరరాఘవ వ్యాసావళి (పుటలు 163 ; 170)

వాస్తు శిల్ప కవిత్వాది దశ[క్రియా పరిజ్ఞాత యగు ఈ ముమ్మసుకవి [పేరణచే శ్రీనాథుడు విశ్వకర్మ పురాణము వ్రాసియుండవచ్చును. శాలివాహన సప్తశత్యాదులవలె అదియు కాలగర్భమున కలసిపోయి యుండవచ్చును. ఎన్నటికేని బయల్పడుచో శ్రీనాథ కవితామూర్తి మరింత దర్శనీయము కాగలదు.

యుగకర్తకు ఉజ్జ్వల కవితా నీరాజనము:

శ్రీనాథ రచనా ప్రభావము తత్కాలమందలి కవులపైననే కాక అర్వాచీను లగు నెందరిపైననో ప్రసరింపకపోలేదు. కనుకనే శ్రీనాథు డొక యుగకర్తగా తెలుగు సాహిత్యమున క్రొత్త పుంతలకు మలచినవాడుగా గౌరవింపబడు చున్నాడు

జీవితములో చిరకాలము కవిగా విద్యాధికారిగా మహాపండితుడుగా రాజభోగము లనుభవించి, చరమజీవితమున కటకటపడుచుండియు, గంభీరోక్తులతో "దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి" అనిఅనగలిగినధీరు డొక్క శ్రీనాథుడే అట్టి శ్రీనాథుని చరిత్రమును వరససాహిత్య గ్రంథముగా మలచిన ప్రతిభా[వభాకరులు [శీశాస్త్రిగారు. ప్రతి ప్రకరణము మొదటను పొందుపరిచిన పద్యములు [శీశాస్త్రిగారివే. అవి వారి కవితా సామర్థ్యమున కెత్తిన కరదీపికలుగా నున్నవి.

నవ్యత–ప్రామాణికత :

1923లో 'శృంగార శ్రీనాథము' వెలువడినదిమొదలుగా శ్రీనాథ కృతులను గూర్చియు చరిత్రమును గూర్చియు అనేక సమీక్షాగ్రంథములు వెలువడినవి. అయినను [శీశాస్త్రిగారి గ్రంథ మీనాడు చదువుచున్నను నవనవముగనే హృదయము నలరించును. నూతన పరిశోధితాంశము లనేకము వెలువడినను తన నవ్యతను కోల్పోని గ్రంథము గౌరవార్హము. గ్రంథము వెలువడిన సంవత్సర కాలములో దీనిని రెండు పర్యాయములు చదివి ముగించి, ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు 17–9–1924న శ్రీశాస్త్రిగారికి వ్రాసిన జాబులోని ఈ వాక్యములు గుర్తుంచుకొనదగినవి. "ఇట్టి గ్రంథ మిదివరకు మన భాషలో నెవరుగాని రచించి యుండలేదని నా దృఢాభిప్రాయము. ఈకార్యము కొనసాగించుటలో మీరు గావించిన పరిశోధన పరిశ్రమ వర్ణనాతీతములు....మీనుండి యెన్నియో క్రొత్త

విషయములను నేర్పుకొనవలయునని కుతూహలపడుచున్నాను" చరిత్ర – ఆర్థిక శాస్త్రములలో సుప్రసిద్ధుడగు నొక ఆచార్యుని పలుకు లివి.

విజయమునకు శ్రీశాస్త్రిగారు తమ గ్రంథమును తొలుత చరిత్రభాగమని గ్రంథవిమర్శ భాగమని రెండు భాగములుగా రచించి, గ్రంథ బాహుళ్య భీతిచే ప్రథమభాగము మాత్రమే ముద్రించిరి. 1912 నాటికే సిద్ధమైయున్న ఆ వ్రాత ప్రతి వచ్చునకు తెచ్చు ప్రయత్నములో అది అంతరిత ప్రాయమై ప్రణష్టమైనదట ! "ఆగౌరవ నిప్పుకు తరవనేల" యని తెచ్చికోలు నోదార్పుతో శాస్త్రిగారు నిర్విణ్ణులైరి.

ప్రభాకర వాఙ్మయ యజ్ఞము :

తెనుగునాట గ్రంథముద్రణ మొక మహాయజ్ఞముగా పరిణమించినది. సాహిత్య విమర్శ గ్రంథముల జాతకము మిక్కిలియు శోచనీయము. అయినను పట్టువిడువక శాస్త్రిగారి పుత్రుడు డా. ఆనందమూర్తిగారు ఈ గ్రంథమును నేటికైన పునర్ముద్రణకు తేగలుగుట మెచ్చుకొనదగిన యంశము. అముద్రితమై శాస్త్రిగారి సాహిత్య యోగ వాఙ్మయ మెంతయోగలదు. దానిని కొంత కొంత 'మణిమంజరి' పత్రికా సంచికలలో ప్రచురింపగలుగుచున్నారు. అట్టి ప్రచురణల నాంధ్రరసజ్ఞ సంపన్ను లవశ్య మాదరింపవలెను. వేటూరి ప్రభాకర శాస్త్రి మెమోరియల్ ట్రస్టువారు వాఙ్మయయోగ పరిశోధన మార్గమున చేయు కృషి అసాధారణమైనది. దీని ప్రసక్తి ప్రకృత గ్రంథ పరిచయ సందర్భమున సముచితమే యనుకొందును.

ప్రతిభాప్రభాకరులైన శ్రీశాస్త్రిగారు పెద్దకాలము మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున పండితులుగా పనిచేసిరి నేనును ప్రస్తుత మాంధ్రప్రదేశ్ ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున పనిచేయువాడనగుటచే కృషి సామ్యమును పురస్కరించుకొని ఈ గ్రంథమున కీముందుమాటలు వ్రాయ సాహసించితిని. ఇందుకు కారణభూతమైన డా. ఆనందమూర్తిగారి ఔదార్యమునకు కృతజ్ఞతలు.

హైదరాబాద్ — వాసిలి వేంకటలక్ష్మీనరసింహారావు
6 10. 1985.

**Dr. M. RADHAKRISHNA SARMA**
Professor and Head
Dept of Ancient Indian History,
Culture and Archaeology
Osmania University

# The Reprinting Of The Valuable Work

"Sringaara Sreenaathamu" of Veturi Prabhakara Sastri Garu should receive the attention of pandits and public interested in the history, culture and literature of Andhras. Professor M. Venkatarangaiya, having gone through the work, wrote in a letter dated 17th September 1924 thus... "It is my firm belief that no one has written such a work as this in our (Telugu) language. The research and efforts that have gone behind the work cannot be expressed in words". These words written some sixty years ago could be taken to be true even today.

'Sringaara Sreenaathamu', ofcourse, is a study of the life, works and times of the renowned poet of the Telugus belonging to the medieval period, Srinatha. The uniqueness of the book of Sri Prabhakara Sastri is that through his expert writing he has made it a historical research work of a literary personage whose life was intertwined subtly with the political events and social ethos of the times.

Historical methodology, with surprising clarity, has been enunciated by Sri Prabhakara Sastri even in the 1920 's. In the foreword to his work he says"... This cannot be a true historical work; for one to be called so should adduce

evidence that each event mentioned is a fact. I have merely collected available historical materials and gave a shape of history of Srinatha. For this reason only I have not named it as history, but, preferred to give the present title of "Sringaara Sreenaathamu". The manner in which the author tackled the historical value of the "Palnativiracharitramu" is a typical example even to the present-day researcher as to how research writing should be. Relevant words of C. P. Brown are quoted and made apt use of (Chapter VIII). In this context Sri Prabhakara Sastri elaborated the research maxim "It is proper that while printing ancient works no changes are made in the text of the authors."

The author makes it clear both in his foreword to the book, as well as in many discussions in the work itself that he is not publishing his entire text. The original work written some ten years prior to the date of the first edition in manuscript seems to consist of two parts, the Historical and the Criticism, of which only the former part is being published. He proposed to publish the 'Criticism' part separately. Today when liberal research grants are available, the work of Sri Prabhakara Sastri in its entirety should be brought out in a single volume. This would serve as an excellent source book for the medieval history and culture of Andhras. It is after the publication of such works of pioneers as this that an attempt to bring out works on "Historiography of Andhra" or "Andhra Historians" could be done. The Prabhakara Sastri Parisodhaka Mandali which is in possession of late Sastri's writings should bring out the comprehensive volume on "Sringaara Sreenathamu" with financial assistance of the Government of Andhra Pradesh.

Historians of Medieval Andhra had been concentrating their studies on the history of the Kakatiyas and the Vijayanagar dynasties. Excepting for a few significant studies the history and contribution of several dynasties that ruled Andhra in the post Kakatiya period have not been researched into. In-depth examination of literary and archaeological sources and attempt at the coordination between the two have yet to be seriously done. The relations that existed between the various kingdoms and regions of Andhra during the period between A. D. 1300 to 1600 A. D. are very vital for the understanding of Andhra history and culture of the later periods as it was now that Telugu lanaguage and culture took a mature form and the new elements of Islamic culture got introduced. Srinatha lived during these times. Life and works of Srinatha truly mirror his times. For instance as Sri Prabhakara Sastri with deep insight remarks that 'Palnativiracharitramu' of Srinatha truly reflects Andhra country, Andhra language, Andhra customs and manners, in a word 'Andhraness'. (Chapter 8). I find that "Sringaara Sreenathamu" is a source book for matter and methodology for researchers delving into the period.

Taking into account the period covered in the work, it is encyclopaedic. The work is divided into nine chapters, The first chapter reviews the conditions in Andhra during the 14 th and the greater part of 15 th century A. D, which is the period when Srinatha lived. Srinatha's caste, gotra, genealogy, nativity, period of life, name, boyhood, early education, family conditions and relationships are systematically dealt with. The interesting problem of the contemporaneity of Srinatha and Potana is examined.

The second chapter discusses the history of the Reddis of Kondaveedu making use of both literary and

epigraphic sources. The Contribution of these *Reddis* to Telugu culture is briefly and beautifully put in the concluding paragraph of the chapter. Literary patronage of the rulers and literary output of the poet are now extensively discussed in the third chapter. A thorough examination of inscriptions from the view-point of history of literature is made. Maruttaratcharitra, Salivahana Saptasati, Panditaradhya-Charitamu, Sringaaranaishadhamu, Haravilasamu- the significant works of the author are discussed in many of their aspects. The collapse of the Reddi kingdom of Kondaveedu also marks the end of a stage in the life of Srinatha.

The fourth chapter takes the life and times of Srinatha from this point, and mainly examines his work 'Bhima khandamu'

The fifth, sixth and seventh chapters deal with the best years of the life of Srinatha. It is here that his encounter with Dindimabhattu is picturesquely described and discussed in detail.

Chapter eight covers the theme and historical importance of Palnativiracharitra, the folk literary compositions of the poet. Katamarajukatha, Kreedabhiramamu, Sivaratrimahatmyamu and miscellaneous works.

In the final chapter the sad days of the poet at the end, his character and personality, personal religion, other poets' estimate of him and his contemporary poets are covered. The author in a tribute to the poet concludes what if he died in penury! when riches had not succeeded in making the name of others permanent, the name of Srinatha is living for eternity due to the merits of his Poetry.

The suggestion of Sri Veturi Prabhakara Sastri that a memorial should be raised for Srinatha in Andhradesa should be seriously and sincerely taken up by the govern-ment and the public. "Srinatha Peethamu', established at Guntur recently appears to be one such step taken in that direction. Let us hope that it fulfills the hope of Sri Sastri.

When one goes through Sri Veturi Prabhakara Sastri's 'Sringaara Sreenathamu" one realises why it was remarked 'Desa Bhashalandu Telugu lessa?' It is indeed sweet.

**Radhakrishna Sarma**

Hyderabad
30-10-1985

# గ్రంథ పరిచయము

[రుధిరోద్గారి సం॥ శ్రావణమాస శు॥ ౭ ఆం॥ పత్రిక సారస్వతా నుబంధమున శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు శృంగార శ్రీనాథమును సమీక్షించి వ్రాసిన వ్యాసభాగమిది]

ఈ గ్రంథమును ప్రభాకరశాస్త్రి గారు పదేండ్లకు బూర్వమే వ్రాసినను నాంధ్రప్రపంచమునకు దానిని జదివి యానందింపగల భాగ్యమిపుడు గలిగినది. శృంగారప్రియుడైన శ్రీనాథుని చరిత్రమునకు శృంగార శ్రీనాథమను నామకరణము సార్థకము....

తొమ్మిది ప్రకరణముల గ్రంథమునందును శ్రీనాథకవీంద్రుని చరిత్రమును హృద్యముగను విచక్షణోపేతముగను వ్రాసి శాస్త్రిగా రంధ్రకవిజీవితహారమున కొక యమూల్యమైన మణిని సమకూర్చి కృతార్థులైరి....

ప్రతిభగల మహాకవి జీవితమును వర్ణించుట సులభసాధ్యముగాదు కవి కాలమును కవిహృదయమును గ్రహింపగల పండితులు మాత్రమే ఈ కార్యమును నిర్వహించుటకు సమర్థులు. ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథుని పరిస్థితులను హృదయమును గనుగొనుటకు జేసిన పరిశ్రమను గ్రంథమంతయును విశదముచేయుచున్నది శ్రీనాథుని భోగాభిలాషను విపరీత దృష్టితో నవలోకించిన వీరేశలింగము పంతులుగారి భావములును శ్రీరామమూర్తిగారి భావములను శ్రీనాథ ప్రియులైన ప్రభాకరశాస్త్రిగారికి నిరాదరణము గలవులైనను శాస్త్రిగారి భక్తియును నతిశయోక్తిని పొందినది. శ్రీనాథుడు 500 ఏండ్లక్రితము జీవించియుండెను. ఆ సుకవీంద్రుని జీవితమును పరిశీలించునపు డాకాలపు స్థితిగతులను ప్రమాణముగ గైకొని పరిశీలించుట ధర్మము ప్రస్తుత పరిస్థితులను ప్రమాణముగ గైకొని పరిశీలించుట యనుచితము. ప్రభాకరశాస్త్రిగారిట్టి లక్ష్యముతోనే గ్రంథమును రచించిరి. గ్రంథమునందు సహజముగను పునరుక్తిదోషమున్నను శ్రీనాథుని జీవిత గ్రహణమునందభిరుచిని బుట్టించుచున్నది. ఆంధ్రులకు చిరపరిచితములైన శాస్త్రిగారి మంచిశైలియును విషయాన్వేషణ సామర్థ్యమును దీనియందును గన్పట్టుచున్నవి. ప్రకరణారంభమునందు రసవంతములైన పద్యములను జేర్చి పద్యభావమును ప్రకరణమునందు హృద్యముగ విస్తృతముచేసిరి....శృంగార శ్రీనాథము నందు ప్రాచ్య పాశ్చాత్య విధానములు మేళగించి కవి జీవిత రచనము క్రొత్త సొంపును బొందినది. గ్రంథము హృద్యముగ నున్నది....

# శృంగార శ్రీనాథము

శ్రీగురు చరణం శరణమ్.

గీ. శ్రీనిరంతరానంద నిశ్శ్రేయసార్థ
సాధకము సర్వకిల్బిషబాధకము స
మగ్రవిజ్ఞానదము మహామహిమఘనము
శరణ మగు మాకు సద్గురుచరణయుగము.

దివ్యప్రకాశమగు శబ్దజ్యోతిని వెలయించి మానవుల జ్ఞాననేత్రమునకు లోకవృత్తాంతమును శాశ్వతముగాఁ గన్పఱుచు కవీశ్వరుల ప్రతిభాశక్తికి నమస్కారము. శబ్దజ్యోతి లేని నాఁడును, దానిని గవీశ్వరులు శాశ్వతముగా నుద్దీపింపఁజేయని నాఁడును లోకము చీకటి గొనును. లోకనౌకకుఁ గవీశ్వరులే కర్ణధారులు. సంసారయాత్రలోఁ గవీశ్వరులే కవితామృతప్రపల వెలయించి యశ్రమమున లోకము నానందోద్దేశమున కంజె వేయించుచున్నారు. రసానందానుభవము వెలయుచుండునంతవఱకు లోకమున నీ కవీశ్వరుల ఘనత యనితరలభ్యమై సభ్యమై యొప్పుచుండును వారియున్నతజీవితము లోకమున కున్మార్గ దర్శకము. దాని నారాధించుట లోకమునకు మేలుకూర్చుకొనుట. ప్రాచీనాంధ్రకవీశ్వరుల జీవితచరిత్రములను విపులముగా వెలయించి వారికీర్తిమూర్తులను గీర్తింపవలెననియు, తత్కవితా విమర్శ మూలమున నంధ్రవాణికిఁ గొంతయారాధనము చేయవలె ననియు నాకుఁ గొండంత కోరికకలదు. ఈ కోరికను దీఱుచుకొను

టకై చేయు నాయత్నమునఁ దొలుతఁ దోఁచినవాఁడు శ్రీనాథకవిసార్వభౌముఁడు. బహుదేశములుతిరిగి, బహుశాస్త్రములనెఱిఁగి, రసవత్కవిత రచించి, రాజాధిరాజుల పూజలఁగొని, విద్వద్గోష్ఠులం దాఱితేఱి, విద్యావివాదములందు విజయములంది, భువనభరితకీర్తియై, పూర్ణపురుషాయుషజీవియై దివిజకవివరుగుండియలు దిగ్గురనునట్లు స్వర్లోకప్రస్థానముసల్పిన మనకవిసార్వభౌమునివంటివాఁడు, ప్రఖ్యాతచరిత్రుఁ, డంధ్రకవీశ్వరులం దింకొకఁ డగపడఁడు. ఆయనచరిత్రము గనుఁగొనుటకు సాధనము లనేకములు సమకుఱియున్నవి యథాశక్తి, యథోపలబ్ధి, యిఁకమీఁద నాసుకవీంద్రునిచరిత్రము వివరింతును.



# ప్రథమ ప్రకరణము

సీ. కమలనాభుఁడు సుధీఘనుఁడు సత్కవితా వి
 ధాత కాల్పట్టణస్థాత తాత
మారయ్య సర్వవిద్యారసజ్ఞుఁడు తండ్రి
 భీమాంబ సుగుణాభిరామ తల్లి
దుగ్గయ్య కృతికర్త తగ్గవాఁడు మఱంది
 పాటికెక్కిన పాకనాటికులము
శాఖ కృష్ణయజుః ప్రశస్త మాపస్తంబ
 సూత్ర భారద్వాజగోత్రయుతము

గీ. జన్మకాల మాంగ్ల శాకాబ్దములు పహ
త్రయము మూఁడునూర్లు చనినమీఁద
నెప్పుడేను కొంచె మించుమించుగ నగు
నెవని కట్టి సుకవిం విని దలఁతు.

మన కిప్పుడు ప్రస్తుతాంశమగు శ్రీనాథచరిత్రము కొఱకయి యెఱుకకుఁదెచ్చుకొనవలసినకాలము పదునాల్గవ శతాబ్దియంతమును, బదునైదవ శతాబ్ధియర్ధాధికభాగమును.

విద్వత్కవిసంపన్నతచే నీకాలమం దంధ్రదేశ మెక్కువ వైభవమనుభవించినది. విద్యారణ్యులవారు తురుష్కులవలన నార్య ధర్మ నిర్మాణముల కుపప్లవము కల్గకుండ విద్యానగరరాజ్యమును వెలయఁజేసి వేదాదివిద్యలకు భాష్యములు రచియించి వైదిక సంప్రదాయమును సంరక్షించి యిప్పటి కెక్కువ కాలము కాలేదు.

డ్రహ్మమహాకావ్యములకు వ్యాఖ్యానములురచించి సంస్కృత సారస్వత స్ముద్రను విప్పిచూపిన వ్యాఖ్యాతృశిరోమణి మల్లినాథ సూరియు భక్తిరసపారావారమునఁదోలాడున ట్లంధ్ర భాగవత ప్రబంధమును రచించి యంధ్రలోకము ననుగ్రహించిన పూతచరిత్రుఁడు బమ్మెర పోతరాజ కవియు నీకాలముననే యవతరించిరి. సంస్కృతాంధ్రములం దింక నెందఱో యెన్నఁదగిన కవీశ్వరు లున్నారు. వారివిషయము ప్రకరణాంతరమునఁ బ్రశంసించెదను. పరమధార్మికులును, విద్యావిలాసలాలసులును నగు రెడ్డిరాజులపాలన మీ కాలముననే కొనసాగెను విద్యానగరమునఁ గర్ణాటరాజులును, గటకమున గజపతులును, నద్దంకి కొండవీడు రాజమహేంద్రము మొదలగు స్థలముల రెడ్డిరాజులును రాచకొండ దేవరకొండ మొదలగు స్థలముల రేచర్ల వెలమరాజులును నెలకొని యీ కాలమున నంధ్రదేశభాగములు పాలించుచుండిరి. సారవంతమయిన మధ్యాంధ్రదేశము రెడ్డిరాజుల పాలనమునసుండుటచే వారిపయికిఁ దక్కినవారు దండువెడలుచుండిరి. తురుష్కుల తళ్లను గలదుగాని వా రంధ్రదేశమునఁ సుప్రతిష్ఠితులు కాలేదు. నాఁటి రాజులలోఁ బ్రధానులు వీరు. మఱికొందఱు చిఱుతదొరతనములు నెఱపువారు నున్నారు; కాని వారు పయివారికి లోపడినవారే అప్పటి యంధ్రదేశ రాజ్యస్థితి యిట్టిది.

## కులగోత్రములు

శ్రీనాథుఁడు యజుశ్శాఖయు నాపస్తంబసూత్రమును భారద్వాజ గోత్రమునుగల పాకనాఁటి నియోగిబ్రాహ్మణవంశమువాఁడు. పాకనాఁడు పూర్వ మేకవింశతిసహస్ర (21000) గ్రామసంఖ్యాకమగు దేశము.

శృంగారశ్రీనాథము

మ. అరుదందన్ వెలనాటిచోడమనుజేంద్రాజ్ఞాపనం బూని దు
స్తరశక్తిన్ జని యేకవింశతిసహస్రగ్రామ సంఖ్యాకమై
ధరణింబేర్చినపాకనాఁడు నిజదోర్దర్పైకలగ్నంబుగాఁ
బరిపాలించె నమాత్యకొమ్మన జగత్ప్రఖ్యాతచారిత్రుఁడై.

కేయూరబాహుచరిత్రము.

శ్రీశైలము తూర్పుటంచునంటుకొని గుండ్లకమ్మ నదికి నుత్తర దక్షిణ పార్శ్వములందు సముద్రముదాఁక వ్యాపించినదేశము పూంగినాఁడని పోలయవేమునిశాసనమం దున్నది. పూగి, పూంగి, పోఁక, పాక, పదములకు శబ్దార్థసంగతి కలదు. పూంగినాఁడే పాకనాఁడు కావచ్చును. అట్లేయగునేని నేఁ డది కర్నూలు, గుంటూరు, నెల్లూరు, కృష్ణామండలములలో సంక్రమించినదగును. బహుకాలమునకు ముందే యంధ్రబ్రాహ్మణులు వైదికులని, నియోగులని, యిరుదెఱఁగులవారయిరి. వేదాదివిద్యాసంపన్నులును, వైదికకర్మాచరణపరాయణులును నయినవారు వైదికులు. వైదికధర్మముల నాదరించుచు, రాజ్యాంగోద్యోగులను, గార్యఖడ్గనిపుణులును, వితరణ కుశలులును నయినవారు నియోగులు. వేదాదివిద్యాసంపన్నతను గాంచిన నియోగులును రాజ్యాంగోద్యోగాదిపదములను బడసినవైదికులునుగూడఁ గొందఱు లేకపోలేదు. ప్రాయికముగా వైదికులు గీర్వాణభాషను, నియోగులు తెలుఁగుభాషను బోషించుచు వచ్చిరి. వైదికులలో వేఁగినాటివారు, వెలనాటివారు మొదలగు పేళ్లతోను, నియోగులలోనార్వేలవారు, పాకనాటివారు, మొదలగుపేళ్ళతోను నవాంతరభేదము లుప్పతిల్లినవి. వారు వారాయానాళ్లలోనున్నావా రగుటనుబట్టి యాయాభేదము లేర్పడెను. పాకనాఁటింటివాఁ డనియున్నదేగాని శ్రీనాథుని యింటిపేరేమో స్పష్టముగా

నెక్కడను గానరాలేదు. పాకనాఁడనునది నియోగులయొకశాఖకే పేరు గానున్నదిగాని యొక కుటుంబమునింటిపేరుగా వినఁబడదు.

## తాతతండ్రులు

సాహిత్యచక్రవర్తియై పద్మపురాణసంగ్రహమను ప్రబంధమును రచియించి కవితాపితామహుఁడనఁబరగిన కమలనాభామాత్యుఁడు శ్రీనాథునితాత. పద్మపురాణ సంగ్రహకథాకావ్య ప్రబంధాధిపుఁడనియు, కలితకావ్యకళాలాపుఁడనియు, నుండుటచే నాతఁ డాగ్రంథమునకుఁ గృతిపతి యయ్యెనేమోయని సందేహము కలుగవచ్చును. దీని కుపబలముగాఁ గూచిమంచి తిమ్మకవికృత లక్షణసారసంగ్రహమున "మత్పితామహుఁ గవిపితామహు"నని భీమఖండమందున్న పద్యము, 'మత్పితామహు ధీపితామహు' ననుపాఠముతోఁ గానవచ్చుచున్నది. భీమఖండమునకు వ్రాఁతప్రతులు మంచిపి దొరకలేదు. కావున నాపాఠము నిర్ణయింపఁ గుదురకున్నది. అయినను, సరససాహిత్య సామ్రాజ్యచక్రవర్తి, కవితావిద్యాధరుఁడు. ననిపేర్కొనఁబడుటచే నాతఁడు కవియనియే యెఱుఁగఁదగును. అతనిపద్మపురాణసంగ్రహమిప్పుడు దొరకకున్నది. లక్షణ గ్రంథాదులందదియుదాహృతముగాఁ దెలియరాలేదు. భీమాంబామారయలు శ్రీనాథునితల్లిదండ్రులు. మారయ కమలనాభునివంటి విద్వాంసుఁడుగాకున్నను, ప్రాజ్ఞుఁడు విద్యావంతుఁడు ననియే తలఁపఁదగియున్నాడు. కాశీఖండమున నాతఁడు 'విద్యారాజీవభవుఁ'డని ప్రస్తుతింపబడెను.

## జన్మదేశము

శ్రీనాథుఁడు పిన్ననాఁటనుండియుఁ గొండవీటి రెడ్లయాస్థానమున మెలఁగినవాఁడగుటచేతను, పాకనాఁటింటివాఁడగుటచేతను, నాతనిజన్మ

దేశము కొండవీటిసీమ యగునని స్థూలదృష్టికి గోచరించును. ఈ విషయమును గూర్చి పలువురు పలుదెఱఁగుల వ్రాసియున్నారు. ఒకానొకరు :- శ్రీనాథుఁడు కర్ణాటకుఁడనియు నంధ్రదేశమునఁ జేరి తెలుఁగుఁగవీశ్వరుఁ డయ్యెననియుఁ, దనతాతనివాసస్థలముగా నాతఁడు చెప్పుకొన్న సముద్రతీరపుఁగాల్పట్టణమేదో పశ్చిమసముద్రతీరమున నుండుననియు వ్రాసియున్నారు. ఈ వ్రాఁత సర్వధా యసంగతముగా నున్నది. భీమఖండకృతిపతి "పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు"నని శ్రీనాథునిఁ బ్రశంసించుట, నాసికేతోపాఖ్యానకర్త దగ్గుబల్లి దుగ్గన "శ్రీనాథసుకవి కూరిమిఁ షేయుమఱఁది" నని చెప్పుకొనుట, మొదలగు నంశములు పైవాదమును బ్రధ్వంసపఱుచుచున్నవి. అసంగతముగా నున్న పైవాదము నపాకరించి బ్రహ్మశ్రీ చిలుకూరి వీరభద్రరావు గారును, వీరేశలింగముపంతులుగారును, మఱి రెండు దెఱఁగులఁ గ్రొత్త వాదములను నెలకొల్పిరి. "కాల్‌పట్టణమనగాఁ గాలపట్టణము. [కాల = నల్లని] కాల పట్టణమే కృష్ణపట్టణము. ఇది నెల్లూరి చేరువ నున్నది." వీరభద్రరావుగారి యూహయిది. ఈయూహ వారికేతృప్తిని గొల్పదయ్యెను. కృష్ణపట్టణమని పద్యమునఁ జెప్పఁ గుదురక కాల పట్టణముగా మార్చుకొనవలె యటులును గుదురక, కాల్‌పట్టణముగాఁ గుంచించుకొని శ్రీనాథకవి చెప్పవలసినవాఁడయ్యె ననుటయుచితముగా నుండదుగదా!

"కాల్ పట్టణము కాదు క్రొల్పట్టణ మనియుండవలెను. క్రొల్పట్టణ మనఁగాఁ బ్రకాశించుపట్టణము. క్రొత్తది ప్రకాశించునుగనుకఁ గ్రొత్తపట్టణమని యర్థమువచ్చును" అని వీరేశలింగముపంతులుగారి సంభావనము. ఇది మిక్కిలి యసంగతముగా నున్నది. కృష్ణపట్టణమని చెప్పఁ జూచుచోఁ జొప్పడెడు దోషములు దీనికిని దప్పినవికావు. మఱి

విశేష మొక్కటి. క్రొత్తపట్టణ మేర్పడి యిప్పటి కిన్నూఱేండ్లుకాలేదు. ఇది వంగవోలునకుఁ దూర్పునఁ బదిమైళ్లలో సముద్రపుటొడ్డుననున్నది. అర్నూఱేండ్లకుముం దీపట్టణముఁ గూర్చి ప్రశంసయసంగతముగదా!

మచిలీపట్టణమునకుఁ దూర్పున సముద్రతీరమున నిప్పుడు కాలీపట్టణ మనుగ్రామ మున్నది. అది ప్రాచీనపట్టణము. ఇప్పుడు మిక్కిలి రూపుచెడియున్నను నాగ్రామము ప్రాచీన ప్రాభవమును సూచించుచున్నది. కాలిపట్టణము, కాలీపట్టణము, కాళీపట్టణము అను పదముల కంతగా భేదములేదుగదా! 'వారిధితటీకాల్పట్టణాధీశ్వరుణ్' అని భీమఖండ పద్యపాదమున శ్రీనాథుఁడు పేర్కొన్న కాల్పట్టణ మిప్పుడు కాలీపట్టణమని వ్యవహరింపబడుచున్న పయిగ్రామము కాఁదగును. శ్రీనాథునిబావమఱఁదియగు దుగ్గన యింటి పేరిగ్రామమగు దగ్గుఁబల్లి కాళీపట్టణమునకుఁ బదిమైళ్ల దూరమందున్నది. శ్రీనాథుని బంధువగు బెండపూఁడియన్నమంత్రి ప్రభృతుల గ్రామములుగూడ దానికిఁ జేరువనున్నవి.

ఈనడుమ బ్రహ్మశ్రీ. కే.వి. లక్ష్మణరావుపంతులుగారొకశాసనము (క్రీ.8-వ శతాబ్ది) నందుఁ "గలుపట్టణము" అనుపేరును జూచి శ్రీనాథుని కాల్పట్టణ మదియేయని నిర్ణయించిరి. శాసనమున నట్లుపేర్కొనఁబడిన కలుపట్టణము నేఁడు కలపట మనుపేర నున్నది. అది యిదివఱకు నేను బేర్కొన్నకాళీపట్టణమునకు దరిదాపుననేకలదు. కాళీపట్టణము సముద్రము నొడ్డుననే యున్నది. కలపటము పదిమైళ్ల దూరమున నున్నది. శ్రీనాథుఁడు పేర్కొన్న గ్రామమిదియుఁ గావచ్చును.

శృంగారశ్రీనాథము

## జీ వి త కా ల ము

సీ. చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటి నాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాలనూత్న యౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిండుజవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మంధ్రభాష
ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకునిమహిమ

గీ. ప్రాయ మింతకు మిగులఁగై ప్రాలకుండఁ
గాశికాఖండమను మహాగ్రంథ మేను
దెనుఁగు చేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి ! శ్రీనాథభట్టసుకవి !

సీ కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు ?
రంభఁ గూడెఁ దెనుంగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు ?
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు ?
కైలాసగిరిఁ బంటమైలారవిభుఁ డుండె
దినవెచ్చ మేరాజు తీర్పఁగలడు ?

గీ. భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండ గష్ట మనుచు
దివిజకవివరుగుండియల్ దిగ్గు రనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.

మొదటిపద్యము శ్రీనాథుని కాశీఖండమందలిది. రెండవది యాతని చాటువు. ఈ రెండు పద్యములనుబట్టి శ్రీనాథుని జన్మకాలమును నవసానకాలమును గొంచెము మించుమించుగా గుర్తింపఁదగును. మొదటి పద్యమునఁ బేర్కొనఁబడినగ్రంథములలో శృంగార నైషధము, భీమఖండము, కాశీఖండము నిప్పుడు ప్రఖ్యాతములయి యున్నవి. తక్కినవి కానరావు. శృంగార నైషధము నిండుజవ్వనమునను. భీమఖండము ప్రౌఢనిర్భరవయఃపరిపాకకాలమునను, గాశీఖండము వార్ధకారంభమునను రచింపఁబడినవని పయిపద్యము చెప్పుచున్నది. ఇర్వదికిమీఁద ముప్పదియైదుదాఁక నిండుజవ్వనమనియు, ముప్పదియైదునుండి నలుబదియైదుదాఁకఁ బ్రౌఢనిర్భరవయఃపరిపాకమనియు నలుమీఁదవార్ధకమనియు వయోవిభాగమును జేయఁదగును.

పయిగ్రంథములో దేనికేని రచనాకాలము స్పష్టముగా మనకుఁ బట్టుచిక్కెనేని దానిఁబట్టి కొంచెమించుమించుగా జన్మకాలము తెలిసికొనఁగల్గుదుము. శృంగారనైషధము పెదకోమటివేమభూపాలమహాసామ్రాజ్యరక్షామణియై, యవనాధీశసభా నిరర్గళవచోవ్యాపారపారీణుఁడై, వివిధాగ్రహారములతో నాందోళికాచ్ఛత్రచామరాదిరాజార్హపదములను బడసిన మామిడిసింగమంత్రి కంకితముచేయఁబడినది. పెదకోమటి వేమారెడ్డి క్రీ. 1400. తరువాతికాలమున రాజ్యమునకు వచ్చెను. క్రీ. 1420 వఱకు రాజ్యమేలెను. కాఁబట్టి సింగమంత్రి యట్టిప్రాభవములఁ బడసినపిదప నడచిన శృంగారనైషధరచనము క్రీ. 1410, 1415 ప్రాంతముల నయియుండవచ్చును. మామిడిసింగమంత్రియే క్రీ. 1418లో సోమసిద్ధాంతమునకు వ్యాఖ్యానము రచించినాఁడు. కృతిపడిగై కొన్నకాలము దానికిఁ జేరికగా నుండవచ్చును ఈ విషయమున నాక్షేపసమాధానములు కొన్నియున్నవి. అవి మూఁడవ

ప్రకరణమునఁ జూడఁదగును. శృంగారనైషధము నాతఁడిర్వదియైదు ముప్పదియేండ్ల నడిమివయసున రచించియుండునేని, యాతనిజన్మకాలము క్రీ. 1385 ప్రాంతమగును. ఈ పరిగణనమును నేను నిందు జవ్వనము నడిమికాలమును, పెదకోమటి వేమారెడ్డిపాలనము నడిమి కాలమును గొని యేర్పఱిచినాఁడను. ఇది స్థూలపరిగణనము. దీని కేదెనిమిదేండ్లు పూర్వోత్తరములుగాఁగూడ నాతనిజన్మకాల ముండ వచ్చును. కాన యిది నిష్కృష్టనిర్ణయమునకుఁజాలదు. కాని మఱికొన్ని విధములఁ జూడఁగా నీకాలమే నిష్కృష్టముగా నిలుచుచున్నది. భీమఖండరచనాకాలము క్రీ. 1428 కిఁ బైపడియు 1435కి లోపడియు నుండును. ఆవిషయము నాల్గవ ప్రకరణమున జూడఁదగును. భీమఖండరచనమునాఁటికి శ్రీనాథుఁడు ప్రౌఢనిర్భరవయఃపరిపాకశాలియై బహుభోగముల ననుభవించుచున్నాఁడు. ఆవయస్సు ముప్పదియైదేండ్లనుండి నలుబదియైదేండ్లదాఁక నగునని కొంటిమి. శ్రీనాథుఁడు నలుబదియైదేండ్ల వయస్సుననే భీమఖండము రచించెనను కొన్నను నది క్రీ. 1430 అనియే యనుకొన్నను, నాతనిజన్మకాలము క్రీ. 1385గానే యేర్పడుచున్నది.

శ్రీనాథుని జన్మకాలము క్రీ. 1360 అగునని యొక యాక్షేపవాదమున్నది. దాని స్వరూపము సంపూర్ణముగాఁ దృతీయ ప్రకరణమునఁజూడఁదగును. ఆ యాక్షేపపక్షమును సమాధానపఱుచుటకయి యీ చర్చలో నేనా ప్రక్కకే తిరిగి యచట యానుకూల్యమొసఁగి సిద్ధాంతము నిర్ధారింపఁబ్రయత్నింతును. ప్రౌఢనిర్భరవయఃపరిపాకకాలము ముప్పదియైదేండ్ల వయసు నుండి యెన్నదగినదైనను, భీమఖండరచనాకాలము క్రీ. 1435 వఱకు నెన్నఁదగినదైనను, నా యాక్షేపవాదపక్షమున కనుకూలముగా నేను ప్రౌఢనిర్భరవయః పరిపాకమునకుఁ బరమా

వధియనఁదగిన నలుబదియైదేండ్లవయఃకాలమును, భీమఖండ రచనా కాలముకాఁదగిన యేదేండ్లలో మొదటిదేయగు సంవత్సరమును గయి కొనుచున్నాఁడను. ఇట్లు కైకొనఁగాఁ క్రీ॥ 1429 సంవత్సరమునాఁటికి శ్రీనాథుఁడు నలుబదియేదేండ్ల వాఁడగును. ఇట్లుచూచినను, నాతని జన్మకాలము క్రీ॥. 1384 కంటెఁ బూర్వమునకుఁ బోఁజాలకున్నది. ఆక్షేపవాదమునఁ బ్రౌఢనిర్భరవయఃపరిపాకకాలమనఁగా నఱువది యేండ్ల వయస్సని యొక యుపక్రమముకలదు. అది యసంభావ్య ముగా నేను దలంచుచున్నాఁడను. 'కలౌషష్టి' యను పలుకు ప్రఖ్యా తము. అఱువదియేండ్లవయస్సు వార్ధకముగాని ప్రౌఢనిర్భరవయఃపరి పాకకాలముగాదు. అయినను నఖండమగు నారోగ్య భాగ్యము ననుభ వించిన శ్రీనాథున కసామాన్యముగా నేఁబదియేండ్ల ప్రాయముకూడఁ బ్రౌఢనిర్భరవయఃపరిపాకకాలముగాఁ బరితోషమొసఁగి యుండవచ్చు నని యింకనుగూడ నాయాక్షేప పక్షమునకే యానుకూల్యమొసఁగి క్రీ॥. 1429 సంవత్సరమే భీమఖండరచనాకాలముగా నంగీకరించి చూచిన నింకొక యయిదేండ్లు శ్రీనాథుని జన్మకాలము పూర్వమునకుఁ బోఁగలదేకాని యంతకెచ్చుపోఁజాలదు. కాని యట్లాతని జన్మకాలము క్రీ॥. 1385 కింకను బూర్వమునకుఁ గొనిపోవు నద్దగినచు ప్రతికూల సాధనములింకను గొన్నికలవు.

శ్రీనాథుని యవసానపద్యమున 'రంభఁగూడెఁ దెనుఁగు రాయ రాహుత్తుండు కస్తూరికేరాజుఁ బ్రస్తుతింతు' నవికలదు. తెలుఁగురాయ రాహుత్తునివిషయము చతుర్థపరికరణమునఁ జూడఁదగును. అతని కుమారుఁడు తిరుమలయదేవరాయని శాసనములు క్రీ॥.154 లోనున్నవి. శాసనములు చెక్కించునాఁటి కాతిరుమలయదేవరాయఁడు డెబ్బది మూఁడేండ్లవాఁడను కొన్నను, నాతనిజన్మకాలము క్రీ॥. 1470 అగు

చున్నది. కొడుకును గన్నపిదపఁ దెలుంగురాయఁడు మృతిచెందుట కును నాతఁడు మృతిచెందినపిదప శ్రీనాథుఁడు మృతిచెందుటకును నాల్గయిదేండ్లకాలము పట్టియుండవచ్చుననుకొన్నచో శ్రీనాథుని మరణ కాల మించుమించుగా క్రీ. 1475 అగుచున్నది. శ్రీనాథుఁ డవ సానకాలమునకు నెనుబదియైదు తొంబదియేండ్లవాఁడగునను కొన్నను నాతని జన్మకాల మించుమించుగా క్రీ 1385, 1390 గా నేర్పడు చున్నది. ఈసాధనము శ్రీనాథుని జన్మకాలమును క్రీ. 1385 కంటెఁ దర్వాతికాలమునకుఁ గొనివచ్చుట కానుకూల్యము గలిగియున్నదే గాని పూర్వమునకుఁ గొనిపోవుట కేమాత్రమును నవకాశమిచ్చుట లేదు.

మఱియు శ్రీనాథున కన్మమలచింతలచెన్నమరాజని శిష్యుఁ డొకఁడున్నాఁడని చారుచంద్రోదయమను గ్రంథము చెప్పుచున్నది. చారుచంద్రోదయకారుఁడుకూడఁ జెన్నమరాజే. ఈచారుచంద్రోదయ కారునికి శ్రీనాథునిశిష్యుఁడగు చెన్నమరాజు పితామహుఁడు. కవుల చరిత్రమున శ్రీ వీరేశలింగముపంతులుగా రీవిషయమును దప్పుగ వ్రాసిరి. అది యెల్ల నిందుఁ దొమ్మిదవ ప్రకరణమునఁ జూడఁదగును. చంద్రోదయకర్త వేంకటపతిరాయలచే బహుబహుమానములఁ బడసిన వాఁడు. వేంకటపతిరాయఁడు క్రీ. 1540 నుండి 1615 దాఁక నున్న వాఁడు. క్రీ. 1600 నాఁటికిఁ జారుచంద్రోదయకారుఁ డఱువది యేండ్లవాఁ డనుకొన్నను నాతనిజన్మకాలము క్రీ 1540 యగును. అప్పటికాతనితండ్రి కేఁబదియేండ్లుండుననుకొన్నను నాతని జన్మ కాలము క్రీ. 1490 అగును. ఆతని తండ్రియే శ్రీనాథుని శిష్యుఁడు. కుమారునిఁ గాంచునప్పటి కాతఁడుగూడ నేఁబదియేండ్లవాఁడసియే యనుకొన్నను, నాతని జన్మకాలము. క్రీ. 1440 అగును. ఆక్షేపపక్ష

మునకనుకూలముగా నీలెక్క నే నసామాన్యవిధముననే వేసితిని. అతఁడు శ్రీనాథుని శిష్యత్వముచేయునప్పటికిఁ బదునైదేండ్లో యిరువదియేండ్లో ప్రాయము గలవాఁడయి యుండవలెనుగదా! అట్టులయిన నది క్రీ. 1455, 1460 అగును. శ్రీనాథునిజన్మకాలము క్రీ. 1385గా లెక్కించుమేని యప్పటికాతఁడు డెబ్బదియైదేండ్లవయస్సువాఁడగును. క్రీ. 1600లో నున్న చెన్నమరాజుతాత నంతకంటెఁ బూర్వకాలమునకుఁ బంపుట సాధ్యమగునా? క్రీ. 1385, కంటె నింకను బూర్వకాలమందే శ్రీనాథుఁడు జన్మించియుండినచో, నాతనికా చెన్నమరాజతాత చెన్నమరాజు శిష్యతి నెఱప సాధ్యమగునా?

శ్రీనాథునికి బావమఱఁదియు శిష్యుఁడు నగుదగ్గుఁబల్లి దుగ్గన తనకృతిని నాసికేతోపాఖ్యానమును, జంఁదలూరి గంగయ్యకంకితము చేసినాడు. ఈ గంగయ గజపతులపాలనమున వారిగడిదుర్గములకు రక్షకుఁడుగా నుండిన తమ్మయబసువరాజునకు నాశ్రితుఁడును, దక్షిణామూర్తిశివాఘోరశివాచార్యులకు శిష్యుఁడై, కృష్ణరాయలతండ్రి యగు వీరనరసింహరాయని కంకితముగా వరాహపురాణమును రచించిన నందిమల్లఘంటసింగ కవులచేఁ బ్రబోధచంద్రోదయమను కృతినిగొన్న వాఁడునునై యున్నాఁడు. మల్లయసింగయలగురువగు నఘోరశివాచార్యుఁడే కృష్ణరాయలకంకితముగాఁ బారిజాతాపహరణము రచించిన ముక్కుతిమ్మనకవికిని, కృష్ణరాయలమంత్రియగు తిమ్మరసునల్లునికిఁ గృతియిచ్చిన మాదయమల్లకవికిని గూడ గురువు. ఇట్లు వీరందఱు నొకజడముడిలోఁ బడుచున్నారు గాన, దగ్గుఁబల్లిదుగ్గన వీరినుండి యెంతవేఱుపడి పూర్వమునకుఁబోయినను క్రీ. 1480 - 90 కంటె నెక్కువ పూర్వమునకుఁ బోవుట కష్టసాధ్యము. పిల్లలమఱ్ఱిపినవీరభద్రకవియు శ్రీనాథుని శిష్యుఁడని జనశ్రుతి గలదు. అతఁడు

క్రీ. 1480 ప్రాంతములందు విద్యానగరమేలిన సాళ్వగుండ నరసింగ రాయల కంకితముగా జైమినిభారతమును రచియించినవాఁడు. పిల్లల మఱ్ఱిపినవీరభద్రునకు గురువును, దగ్గఁబల్లిదుగ్గనకుఁబావయు గురువు నైవర్తిల్లియుండుటకుఁ బూర్ణపురుషాయుషజీవియైన శ్రీనాథుఁడుగూడఁ గొంచెమించుమించుగా నంతకుఁ బదిపదునైదేండ్లపూర్వకాలముదాఁక నున్నవాఁడు కాఁగలఁడు.

ఎన్నివిధములఁ జూచినను, శ్రీనాథుని జన్మకాలమును క్రీ. 1385 కంటెఁ బూర్వమునకుఁ గొంపోఁగుదురకున్నది. ఈ క్రిందిసాధనము నాల్గుమూడేండ్లకంటె హెచ్చుగా నటుతర్వాతికాలమునకుఁ గొనివచ్చుటకుఁగూడ నడ్డుదగులుచున్నది.

శ్రీనాథుఁడు పెదకోమటివేమభూపాలుని పాలనకాలమున విద్యాధికారియై శాసనకృతులను రచించినాఁడు. క్రీ. 1404లో పెదకోమటి వేమారెడ్డి చేసినధర్మకార్యముల శాసనములు మూఁడుపలబ్ధమయినవి. ఒకటి శ్రావణమాసమునాఁటిది, రెండుపుష్యమాసమునాఁటివి. పుష్యమాసపుశాసనములు రెండింటను శ్రీనాథుఁడే శాసనాచార్యుఁడుగా నున్నాఁడు. ఆ సంవత్సరమే శ్రావణమాసము కడచినతర్వాత నాతఁ డాపదము నందియుండవచ్చును. చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటి నాఁటికే ప్రబంధరచయితయయిన ప్రతిభాశాలి గావున నాతఁడు, శాలివాహనసప్తశతీరచనాకాలమగు నూనూఁగుమీసాల నూత్నయౌవనము తఱికిఁ బెదకోమటివేమ భూపాలునియొద్ద విద్యాధికారిపదమును బడసియుండవచ్చును. క్రీ. 1385 ప్రాంతమున జనించెనేని యప్పటి కాతఁడు పదునెనిమిది పందొమ్మిది యేండ్లప్రాయము వాఁడగును. ఆతని జన్మకాలమింకను దర్వాతికిఁ దెత్తుమేని విద్యాధికారిపదముఁబడయుటకు క్రీ. 1404 నాఁటికి వయసుచాలనివాఁడగును. కాఁబట్టి

శ్రీనాథుఁ డించుక యించుమించుగాఁ క్రీ. 1385లో జనించెనని, క్రీ. 1475లో స్వర్గస్థుఁడయ్యెనని నేను దలంచుచున్నాఁడను.

నేను మీఁదఁజూపినసాధనములు ప్రత్యేకముగాఁ జూచినఁగూడ బలిష్ఠములే యనఁదగియున్నవి. సమిష్టిమీఁద నవియన్నియుఁ గూడ నొకసిద్ధాంతమునే సాధించుచున్నవి. కాఁబట్టి యాసిద్ధాంతమును గట్టి బలముగల దగుచున్నది. అట్టిదానిని త్రోసిపుచ్చుట దుశ్శక మన వచ్చును. బలవంతములగు ప్రతిపక్షసాధనము లుండి పయిసిద్ధాంత మును బరిహరింపఁగల్గి శ్రీనాథునిజన్మకాలమును క్రీ. 1360గా నిలుపఁగలుగునేని దానినే పరిగ్రహింతముగాక.

పేరు

సామాన్యముగా నాకాలమున జనులనామధేయములు వైకృత ములుగా నుండెడివి. అప్పన్న, తిప్పన్న, జక్కన్న, మారన్న, వీరన్న, పోతన్న, మొదలగునవి యుదాహరణము, మన కవీశ్వరునకు "శ్రీనాథుఁ"డన్న శ్రుతిమధురమయిననామధేయ మాతని తండ్రితాతల విద్యాచాతుర్యమునకు ద్యోతకముగానున్నది. వీరివంశము విద్వద్వం శమేగదా! శ్రీహర్ష, శ్రీనాథ, పదములయందుబాటు ప్రశంసనీయము. ఆకవిగ్రంథము నీకవి తెల్గించెను. శృంగారనైషధ మాతఁడే యీతఁ డుగా నవతరించెనో యనిపించుచున్నది. కొందఱిట్లుగూడఁ బొరఁ బడిరి. ఏనుఁగులక్ష్మణకవి రామేశ్వరమహాత్మ్యమున నిట్లుకొనియాడెను

గీ. మహితచింతామణీ దివ్యమంత్రసిద్ధు
నైషధాదిప్రబంధ సందర్భనిపుణు
సకలవిద్యావిశారదు సత్కవిత్వ
పట్టభద్రుని శ్రీనాథుఁ బ్రస్తుతింతు.

శృంగారశ్రీనాథము

శ్రీహర్షునకుఁజెల్లువిశేషణములు శ్రీనాథున కిక్కడ దక్కినవి. ఈకవి జాహ్నవీమహాత్మ్యమునఁగూడనిట్లే చెప్పినాఁడు.

## బా ల్య ము

మనకవీశ్వరునిబాల్యవర్తన మెట్టిదో సరిగా గుర్తించుట కాధారము లేవియుఁ గానరావు. తొలిటికృతులనుబట్టి కొంతగుర్తింపనగునను కొనెదను. కాని యాకృతు లిప్పుడు దుర్లభము లయినవి. చిఱుత కూఁకటినాఁటికే ప్రబంధరచనము నిర్వహించినవాఁడగుటనుబట్టి యాతఁ డల్లరిగాఁడిరిగి కాలముఁ బొల్లపుచ్చక పసిప్రాయమునాఁడు విద్యాభ్యాసోత్సాహముననే వర్తించెనని భావింపనగును. విద్యాభ్యాసముచేతన కాక రూపసౌందర్యము చేతనుగూడ నీతఁడు నాఁడు వాసికెక్కినవాఁడుగాఁ దోఁచుచున్నాఁడు. ''చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటి, నూనూఁగుమీసాలు'' ననుట దానికి స్ఫోరకము.

## వి ద్యా భ్యా స ము గు రు వు

శ్రీనాథునివిద్యాభ్యాసాదికమెక్కడనెట్లుజరిగెనో గుర్తించుటకుఁ దగినబలవదాధారములు లేవు. కుశాగ్రబుద్ధియు నద్భుతప్రతిభాశాలియు నగునీతఁడు పలువురుగురులయొద్ద గురుకులవాసక్లేశమునకు లోనయి చిరకాలముజాడ్యముతో విద్యాభ్యాసము చేసెనని తలంపరాదు. తనతాత కమల నాభామాత్యుఁడు గొప్ప విద్వాంసుఁడును గవీశ్వరుఁడునని శ్రీనాథుఁడు పలుమాఱు ప్రశంసించినాడు.

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీకాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ బద్మపురాణసంగ్రహ కథాకావ్యప్రబంధాధిపున్.

వినమత్కాకతిసార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తు మా
యనుఁగుందాతఁ బ్రదాతశ్రీకమలనాథామాత్యచూడామణిన్.

గీ. మత్పితామహుఁ గవిపితామహునిఁ దలఁతుఁ
గలితకావ్యకళాలాభుఁ గమలనాభుఁ
జంద్రచందనమందారపద్మశకీర్తి
సరససాహిత్యసామ్రాజ్యచక్రవర్తి.

కవీశ్వరుఁడగు నీ కమలనాభామాత్యుని పౌత్త్రిత్వము మన శ్రీనాథునకు సహజశక్తిని సమకూర్చియుండును. కమలనాభునిసాక్షా దుపదేశముల నీతఁడు కాంచెననికాని లేదనికాని స్పష్టపఱుప నాధారములు గానరావు. అతఁడు సేకరించియుంచిన గ్రంథభాండారము రచయించినరచనములు నీతనిసహజశక్తికి వడివడిగా నున్మేషము గలిగించి గ్రంథరచనమునకుఁ గడఁగించెనని తలఁపఁదగును. సహజశక్తి లోకశాస్త్రకావ్యాద్యవేక్షణమువలననైపుణ్యము కావ్యజ్ఞశిక్షచేనభ్యాసము ననునివి కవిత్వోపలబ్ధికిఁ గారణములని యాచార్యదండి ప్రభృతులనిరి. ఉత్తమకవితకు సహజశక్తి, లోకానుభవాదులవలననైపుణ్యముచాలను. కావ్యజ్ఞశిక్ష యత్యావశ్యకము.సంస్కృత ప్రాకృతాదిభాషలలోఁబరిజ్ఞాన పాటవము, తర్కవ్యాకరణాది శాస్త్రములందుఁ దలస్పర్శమగువైదుష్యము, పండితులతో శాస్త్రార్థములు సల్పఁజాలినపాండితీప్రౌఢి. పయిపయిపూఁత మెఱుంగు చాతుర్యముతో నలవడఁదగినవికావు. సకలవిద్యా సనాథుఁడయి యాతఁ డిఁకముందు కోమటివేమారెడ్డి యాస్థానమున విద్యాధికార్యున్నతోద్యోగము వహింపనున్నాఁడు. మఱియు డిండిమభట్టారకాదులతో విద్యావివాదములు సలుపనున్నాఁడు. ఇట్టివాఁడు, గట్టిగా గురుశుశ్రూషతో శాస్త్రాభ్యాసము సల్పితీఱవలసి

యుండును. అట్టిగురువెవ్వరో స్పష్టముగా నీతఁడు తన గ్రంథములందుఁ దెలుచుగాఁ బ్రస్తుతింపఁదగి యుండును. అలోకసామాన్య ప్రతిభాశాలి యగుటచే నాఁత డొకవేళ నాయఖండపాండిత్యమునుగూడ, నాచార్య సన్నిధి నభ్యసింపకయే యలవరచుకొన్నాఁడేమో యనుసంశయమున కీక్రిందిపద్య మవకాశము కలిగించుచున్నది.

శా. బ్రహ్మాద త్తవరప్రసాదుఁడ వురుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాదిమహాపురాణచయ తాత్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే॥

శృంగారనైషధము.

కాని దీనినాధారముగాఁ గొని శ్రీనాథునకు విద్యాగురుఁడు లేఁడని తలంపరాదు. కొందఱవిద్యాలాభము "ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః" అన్నసూక్తిని స్ఫురింపఁజేయుచుండునుగాని యట్టివిద్యోపలబ్ధికిఁగూడ నుద్బోధకముగాఁ గొంత గురుశుశ్రూష యుండవలసినదే యగును. శాస్త్రాధ్యయనము గురునియొద్దఁ జేయవలసినదేయని శ్రీనాథుఁడే చెప్పినాఁడు.

గీ. శాస్త్ర మాచార్యసన్నిధిఁ జదువఁడేని
యిద్ధబోధంబు మది సంగ్రహింపఁడేని
తెగువమీఱి ప్రతిజ్ఞ సాధింపఁడేని
జ్ఞాతిజయమందఁడేని తజ్జనుఁడు జనుఁడె.

కాశీఖండము.

సంస్కృతకాశీఖండమున నీవిషయముగల గ్రంథభాగముకలదు గాని శ్రీనాథుఁ డీపట్టునఁ బ్రసక్తిగల్గించుకొని కొన్ని పద్యములలో

స్వవిషయమునే వెల్లడించుకొన్నాఁడని నేను నిశ్చయించుచున్నాఁడను. తన సాహిత్యసౌష్ఠవమునకుఁ గారణములు నుద్బోధకములునని తన కడపటిగ్రంథమగు కాశీఖండమున శ్రీనాథుఁడీ క్రిందివానిని బేర్కొన్నాఁడు:-

సీ. ఆంధ్రక్షమామండలాఖండలుండైన
వేమభూపతికృపావీక్షణంబు
ఘోడెరాయాంక సద్గురురాయభీమేశ్వ
రస్వామిపదపద్మారాధనంబు
కమలాద్రివిలయమార్కండేయశివమౌళి
చంద్రాంశునవసుధాసారధార
వేదాద్రివరసింహవిపులవక్షస్స్థలీ
కల్హారమాలికాగంధలహరి

గీ. కారణంబులు నుద్బోధకములుఁ గాఁగ
వంతవించినసాహిత్యసౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధవిభునిఁ జేసి
కాశికాఖండముఁ దెనుంగుఁగా నొనర్తు.

మొదటిది:- ఆంధ్రదేశాధీశ్వరుఁ డయిన వేమభూపాలుని దయాదృష్టి. కొమరగిరిరెడ్డి బావమఱఁది యగు కాటయవేమారెడ్డియుఁ గొమరగిరియనంతరము కొండవీడురాజ్యము పాలించిన పెదకోమటివేమారెడ్డియుఁ గాశీఖండకృతీశ్వరుఁడగు వీరభద్రారెడ్డియన్న యల్లయవేమారెడ్డియు, నని శ్రీనాథుని కాలమున విఖ్యాతులు ముగ్గురు వేమారెడ్లు వర్తిల్లిరి. ఇందుఁ బేర్కొనఁబడినవేమారెడ్డి యీముగ్గురలో నొక్కఁడు కావలెను. మొదటివాఁడు కాటయవేమారెడ్డి; ఈతఁడు

కొమరగిరిని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి కొండవీటఁ దానే రాజ్య మేలి, పదపడి యాతనిచే రాజమహేంద్రవర ప్రాంతదేశము పారితోషికముగాఁ బడసి కొంఁదికాలము ప్రభుత్వము నెఱపినవాఁడు. పండితప్రియుఁడు; కాళిదాస నాటకత్రయవ్యాఖ్యాత; పండితుఁడు. శ్రీనాథుని చిన్ననాఁట జీవించి యున్నవాఁడు. ప్రస్తుతగ్రంథమగు కాశీఖండమును గృతిగాఁ గొనువీరభద్రారెడ్డికి మామ. ఈతఁడు శ్రీనాథుని ప్రతిభాచాతుర్యము పరికించి యాదరించి బాల్యమున నాతనివిద్యాభ్యాసమునకువలయువసతుల సమకూర్చి తనవిద్వద్గోష్ఠులందు గౌరవించుచుండవచ్చును. ఇఁక రెండవవాఁడు పెదకోమటి వేమారెడ్డి; ఇతఁడు సంగీతసాహిత్య విద్యలందుఁ జతురుఁడు. పెక్కు కావ్యములఁ జెప్పించుకొన్నవాఁడు. చెప్పినవాఁడు. సర్వజ్ఞచక్రవర్తి యని బిరుదు గొన్నవాఁడు. శ్రీనాథకవీశ్వరునకుఁ దనయాస్థానమున విద్యాధికార్యున్నతోద్యోగము నొసఁగి తాను జీవించియున్నంతదాఁక నాదరించినవాఁడు పైప్రస్తావ మాతని గూర్చి వర్తించినది కాఁదగును. కాని యట్లనుటలో నొక్క చిక్కు చిన్నది యున్నది. కోమటివేమారెడ్డికిని. వీరభద్రారెడ్డిప్రభృతులకును విరోధము మెండు అతనిపొగడ్త తన పేరఁ జెప్పించుకొనుకృతిలో నుండుట వీరభద్రారెడ్డికి సహ్యముగాఁ గూడదు. మూడవవాఁడు :- అల్లయవేమారెడ్డి. తనతమ్ముని వీరభద్రారెడ్డి నాతనిభార్యమూలముగా వచ్చినరాజమహేంద్రవర రాజ్యమున కభిషిక్తునిఁజేసి దేశమును నిష్కంటకముగా నేల్పడికిఁ దెచ్చినవాఁడు. ఈతనిప్రాపు శ్రీనాథుఁడు బాల్యమున నున్నట్లు తెలియరాదు. కాని కాశీఖండరచనసందర్భమునఁ దాత్కాలికోత్సాహమునకుఁ గారణమగుటను బట్టి యప్పుడట్టి పొగడ్త యతనిగూర్చి చేసియుండు ననుకొనుట యుక్తముకాకపోదు. సమష్టిమీఁదఁ బద్యార్థమును బర్యాలోచింపఁగాఁ

బయిప్రశంస కాశీఖండ రచనాకాలమునకుఁ దాత్కాలికోత్సాహ కారణముగా నున్న యల్లవేమారెడ్డినిగూర్చి చేసినదిగానే తోఁచుచున్నది.

రెండవది:- ఘోడెరాయబిరుదాంకుఁడగు భీమేశ్వరస్వామి పాదసేవ. ఈభీమేశ్వరస్వామి యెవ్వరో గుర్తింపవలసి యున్నది.

"రాయగురుపరమేశ్వరసాధుజనవిధేయ, ఘోడెరాయ సకలకళా ధామాదిబిరుదభాస్వరుండై భీమయగురువరేణ్యపుణ్య కారుణ్యకటాక్ష వీక్షాలబ్ధసుస్థిరైశ్వర్యధుర్యుండై విజయధాటీ సమాటీకనంబున దిశలల్లాడ నల్లాడభూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా ........ బాలించె.

భీమేశ్వరపురాణము.

మఱియుఁ గాశీఖండమందే:-

శా. ఈశ్వరుఁ డింటివేల్పు జగదేకగురుండగు ఘోడెరాయభీ
మేశ్వరుఁ డాత్మవంశగురుఁ డీగులు నిత్యవినోదకృత్యముల్
శాశ్వధర్మకీర్తులు తలంపఁగ నమ్మినసొమ్ము లాదిగ
ర్వేశ్వరుఁ డంట నైజ మెన యేనృపు లల్లయవీరశౌరికిన్.

పర్యాలోచింపఁగా నీభీమేశ్వరస్వామి దైవమగుదాక్షారామభీమేశ్వరస్వామిగాక యొకమహాపురుషుఁడని తేలుచున్నది. ఆయనకు రాయగురుపరమేశ్వర సాధుజనవిధేయ ఘోడెరాయ సకలకళాధామాదులు బిరుదములు. రెడ్డిరాజులగురువులకు ఘోడియరాయ లనిబిరుదు పెక్కుచోట్లఁ గానవచ్చుచున్నది. వీరభద్రారెడ్డితండ్రి యల్లాడభూపతికి రాజ్యలాభ మీమహనీయు ననుగ్రహమున సమకూడెనట! ఈతఁడు తప

స్వియు, వర్చస్వియు, నగుమహావిద్వాంసుఁ డయియుండును. వీర భద్రారెడ్డితమ్ముఁడు దొడ్డారెడ్డికిఁ గృతిగా నిశ్శంకకొమ్మనామాత్యుఁడు రచియించినశివలీలావిలాసమను ప్రబంధమునఁగూడ నీభీమయగురునిఁ గూర్చి యిట్లు కలదు:-

క. వీరలవంశగురుండు ను
దారగుణోత్తరుఁడు నగుచుఁ దత్త్వమహత్వ
శ్రీరుచి ఘోడియరాయప
దాహ్వయుఁడు భీమదేశికాధిపుఁ డొప్పున్.

సీ. అవిరళైశ్వర్యమహత్త్వసంపన్నత
మౌనైన (?)బానట మలయువాఁడు
సంశ్రితరక్షణాస్థాపరిపూర్ణత
నాథామహోజ్జ్వలు నమపునాఁడు
వేదశాస్త్రాదికవిద్యానిరూఢత
వదనసరస్వతివడుపువాఁడు
వివిధాన్నవితరణాచరణసమీక్షణ
.... .... .... ....సమతవాఁడు

గీ. తగుఁ బ్రశంసచేయ దండభృన్మదవిభం
జనుఁడు వినయవినత (జనవరేణ్య)
మణికిరీట (గుణ, ఘృణి) సమంచితచరణుండు
ఘోడెరాయభీమగురువరుండు.

మ. నిపుణత్వంబునఁ బ్రస్తుతింపవలయున్ శ్రీవీరభద్రాచలా
గ్రిపదవ్యాతతధర్మహర్మ్యతల జాగ్రద్వీరభద్రాళిలే

శపదాబ్జద్వయభక్తిసుస్థిరమానంపూర్ణ భీమేశ్వరున్
త్రిపురారీంద్రగురూత్తమాత్మభవువిం దేవేంద్రకోలాహలున్.

పై పద్యమువలన నాభీమేశ్వరస్వామి త్రిపురారి (తిప్పయ) కుమారుఁడనియు, వీరభద్రాచల నిలయుఁడగు వీరభద్రేశ్వరునకు భక్తుఁడనియు, వేదశాస్త్రాదివిద్యానిరూఢుఁడనియుఁ దెలియుచున్నది. వీరభద్రాచలము కాశీఖండమం దెక్కువగా వర్ణింపఁబడినది. ఆవర్ణనము సంస్కృతకాశీఖండమునఁగానరాదు. అది శ్రీనాథువిస్వయం కల్పితము. భీమయగురువరేణ్యుని నివాసస్థల మగుటమీఁదియభిమానము చేతనే దాని నంత విరివిగా సవిశేషముగా వర్ణింప నుత్సహించినాఁడు. సమన్వయించి చూడఁగా నావీరభద్రాచలము పట్టిసపర్వతముగా నేర్పడు చున్నది. అది యఖండగోదావరీతీరస్థిత మగు పుణ్యక్షేత్రము, భీమయగురుఁ డీక్షేత్రమున వెలసియున్న వీరభద్రేశ్వరస్వామి నారాధించుచు నుండినవాఁడు. శ్రీనాథువ కద్వైతమందే తాత్పర్యమయినను, శైవమతమునం దభిమానవిశేషముగలదు. పెక్కుమార్లాతఁడు పంచబ్రహ్మషడంగమంత్రములతోఁ బ్రాసాదపంచాక్షరినిస్మరించుచుండును. ఆయనగ్రంథము లెక్కువగా శివకథాప్రధానములే, ఆతని కాశ్రయ మొసఁగిన రెడ్డిరాజులందఱుఁగూడ శైవమతాభినివిష్టులే. వేదశాస్త్రాది విద్యోపదేశముచేఁగాక యాభీమయగురువరేణ్యుఁడు శైవమంత్రాద్యుపదేశముచే నతనికి గురుఁడయియుండవచ్చును. తనసాహిత్య సౌష్ఠవమునకుఁ గారణము లని చెప్పుకొన్న నాల్గింటిలో వేమభూపతి కృపావీక్షణము, భీమేశ్వరస్వామిపదసమారాధనమునను నీ రెండును మానుషములు.

మూఁడవది:- కమలాద్రినిలయుఁడగు మార్కండేయేశ్వరుని యనుగ్రహము. రాజమహేంద్రవరమండలి యొక స్థలవిశేషమునకుఁ

గమలాద్రియని పేరు. మార్కండేయేశ్వరస్వామి యక్కడ వెలసిన వేల్పు.

నాల్గవది:- వేదాద్రినరసింహస్వామి యనుగ్రహము. వేదాద్రి యను పేరుగల శైలములు పెక్కులున్నవి. తెల్గుదేశమందున్నవానిలోఁ బ్రధానమయినవిమూఁడు. కృష్ణాతీరమున విప్పుడు ముక్త్యాల సంస్థానమునకు సంబంధించియున్న వేదాద్రియొక్కటి. నైజాంరాష్ట్రమున రాచకొండకుఁ జేరువనున్నవేదాద్రి యొక్కటి రాజమహేంద్రవరముదగ్గఱనున్న యొకమిట్టకుఁగూడ వేదాద్రియని పేరున్నట్టు శ్రీచిలుకూరి వీరభద్రరావుపంతులుగారు వ్రాసినారు, కాటయవేమారెడ్డి యహోబల శాసనమునఁగూడ గౌతమీతీరమున వేదాద్రియున్నట్టు చెప్పఁబడినది. "కాటమరెడ్డివేమారెడ్డింగారిఅర్ధాంగలక్ష్మిఅయి ఆ కొమరగిరయ్యంగారే ఈకొమరగిరయ్యంగారై అవతరించిన ఈ కొమరగిరయ్యంగారికి తల్లిగారైన తల్లసానమ్మగారు ఈకొమరగిరయ్యగారికిన్ని కాటమరెడ్డివేమారెడ్డిగారికిన్ని సుకృతముగాను శ్రీగౌతమీతీరమందును వేదాద్రి శ్రీనరసింహదేవరకును ఆచంద్రార్కము ప్రతిసంవత్సరతిరునాళమహోత్సవానకుదారవోసి సమర్పణచేసిన వెలుచూరితల్లవరము.... .."

కాఁబట్టి శ్రీనాథుఁడు పయిపద్యమునఁ బేర్కొన్న వేదాద్రి శ్రీవీరభద్రరావుపంతులుగారన్నట్టు కమలాద్రితోపాటు రాజమహేంద్రవరము దగ్గఱ నున్నమిట్టయే యగును.

పయివిధమునఁ బరామర్శింపఁబడినయా కాశీఖండపద్యము శ్రీనాథునిబాల్యవిద్యాభ్యాసవిషయమును దెలుపునదిగా దోఁచకున్నది. కాశీఖండరచనాకాలమున నాతనికిఁ దాత్కాలికోత్సాహకారణముగా

మందుటచే నల్లయవేమారెడ్డిని, భీమయగురుని, మార్కండేయేశ్వరుని, నరసింహస్వామిని బ్రిస్తుతించినాఁడు. వీరందఱు రాజమహేంద్రివర సన్నిహితులే. ఉపలబ్ధమయిన శ్రీనాథునిగ్రంథములం దాతనిగురువెవ్వరో తెలియరాకున్నాఁడు. మరుత్తరాట్చరిత్రి పండితారాధ్య చరిత్రాదులం దుండునేమో! ఈవిధముననే శ్రీనాథునికిఁ దర్వాతి కవియగు పట్టమెట్ట సోమనాథసోమయాజి సూతసంహితలో నొక్క పద్యముచెప్పినాడు. ఆపద్యమిది:-

సీ. అవ్వద్గురుస్వామియైన లింగారాధ్య
సార్వభౌముప్రసాదసౌష్ఠవంబు
అత్యాప్తుడు పతిర్థ్యుఁడై నకామారెడ్డి
పట్టభద్రుని ధర్మపాటవంబు
తత్ప్రభావదులైన ధన్యవిద్వాంసుల
సంతతసల్లాపసమ్మతంబు
ఘనుఁడు విద్యారణ్యముని యేర్పరించిన
తాత్పర్యదీపిక దారికలిమి

కారణంబులుగా నిరాఘాటచాటు
శుద్ధపద్ధతిఁ దెలుఁగున సూతసంహి
తాచతుర్విధఖండసందర్భమెల్లఁ
గావ్య మొనరింతు లోకవిఖ్యాతముగను.

## అభ్యసించిన విద్యలు

కొన్నియన్యపద్యములనుబట్టియు, శ్రీనాథకృతగ్రంథములను బట్టియుఁనాతఁ డభ్యసించినవిద్యలనుగూర్చి కొంత యెఱుఁగఁగల్గు

దుము. శ్రీనాథుఁడు కృష్ణయజుర్వేదము నధ్యయనముచేసినాఁడు. స్వవేద శాఖాధ్యయనము బ్రాహ్మణున కావశ్యకకార్య మని స్మృతికారులనిరి. దాని నీతఁడు పాటించెను. అధ్యయనముఁ జదివి మఱచుచందమునఁ గాక చక్కఁగా నుపస్థితిలో నుండునట్లేచేసెను. ఈయర్థమును "అధ్వర్యు వేదశాఖాధీతివిష్ణాతు" అన్నపద మెఱిఁగించుచున్నది. అధర్వ్యువేద శాఖ యనఁగాఁ గృష్ణయజుర్వేదము. ఉభయభాషాకవియై 'శ్రీనాథకవి' యనియేకాక వేదాధ్యయనపరుఁడై 'శ్రీనాథావధాని' యనికూడ శ్రీనాథుఁడు పేర్కొనఁ దగినవాఁడయినాఁడు. మఱియుఁ బదునెనిమిదియగు పురాణములను స్మృతులను, నింక సాంఖ్యయోగసిద్ధాంతములను, శైవాగమములను జదివినాఁడు. ఈయర్థము నీక్రిందిపదము లెఱిఁగించుచున్నవి. "శ్రుతిపురాణాగమస్మృతిసాంఖ్యసిద్ధాంత కలశనవ్యుత్పత్తి గౌరవంబు" "అఖిలపురాణవిద్యాప్రవీణు" "ఆగమజ్ఞాననిధివి" "బహుపురాణజ్ఞుఁడవు". "కలశనవ్యుత్పత్తిగౌరవంబు" అనుటచేనావిద్యలనుముద్దలుచేసి మ్రింగినట్లుగా నశ్రమమున గ్రహించి వ్యుత్పత్తి నార్జించినాఁడని యగుచున్నది. ఇంకను, మహారాష్ట్రి, శౌరసేని మొదలగు ప్రాకృతభాషలందుఁ బరిజ్ఞానపాటవము గడించినాఁడు. "సంస్కృత ప్రాకృతశౌరసేనీముఖ్యభాషాపరిజ్ఞానపాటవంబు." –మహారాష్ట్రిప్రాకృతము సామాన్యముగాఁ బ్రాకృతపదముచేఁ గొన్నిచోట్ల వ్యవహరింపఁబడియున్నది. "మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః" కావ్యాదర్శము. మహారాష్ట్రిప్రాకృతమున నున్న సాతవాహనసప్తశతిని శ్రీనాథుఁడు తెలిఁగించినాడు. అట్లు తెలిఁగించుటకు ప్రాకృతమున మంచి పరిజ్ఞాన ముండవలెను గదా! ప్రాకృతమునకు సంస్కృతమున ఛాయవ్రాయుటాచారము ప్రాచీనకాలముననున్నట్లు తెలియరాదు. మఱియు నాసప్తశతిలో నూఱుగాథల నేఱి శ్రీనాథుని

క్రాశయమైన పెదకోమటివేమారెడ్డి వ్యాఖ్య రచించెను. ఆవ్యాఖ్య యిప్పుడు క్రొత్తగా దొరకియున్నది. అవ్యాఖ్యారచనమున రెడ్డిగారికి శ్రీనాథునితోడ్పాడుటకూడ నుండఁబోలును

పతంజలిప్రణీతమగు వ్యాకరణమహాభాష్యమును బాగుగాఁ బఠించినాఁడు. "పన్నగపతిసార్వభౌమభాషితమహాభాష్య విద్యాసమభ్యాసబలము" ఈయర్థమునకు శ్రీనాథునిగ్రంథములన్నియుఁ దార్కాణమగుచున్నవి. ప్రౌఢమగువ్యాకరణపాండిత్య మున్నవాఁడే ప్రయోగింపఁదగినపదము లనేకము లీయనకృతులందుఁ గానవచ్చుచున్నవి. న్యాయవైశేషిక దర్శనములందుఁ గౌశల్యముఁ గాంచినాఁడు. "అక్షపాదకణాద పక్షిలోదీరిత న్యాయకళాకౌశలాతిశయము." అక్షపాదుఁడు న్యాయదర్శనకర్త గౌతమముని; కణాదుఁడు వైశేషికదర్శనకర్త; పక్షిలుఁడు గౌతమన్యాయభాష్యకర్త వాత్స్యాయనముని. శ్రీనాథుని నాఁటికి న్యాయవైశేషికదర్శనములకు సాంకర్యములేదు. అన్నంభట్టారకుని యనంతరమే యారెండు దర్శనములు గలసిపోయినవి. శ్రీనాథునకు న్యాయవైశేషికములయందుఁగల వైదుష్యము కాశీఖండాది కృతులలోఁగానవచ్చుచున్నది. కోమటివేము నాస్థానమున విద్యాపరీక్షణ వేళలందు బహుదేశబుధులతో భాషింపఁగల్గుటకుఁ దర్కపరిజ్ఞానము తప్పక యుండవలెను. డిండిమభట్టారకాదులతో వివాదము సల్పఁజాలుటకును దర్కచాతురి యావశ్యకమేయగును.

మఱియుఁ బ్రాచీన కృతులందుఁ గల్గు భావ విశేషములను బయల్పఱిచి హృద్యముగాఁ జెప్పు చాతుర్యము గలవాఁడు. "పూర్వకవి ముఖ్యవిరచితాపూర్వకావ్య భావరససుధాచర్వణప్రౌఢత యును." ఈచాతుర్య మపారముగా శ్రీనాథున కుండు నను టకు

సందేహమేమి? సహృదయులగోష్ఠులలోఁ మెలఁగుచుండినవాఁడేగదా! శ్రీనాథునిగ్రంథములలోఁ బెక్కుచోట్ల నాతఁడభిమానించినసంస్కృత కావ్యనాటకాదులలోని పద్యగద్యార్థములు పొందుపడినవి. అట్టివానిలో నేనుగుర్తింపఁగల్గినవానిఁబట్టి యేయేగ్రంథములమీఁద నాతని కభిమాన మున్నట్టు తెలియవచ్చెనో వాని నీక్రింద నిచ్చుచున్నాఁడను. కాళిదాసుని కావ్యములు, నంతఁ గుమారసంభవమును, భారవి కిరాతార్జునీయమును, శ్రీహర్ష నైషధమును, భవభూతి యుత్తరరామచరితమును, మురారి యనర్ఘరాఘవమును, బాణునికాదంబరియును, మయూరునిసూర్యశతక మును నీతనికృతులలోఁ బెక్కుచోట్లఁ జొచ్చినవి. ఇంకను యోగ సాంఖ్యశైవాగమబౌద్ధాగమాదులు గూడఁ బ్రసక్తములుగాఁ జేరినవి. శ్రీనాథునియాయాగ్రంథములను గూర్చి చర్చించునప్పు డవి కొంత వివరింపబడును.

## కుటుంబస్థితి

ఈవిషయముఁగుర్తింప నాధార మేదియుఁగానరాదు. నిరంతరము దేశాటనముసేయుచు విషయలౌల్యమున వర్తించుచు వచ్చినవాఁడగుఁ టచే నితనికి సంసారమునం దర్హమగునానందము లభింపకపోయెడి దేమో యని సంశయము కల్గుచున్నది. పుత్రసంతానము కలదో లేదో తెలియదు. ఉండినను బండితపుత్రత్వము నన్వర్థము సేయునదై యుండును. ప్రయోజకులయినపుత్రులే యుందురేని, యీతఁడు కడ కాలమునఁగూడఁ గృషికృత్యమునకుఁ జొచ్చుటయుఁ బన్నుచెల్లింప లేకపోఁగా దాఁపరిల్లినరాజదండనకుఁదానై పాల్పడుటయు సంభవిం పదుగదా! అలోకసామాన్యమగు ప్రతిభాసంపత్తితో భాసిల్లువారి సంతా నము ప్రాయికముగాఁ గొఱకురానిదగుచుండును. కావుననే పండిత పుత్రపదము మూర్ఖప్రాయముగా నయ్యెను.

ప్రథమప్రకరణము

శ్రీవంగూరి సుబ్బారావుపంతులుగారు 'శ్రీరామాభిషేక" మను గ్రంథమొక్కటి తమదగ్గఱఁ గలదవి దానినుండి కొన్నిపద్యములను నా కొసఁగినారు. ఆ శ్రీరామాభిషేక గ్రంథకర్తయిప్పటికి నూఱేండ్ల క్రిందటివాఁ డగునేమో! ఆ పద్యములు మిక్కిలిదుష్టములుగా నున్నను శ్రీనాథకవీశ్వరుని కుటుంబవిషయము నెఱిఁగించుచున్నవి. ఆపద్యముల సారమిది:- కొండవీడు వాస్తవ్యుఁడగునాత్రేయగోత్రజున కొకనికి శ్రీనాథుడు కూఁతునొసఁగెను. వారికిఁ బుత్త్రసంతతి కలదు. శ్రీనాథుఁ డాదౌహిత్రుల నింటనుంచుకొని పెంచెను. ఆకారణమునఁ దత్సంతతికి శ్రీనాథునివారని యింటిపేరు వచ్చెను. వారివంశపరంపరలు మిక్కిలి పెంపొందెను. ఆపరంపరలలో మాధవమంత్రి యనువాఁడు ప్రఖ్యాతుడయ్యెను. అతని కయిదవతరమువాఁడు శ్రీరామాభిషేక గ్రంథకర్త."

## బాంధవము

ఈయన కన్నదమ్ములు, నక్కసెలియండ్రు నుండిరోలేరో యెఱుఁగరాదు. కీర్తిమూర్తితో వెలయుచున్నాఁడుగాన శ్రీనాథకవివర్యుఁ డెన్నటికిని గోచరించుచున్నాఁడు. కాని భౌతికశరీరమాత్రమున నాఁడే కడతేఱినతద్బంధుమండలి తెలియరాదుగదా! మనకవివర్యుఁ డెఱిఁగింపలేదు. దగ్గుఁబల్లిదుగ్గన యనుకవీశ్వరుఁ డొక్కరుఁడు శ్రీనాథునిబావమఱఁదినని చెప్పికొన్నాఁడు.

"సీ. సంస్కృతప్రాకృత శౌరసేనీముఖ్య
భాషాపరిజ్ఞానపాటవంబు"

ఇత్యాదిపద్య మీవల నుదాహరింపఁబడినది; తర్వాత :

"సీ॥ కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేత
గనకరత్నాభిషేకములు గొనిన
శ్రీనాథసుకవి కూరిమిసేయుమఱఁదివి
దుగ్గయకవిరాజ దగ్గుఁబల్లి
తిప్పనార్యునకు సతీమణి యెఱ్ఱమ
కును దనూజుఁడవు పోతనకు నెఱ్ఱ
నామాత్యవరునకు నసుగుఁదమ్ముండవు
శాండిల్యగోత్రుఁడౌ వరవమతివి
గీ॥ చెప్ప నేర్తువు కృతులు సుస్థిరముగాఁగ
గాన నీవిప్డురచియింపఁగఁదగి యున్న
నాసికేతచరిత్రంబు నాదు పేర
నంకితముసేయు కవిరాజ లాదరింప"

మఱఁదియనఁగా భార్యసోదర్యుఁడు. ఈతని శిష్యునిగాఁజేకొని శ్రీనాథుఁడు దేశములుతిప్పి విద్యాబుద్ధులు నప్పి సుకవితావిశారదునిఁ గావించెను. శ్రీనాథునికి బందుగుఁడనని చెప్పుకొనఁ దగిన యర్హత నీతఁడు గడించుకొన్నాఁడు. నాసికేతోపాఖ్యానమను సరసకావ్యమును రచించి యనంతామాత్యునిగంగయ్యకుఁ గృతియిచ్చినాఁడు. ఈతఁడు కాంచీమాహాత్మ్యముకూడ రచించెను. అది యిప్పుడు లభింపకున్నది. ప్రబంధరత్నావళిలో నందలి పద్యము లుదాహరింపఁబడినవి. ఈతఁడు శ్రీనాథశిష్యత్వమునుగూర్చి నిట్లు గద్యమునఁ బ్రశంసించుకొన్నాఁడు:-

"ఇది శ్రీమత్కమలనాభపౌత్త్ర మారయామాత్యపుత్త్ర కవిసార్వభౌమ సకలవిద్యాసనాథ శ్రీనాథమహాకవీంద్రప్రసాదలబ్ధకవితావిశేష దగ్గుఁబల్లితిప్ప

ప్రథమప్రకరణము

నార్యప్రియతనూజ దుగ్గననామధేయప్రణీతంబైన నాచికేతోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు''-

దగ్గుఁబల్లి కృష్ణామండలమునందు గుడివాడకుఁ జేరువనున్నది. ఈ దుగ్గన యాగ్రామమువాఁడు కావచ్చును. ఈ దుగ్గనతల్లిదండ్రు లగు నెట్టమాతిప్పనార్యులు శ్రీనాథునకత్తమామలగుదురుగదా! దుగ్గన యన్నలగు పోతన యెఱ్ఱనలు మఱియిద్దరు శ్రీనాథుని బావమఱఁదు లుండిరి.

## బమ్మెర పోతన

ఆంధ్రభాగవతకర్తయై భక్తిరసపారావారమున నంధ్రలోకము నోలలాడించుచున్న బమ్మెరపోతనామాత్యుఁడుకూడ మన శ్రీనాథకవీ శ్వరునకు బావమఱఁదియని యైతిహ్యముకలదు. ఇర్వురదేశకాలము లకును గలయిక యేర్పడునేని యైతిహ్యము విశ్వాస్యముకాఁదగును. పరిశీలింతము. పోతనామాత్యునికృతులుభాగవతము వీరభద్రవిజయము భోగినీదండకము నని మూఁడు కలవు. వీరభద్రవిజయకర్త యీ తఁడు కాదేమోయనుసందేహ మంతయసంగతము కాదు. భోగినీదండక కర్త యీతఁడు కాఁడను వాద మెంతయు నసంగతమే; భాగవతము నీతఁ డేకశిలానగరమున నుండి రచియించెను. కాఁబట్టి యీతఁ డేక శిలానగరవాసి యనఁ జెల్లును. ఏకశిలానగర మనఁగా నోరుఁగల్లే యగుట నిశ్చయము. ఐనను గొందరు ''ఒంటిమిట్ట'' యని భ్రమించు చున్నారు. వాదించుచున్నారు. ఓరుఁగల్లు కాకతీయులరాజధాని. ప్రసిద్ధ పట్టణము. ఏకశిలానగరమని దానికే యేనాఁడును వ్యవహారముగలదు. శాసనములందేమి కావ్యములందేమి చరిత్రములందేమి, యెక్కడఁ జూచినను నోరుగల్లనకు నేకశిలానగరమని నామాంతరముకన్పట్టుచున్నది.

శృంగారశ్రీనాథము

చెన్నపురి "ఓరియంటల్ లైబ్రరీ" లోని యేకశిలానగర వృత్తాంతము మొదలగు చారిత్రకసంపుటములు పెక్కులు దీనికిఁ దార్కాణము. ప్రతాపరుద్రీయాదులు తార్కాణము. కాకతీయప్రభృతులశాసనములు తార్కాణము.

భోగినీదండకము కుమారాన్నపోతానేనికుమారుఁ డగు రావుసింగభూపాలుని పేర రచింపఁబడినది. ఆరేచెర్ల వెలమరాజులు రాచకొండ రాజధానిగా భువనగిరి, ఓరుఁగల్లు, సింగపురము మొదలగు తెలుఁగుదేశములు పాలించినారు. అన్నపోతానేఁడు, ఓరుఁగల్లు దగ్గర మైలారదేవరకు నగ్రహార మొసఁగినట్లు శాసనము లున్నవి. పోతనామాత్యుఁ డోరుగల్లునివాసిగావుననే రావుసింగభూపాలున కాయల్పకృతి యొసఁగుట యుపపన్నమయ్యెను. ఒంటిమిట్టకు రాచకొండకుఁ, జేరికలేదు. పోతననాఁటికిఁ గాకతీయరాజ్యము చిదికిపోయినది. తురుష్కులతల్లి వచ్చినది. కావున భాగవతమునకు శీఘ్రవ్యాప్తి కలుగ దయ్యెను. రాజునకుఁ గృతి యొసఁగినచోఁ దదాలంబమునఁ బెక్కులు ప్రత్యంతరము లేర్పడి వ్యాప్తిచెందఁగల్గెడిది. ఒసఁగఁదయ్యెను. పోతనయనంతరము కొలదికాలమునకే యా గ్రంథసంపుటము కొంతకొంత శిథిలమయ్యెను. నాఁ డాభాగమును వెలిగందలనారయాదులు పూరించిరి. వెలిగందల యోరుఁగంటికిఁ మిక్కిలి చేరువనున్నదట! మఱియు బమ్మెర గ్రామముగూడ నోరుఁగంటికిఁ జేరువనే కలదట. బమ్మెరవారు, నేఁటికిని నోరుఁగల్లుప్రాంతములందున్నారట. మఱి యొంటిమిట్టకు నేకశిలానగరమన్నపే రెక్కడను నేనాఁడును గానరాదు. అయ్యలురాజురామభద్రుఁడు తనగద్యమున "ఒంటిమిట్ట రఘువీరశతకనిర్మాణకర్మఠ" యని యొంటిమిట్టనే పేర్కొనెను. అతనితాత తిప్పరాజుశతకమునఁగూడ "ఒంటిమిట్ట

రఘువీరా! జానకీనాయకా!" యనియెను. "ఒంటిమిట్టను గాఁపురం బున్నయట్టి సిద్ధసానికి సంకల్పసిద్ధిరస్తు" అని చాటువు.

"మానవతి వినవమ్మ చంద్రుఁడు మందువెన్నెల గాసెనే
సూనశరములవింట మదనుఁడు సూటిదప్పక యేసెనే
భానుతేజుఁడు తెలిసియంతటఁ బంతమున నమడాసెనే
మేన గంధము పూసెనే! ఒంటిమిట శ్రీరఘురాముఁడు"

ఇత్యాదిపద్యములందును నొంటిమిట్ట యన్నపేరే పేర్కొఁబడి నది. చెన్నపురి "ఓరియంటల్ లైబ్రరీ"లో నొంటిమిట్ట విషయము గలదు. కొన్ని శాసనము లుదాహరింపఁబడినవి. అన్నింటను నొంటి మిట్ట యన్నపేరే గలదు. "ఒంటఁడు, మిట్టఁడు" నను శబరుల మూలమున నక్కడ పురమేర్పడినట్టును వాంద్రపేళ్లతోడనే యా పేరుకలిగినట్టును నొంటిమిట్టవాసులు పలువురు స్థలజ్ఞులు చెప్పిన ట్లందు వ్రాయఁబడినది. ఎన్నెన్నో విషయములు వ్రాయఁబడినవి గాని యందుఁ బోతనామాత్యుని ప్రస్తావమే చేరలేదు. పూర్వ మీకిం వదంతియున్నదనుట కాధారములేదు. భాగవతమును దొల్త మద్రాసున ముద్రించిన పురాణం హయగ్రీవశాస్త్రిగారి యూహమే యీవాదమున కుపజ్ఞ. పోతన తననాఁటికి నేకశిలానగరమను పేరుఁగల్లునకు జగత్ప్రఖ్యాతముగాఁ జెల్లుచుండఁగాఁ దానుగ్రొత్తగా నొంటిమిట్టకుఁ గూడ నదేపేరు పొసఁగించుట సంభవింపదు. ఈ సందర్భమున నిప్పుడు వాదప్రతివాదములు పేడెత్తియున్నవి. ప్రాజ్ఞలోకము యథా ర్థము నెఱుఁగఁగలదు. ఇది యింతటఁ జాలును.

శ్రీనాథుఁ డోరుఁగంటితోఁ దనకుగలపరిచయ మెల్ల వల్లభా

శృంగారశ్రీనాథము

మాత్యుని పేర్వెట్టి తానురచియించిన క్రీడాభిరామమున వెల్లడించినాఁడు. శ్రీనాథునకును బోతనకును స్థలసంబంధము పొసఁగుచున్నది. పోతన భాగవతమున నాతనికాలము నిర్ణయించుటకుఁ దోడువచ్చునంశ మేదియుఁ గానరాదు. భోగినీదండకమున :-

'సీమంతినీమానసారామవాటీవసంతుణ్,వవంశావనీ నాథసంసేవితాంచత్ప దాంభోజురావుసింగక్షమానాథపౌత్రుణ్, సర్వజ్ఞసింగోర్వరాధ్యక్షు'

అని కలదు. రేచర్లవారివంశచరిత్రలం దీసర్వజ్ఞసింగ భూపాలుఁడు సరిగా గుర్తింపనగుచున్నాఁడు. ఈతఁడే శ్రీనాథునిచే దర్శింపఁబడినవాఁడు. షష్ఠప్రకరణమం దీవిషయము విపులముగాఁ జర్చింపఁబడును. కాలసంబంధమును బొసఁగినది. ఇర్వురును గవీశ్వరులు. సమానవృత్తివ్యాపృతులుగా నుండు వారికి మైత్రియో శాత్రవమో ప్రాయికముగాఁ బొటిల్లుచుండును. శ్రీనాథుఁ దర్థ విద్వాంసులపై నాదరము కల్గువాఁడు. పోతనామాత్యుఁడు సాత్త్వికప్రకృతి గల యుత్తమపురుషుఁడు రాజాశ్రయాద్యపేక్షలు లేనివాఁడు. పరస్పరము ద్వేషమునకుఁ గారణము లేదు. ఈయిర్వురసంబంధమునుగూర్చి వాడుకలోఁ గొన్నికతలుగలవు సంగ్రహముగాఁ బేర్కొనెదను. శ్రీనాథుఁడు తన గ్రంథములెల్లఁ బ్రాభవాధికుల కొసఁగి హెచ్చు ధనమును గడించి భోగసమృద్ధితోఁబల్లకులెక్కి తిరుగుచుండెడివాఁడు. పోతనామాత్యుఁ డట్లుచేయమిచే బీదవాఁడై కృషిచేసికొని జీవించుచుండెను. పోతనామాత్యునిచేఁగూడ, నరాంకితములుగాఁ గృతులు చెప్పింపఁ దలంపుగొని యొకప్పుడు శ్రీనాథుఁడాతని దర్శింపఁ బోయెనట' త్రోవలోఁ బొలము దున్నుకొనుచున్న పోతనామాత్యుని జూచి శ్రీనాథుఁ డీక్రింది పద్యమును జెప్పెనట।

క. కమ్మనిగ్రంథం బొక్కటి
యిమ్ముగ నేనృపతికైనఁ గృతి యిచ్చినఁ గో
కొమ్మని యీయరె యర్థం
బిమ్మహి దున్నంగ నేల యిట్టిమహాత్ముల్.

ఇర్వురు నింటి కరిగిరి. లేపడిఁ గుడుచుచున్న యాధన్య చరితుఁ డా శ్రీనాథకవికిఁ దగిన ట్లాతిథ్యము నెఱపలేకపోయెనట! శ్రీనాథునిప్రాభవమును జూచి యానాఁడుపోతానామాత్యునిభార్య కవిత వలన మీకుఁ గాసైన గడింపలేకపోయెఁగదా! యని విసువుదోఁపఁ బలికెనట! పోతనామాత్యుఁడు వ్యాకులపడెనట! శ్రీనాథుడును రాజాంకితముగాఁ గృతులు చెప్పి ధనవంతుఁడగు మనిప్రోత్సాహపఱిచెనట! నాఁటిరాత్రిస్వప్నమున సరస్వతి దీనాననయై కన్నీరుదోఁపఁ బొడ చూపఁగాఁ బోతనామాత్యుఁ డప్పు డీక్రిందిపద్యమును జెప్పెనట.

ఉ. కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ నేలయేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాఁదిలికోడల' యోమదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాఁకటికై కొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్మ భారతీ!

భాగవత మందలి "సిరికింజెప్పఁడు" మొదలగుకొన్ని పద్యములఁగూర్చి శ్రీనాథునకుఁబ్రసక్తములుగాఁ గొన్నికతలు గలవు. పోతన యైహికేచ్ఛావిముఖుఁ డగుట విశ్రుతము. నరకృతి యాతని కసమ్మతము. శ్రీనాథాదులకుఁ జుఱుకుమని తగులునట్లు భాగవతమున నిట్లుచెప్పినాఁడు.

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురమ్ములు వాహనమ్ములున్
సొమ్ములుఁ గొన్నిపుచ్చుకొని చొక్కి శరీరముఁ బాసి కాలుచే

సమ్మెట ప్రేటులం బడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్

పోతనకు సహజపాండిత్యుఁ డని బిరుదు. పాండిత్యవిషయమునఁ బోతరాజుగారికంటె శ్రీనాథభట్టారకుఁడు మిక్కిలి దండివాఁడు. వీరిర్వురును నిశ్చయముగా నిచ్చిపుచ్చుకొన్నసంబంధమున్న బావమఱఁదులయినను గాకున్నను, వరుసకయియుందురని నమ్మదగును.

భీమఖండకృతిపతి బెండపూడియన్నమంత్రి శ్రీనాథునకు బంధుగుఁడు. ఆ బాంధవము తమనాఁటిదిగాక తరముల నుండి వర్తిల్లుచున్నదిగా భీమఖండముననిట్లు సూచించినాఁడు.

సీ. గీ. పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభునిమనుమఁడ నమలమతివి
నాకుఁ గృపసేయు మొకప్రబంధంబు నీవు
కలితగుణగణ్య! శ్రీనాథకవివరేణ్య!

మఱియు శ్రీనాథునకు రామయమంత్రియని బావమఱఁదియో బావమఱఁదివరుసవాఁడో యొక్కఁడుండెడివాఁడనియు నాతఁడు భోజనశూరుఁడనియు, నొకసారి బంతినిగలసి భుజించుచు శ్రీనాథుఁ డాతని నీక్రిందిపద్యముఁ జెప్పి గేలిచేసెననియు వినికి. ఇది విశ్వాస్యముగా నాకుఁ దోఁపదు.

ఉ. గ్రామము చేతమడి పరికల్పితధాన్యము నింటనుండి శ్రీ
రామకటాక్షవీక్షణపరంపరచేఁ గడతేఱెఁ గాక మా
రామయమంత్రిభోజనపరాక్రమ మేమనిచెప్పవచ్చు నా
స్వామి యెఱుంగు దక్కబళదాతురి శాకఫలప్రమాణమున్.

# శృంగారశ్రీనాథము

## ద్వితీయ ప్రకరణము

మ. మహనీయంబుగ నంధ్రభూవలయముం బాలించుచుం బ్రాజ్ఞులై
బహుకావ్యంబులు చెప్పుచున్, మఱియుఁ జెప్పంజేయుచాముష్మిక
స్పృహతో ధర్మము లాచరించుచు, జగజ్జేగీయమానంబుగా
మహముల్ పుచ్చిన రెడ్డిరాజులసముద్యత్కీర్తిఁ గీర్తించెదన్

### కొండవీటి రెడ్లు

క్రీ 1330 ప్రాంతమునఁ దురుష్కులకల్లువలనఁ గాకతీయాంధ్రసామ్రాజ్యము చీకాకయి చెడెను. వారిక్రింద దండనాథులుగా నుండిన రెడ్లు వెలమలు మొదలగువా రటుతర్వాతఁ గొందఱు స్వతంత్రరాజ్యముల నేర్పఱచుకొన్నట్లు తెలియుచున్నది. ఈకొండవీటిరెడ్డిరాజ్యము కోమటిప్రోలయ యను రెడ్డికాలమున నెలకొన్నది. ఈతఁడు, క్రీ 1320 ప్రాంతమున రాజ్యమేలెను. శాసనములం దీతనితండ్రి వేమన వంశకర్తగాఁ బేర్కొనఁబడుచున్నాఁడు. ఆతనికిఁ బూర్వవిషయ మేశాసనమునను గానరాదు. ముట్లూరిశాసనమున నాతఁడు దండనాథుఁ డనియు నాతనికుమారుఁడుప్రోలయక్షమాధీశ్వరుఁడనియుఁ గలదు. ముట్లూరిశాసనము క్రీ 1333న కోమటి ప్రోలయకుమారుఁ డగుప్రోలయ వేముఁడు తన మేనమామయగు నాగసేనానికిఁ బుణ్యముగా, జొన్నలగడ్డమృత్యుంజయార్యున కాగ్రామము దానముచేసి నెలకొల్పినాఁడు.

క్రి.శ. 1423న నెలకొల్పబడిన యనితల్లి కలువచేరు శాసనమున నీరెడ్డి రాజ్యారంభవిషయ మిట్లు తెలుపఁబడినది.

"ఆ ప్రతాపరుద్రుఁడు మ్లేచ్ఛచేతనే (తురుష్కులకోడిపోయి యుద్ధాదులవలన మృతుఁడు కాలేదనుట) స్వర్గస్థుఁడుకాఁగా భూమి తురుష్కాక్రాంత మయ్యెను. సముద్రజలమగ్న మయినప్పు డాది వరాహమూర్తి యుద్ధరించినవిధమున, యవనులపాలయినప్పుడు ప్రోలయనాయకుఁడు స్వర్గస్థుఁడు కాఁగా విశ్వేశ్వరానుజ్ఞచేఁ గాపయ నాయకుఁడు డెబ్బదియేగురునాయకులు తన్ను సేవింప నేల్పడి నెఱపుచుఁ దురుష్క లాక్రమించుకొనినరాజ్యమెల్ల స్వవశముచేసికొని యనే కాగ్రహారములను బ్రాహ్మణులకు దానములొసఁగి పేర్వెలసెను. అతఁడును స్వర్గస్థుఁడయిన తరువాత నాడెబ్బది యేగురు నాయకులుఁ దమ తమ భాగములందు రాజ్యమేలఁ జొచ్చిరి. అందు వేమనరేశ్వరుఁ డొకఁడు"-

ముట్లూరిశాసనమున మొదటి వేమయ దండనాథుఁడయినట్లును, నాతనికొడుకు ప్రోలయ రాజయినట్లును ప్రోలయ కొడుకు వేమయ ప్రసిద్ధముగా రాజ్యమేలినట్లును గలదుగదా, కలువచేరుశాసనమున వంశమునకు మూలపురుషుఁడుగాఁ బేర్కొనఁబడిన ప్రోలయ వేమయ చేతనే నెలకొల్పఁబడిన ముట్లూరిశాసనము ఆకలువచేరుశాసనముఁ కంటెఁ బ్రాచీన వృత్తాంత మెఱిఁగించుసందర్భమం దధ్యాశ్రిత మగు ననుటకు సందియముండదు. డెబ్బదియేగురు దండనాథులలో నొక్కఁడు గానున్నవాఁడు ప్రోలయతండ్రి వేమయయగునేమో'కలువ చేఱుశాసనమునఁ బ్రోలయకొడుకు వేమయయే పేర్కొనబడినాఁడు. కాపయనాయకునకునునాతనికిఁ బూర్వము రాజ్యమేలిన ప్రోలయనాయ

కునకును వీరికి నేమేని సంబంధము గలదో తెలియదు. అకావయ నాయకుని విషయ మీవఱ కంతగా గుర్తింపఁబడినదిగాదు. కలువ చేఱుశాసనము నార్యవటశాసనము నాతని మిక్కిలిప్రఖ్యాతునిగాఁ బేర్కొనుచున్నవి. మొదటివేమనకుమారుఁ డగుప్రోలయకే కోమటి ప్రోలయ యని నామాంతరము. ఈతని భార్య యన్నమాంబ. వీరికి మాచయ వేమయ దొడ్డయ అన్నయ మల్లయ యని యైదుగురు పుత్త్రిలు జనించిరి. కొన్ని శాసనములు మల్లయనువిడచి నలుగురినే పేర్కొనుచున్నవి. ప్రోలయతరువాత నాతనిరెండవపుత్త్రుఁడు వేమయ రాజ్యమునకు వచ్చెను.

ఈ కొండవీటిరెడ్డిరాజ్యారంభమును గూర్చి కొండవీటి దండ కవిలెలోను, గొండవీటికైఫీయతులోను, మరికొన్నిటను "పరుసవేది కథ" యొకటి గలదు. ఆకథ యాథార్థ్య మెట్టిదో యెఱుఁగఁజాలము రెడ్డిరాజులు 'వేమయ' 'కోమటి' నామములను దఱచుగాఁ దాల్చుచు వచ్చిరి. దీనికిఁ గారణ మేదో యుండఁదగును. పరుసవేదికథకు సంబంధించిన విషయ మేదేని కారణమగుట చేతనేగాని, లేనిచోఁ గోమటీశుఁ డనుజైనదేవునియు వేమయయను వీరశైవాచార్యునియు నామములనుబట్టిగాని యాపేళ్లు వారుతఱచుగాఁ దాల్చుచుండవచ్చును. పరుసవేదికథయెడలఁ దొలుత నాకుఁ బ్రమాణబుద్ధి లేకుండెనుగాని ప్రోలయవేమయనాఁటనే వెలయింపఁబడిన మంచాళ్ల తామ్రశాసనమా కథయందుఁ గొంత సత్యము కలదేమో యని సందేహము కలిగించుచున్నది. అందిట్లు కలదు:-

" శ్లో. తద్వంశజాతామలపంటరెడ్డి కులామృతాంభోనిధిపూర్ణ చంద్రః। ప్రోలాభిధః ప్రాప పురాతనోర్థః పూజావశా ద్బ్రహ్మణపాదుకాభ్యామ్॥

ద్వితీయప్రకరణము

యదృచ్ఛయా స్వర్ణకరప్రసిద్ధిం లబ్ధ్వాన్నమాంబాపతి రాజభూపః। తశ్చ పుత్త్రౌ పంచ లేభే బృందారకాధీశ్వరతుల్యమూర్తిః॥ తత్పుత్త్రౌ ష్వధవేమభూపతి రరిప్రాణాపహారీ రణే ....—"।

ఇందు రెండవశ్లోకమున దైవికముగా స్వర్ణకరప్రసిద్ధి పొంది యన్నమాంబాభర్తయగు ప్రోలయ పెంపొందె ననియున్నది. ఇది పరుసవేదివిషయమేమో యని సందేహమగుచున్నది.

## ప్రోలయ వేమారెడ్డి.

ఈతఁడే రెడ్డిరాజ్యమును మహోన్నతికిఁ దెచ్చిన ప్రఖ్యాత పురుషుఁడు. ఈతనిప్రథానరాజధాని యద్దంకి. కొండవీడు, కొండపల్లి, ధాన్యవాటి, మొదలగు స్థలములం దీతఁడు చాసీతిదుర్గములను నిర్మించి తన స్వజనము నక్కడక్కడ నెలకొల్పెను. బ్రాహ్మణులలో వేంగినాటివారికి, వెలనాటివారికి, ద్రావిడులకు ముప్పదియాఱగ్రహారములు దానముచేసెను. మఱియు హేమాద్రిధర్మశాస్త్రమునఁ జెప్పఁబడిన మహాదానములన్నింటిని గావించెను. శ్రీశైలమునకు, నహోబలపర్వతమునకు సోపానములు కట్టించెను. ఈ సోపాననిర్మాణము రెడ్డిరాజుల శాసనములందుఁ దఱచుగాఁ బ్రస్తావింపఁబడును. పల్లవత్రినేత్రాదు లీతనిబిరుదులు. కవిత్రయమందొక్కఁడై ప్రబంధపరమేశ్వరుఁడునాఁ బరగిన యెఱ్ఱాప్రెగ్గడచే రామాయణమును హరివంశమును జెప్పించి కృతినాథుఁడై శాశ్వతకీర్తి గన్న ధన్యాత్ముఁ డీతఁడే।

---

1. ఈ శాసనము మిప్పుడు లభింపలేదు. మెకంజీదొరగారు దీని ప్రతి వ్రాయించియుంచినారు. లోకల్ రికార్డు వాల్యూములో జూడఁదగును.

క. వితతయువరాజవిభవో
న్నత పోతయసైన్యనాథ నయమార్గవమీ
హిత వంతత సేవావిల
పితపుత్త్ర శ్రీవమృద్ధ శివగుణ సిద్ధా. - హరివంశము.

హరివంశరచనమునాఁటి కీప్రోలయవేముని పెద్దకుమారుఁ డన పోతరెడ్డి యువరాజుపదమును బడసియున్నాఁడు.

ఎఱ్ఱాప్రెగ్గడను దొలుత సత్కరించినవాఁడు ప్రోలయవేముని తమ్ముఁడు మల్లచమూపతి. అతఁ డీకవీశ్వరుసఁ దన యన్నగారి కర్పించెను. ఆ మల్లచమూపతి కురుమలూరు పురనాయకుఁడుగా నుండెనట. మధ్యాంధ్రదేశ క్షేమదకరవాలుఁడని హరివంశమునఁ బ్రోలయవేముఁడు పొగడ్తగాంచినాఁడు. ఆతనికిఁ జిట్టయయనువాఁడు మేనమామ కుమారుఁడు కుడిబుజమై యుద్ధాదులందు మిగుల సాహాయ్యము చేయుచుండెడువాఁడు. చదలువాడయెఱ్ఱాప్రెగ్గడ సూర్య సుకవికొడుకు. శంకరస్వామి సంయమిశిష్యుఁడు. ఆశంకరస్వామి శివ పూజాధురంధరుఁడట! ఎఱ్ఱాప్రెగ్గడకు శంభుదాసుఁ డని నామాంతరము. భారతారణ్య పర్వశేషము, లక్ష్మీనృసింహపురాణము, రామాయణము, హరివంశము నాతని కృతులు.

సీ. రసవత్కవిత్వనిర్మాణంబునఁ బ్రబంధ
 పరమేశ్వరుం డన్న బిరుదమందె
ప్రోలయవేమభూభుజు కోర్కి హరివంశ
 మును రామకథయుఁ దెల్గునకుఁదార్చె
వన్నయపారవశ్యోన్నతి దనుఁ జెంద
 భారతారణ్యపర్వము ముగించె

శృంగారశ్రీనాథము

చెప్పెనొప్పులుగ నృసింహపురాణ మె
త్తువ విల్చె నన్న తిక్కనలతోడ

గీ. పరమశైవుఁడై పేర్వాపి పరగె శంభు
దాసుఁ డన నిహపరహితధర్మములఁ దె
లుఁగులెల్లఁ గడంక నెఱింగె నెట్టి
ప్రెగ్గడకవీంద్రుఁ డతఁడు వర్ణింపఁ దగఁడె.

ప్రోలయవేముని యాస్థానమున లొల్లలక్ష్మీధరుని (లక్ష్మీధరుఁడు క్రీ. 1530వాఁడు) కేడవతరమువాఁడగు మహాదేవకవియుండెను.

శ్లో. యః కర్ణాటవసుంధరాధిపమహాస్థానే సువర్ణాయితో
యో నిత్య న్నికషాయితో నృపగృహే వేమాఖ్యపృథ్వీశితుః
శ్రీమల్లొల్లభట్టశిష్యఇతి యో లొల్లాఖ్యయా శ్రూయతే
శ్రీశేషాన్వయశేఖర స్సహి మహాదేవో విపశ్చిన్మహాన్.

## అనపోతారెడ్డి.

ప్రోలయవేమనకుఁ దర్వాత నాతనిపెద్దకుమారుఁ డనపోతారెడ్డి రాజయ్యెను. ఈతని కాలమునుండి రేచర్లవెలమరాజులకును నీ రెడ్డిరాజులకును పోరు ఘోరముగా నడవఁజొచ్చెను. పరస్పరముఁ దలలు నఱుకుకొని తమ్మపడిగల దాపించుకొనుచు వచ్చిరి. తుద కీరెడ్డిరాజ్యము ప్రభ్రష్టమగుటకుఁగూడఁ గొంతవఱ కీవివాదము కారణమయ్యెను. దన్నాలకోట (ధరణికోట) యొద్ద నీయనపోతారెడ్డిని రేచర్ల వెలమరాజగుసింగయమాదానేఁడు యుద్ధమొనరించి పాఱఁదఱిమినట్లు వెలిగోటివారివంశ చరిత్రలు పెక్కువగా వాకొనుచున్నవి.

ఉ. దన్నడకోట ముంగల నుదగ్రబలోన్నతి గంగదాఁటి పం
పన్నబలుండు పింగజనపాలునిమాదఁడు రెడ్డిపోతనిన్
బన్నిన సేనలం దునిమి పాఱఁగఁదోలె విరాటుపీట న
త్యున్నతవిక్రమంబున సుయోధనుఁ దోలు కిరీటి కైవడిన్.

వేమారెడ్డికాలమునఁ గొండవీ డొకదుర్గముగా నుండెడిది, కాని యద్దంకియే ప్రధానరాజధానిగాఁ నుండెను. ఈ యనపోతారెడ్డి యేకారణముననో యద్దంకి వీడనాడి కొండవీడునగరమును బెంపొందించి దానినే తనరాజధానిగాఁ జేసికొన్నాఁడు. రాచకొండ రాజధానిగా రాజ్యమేలుచున్న వెలిగోటివెలమరాజులతో స్పర్ధలు, యుద్ధములు పెరుగుచుండుటచే వారితాఁకుడు నడ్డుకొనుటకయి చేరువనుండఁగోరి కొండవీటికి మార్చుకొని యుండునని తలఁచెదను. నాఁటనుండియు రెడ్లరాజధాని కొండవీడుగా నుండెను.

(రాజమహేంద్రవరం యిలాకా యిప్పటిమన్యమాపురం శాసనం)*

---

+ ఈశాసన మింతవఱకు నముద్రితము. దీని వ్రాఁతప్రతి ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోనున్నది, అందుఁ దప్పులున్నవి. ఇప్పుడుదాహరింపఁబడిన శ్లోకములలోనే ''తతోన్నపోతనృపతిః'' అని యుండవలసినచోట ''తతోన్నవేమ నృపతిః'' అని తప్పువ్రాయఁబడినది ఈ శ్లోకముల నింతకుముందు శ్రీ వీరభద్రరావుగారు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోని లోకల్ రికార్డునం దున్నట్టే యుద్ధరించి యుదాహరించిరి. వీరేశలింగముపంతులుప్రభృతులు వీరభద్రరావు పంతులుగారిపుస్తకమునుండి యెత్తికొని యుదాహరించుకొనిరి. ప్రోలయవేమనతర్వాత రాజ్యమేలినవాఁడు అన్నపోతరెడ్డిగాని యనవేమరెడ్డి కాఁడు. ఆశ్లోకమునకుఁ దర్వాత నాశాసనమున "సోన్నపోతనృప స్స్వేవనిర్మి

శృంగారశ్రీనాథకు

"తతోఽన్నపోతనృపతిః పటుః పాలనకర్మణి
అపాలయ త్తస్య పుత్త్రి త్వందం తేఽంధ్రవసుంధరామ్
కొండవీడుం రాజధానీం వవిచిత్రా మకల్పయత్
దృష్ట్వా త్వష్టాపి వైచిత్ర్య మభూ ద్యస్యా వ్సువిస్మయః.
ఉచ్చైశ్శ్రీవస్తుల్యబలై స్తురంగైః కల్పద్రుమాభైశ్చ వదాన్యవర్గైః
రంభోపమాసై రమణీజనైశ్చ సా భాతి భూమా వమరావతీవ.

సోఽన్నపోతనృప స్స్వేవ నిర్మితాయాం పురిస్థితః
కుర్వ౯ హేమాద్రి దానాని చిరం భువ మపాలయత్."

ఈ యనవోతారెడ్డియాస్థానమున విద్యాధికారియై బాలసరస్వతి యనుపండితుఁ డుండెడివాఁడు. అతని ధర్మకార్యముల కాబాలసరస్వతియే శాసనకృతికర్త. శాసనావసానముల నాతఁడు తన పేరు చెప్పికొన్నాఁడు

శ్లో. అన్నపోతనరేంద్రస్య విద్వా౯ బాలసరస్వతిః
ఆకరో దాకరో వాచాం నిర్మలంధర్మశాసనమ్

ఈ బాలసరస్వతి యనవేమారెడ్డికాలమునఁ గూడఁగలఁడు.

మఱియు నీ యనపోతారెడ్డి యొకవెన్నెలకంటి సూర్యకవిచేఁ గృతుల నందుకొన్నాఁడు.

శ్రీనాథుని సమకాలముననున్న జక్కనకవి తనవిక్రమార్కచరిత్రలోఁ గృతినాథునిఁగూర్చి చెప్పినపద్యము :-

---

తాయాం పురిస్థితః" ఇత్యాదిగాఁగలదు. అమీఁద నవవేమారెడ్డిరాజ్య పాలన విషయముకూడఁ జెప్పఁబడినది. కాన యీ తర్వాతిభాగము పరిశీలించి చదివినప్పుడు దాతప్పు స్పష్టముగా గోచరించును. కొండవీడు రాజధానిగాఁ జేసినవాఁ డనపోతారెడ్డిగాని, యనవేమారెడ్డి కాఁడు.

ఉ. వెన్నెలకంటిసూర్యుఁడు వివేకగుణాఢ్యుఁడు వేదశాస్త్రవం
పన్నుఁడు రెడ్డివేమనరపాలకుచేత మహాగ్రహారముల్
గొన్న కవీంద్రకుంజరుఁ డకుంఠితతేజుఁడు పెద్దతండ్రిగా
వన్నెతిగన్నసిద్ధనకు వంతతదానకళావినోదికిన్.

ఇందు రెడ్డివేమనరపాలుఁ డగ్రహారము లిచ్చెనని యున్నది. ప్రోలయవేమన కావచ్చును. వెన్నెలకంటి యింటిపేరివాఁ డొకకవి యనపోతరెడ్డికిఁగూడఁ గృతుల నిచ్చినట్టు తెలియఁదగియున్నది. ఆ వెన్నెలకంటి వంశమందే జన్మించి సరస కవితావిశారదుఁడై విష్ణుపురాణమును దెలిఁగించిన వేఱొక వెన్నెలకంటిసూరన యీవిషయమిట్లు పేర్కొన్నాఁడు:

ఉ. ఈ నిఖిలంబు మెచ్చ నమరేశ్వరదేవుఁడు చూడఁ గృష్ణవే
ణీనది సాక్షిగా నతికి నిల్చినరావుతుకేపభూవిభుం
గానకుఁ దోలి వెన్నడచి కాచిన వేమయ యన్నపోతభూ
జానికి వత్ప్రబంధము లొసంగిన వెన్నెలకంటివారిలోన్.

అన్నపోతారెడ్డి పంచారామములోఁ బ్రథమారామముగా సమరారామమనుపేరఁ బరగిన యమరావతి (ధాన్యవాటి)లో నమరేశ్వరదేవరను మంత్రియగుమల్లయవేమునిచేఁ బునఃప్రతిష్ఠితుఁని జేయించెను. అమరావతి శిలాశాసనమున నామల్లయవేమమంత్రి ప్రతాపాదికము మిక్కిలి కీర్తింపఁబడినది. అతఁడు ధరణికోటపయికిఁ దురుష్కసైన్యము దండెత్తిరాఁగా వెఱచఱవక డీకొని యోడించి పంపినాఁడట.

అన్నపోతారెడ్డి 1368 వఱకు రాజ్యమేలెను. అతని శాసనములఁ గూర్చి యనుబంధముచూచునది. అతనికిఁ గొమరగిరిరెడ్డి కుమారుఁడు.

కొమరగిరిరెడ్డి బాలుఁడగుటచేతనేమో యనపోతారెడ్డి తర్వాత నాతని తమ్ముఁ డనవేమారెడ్డి రాజయ్యెను. శాసనములం దనపోతారెడ్డి స్వర్గస్థుఁడయినపిదప నాతని ప్రియసోదరుఁ డనవేమారెడ్డి పిత్ర్యమగు రాజ్యమును బడసెనని చెప్పఁబడియున్నది.

## అనవేమారెడ్డి.

ఈతఁడు మహాధార్మికుఁడు. 'ధర్మవేమన' యని యీతనికిఁ బ్రఖ్యాతి కలదు. ఈక్రింద నుదాహరింపఁబడుచాటువు లీతనిఁగూర్చి రచింపఁబడినవి. అనవేమ వేమనామములు ప్రోలయవేమాన్నవేములకు సామాన్యములు.

శ్లో. అరుణోదయ తపనోదయ వంగవ మధ్యాహ్న సాయ మర్ధనిశాః
శివపూజావమయా ష ట్ప్రతిదిన మనవేమపార్థివేంద్రస్య.

శ్లో. భువివత్యనవేమపార్థివేంద్రే విదుషాం జీవన మేవ జీవనమ్
దివివత్యనవేమభూపతీంద్రే విదుషాం జీవనమేవ జీవనమ్.

శ్లో. పాతాళం పరిపాలయ త్యహిపతౌ వాతాశినో భోగివ
శ్శక్రే శాసతి నాకలోక మమరా న్ప్రాశాసినో జజ్ఞిరె
భూమీశే చిర మన్నవేమనృపతౌ భూయో లభంతే జనా
మృద్వన్నం మృదులాంబరం మృగమదం చామీకరం చామరమ్.

శ్లో. నీవారోపహతే ర్గదాతరుఫలచ్ఛేదాద్ద్రుమః కంటక
స్యోద్ధారా ద్విశిఖస్ప్రముద్ధత వమిచ్ఛేదాచ్చ కాక్షేయకః
వేమక్షపః భవద్భయేన విపినక్షోణీం వమాసేదుషాం
సాఫల్యం దధతే రిపుక్షితిభృతాం శస్త్రాణి కాలా ద్వహో॥

శ్లో. లక్ష్మీ స్త్వన్నయనాంబుజేచమణయ స్త్వత్కోశగేహాంతరే
త్వద్దోష్ణో స్సురభూరుహ స్త్వవగిరాం గుంభే సుధా వంభృతా
అంభోమాత్రధనవ్య మే తవ చమూరేణో ర్భయం మా స్త్వితి
శ్రీమత్యా: త్వాం ప్రతి వేమభూవర శశి సింధో రయం పత్రికా:

సీ. యామినీశయయాతి యాదోధిపతి యక్ష
యమతనూభవులు పీయ తవారు
తపనతాటక (?) వైరితాలాంకతారాద్రి
తారకాంతకులు నీతరమువారు....

గీ. శుద్ధిమతిరయగాంభీర్య వృద్ధిరూపశాంతికరుణావితరభూతికాంతిభాగ్య
సారధవధర్మతేజోతిశౌర్య ధైర్య భుజబలంబుల ననవేమభూపవర్య.

క. ఏపనికిఁ దగిన మనుజుని నాపని కనుపంగలేక యవనీశుఁడు దా
నోపనిమనుజునిఁ బంపిన నాపనిదాఁ జెఱిచినట్టు లనవేమనృపా.

అనవేమమహీపాలుని పాలనకాలమునఁగూడ బాలసరస్వతికవి విద్యాధికారిగా నుండెనని యింతకు ముందే వ్రాసితిని. అతఁడు చని పోవుటచే నయియుండును త్రిలోచనాచార్యుఁడను కవీశ్వరుఁ డింకొకఁడుకూడా శాసనాచార్యుఁడుగా నీతని యాస్థాన మందున్నాఁడు శా. 1298 ఉప్పుగల్లుతామ్రశాసనమునకు బాలసరస్వతి కర్త. శా. 1300 (ఇమ్మడిలంక) వానపల్లి తామ్రశాసనమునకు త్రిలోచనాచార్యుఁడు కర్త.

శ్లో. శ్రీమ త్త్రిలోచనాహార్య స్సుకవిః కవివంశదీపకో జయతి
అనవేమనృపతిదత్త స్యేమ్మడిలంకవ్య శాసనం కృతవాన్.

శృంగారశ్రీనాథము

శ్లో. మహానటజటాచ్యుటానటదమందమందాకినీ
కలక్వణితకంకణప్రజవిజృంభివాగ్గుంభనః
కవిః కవికులోద్భవో భువనభవ్యదివ్యోదయ
శ్శివాగమవిశారదో జయతి శారదావల్లభః.

మఱియు ననవేమమహీపాలుని పాలనమున "పరికాళ భారతీ యోగి" యని యింకొక యంధ్రికవీశ్వరుఁ డుండెడువాఁడు. దాక్షారామపురమున నా యనవేమభూపాలుఁడు దేవాలయాదికమును వెలయించు సందర్భమునఁ బద్యరూపకములగు శాసనకృతుల నాతఁడు రచియించెను.

## కొమరగిరిరెడ్డి.

ఈతఁడు భోగైకపరాయణుఁడు. అనువర్షమును వసంతోత్సవము లొనర్చుచుండెడువాఁడు. మన శ్రీనాథుని హరవిలాసము గృతి నందిన యవచి దేవయతిప్పయ యిమ్మహారాజునకుఁ బ్రతిసంవత్సరోత్సవంబునకుం దగిన కస్తూరీఘనసారసంకుమదహిమాంబుకాలాగురు ప్రభృతి సుగంధద్రవ్యంబు లొడఁగూర్చియుఁ జీనిసింహళతవాయి హురుమంజిజలనోగిప్రభృతి నానాద్వీపనగరాకరంబుల ధనకనకవస్తు వాహన మాణిక్యగాత్యంబులు తెప్పించియు నాందోళికాచ్ఛత్రచామర తురంగాది రాజ్యచిహ్నముల నందెను. కుమారగిరిచే సంస్కృతమున వసంతరాజీయమను నొకనాట్యశాస్త్రగ్రంథము రచింపఁబడెనట; అది యిప్పుడు చేకూరకున్నది.

శ్లో. మునీనాం భరతాదీనాం భోజాదీనాం చ భూభుజామ్
శాస్త్రాణి సమ్య గాలోచ్య నాట్యవేదార్థవేదినామ్

ప్రోక్తం వసంతరాజేన కుమారగిరిభూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమమ్.

- శాకుంతలవ్యాఖ్య.

నిత్యభోగపరాయణుఁడగు నీతఁడు వసంతోత్సవములతోడను వారాంగనాభినయములతోడను గాలముపుచ్చుచుఁ బేరునకు రాజై సింహాసనము నధిష్ఠించియుండఁగా నీతని బావమఱఁది (సోదరిభర్త) కాటయవేమన సర్వసమర్థుఁడై రాజ్యమును నిష్కంటకముగాఁ గాపాడుచుండెను.

శ్లో. భాగ్యం నామ సమగ్ర మీ దృశ మతిస్నేహైకపాత్రం యతో
వీరం కాటయవేమ ముద్ధతరిపుధ్వంసే నియుజ్య స్వయమ్
నిత్యం నందతి నర్తనై రభినవైః కాంతై ర్వసంతోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరిభూపాలో నృపాలోత్తమః

—మాళవికావ్యాఖ్య.

కొమరగిరి కొలువున "లకుమ" యనుపేరుసి నాట్యమాడుచుండెడిదట.

శ్లో. జయతి మహిమా లోకాతీతః కుమారగిరిప్రభో
స్సదసి లకుమాదేవీ యస్య ప్రియాపదృశీప్రియా
సమ మభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహూనర్థానర్థి వ్రజాయ సహస్రశః.

లకుమాదేవి వేశ్యకావచ్చును. వేలతెఱఁగుల నవనవాభినయములు చేయుచు వేలకొలఁదిగా నర్థివర్గమునకు నామె ధనమొసఁగుచు

శృంగారశ్రీనాథము

నుండెడిదట. కొమరగిరిరెడ్డికి ననపోతరెడ్డియని కొడుకుండెను. నామ మాత్రము తప్ప నాతని గూర్చి యేమియు నెఱుఁగరాదు. ఒక ద్రాక్షా రామశాసనమున "శ్రీ మత్కుమారగిరి భూమిపతేః కుమారో వీరాన్న పోతనృపతిః" అని కలదు. తర్వాతరాయి పగిలిపోయినది.

## కాటయ వేమన

ఈ కాటయవేమనవంశవృత్తాంత మిది:-

శ్లో. నప్తా కాటయశౌరేః పౌత్రో మారవ్య కాటనృపసూనుః
వీరాన్నపోతనృపతే ర్జామాతా జయతి వేమభూపాలః

ఈతఁడు కాటయకునప్త, మారయకుఁ బౌత్త్రుఁడు, కాటయకుఁ బుత్త్రుఁడు, అనపోతనృపాలున కల్లుఁడు. తల్లాంబిక దొడ్డాంబిక మల్లాంబిక యని యీతనికి ముగ్గురుభార్యలు తెలియవచ్చుచున్నారు. తల్లాంబిక యందుఁ గుమారగిరియని కుమారుని, దొడ్డాంబికయం దనితల్లియని కుమార్తెను గాటయవేమన కాంచినాఁడు. మల్లాంబికకు సంతానము కలదో లేదో తెలియదు ఆమె కన్నిభదేవరాయని కుమార్తెయు ముక్కంటిరాజు తోఁబుట్టువనటఁనాయూహ న్యాయ్యమగు నేని కాటయవేమునకు హరిహరరాయలకూఁతు రింకొకతె కూడ భార్య యగును. కాటయవేమన శూరుఁడు. విద్వద్గోష్ఠీప్రియుఁడు. స్వయము విద్వాంసుఁడు కాళిదాసకృతనాటకత్రయమునకుఁ గుమారగిరిరాజీయ మనుపేర నీతఁడు వ్యాఖ్యరచించెను.

శ్లో. తత్రోక్తేనైవ మార్గేణ దర్శితా శేషలక్షణమ్
కవీనా మాశ్రయో మంత్రీ కాటభూపతసూభవః

శ్లో. సో౽యం వేమవిభుః కుమారగిరిణా రాజ్ఞా నియుక్తః కృతీ
నాట్యానాం త్రితయం కృతంకృతధియా శ్రీకాళిదాసేన యత్
తస్యోద్దీర్ణరసాశ్రయస్య రసికః శ్శాకుంతలాదేస్స్వయం
వ్యాఖ్యానం కురుతే కుమారగిరిరాజీయాఖ్య మస్మై హితం.

ఈతనిఁ గూర్చి చెప్పఁబడిన పద్య మిది యొకటి:-

క వెలయాలు శిశువు నల్లుఁడు
విలయేలిక యాచకుండు నేగురు ధరలోఁ
గలిమియు లేమియుఁ దలఁపరు
కలియుగమునఁ గీర్తిగామ కాటయవేమా!

ఈయనయొద్దనే రాయనభాస్కరుఁడు మంత్రిగా నున్నట్టు చాటు పద్యము చాటుచున్నది. ఆ పద్యమిది:-

ఉ. కలయఁ బసిండిగంటమునఁ గాటయవేమనమక్షమందు స
త్ఫలముగ రాయనప్రభునిబాచఁడు వ్రాసినవ్రాలమ్రోఁతలున్
గలుగలుగల్లుగల్లురనఁ గంటకమంత్రుల గుండె లన్నియున్
జలుజలుజల్లుజల్లురను వక్కవినర్యుల మేలుమేలనన్.

కొమరగిరికాలమునఁ గాటయవేమారెడ్డి శూరాగ్రేసరుఁడై పూర్వదేశమును హెచ్చుగా జయించి యార్జించెను. అతఁడు జయించిన దుర్గములను శాకుంతలవ్యాఖ్యానమున నీ క్రింది శ్లోకము తెలుపుచున్నది.

శ్లో. ధాటీఘోటిఖురాగ్రత్రుటితగిరితటే యత్ర మాక్లేదిదుర్గం?
దుర్గంకిమ్మూరుపంజ్జుం దశితరిపుబలే దుర్గమం బెండపూడిమ్

శృంగ రశ్రీనాథము

దుర్భేదం వజ్రకూటం జితవతిరభసా రామగిర్యాఖ్యదుర్గం
విఖ్యాతం వీరఘోట్టం గళితమసుహృదాం దుర్గవన్నాహదార్ఢ్యమ్.

శ్లో. రాజవేశ్యాభుజంగ శ్రీకుమారగిరిభూపతేః
శక్తి కాటయవేమస్య ప్రగల్భా తత్ర్తి దూతికా.

కాటయవేముశాసనము లనేకములు పిఠాపురము పెద్దాపురము ప్రాంతముల దున్నవి. ఈతఁడు రెడ్డిరాజ్యమును మిక్కిలి పెంపొందించినవాఁడు. జయింపఁబడిన యాక్రాంతదేశమునకుఁ బరిపాలన సౌకర్యము కోరి యప్పుడు కాటయవేమకొమరగిరులు 'అనవేమ క్షితిపాలపౌత్రీపతి' యగునల్లాడరెడ్డిని రాజమహేంద్రవరమునఁ దమ ప్రతినిధినిగా నిలిపిరి. అతఁ డక్కడ పాలించుచుండెను. తర్వాతఁ గొంతకాలమునకుఁ గొండవీట నేదో కల్లోలము పెదకోమటివేమాదుల మూలమునఁ గలుగుటచేతనో కొమరగిరి వృద్ధుఁడగుటచేతనో కాటయ వేమన కొండవీడు వీడనాడి రాజమహేంద్రవరము వచ్చిచేరెను. తన్ను సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి రాజ్యమును జక్కఁగాఁ గాపాడి పెట్టినందులకుఁ గొమరగిరిరెడ్డి రాజమహేంద్రవరరాజ్యమును గాటయ వేమనకుఁ బారితోషకముగా నిచ్చెనని శక. 1383 సం॥ తొత్తరమూఁడి తామ్రశాసనము చెప్పుచున్నది.

శ్లో. ఆసీ దమాత్యరత్నం కాటయవేమప్రభు ప్రస్య
అతిసురగురుభార్గవమతి రతి భార్గవవిజయ విజయవిఖ్యాతః

శ్లో. సింహాసనే విధాయాసౌ కుమారగిరిభూవరమ్
ఆతేజయ న్మహాతేజా శ్రీకృష్ణఇవ ధర్మజమ్
కుమారగిరిభూనాథో యస్మై విక్రమతోషితః
ప్రాదా ద్ప్రాచీం భువం రాజమహేంద్రనగరీముఖామ్.

కాటయవేముఁడు తన కుమార్తెయగు ననితల్లి నల్లాడరెడ్డి రెండవకుమారుఁడగు వీరభద్రారెడ్డి కిచ్చి వివాహముచేసెను. మఱియు నల్లయ వేమునకుఁగూడఁ దనపుత్త్రి (పౌత్త్రి యనుట తప్పుగాఁ దోఁచుచున్నది.) ని హరిహరాంబ నిచ్చి పెండ్లిచేసెను. కావునఁ గాటయవేమనయు నల్లారెడ్డియు నాతని పుత్రులును గలసి రాజ మహేంద్రవరమున రాచఱికము నెఱపుచుండిరి. కాటయవేమన కొంచెె మించుమించుగా క్రీ. 1416లోఁ జనిపోయెను. అతర్వాత నితని కుమారుఁడు కొమరగిరి రాజయ్యెనుగాని కొలదిదినములకే యాతఁ డును స్వర్గస్థుఁడయ్యెను. ఆ కొమరగిరి బాలుఁడుగాఁడు వివాహితుఁడే. అనంతర మనితల్లి మూలమున రాజ్యమును వీరభద్రారెడ్డికి సంక్ర మింపఁ జేసి యల్లారెడ్డియుఁ దత్పుత్త్రులును బరిపాలనము నెఱపిరి. రాజ మహేంద్రవరమున రెడ్డిరాజ్యవేర్పడిన క్రమమిది. ఇంక గొంద వీటిరాజ్యప్రశంస కొంత తెలుపవలసియున్నది. కొమరగిరి క్రీ. 1400, 1403 వఱకు రాజ్యమేలెను. అతఁ డటుతర్వాతఁగూడ నాల్గయిదేండ్లు జీవించియున్నట్టున్నాఁడు. ఆతనికి ననపోతరెడ్డి యను కొడుకు పుట్టినట్టు న్నాఁడనికూడ నీవఱకే వ్రాసితిని.

## పెదకోమటి వేమారెడ్డి.

కొమరగిరిరెడ్డి తర్వాతఁ గొండవీటిరాజ్యమునకుఁ గోమటి వేమారెడ్డి రాజయ్యెను. జ్యేష్ఠానుక్రమమునఁ గొమరగిరి జ్ఞాతులలో నీతఁడే ముఖ్యుఁడగును. ప్రోలయవేమన యన్నయగు మాచారెడ్డి కీతఁడు మనుమఁడు. ఈతఁడు మిక్కిలి విద్యారసికుఁడు. విద్వాంసుఁడు. ప్రఖ్యాతకవీశ్వరుల నాదరించి శాశ్వతకీర్తి నార్జించుకొన్నవాఁడు. సర్వజ్ఞచక్రవర్తియని వీరనారాయణుఁడని యాతని బిరుదులు.

శృంగారశ్రీనాథము

ఈతఁడు రాజ్యమునకు వచ్చిన తర్వాతఁ దనతమ్ముఁడగు మాచారెడ్డికిఁ గొండపల్లిరాజ్యముఁ గొంత పంచియిచ్చి యక్కడకుఁ బంపెను. కోమటివేమారెడ్డికి వెల్గోటివెలమ రాజులతోడను రాజమహేంద్రపుర మేలుచున్న యల్లయవేమాదులతోడను గజపతి (ఓడ్ర — ఒడ్డె) రాజులతోడను విరోధము మిక్కిలి చిక్కు గల్గించుచుండెను. కాటయవేమనయుఁ దత్పుత్త్రుఁడును స్వర్గస్థులయినపిదప నీతఁడు రాజమహేంద్రివర రాజ్యమితనకు రాఁదగినదని యల్లయవేమాదుల మీఁదికి యుద్ధమునకుఁ బోయెను. ఆ యుద్ధమున నల్లారెడ్డియు నాతని పుత్త్రులును నీతని సైన్యము నోడఁగొట్టిరి. ఈ విషయము రెండుమూఁడు శాసనములందును. శివలీలావిలాసమునందును జెప్పఁబడినది.

వెల్గోటిరాజగు పినవేదగిరినేఁడు తనతమ్ముఁడగు మాచారెడ్డి నోడించి యాతనిరూపమును దమ్మపడిగలోఁ దాఁపించుకొనఁగా నీతఁడు "ఘోరముగాఁ బోరుసలిపి యాపినవేదగిరినేనిం జంపి యాతనితల తనతమ్మపడిగలోఁ బొదిగించుకొనెను. అంత నా పినవేదగిరినేని తమ్ముఁడు లింగమనేఁడు ద్వాదశవర్షంబుల వాఁడై యుండియు బంధుహితపరిజనములం గూర్చుకొని యమరులకు వెక్కసంబగుయుద్ధంబు సల్పి కోమటివేమారెడ్డి నోడించి తనతమ్మపడిగం బొదిగించుకొనె" నట. మఱియు నందికంతపోతురాజను రెడ్లకఠారినిగూడఁ గొనిపోయెనట! ఈవిషయము ముందు విస్పష్టముగాఁ దెలియఁగలదు. ఈ లింగమనేఁడు కొమటివేమారెడ్డికే కాక, రాజమహేంద్రివరమున రాజ్యమేలిన యల్లయవేమవీరభద్రారెడ్లకుఁ గూడఁ బ్రబలవిరోధియైనవాఁడు. రాజమహేంద్రివరమున నీతఁడు కొల్లలాడినాఁడట. వెలిగోటివారి వంశ చరిత్రలందలివి యీసందర్భమును సూచించు

పద్యములు గొన్ని యనుబంధమునఁ జూడఁదగును. కోమటివేమా రెడ్డియాస్థానముననే శ్రీనాథకవీశ్వరుఁ డున్న వాఁడు గావున ముందాతని రాచరికముఁగూర్చి విస్తారముగాఁ దెలుపఁబడును. ఈతఁడు క్రీ. 1420 వఱకు రాజ్యమేలె నని యీవఱకే తెల్పియున్నాఁడను. ఈతనితర్వాత నీతని కుమారుఁడగు రాచవేమన నాల్గువత్సరములకంటె నెక్కువకాలము రాచరికపుభాగ్య మనుభవింపలేకపోయెను. అతఁడు మిక్కిలి దుష్టుఁడట! భృత్యు డొకఁ డశ్వారూఢుఁడై నగరిలోనికి వచ్చినాఁ డన్న కారణమున నీతఁడు వానినిఁ జంపించెనట!. కొంత వఱకుఁ బ్రజలే యీతనిని హింసించిరి. రాజమహేంద్రివర మందున్న వేమవీరభద్రారెడ్లు తద్రాజ్యమును గొంత యాక్రమించుకొనిరి. విద్యానగరప్రభువులు గొంత యాక్రమించుకొనిరి. కొండవీటఁ గూలినపిదప మఱి ముప్పదియేండ్లకు రాజమహేంద్రివరమునఁ గూడ రెడ్డిరాజ్యము వేమవీరభద్రారెడ్లతోనే యంతరించినది.

## రెడ్డిరాజులయోగ్యత.

ప్రఖ్యాతముగా రెడ్డిరాజు లంధ్రదేశమును బరిపాలించినది నూఱేండ్లుమాత్రమేయైనను వారు ప్రజలకుఁ బరమప్రేమ పాత్రులయి యఖండయశము నార్జించిరి. కృతికర్తలైరి. కృతిపతులైరి. ఆంధ్రభాష యున్నంతకాలము, నెఱ్ఱాప్రెగ్గడ శ్రీనాథకవులకావ్యము లున్నంతకాలము రెడ్డిరాజులకీర్తి కీర్తిత మగుచునే యుండును. కోమటివేమారెడ్డికృతులు సాహిత్యచింతామణ్యాదులిఁక ముద్రితములు కావలసియున్నవి. ఫల భరితమయిన కృష్ణాగోదవరీప్రాంతదేశ మీ రెడ్డిరాజులు పరిపాలించిరి. వీరి పాలనము తురుష్కులకు గజపతులకు విజయనగరకర్ణాటప్రభువులకును గన్నెఱ్ఱగలిగించునదిగానుండెను.

అఖండశివపూజాధురంధరులయి పీ రాముష్మికతత్పరులుగా నుండిరి. అనవేమారెడ్డి షట్కాలములందు శివపూజసల్పుచుండెడివాడట! కృష్ణా గోదావరీగుంటూరుమండలములందు నేఁడాగ్రహారికులుగా నుండువా రనేకులు నాఁడు రెడ్డిరాజులవలన నగ్రహారములు వడసిన వారిసంత తులవా రగుదురు. అసామాన్యములయిన ధర్మకార్యములను వారాచ రించిరి. శ్రీశైలాహోబలగిరి సోపాన నిర్మాణము, అమరేశ్వర పునః ప్రతిష్ఠ, అగ్రహార ప్రదానములు, సంతానసాగరాదితటాక నిర్మాణములు పేర్కొనవచ్చును. రెడ్డిరాజులపేళ్ళుగల గ్రామము లనేకము లున్నవి. పారంపర్యముగా వారిపేళ్ళు పెట్టుకొనుచున్న కుటుంబములవారు నేఁడు న్నారు.సవిస్తరముగా వారిచరిత్ర సమగ్రముగా సమకూర్పఁ దగినది. అనుప్రసక్తమగుటచే నిక్కడ నధికముగా వ్రాయవెఱచుచున్నాను. ఈ రెడ్డిరాజులపరంపరలోనివా రిప్పు డెవరగుదురో యెఱుఁగరాదు. నెల్లూరు మండలమునఁ గాటమరెడ్డి యని ఇంటిపేరుగలవారున్నారు. వారు మనకాటయ వేమారెడ్డివంశమువా రగుదురేమో! ఇప్పటికి నేను రెడ్డి రాజులలో ప్రధానముగా రాజ్యమేలిన వారిచరిత్రమునే పేర్కొంటిని. అనుబంధమున వారి వంశవృక్షము చూడఁదగును. చాటుధారయొకటి రెడ్డిరాజులపరిపాలనాక్రమమును దెల్పునది కలదు. శాసనములఁబట్టి చూడఁగా దానిలోని కాలక్రమమును కొంత తప్పుచున్నది.

# శృంగార శ్రీనాథము

## తృతీయ ప్రకరణము

సీ. విద్యాధికార్యన్న । తోద్యోగము సహించెఁ
బోషిధిచెవిద్యావి । శేషములను,
బహుదేశబుధుల వి । ద్వత్త్వ పరీక్షించె
సంతరించెను ధర్మ । శాసనములు,
రచియించె నైషధ । ప్రముఖ ప్రబంధముల్
పైరిపాలైన క । టారిఁదెచ్చె,
అఖిలపురాణ వి । ద్యార్థంబు లెఱిఁగించె
వెదచల్లె దశదిశల్ । విశదయశము

గీ. విక్రమాఢ్యుండు సర్వజ్ఞ । చక్రవర్తి
వీరనారాయణుఁడు వేమ । విభుని సభను
విర్విఘాతంబుగా నెవ్వఁ । డిర్వదేండ్లు,
అతని నుతియింతు "సకల వి। ద్యాసనాథు॥"

### రాజాశ్రయము.

శ్రీనాథుఁడు పదునై దేండ్లప్రాయమునకే సంస్కృతాంధ్రము లందుఁ జక్కనిసాహిత్యశక్తిని సఖండమగు కవితా శక్తిని నార్జించు కొన్నవాఁ డయినాఁడు. "నిరాశ్రయాన శోభంతే పండితా వనితా లతాః" అన్నట్టును,

చ. ఆపనిపుఁ డాదరించిన భటాళిభటత్వము వైద్యువైద్యమున్
గవికవితామహత్త్వమును గాయకుగానముఁ గోటిసేయు న
య్యవనిపుఁ డాదరింపని భటాళిభటత్వము వైద్యువైద్యమున్
గవికవితామహత్త్వమును గాయకుగానము గవ్వసేయునే।

అన్నట్లును, రాజాశ్రయము లేక యశోధనములు సమకూఱనేరవని యా కాలమునఁ బెనుపుగల్గి రాజ్యమేలుచున్న స్వదేశప్రభువులగు రెడ్ల ప్రాపునకై యప్పుడు రాజధానిగా నున్న కొండవీడు చేరెను. రెడ్లకు మంత్రులును గార్యనిర్వాహకులును నగు నియోగిప్రముఖుల యాదర గౌరవములు వడయఁజొచ్చెను. తర్వాత రెడ్ల యాస్థానమున విద్వత్కవియయ్యెను.

కాటయవేమన కొండవీట నున్నకాలముననే, కొమరగిరి జీవించియుండఁగనే శ్రీనాథకవిరత్నము కొండవీటికి వచ్చుచుఁబోవుచు నుండియుండునని నా తలఁపు కాటయవేమన క్రీ.శ. 1398 ప్రాంతముల రాజమహేంద్రవరము చేరినాఁడు. విద్యారసికుఁడగు కాటయవేమన నాకాలమం దీతఁడు దర్శించి యుండవచ్చును. సకల విద్యాసనాథుఁడగుచున్న యీ ప్రతిభాశాలి నాతఁ డాదరించియు నుండవచ్చును. ''కవీనా మాశ్రయః'' అని కాటయవేమన వర్ణింపఁబడెను. అతని నాశ్రయించినకవులలో శ్రీనాథుఁడుకూడ నొక్కఁడు కాఁదగును. శ్రీనాథుఁ డవసానకాలమునఁ జెప్పుకొన్నపద్యమున ''భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగె'' ననికలదు. కావున నాతనికి భాస్కరుఁ డనునాతఁ డొకఁ డాలంబమై యుండెననియు నాతఁ డందఱకుముందే స్వర్గస్థుఁ డయ్యెననియుఁ దెలియుచున్నది. భాస్కరుఁ డనిపేరుగల మంత్రిశేఖరుఁడు కాటయవేమునాస్థానమున నుండెడువాఁడని యింతకుముందే

తెల్పితిని. 'కలయఁ బసిండిగంటమున'నని యారంభముగల యాచాటు పద్యము శ్రీనాథునిదిగాఁ దలఁచుచున్నాఁడను. ''పసిఁడి గంటావ భూపాలు పార్శ్వసీమ" నని యట్టి దింకొకపద్యము భీమఖండమందున్నది. కాటయవేమారెడ్డి కాలమునసున్న యారాయన భాస్కరుఁ డీతని నెట్లాదరించినాఁడో యాతనిపేరనీకవీశ్వరుఁ డేమేని కృతులు రచించినాఁడో యెఱుఁగరాదు.

## గ్రంథరచనము

కొండవీడు చేరునప్పటి కీతఁడు గ్రంథరచనము చేయఁజాలి యున్నాఁడు. కాశీఖండమందలి యీ క్రింది పద్యమువలన నాతఁడు రచించిన గ్రంథములయానుపూర్వి కొంత తెలియనగును:

సీ. చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిండుజవ్వనంబున యందు
హర్షనైషధకావ్య మాంధ్రభాష
ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమ

గీ. ప్రాయమింతకు మిగులఁ గైవ్రాలకుండ
గాశికాఖండమను మహాగ్రంథ మేను
దెనుఁగుచేసెద కర్ణాట దేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

ఈ పద్యమున నాతఁడు కొన్నిప్రధానగ్రంథములను మాత్రమే

పేర్కొన్నాఁడు, ఇవిగాక మఱికొన్నికృతు లాతనివికలవు. హరవిలాస పండితారాధ్యచరిత్రాదు లట్టివి.

మరుత్తరాట్చరిత్రము.

"చిన్నారి పొన్నారి చిఱుతకూకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర." ఈ ప్రాయ మించుమించు పదుమూఁడు పదునాఱు సంవత్సరముల నడిమి ప్రాయముగాఁ దలంపనగును. మరుత్తరాట్చరిత్రము తొలుతటి యభ్యాసకృతి యయినను గడపటికాశీఖండమునఁ బేర్కొన బడుటచే నది యాతనిమనసునకు నచ్చినప్రబంధమే యగును. ఎవ్వరికిఁ గృతియిచ్చినాఁడో యెఱుఁగరాదు. ఇప్పుడది దుర్లభమయినది. తఱచుగా నీతనికృతులు సంస్కృత గ్రంథానువాదములే, కాని యిది యట్టిదిగాఁ దోఁపదు.

శాలివాహన సప్తశతి.

'నూనూఁగు మీసాల నూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి.'' ఇది పదునేడు, ఇరువది సంవత్సరముల నడిమిప్రాయము కాఁదగును. శాలి (సాత) వాహనసప్తశతి ప్రాకృతభాషాత్మకమగుసంసోత్తరశృంగారప్రబంధము. సాతవాహనుఁడను నొకరాజుచేనిర్వహింపఁ బడినది. దీనికే "గాథాసప్తశతి'' యని నామాంతరము. ఈ గ్రంథమున నేడ్నూఱు గాథలు (ప్రాకృతార్యలు) గలవు. కథావస్తు సూత్రితములు గాక యీగాథలు నానావిధ నాయికా నాయకాదుల శృంగార వృత్తులను జమత్కరించుచు భిన్నభిన్నములుగా నున్నవి. శృంగార రసము వీనియందుఁ బొర్లిపోవుచుండును. కొన్నిలోకవృత్తము దెలుపు గాథలును గలవు. పద్యములు మిక్కిలిచిన్నవియైనను భావ పూరితములు. తన ప్రాయమునకుం బ్రవర్తనమునకు ననురూపముగా శ్రీనాథుఁడీకావ్యము నీవయస్సునఁ దెనుఁగునకుఁ దార్చెను. ఎవ్వరి

ప్రేరణమున రచియించెనో యేవి విశేషము లాక్షేపముఖమున వెల్ల డించెనో యెఱుఁగరాదు. ఈ గ్రంథమును లభింపకున్నది. ఒకపద్యము మాత్రము లక్షణగ్రంథములందుఁ గానవచ్చుచున్నది.

ఉ. వారణసేయ దావగొనవా నవవారిజమందుఁ దేఁటి కొ్రి
వ్వాఱుచునుంట నీవెఱుఁగవా ప్రియ హా తెఱగంటి గంటి కె
వ్వారికిఁ గెంపురాదు తగవా మగవారల దూఱ నీవిభుం
డారసి నీనిజం బెఱుఁగునంతకు నంతకు నోర్వ నెచ్చెలీ!

కోమటి వేమభూపాలుఁడీ గ్రంథమును జెప్పించుకొని యుండు నని తలంచెదను. ఈసాతవాహనసప్తశతికా కోమటివేమారెడ్డియేవ్యాఖ్యా తయగుట పైయూహకు సాధకము. అమరుశతకవ్యాఖ్యాతృత్వము కూడ సాధకమే యగును. శ్రీనాథుని నూనూఁగుమీసాల నూత్నయౌవ నమునాఁటికిఁ బెద్దకోమటివేమారెడ్డి రాజ్యమునకు వచ్చినాఁడు. ఈ కాలముననే శ్రీనాథుఁడు విద్యాధికారిపదము నందినాఁడు.

## పండితారాధ్య చరితము.

నిండుజవ్వనము రాకపూర్వము, శృంగారనైషధము రచింపక పూర్వము శ్రీనాథుఁడుపండితారాధ్యచరిత్రము రచించినాఁడు. శృంగార నైషధకృతిపతియగు మామిడి సింగన్న కన్నయయిన పెద్దయ్యకు దానిని గృతి యిచ్చినాఁడు. అతనికి మఱికొన్నికృతులనుగూడ నిచ్చి నాఁడట. అవి యేవో!

పండితారాధ్యచరితము తొలుతఁ బాల్కురికి సోమనాథకవీశ్వ రునిచే ద్విపదకావ్యముగా రచింపఁబడినది. శివతత్త్వసారకర్తయగు మల్లికార్జున పండితారాధ్యుని చరిత్రమిందు వర్ణింపఁబడెను. సంస్కృత

భాషయందు వ్యాసుఁడు పురాణ కల్పకుఁడైనవిధమున నంధ్రభాష యందుఁ బాల్కురికి సోమనాథారాధ్యుఁడు వీరశైవపురాణకల్పకుఁ డయ్యెను. సంస్కృతమున ననుష్టుప్పు పౌసఁగిన ట్లేతఁడు తెలుఁగున ద్విపదపౌసఁగునని గుర్తించి, తనపురాణములను ద్విపద రూపముననే రచియించెను. ఈతఁ డొకదొడ్డకవి. తొల్లింటి తెలుఁగుఁ బల్కుబళ్లిక శ్లేషవిశిష్టములందు మిక్కిలిగానెక్కొనియున్నవి. ఈతనిపండితారాధ్య చరితము ననుసరించి శ్రీనాథుఁడు పండితారాధ్యచరితను బద్యకావ్య ముగా రచించెను. సోమనాథునిరచనములు శ్రీనాథునిరచనములందుఁ బొందుబడినవట! ఈ విషయమును బద్యబసవపురాణకర్త పిడుపర్తి సోమనాథుఁడు చెప్పినాఁడు. శ్రీనాథకవి యెంతశృంగారియైనను జిఱుతనాఁటనుండియు శైవమతాసక్తిగల్గియే యుండెననుటకీ పండితా రాధ్యచరిత్రరచన మొకతార్కాణము.

## పెదకోమటి వేముని వైదుష్యము.

రాజు రసికుఁడయినగాని కవులఘనత వెల్లడికాదు. శ్రీనాథుని ప్రతిభాప్రఖ్యాతికిఁ బెద్దకోమటివేమునివిద్యారసికత ప్రథానకారణము. ఆతఁడు సంస్కృతప్రాకృతాంధ్రభాషలలో మంచి పాండిత్యముగల వాఁడుగాఁ దెలియుచున్నాఁడు. మఱియు సాహిత్యవిద్యయందేగాక సంగీతవిద్యయందుఁగూడ విశేషపరిజ్ఞానము గలవాఁడు. పెక్కు గ్రంథములను జెప్పినవాఁడు. చెప్పించుకొన్నవాఁడు. సర్వజ్ఞచక్ర వర్తియని శ్రీనాథాదికవీశ్వరులచేఁ బొగడ్తగన్నవాఁడు.

శ్లో. చూడామణి ర్నృపాణాం
దుర్మదపరిపంథి శిఖరిదంభోళిః॥

సర్వజ్ఞ, చక్రవర్తి
పెదకోమటి వేమభూపతి ర్జయతి.

ఈశ్లోకము శ్రీనాథుని శాసనకృతియందేగాక వామనభట్ట బాణుని వేమభూపాలచరిత మను నాఖ్యాయికయందుఁగూడఁ గలదు. రాచకొండ రాజధానిగా రాజ్యమేలిన వెలమరాజులకును గొండవీటి రెడ్డిరాజులకును బలవిరోధమని ముందే చెప్పితిని. వా రొండొరు లను మీఱి కీర్తిప్రతాప యశస్సుల నార్జింప యత్నించుచుండిరి. రాచ కొండ వెలమసరరాజు సర్వజ్ఞబిరుద మందగాఁ గొండవీటి రెడ్డిరాజు సర్వజ్ఞచక్రవర్తి బిరుద మందెను. వారు రసార్ణవసుధాకరాది గ్రంథ కర్తలయిరి. వీరు వసంతరాజీయ, సాహిత్యచింతామణ్యాదిగ్రంథకర్త లయిరి. వారు సంగీతసాహిత్యచతురులు. వీరు సంగీతసాహిత్య చతు రులు. వారు కృతిపతులు. వీరు కృతిపతులు. వారు బహుపండితుల నాదరించిరి. వీరుబహుపండితుల నాదరించిరి. ఆస్థాన కవియైశ్రీనాథుఁడు రెడ్డిరాజుల కఖండగౌరవము వెలయించెను. అంతటివాఁడు పోత రాజు వెలమరాజుల యాస్థానమందున్నాఁడుగాని యానిస్పృహుఁడు నరస్తుతివిముఖుఁడై వారిగౌరవాదరములనుగోరఁడయ్యెను. వారిస్పర్థలు యుద్ధములు నాఁడే యంతరించినవిగాని వైదుష్యవిఖ్యాతిమాత్ర మక్షర రూపమై యలరారుచున్నది. సంస్కృతమునఁ బెదకోమటివేమన యనేక కృతులు రచించెను.

పెదకోమటివేమారెడ్డి కృతులు.

శృంగారదీపిక :- రసోత్తర శృంగారగ్రంథముగా గణుతిగన్న యమరుశతకమున కిది వ్యాఖ్య. ఆశతకమునకు మఱికొన్నివ్యాఖ్య లున్నవిగాని యీవ్యాఖ్యకే ప్రచారము మెండు. ఇది విపులమైన చక్కని

వ్యాఖ్యానము. దీని పీఠికలో నిట్లున్నది: "సకల విద్యలం దతిప్రగల్భుఁడును జగనొబ్బగండాకుఁడునగు నావేమభూపాలుఁ డొకప్పు డాస్థానగతుఁడై కవీశ్వరులకావ్యామృతము నాస్వాదించుచుండెను. అమరుకకవి రచించిన శృంగారశతకమును విన్నవాఁడై యప్పుడు వ్యాఖ్యానరచనముచే దాని యభిప్రాయమును వెల్లడించుట కుత్సాహము చెందెను." ఈ వ్యాఖ్యపీఠికలో రెడ్ల ప్రాచీనశాసనకృతులలోని శ్లోకములు కొన్ని కైకొనఁబడినవి. పొసఁగినంతవఱకుఁ దమపూర్వుల శాసన శ్లోకముల నర్వాచీనులు శాసనములందుఁ జేర్పించు కొనుట సంప్రదాయముగాఁ బ్రాచీనరాజశాసనములందుఁ గానవచ్చును. ఇదియు నట్టిదనవచ్చును. కాని సమకాలపు శ్రీనాథుని శాసనకృతుల లోని శ్లోకములుగూడ నీపీఠికలోఁ గలవు. ఈ గ్రంథరచనమున శ్రీనాథునితోడ్పా టుండెనేమో!

సప్తశతీసారటీక:- శ్రీనాథుఁడీయంధ్రసప్తశతినిగూర్చి వ్రాయు నప్పు డించుక దీనిఁ బ్రస్తావించితిని. సాతవాహన (హాల) నృపతి సంధానించిన యేణ్ణూఱుగాథలలో సారమనఁదగు నూఱుగాథలనేఱి కోమటివేమారెడ్డి వ్యాఖ్యచేసినాఁడు. వ్యాఖ్యారంభ మిట్లున్నది:

"శ్లో. హాలః ప్రాక్ సప్తశతీం గాథాకోటే ర్వ్యధత్త సంప్రతితు
సోయం వేమనృపాల స్తస్యాఅపి శతక మాహర త్సారమ్॥

గద్యము. ఇతిశ్రీ పెదకోమటివేమభూపాలేన కృతా సప్తశతీ సారటీకా సమాప్తా."

ఈవ్యాఖ్యానరచనమునఁగూడ శ్రీనాథునితోడ్పాటు నాతఁడు పొందియుండవచ్చును. శ్రీనాథునియాంధ్రీకరణ మట్టి ప్రసక్తికలదను టకు సాధకము.

తృతీయప్రకరణము

సాహిత్యచింతామణి:- ఇది యలంకారశాస్త్రగ్రంథములలోఁ బేర్కొనఁదగిన యత్యుత్కృష్టగ్రంథము. కావ్యప్రకాశము వంటిది. ప్రతాపరుద్రీయవ్యాఖ్యాత కుమారస్వామిసోమపీథి దీని నుదాహరించినాఁడు, మహిమభట్టు ననుమానము నిది ఖండించును. ధ్వన్యాలోకాదుల నిది పరామర్శించును. అమరుశతక శ్లోకములు పెక్కిం దుదాహరింపఁబడినవి. మఱియు ననేక ప్రాచీనగ్రంథములలోని శ్లోకము లుదాహరింపఁబడినవి. "యథా మమైన భాణే" అనియుఁ, "యథావ మమైవకావ్యే వీరనారాయణచరితే" యనియుఁ బెక్కు శ్లోకము లుదాహరింపఁబడినవి. పెదకోమటివేమకృతులగు నాగ్రంథము లిప్పుడు తెలియరావు. వామనభట్టబాణువికృతి వీరనారాయణచరిత మను గద్యగ్రంథము గలదు. కాని యిం దుదాహరింపఁబడినది గద్యగ్రంథముకాదు. శ్లోకరూపమగు కావ్యము. ఎడనెడ వీరనారాయణ పెదకోమటి వేమభూపాలప్రశస్తిప్రస్తావశ్లోకములు పెక్కులుదాహరింపఁబడినవి. వీరనారాయణుఁడే గ్రంథకర్తయగునప్పుడు తనపొగడకుఁ దానే పాల్పడినవాఁ డగును. సమ్మానార్థమై వేమభూపాలు నాస్థానమునకు వచ్చిన యనేక కవీశ్వరులు చెప్పినప్రశంసా శ్లోకముల నిం దుదాహరించుకొన్నాఁడేమో! ఆయాయలంకారాదులకు లక్ష్యముగాఁ బ్రయత్నపూర్వకముగా రచింపఁబడినవిగా లే వాశ్లోకములు. ప్రతాపరుద్రీయరసగంగాధరాదులందలిశ్లోకము లట్టివి.

ఇంకను, "యథా కాదంబరీనాటకే" యని పెక్కుశ్లోకము లుదాహరింపఁబడినవి. ఆ కాందంబరీ నాటక మిప్పుడు క్రొత్తగా దొరకినది. దానికర్త నరసింహకవి. అతఁడువిశ్వనాథకవి తమ్ముఁడు. గంగాధరకవికొడుకు. ఈ నరసింహకవి పెదకోమటి వేమభూపాలునకుఁ గొంచెము పూర్వుఁ డగునని నేను దలంచుచున్నాఁడను. నర

సింహకవియన్న విశ్వనాథకవి సౌగంధికాపహరణ నాటకకర్త కావచ్చును. ఆతఁడగస్త్యకవిమేనల్లుఁడును, గాకతీయప్రతాపరుద్రదేవుని కాలమువాఁడును నని యాతని నాటకమువలనఁ దెలియుచున్నది.

మధురావిజయకావ్యకర్త్రియగు గంగాంబ పయి యగస్త్యుని గంగాధరుని విశ్వనాథుని స్తుతించినది. ఆమె విశ్వనాథుని శిష్యురాలగు నటున్నది. మధురావిజయగ్రంథారంభము చూడఁదగును. నరసింహకవి కాదంబరీనాటకము సాహిత్యచింతామణిలోఁ దఱచుగా నుదాహృతమగుటకుఁ గారణ మేదేని యుండవచ్చును. మఱియు "వేమక్షితీశో వృషమేకపాద" మిత్యాదిశ్లోకము శాసనకృతిగతము దీన నుదాహరింపఁబడినది.

ఈక్రింది శ్లోకము సాహిత్యచింతామణిలోనున్నది;

శ్లో॥ ఆటోపాయనటన్మహావటజటావంఘూట శృంగాటక
క్రోడాఘూటకరోటికోటరకుటీవాచాటవీచీఘటా।
అస్తు వ్యస్త టిసీవిశంకటతటీవాటీక వాటీభవ
ల్లాటీకోటిలలాటపాటలవటాపాటల్యపాటచ్చరీ॥

ఆటోపపదారంభముగలపద్యము లిట్టివి శ్రీనాథునివి పెక్కులు గలవు. భీమఖండమందలి యీక్రిందిపద్యమున నొక సమాసపదము మీఁది శ్లోకమందలిదే కలదు:

శా. ఆడెం దాండవమార్భటీపటహలీలాటోపవిస్ఫూర్జిత
క్రీడాండ బర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడాఘూటకరోటికోటరకుటీకోటీలుఠత్సింధుపీ
చీడోలావటలీవరిస్ఫుటతరస్ఫీతధ్వనిప్రౌఢిమన్.

ఈ శ్లోకమును జదువుఁడు : "వాణీనఖముఖముఖరిత వీణా మాధుర్యధుర్యవాగ్వ్యక్తిః। ధ్వన్యధ్వన్యకధ్వాన్యః పెదకోమటి వేమ భూపతి ర్జయతి." హరవిలాసమందలి యీ పద్యమును గూడఁ జదువుఁడు : క॥ వాణిజ్యచణున కంతర్వాణిప్రస్తూయ మానవాగ్వి భవునకుఁ, వాణీనఖముఖముఖరిత వీణానిక్వాణ విభక విత్వఫణితికిఁ॥ సాహిత్య చింతామణిలో నుదాహరింపఁబడిన యొక శ్లోకమునకుఁ దెలిఁగింపుగా వల్లభరాయని పేర్వెట్టి శ్రీనాథుఁడే రచించిన క్రీడాభిరామమున నొక పద్యమున్నది. వానిని రెంటి నిక్కడఁ జూపఁజాలకున్నాఁడను. క్రీడాభిరామము రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామము ననుసరించి చెప్పఁబడినదిగావున నాశ్లోకము ప్రేమాభిరామమందలి దగునేమో!

ఇట్టి సంగతులచే నీ సాహిత్యచింతామణి రచనమునఁగూడ శ్రీనాథునిసాహాయ్యము కలదేమోయని నే ననుకొనుచున్నాఁడను.

సంగీతచింతామణి:- ఇది తిరువనంతపుర ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. తత్పుస్తకపట్టికలో పేరు మాత్రము చూచినాఁడను.

వీరనారాయణచరితము (భాణము): - సాహిత్య చింతామణిలో నుదాహరింపఁబడిన (యథామమైవ వీరనారాయణచరితే) యీభాణమును మఱొక (పేరేమో!) భాణమును దెలియరావు. పెదకోమటి వేమభూపాలునికృతు లింక నెన్ని యుండెనో?

## ఆస్థానకవీశ్వరులు.

వామనభట్టబాణుఁడు: - ఈతఁడు బహుగ్రంథకర్తయై ప్రసిద్ధిగన్నవాఁడు కొన్నియేండ్ల క్రిందటిదాఁకఁ గాదంబరీ హర్షచరిత్రములు

రచించిన బాణుఁడేతక్క వేఱొక్క బాణుఁడు లేఁడనియు, నుపలబ్ధము లగు నేతత్కృతులుగూడఁ దదీయములే యనియుఁ గొందఱు పొరఁ బడుచుండిరి. వామనభట్టబాణుని కృతులలో నిప్పుడు వేమభూపాల చరితమనునాఖ్యాయికయు రఘునాథాభ్యుదయము నలాభ్యుదయము నను కావ్యములును శబ్దరత్నాకరము శబ్దచంద్రిక యను నిఘంటువు లును, పార్వతీపరిణయ శృంగారభూషణము లను రూపకము లును హంససందేశమను ఖండకావ్యమును నేనుజూచినాఁడను. ఇంకను రెండుమూఁడు గ్రంథము లెఱుఁగవచ్చుచున్నవి. శబ్దచంద్రికా శబ్దరత్నా కరారంభములందు:....

శ్లో॥ విద్యారణ్యగురూన్ సార్వభౌమాద్యఖిలవక్పతీన్।
నమస్కృత్యాథ బాణేన క్రియతే శబ్దచంద్రికా॥

శ్లో॥ వరదాగ్నిచితః పౌత్రః పుత్రః కోమటియజ్వనః।
జాగర్తి వామనోబాణో వత్సవంశశిఖామణిః॥

అనికలదు. దీనిచే నీతఁడు విద్యారణ్యులకుశిష్యుఁడుగాఁ దెలియఁదగు చున్నాఁడు. సార్వభౌమకవియనఁగా శ్రీనాథుని ప్రత్యర్థియగు డిండిమ కవిసార్వభౌముఁ డగునేమో! శృంగారభూషణభాణము తుంగభద్రా తీరమున విరూపాక్షోత్సవమునందుఁ బ్రదర్శింపఁబడినట్టురచింపఁబడిన దగుటచే నీతని జన్మస్థలము విద్యానగరప్రాంతమోయని సంశయము కల్గుచున్నది. ప్రఖ్యాతుఁడగు భట్టబాణుని రచనములఁ బుడికి పుచ్చు కొని యీతఁడు గద్యరచనము నెఱవేర్చెను. అబాణుని తర్వాత నిపుణులగు గద్యకావ్యకర్తలు పొడచూపరైరను కొఱఁత నీతఁడు తీర్చెనట! గద్యకవిసార్వభౌముఁడని యీతని బిరుదు. ఈతనిప్రశస్తి యిట్టిది:–

శ్లో॥ సౌభాగ్యస్య విధి ద్రుతస్య వసతి ర్విద్యావధూనాం వరో
లక్ష్మ్యాః కేళిగృహం ప్రసూతిభవనం శీలస్య కీర్తేః పదమ్
విస్ఫూర్జన్నవికాసయా కవితయా జాగర్తి వత్సాన్వయ
శ్రీమాన్ వామనభట్టబాణసుకవి స్సాహిత్యచూడామణిః॥

శ్లో. గాథా స్తాథాగతానో దథతు వితథతాం తార్కికా స్తర్కవిద్భి
స్సత్రా స్సత్రాపమాద్యం ఫణిఫణితిజుషో వఃకృతం ప్రక్రియాభిః।
భూమ్నాం సాహిత్యసీమ్నా మధిభువి భువనే వామనే భట్టబాణే
దివ్యత్యస్మిన్ కవీంద్రే జహిత భోః కద్వదా విద్వదాస్థాం॥

వామనుఁడనునది పిన్ననాఁటిపేరని భట్టబాణుఁడనునది బిరుదు పేరని నేను దలంచుచున్నాఁడను. ఈబిరుదుపేరు వేమభూపాల రచరితమను నాఖ్యాయికను రచించుటచేతవచ్చినదిగావలయు. వేమభూపాలచరితమునకే వీరనారాయణచరిత మనియు నామాంతరము. పెదకోమటివేమభూపాలునిసాహిత్యచింతామణిరచనమున నీతనితోడ్పాటు కూడ నుండఁదగును. ఈ వేమభూపాలచరితమునఁ బెదకోమటివేమారెడ్డి చరిత్రము కల్పనబహుళముగా వర్ణింపఁబడినది. వాస్తవ చరిత్రమును గుర్తించుటకుఁదోడ్పడు విశేషాంశములంతగానందుఁ గానరావు. దాక్షా రామవేశ్యావర్ణన మెక్కువగా నందుఁ గలదు. గ్రంథాంతమందుఁ బెద కోమటి వేమారెడ్డి "సరసకవి కావ్య శ్రవణభూషణేన కర్ణౌ ప్రతిదిన మలంకుర్వన్" అని వర్ణింపఁబడినాఁడు. శ్రీనాథుఁ డాసరసకవులలో నగ్రగణ్యుఁడగునుగదా! మఱియు గ్రంథాంతమం దీశ్లోకమున్నది:-

శ్లో॥ సుగుణాలంకృతిసుభగా సుకృతిరియం భట్టబాణ భవదీయా
అధరయతి విధుతవఖముఖ ముఖరితవీణావినాదమాధుర్యమ్।

ఇది వామనభట్టబాణువిరచనము కాఁగూడదు. మఱొక కవియా తనిఁ బ్రశంసించుచుఁ జెప్పినది యగును. అది శ్రీనాథునిపద్యమని

నేను దలంచుచున్నాఁడను. ఇంతకుముం దుదాహరింపఁబడిన హర విలాసపద్యమే యీతలంపునకు సాధకము.

### మఱికొందఱు విద్వాంసులు.

కాదంబరీనాటకకర్త నరసింహకవి కొండవీడుప్రాంతముల వాఁడయి యుండవచ్చును. సాహిత్యచింతామణిలో నాతనినాటకము నుదాహరించుట యీయూహకు పోషకము. మఱియు నీవీరనారాయణు నిచే నగ్రహారములు వడసినవా రందఱు గొప్పవిద్వాంసులు. అందు భిషగ్వర్యులు దైవజ్ఞచూడామణులు గలరు. శాసనవిమర్శ సందర్భమున వారుతెలియవత్తురు. వారందఱుగూడ నీతనియాస్థానము నకు సంబంధించిన వారేయగుదురు. మఱియు నీతని మంత్రిశేఖ రుఁడగు మామిడి సింగనామాత్యుఁడుకూడ గొప్పవిద్వాంసుఁడే. జ్యోతిష సిద్ధాంతభాగమునం దతఁడు సంపూర్ణ పాండిత్యము కలవాఁడు. క్లిష్టార్థమగుసోమసిద్ధాంతమునకాతఁడు రచించినవ్యాఖ్యానము క్రొత్తగా నిప్పు డుపలబ్ధమయినది. తనవృత్తాంతము నాతఁ డిట్లుచెప్పుకొన్నాఁడు.

శ్లో. అస్తి శ్రీమద్భరద్వాజగోత్రే శ్రోత్రియభూషణమ్।
నప్తా శ్రీచిట్టయాఖ్యస్య పౌత్రో మామిడిమంత్రిణః
తనుజః పెద్దనార్యస్య శ్రీనృసింహో మహాయశాః
పెదకోమటివేమేంద్రమంత్రిణా తేన ధీమతా
జ్యోతిర్విద్యావిరాఘాటపరస్వత్పారదృశ్వనా
సింగయామాత్యరత్నేన భువి లోకహితైషిణా
క్రియతే సోమసిద్ధాంతవ్యాఖ్యా గూఢార్థదీపికా.

ఈ వ్యాఖ్యానము నీతఁడు క్రీ.శ. 1418 సంవత్సరమున రచించినట్టు చెప్పుకొన్నాఁడు.

## శ్రీనాథుఁడు - విద్యాధికారి.

ఇట్టివా రనేకు లాస్థానమున విద్వాంసులుగా నుండిరి. స్వయము పెద్దకోమటివేమారెడ్డి గొప్పవిద్వాంసుఁడయి సర్వజ్ఞచక్రవర్తియన్న బిరుదము కలిగియుండెను. ఇట్టిచోట మన శ్రీనాథకవి విద్యాధికారిగా నుండెను. విద్యాధికారియనఁగా డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ అనుపేర నిప్పుడాంగ్లేయ ప్రభుతలో నున్నయుద్యోగివంటివాఁడు. విద్యావిషయమున సర్వ కార్యములు నాతనియేర్పాటుప్రకారము జరుగుచుండును. ఇప్పుడును మైసూరు మొదలగుసంస్థానములందు "ధర్మాధికారి" మొదలగుపేళ్లతో నిట్టియుద్యోగు లున్నారు. ఆ పదమునకు సంబంధించినకార్యములన్నియు వారియేర్పాటుప్రకారమే జరుగుచుండును. అయినను నిప్పటి పరిపాలనావిధానము పరకీయ మగుటచే నట్టిపదములకు నాఁడున్నగౌరవము నేఁడు లేకున్నది. శ్రీనాథుఁ డా విద్యాధికార్యున్నతోద్యోగము వహించి యనేకవిధముల నార్యవిద్యల కానాఁ డభ్యుచ్ఛ్రయము చేకూర్చెను. ఆవేమారెడ్డి యాస్థానమునకు సమ్మానార్థమరుదెంచిన విద్వాంసుల ననేకులఁ బరీక్షించి యర్హసత్కారము లొదవింపఁ జేసెను. పెదకోమటివేమారెడ్డికాలమున నగ్రహారములు వడసినవిద్వాంసు లనేకులు గలరు. వారి కాయగ్రహారలాభములు మనశ్రీనాథుని యభ్యనుజ్ఞపయి నమకూడినవే. ఆ యీదానములఁ గూర్చి శాసనకృతులను శ్రీనాథుఁడే రచించుచుండెడివాఁడు. శాసనములకడపట నతఁడు "విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః" అని చెప్పుకొనెడువాఁడు. శ్రీనాథునకుఁ బూర్వ మాయుద్యోగమున బాలసరస్వతియను విద్వాంసుఁ డన్నపోతాన్నవేమరెడ్ల కాలమున నుండెడివాఁడు. కుమారగిరికాలమున నాయుద్యోగమం దెవ్వరుండిరో తెలియఁబడదు. విద్వాంసుఁడు కాటయవేముఁడే యుండెడివాఁడు గావలయు.

నానాదేశములనుండివచ్చుచుండెడి విద్వాంసులు ముందు విద్యాధికారి యగు శ్రీనాథుని దర్శించి తమవైదుష్యము నాతనికెఱుకపఱచుకొనెడి వారు. తర్వాత వారియర్హత నీ విద్యాధికారి రాజున కెఱింగించి సభా సన్నివేశాదికము కూర్పించి విద్యావినోదము నెఱపి సమ్మానాదికము జరిపించుచుండెడివాఁడు. ఈసందర్భమున నీతఁ డనేకవిద్వాంసు లతో భాషించెను. మఱియు ననేకవిద్వాంసులను బరీక్షించెను. ఇట్టిపని నిర్వర్తింపఁ దాటోటుపండితులకుఁ దరముగాదుగదా! వైదికులు, శ్రౌతులు, తార్కికులు, వైయాకరణులు, జ్యౌతిషికులు, భిషజులు, మాంత్రికులు, తాంత్రికులు మొదలుగా నెందరో విద్వాంసు లెన్నివిద్య లనో నేర్చినవారు వత్తురు. వారినందఱఁ బరీక్షించుట కాయావిద్య లలోఁ బ్రధానమయిన వానియందేని పరిపూర్ణపాండిత్య ముండితీఱ వలెను. ఇట్టు వివిధవిద్యలందు వైదుష్యముగడించిన విద్వాంసులను జక్కఁగా గుర్తించి యాదరించినవాఁ డగుటచేతఁగూడఁ బెదకోమటి వేమారెడ్డికి సర్వజ్ఞచక్రవర్తియన్నబిరుదము సంగతమయినది. ఒకకవి యాతనినిట్లు ప్రశంసించెను:—

శ్లో. జ్ఞాతా యది నహి దాతా
దాతాచేత్కోఽపి భువి నచజ్ఞాతా
జ్ఞాతా దాతా చాభూః
పెదకోమటి వేమభూపతే చిత్రమ్.

పెదకోమటివేమారెడ్డి పయివిధమునఁ బ్రిస్తుతికిఁ బాత్రిమై సర్వజ్ఞచక్రివర్తి కాఁగల్గుట కాతఁడు మనశ్రీనాథుని విద్యాధికారిగాఁ జేర్చుకొనుటయుఁ గారణము. ఈతఁ డాతని నట్టివానిగాఁ జేసెను. భీమ ఖండమందలి యీ క్రిందిపద్య మీయర్థమును నిరూపించుచున్నది:

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణవిద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకంబైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ వేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందు

గీ. పాకనాఁడింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభునిమనుమఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొకప్రబంధంబు నీవు
కలితగుణగణ్య! శ్రీనాథకవివరేణ్య!

స్వయము వేమభూపాలుఁడు విద్యాప్రియుఁడుగాన శ్రీనాథుని యుపదేశము లాతనిదగ్గఱఁ జక్కఁగా నెగ్గినవి. తత్పరిపాలనముగల దేశకాలములందు షట్తర్కముల నెఱిఁగినవారు, నాయుర్వేదము నేర్చినవారు, జ్యోతిశ్శాస్త్రజ్ఞులు, వైయాకరణులు, శ్రౌతులు, వేదవిదులు నూర్లలెక్క నుండెడివా రని శాసనములఁ బట్టి మన మెఱుఁగఁ గలము. శ్రీనాథునకిది నెఱజవ్వనపుంబొంగరుఁ బ్రాయము. ఈప్రాయమున శ్రీనాథుఁడు మహాదశ ననుభవించినాఁడు. కొండవీటి రెడ్డిరాజ్య మీతనిచేత నుండెడి దనవచ్చునుగదా! వైదుష్యప్రతిభాధార క్రొవ్వాఁడియై పదనుమీఱి మెఱయుచున్న ఈ కాలమున నీతఁడు స్వప్రజ్ఞా ప్రకటనార్థమై యేమేని దేశాటనము చేసెనేమోగాని ధనార్జనార్థమై చేసియుండఁడు. చేయవలసిన యావశ్యకతలేదు. ఇట్టి పండితప్రకాండు నితో నెడబాటు నట్టివిద్యాప్రియుడు, సర్వజ్ఞచక్రవర్తి సహింపఁ జాలఁడు. మఱియు సమ్మానార్థ మరుగుదెంచు పండితులనుపరిశీలిం

చుట రాజునకు వివిధవిద్యార్థుల నెఱిఁగించుట మొదలగు నుద్యోగ కృత్య మట్టితఁడపి నీయదు. పెదకోమటి వేమారెడ్డికాలమున శ్రీనాథుఁడు తనచేతిమీఁదుగా నెన్నోయగ్రహారముల నెందఱకో విద్వాంసుల కిప్పించినాఁడుగాని తానొక్కయగ్రహార మేనిగై కొన్నవాఁడు కాఁడు. అత్యంత పాభవముతో వీరనారాయణుఁడాదరించుచుండుటచే నీతనికట్టి యగ్రహారముల యావశ్యకతయే యప్పుడు లేకుండెను. "సుకవితా యద్యస్తి రాజ్యేన కి" మ్మనుసూక్తికిఁ దార్కాణమై యీతఁడు నెమ్మదితో నున్నాఁడు. భావికాలమై పరీక్షమును యోజించు నాతఁడు కాఁడు.

పెదకోమటి వేమారెడ్డి దాతృత్వమును గూర్చియుఁ బ్రతాపమును గూర్చియుఁ సంస్కృతాంధ్రములందుఁ జాటు పద్యములు పెక్కులున్నవి. ప్రసంగరత్నావళిలోఁ గొన్ని శ్లోకము లుదాహరింపఁబడినవి. తెల్గుపద్యములు చాటుపద్యమణిమంజరి (ద్వితీయ భాగము)లో జేర్చితిని. అందుఁ గొన్ని శ్రీనాథునివి కాఁదగును. ఉదాహరించుచున్నాఁడను.

శ్లో. దుర్గాండిన్నమ గాండిరర్థవహగాణ్య ప్యర్థటంకోధవా
టంకోవావ్యన్నృపాలకైః కవితతేర్దీయేత దీయేతచేత్
త్యాగః కోమటివేమయక్షితిపతే రష్టౌ శతష్టోదశ
ద్వాత్రింశత్పచతుష్క షష్టిపహితఁద్వ్యష్టోత్తరం వా శతమ్.

శ్లో. కావేర్యాం త్రిపురాంతకే జయపురే కాశీపురే గోకురే
పంచారామపురీషు పట్టవపురే మార్కండశంభోః పురే
గంగాసాగరసంగమేషు నిరతం శ్రీకొండవీటి పురే
చారుక్షాత్రయుతాన్నదాననిరతశ్రీవేమభూపప్రభుః.

శ్లో. జ్ఞాతా యది నహి దాతా
దాతచేత్కోఽపి భువి నచజ్ఞాతా
జ్ఞాతా దాతా చాభూః
పెదకోమటి వేమభూపతే చిత్రమ్.

శ్లో. అర్థిజన చింతితార్థా
దధికం చేత ప్రతోఽ పితే వాణీ;
అప్యా అపి దిశతి కరః
పెదకోమటివేమభూపతే చిత్రమ్.

శ్లో. శ్రితపోషణ రిపుశోషణ
బుధతోషణ సత్యభాషణాది గుణాః
దత్తే దశరథరామః
ప్రాగద్య కలౌ తు కోమటివిభు వేమః

సీ. కపటకంఠీరవాకారనారాయణ
శ్వేతాని వాదంబుఁ గేలిసేయు
కల్పాంతదుర్దాంతకాలభైరవభేరి
ఢమరుకోన్మాదం బదంగఁజేయు
ప్రళయకాలాభీలపటుఘోర నిర్ఘాత
పటపటారావంబుఁ జటులపఱచు
కుహనామహాకాలకోలాహలోత్తాల
పాతాళనినదంబు భంగపఱచు

గీ. గండు మెఱసిన రిపుకోటిగుండె లవియఁ
బండగతిఁ మ్రోయు నీరణోద్దండభేరి
జయరమావంగ రాజవేశ్యాభుజంగ
అతులబలధామ! పెదకోమటన్న వేమ!

శృంగారశ్రీనాథము

కోమటివేమన్న మహాదాతయన్నవిషయ మీవరకేయెఱుకపడెను. అతనియాస్థానమునఁ దురగా రామయ్య యను దుష్టమంత్రి యొకఁ డుండెడివాఁడట.

క. కోమటివేమనదానము
భూమిఁ బ్రసిద్ధంబు కల్ప (గంధ?) భూజముచెంతన్
బాముున్నపగిదిఁ దురగా
రాముం డున్నాఁడు చేరరా దెవ్వరికిన్.

ఎవ్వరు చెప్పినదో యీ పద్యము! కోమటివేమారెడ్డివలన శ్రీనాథుఁ డగ్రహారము లందెనని గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగా రిట్లు వ్రాసినారు:-

"కొండవీటి దండకవిలెలో నీశ్రీనాథునకుఁ గోమటి వేమన్న వలన రెండుపాలెము లీయఁబడెననియు అందొకదానికి సౌలనపాలెమనియు, రెండవదానికిఁ బాలెమనియు నామమున్నట్లును జెప్పఁబడియె. ఆ రెండుగ్రామములను దొంతియల్లాడరెడ్డి కాలములో నల్లాడరెడ్డికూఁతువకు నతనివలన సంక్రాంతిపండుగబహుమానముగా నీయఁబడిన వనియున్నది. అల్లాడరెడ్డి కూఁతురుపేరు వేమాంబ. ఆమెకు నామాంతరము మైలమ్మయని కలదు. మైలమ్మ కాగ్రామము లిచ్చి పొలమేరహద్దులు పెట్టించి యందొకదానికి మైలమ్మపేరిట మైలవరమనియు రెండవదానికి సంక్రాంతిపండుగకుగా నీయబడుటచేత సంక్రాంతిపాలెమనియు నామకరణముఁచేసిరి. నాఁడు మొద లవి ప్రత్యేకగ్రామము లాయెనని యున్నది." పయివ్రాఁతలో నేమేని సత్యము కలదాయని నేను సంశయించుచున్నాను. కోమటివేమన కు నల్లాడరెడ్డి సంబంధముం డెననుట సందేహింపఁదగినది. విరోధము ప్రఖ్యాతముగాఁ గలదు.

తృతీయప్రకరణము

## శృంగారనైషధ రచనకాలము.

పెదకోమటి వేమారెడ్డి రాజ్యమునకు వచ్చినతర్వాత (క్రీ. 1403 తర్వత)నే శ్రీనాథుఁడు క్రీ. 1410, 1415, ప్రాంతముల శృంగారనైషధమును రచించెనని నేను నిశ్చయించుచున్నాఁడను. శృంగారనైషధకృతిపతి మామిడి సింగనామాత్యుఁ డీనాఁటి క్రిందివిధమునఁ బ్రిభవము గాంచియున్నాఁడు.

మ॥ అరుదారఁగ నివిహాగ్రహారములతో నాందోళికాచ్ఛత్రచా
మరకళాంచి కళాచికాది బహువస్త్రాన్వర్థచిహ్నంబు లా
దరమొప్పారఁగ వేమభూవరునిచేతన్ గాంచె సామ్రాజ్యవం
భరణప్రౌఢుఁ డమాత్యసింగఁడు నయప్రాగల్భ్యగర్వోన్నతిన్.

ఈ క్రింది పద్యముకూడఁ జూడఁదగినది.

మ॥ నవరత్నోపల దివ్యలింగవరదానప్రీత దాక్షాయణీ
ధవ కర్పూరవసంతరాయ యనవద్య ద్వాదశీవావరో
త్సవ రుక్మాంగద వేమభూపతి మహాసామ్రాజ్యరక్షామణీ
యవనాధీశవధూవిరంకుశవచో వ్యాపారపారాయణా.

మఱియు నింక ననేకపద్యము లున్నవి. విస్తరభీతిచే విడచుచున్నాఁడను. నైషధమునఁ జూడఁదగును. శృంగారనైషధము పెద్దకోమటివేమారెడ్డి రాజ్యమునకు రాకముందే కొమరగిరిరెడ్డి పరిపాలనకాలమందే రచితమయ్యెననియు నా వేమారెడ్డినిగూర్చియుఁ దన్మంత్రియగు మామిడిసింగనామాత్యునిఁగూర్చియుఁ జేయఁబడిన వర్ణన మతిశయోక్తియనియు, వేమారెడ్డి కంతకుఁబూర్వమును గొంత రాజ్య ముండెననియు నొకవాద మున్నది. దాని నేను విశ్వసింపఁ జాలకున్నాఁడను. మామిడిసింగనామాత్యునివర్ణనలలో నతిశయోక్తులని

తోసిపుచ్చఁదగినవికావు మీఁద నుదాహరింపఁబడిన విషయములు ; కొమరగిరియు, కాటయవేమనయు బావమఱఁదులు. మఱియుఁ గుమార గిరిరెడ్డికిఁ గాటయవేమారెడ్డి మంత్రి. ఈతనితోఁ బెదకోమటివేమా రెడ్డికి వైరమున్నట్లు తెలియుచున్నది.

పెదకోమటివేమారెడ్డికి రాజ్యలాభము కాటయవేమునకు సహింపరాని దయ్యెను. అట్లగుటచేతనే కొమరగిరి జీవితకాలముననే క్రీ. 1398 ప్రాంతమున నాతఁడు రాజమహేంద్రపురరాజ్యమును బడసి కొండవీడును విడనాడెను. "గతే దివం కాటయవేమభూపే నిర్మూల్య తద్ద్రోహికులం సమస్త" మిత్యాదిశాసనాంశము లిందుకు సాధకములు. కాటయవేమారెడ్డియే కొమరగిరిరెడ్డియనవచ్చును. కొమర గిరిరెడ్డికాలమునఁ గాటయవేముని ప్రాభవమే సాగినది. "సింహాసనే విధాయాసౌ కుమారగిరి భూపతిమ్, అతేజయ న్మహాతేజాశ్శ్రీకృష్ణ ఇవ ధర్మజమ్" అట్టిస్థితిలో వారిపాలనమునఁ బెద్దకోమటివేమారెడ్డికి రాజ్య లాభము దర్లభము. కొమరగిరి యవసానమునకుఁ బూర్వము కోమటి వేమారెడ్డికి రాజ్య మున్నదనుట కాధారము నాకుఁగానరాలేదు. మామిడి సింగనయవనాధీశ్వరునిసభలోనిరంకుశవచోవ్యాపారము నెఱపుటయును, వివిధాగ్రహారములతో నాందోళికాచ్ఛత్రచామరాది రాజార్హపదముల బడయుటయును నాతని నేలిన రాజగు కోమటివేమారెడ్డి కొండవీడు రాజ్య సింహాసనాధిష్ఠితుఁడయి యుండినప్పుడే యుక్తమగును. అప్పుడే యాతఁడు వేమభూపతిమహాసామ్రాజ్యరక్షామణి యనఁదగినవాఁడగును. రాజునకు రాజ్యములేనప్పుడు మంత్రియు నామంత్రి కగ్రహారాందోళి కాచ్ఛత్రచామరాదిలాభమును సామ్రాజ్యసంభరణప్రౌఢిమయు నసం గతములు. శృంగారనైషధము వేమారెడ్డికిరాజ్యలాభము కల్గినతర్వాతనే

రచింపఁబడినదనుట కిది యాధారమే యగుచున్నది. బలిష్ఠమగు సాధనమొకటి పెదకోమటి వేమారెడ్డి రాజ్యమునకు రాకపూర్వమే శృంగార నైషధరచనము జరిగెనని స్పష్టముగా నిరూపించుచున్నప్పుడు పయిదానిని సందేహింప వచ్చును గాక! అది యంతకుఁ బూర్వమే రచిత మయ్యెనను ప్రతికూలవాదమునకు విలువఁదగిన సాధనము నాకుఁ గానరాకున్నది. సాధనముగాఁ దత్పక్షమునఁ జూపఁబడునది హరవిలాసప్రబంధరచనావిషయము.

## హరవిలాసవిషయము

ప్రతిపక్షవాదముసారాంశ మిది :—

"హరవిలాసము వ్రాయునప్పుడు కుమారగిరి బ్రదికి యుండెననియుఁ గొండవీటిలో రాజ్యము చేయుచుండెననియు ఆతనియొద్ద పెద్దసెట్టిగా అవచితిప్పయ యుండెననియు జూపు వాక్యము లీ (హర విలాసము) గ్రంథమునందుఁ బెక్కులుగలవు. ఇట్టివాక్యము లున్నను కుమారగిరి చనిపోయినతర్వాత తిప్పన అధికార మూడిపోయిన పిదప హరిహర ఫేరోజుశాహాలకీర్తిశేషులయిన యెన్నియో సంవత్సరములకుఁ దర్వాత నీకావ్యము రచింపఁబడియెనని చెప్పుటకంటె విపరీతమైన సిద్ధాంతము మఱియొకటి యుండదు."* హరవిలాసము శ్రీనాథుని యుపసానకాలపు గ్రంథమనుటను నే నంగీకరింపను. మఱియు, నది కొమరగిరి జీవితకాలమందే, యవచితిప్పయ కొండవీటఁ బెద్దసెట్టిగా నుండుకాలమందే రచింపఁబడిన దనుటనుగూడ నంగీకరింపఁజాలను. హరవిలాసమునుండి ప్రతిపక్షవాదమునకు సాధకముగా నుదాహరింపఁ

*వాదస్వరూపము సమగ్రముగాఁ దెలియుటకై యి సమగ్రంథము నుండి సహానభాగము సమబంధమునఁ జూపుదుము.

బడిన గ్రంథభాగము. కుమారగిరి జీవితకాలమందే యా గ్రంథము రచింపఁబడెననుట నేమాత్రమును సాధింపఁజాలదు. "సుగంధ ద్రవ్యంబు లొడఁగూర్చియు గాణిక్యంబులు తెప్పించియు, కవినై గమిక వైతాళికాదులగు నర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు విఖ్యాతిగాంచిన తిప్పప్రభుం డొక్కనాఁడు...." అని కలదు. కుమార గిరి జీవించియున్నకాలమే, యాయుత్సవములు నడుచుచున్నకాలమే, యదియగునేని, "సుగంధద్రవ్యంబు లొడఁగూర్చుచు.... తెప్పించుచు... గుప్పించుచు.... ఖ్యాతిగాంచుచున్న" యని యుండవలెను. ఆ కాలము దాఁటినపిదప రచింపఁబడినదగుటచేతనే యట్లు భూతకాలక్రియావిశేష ణములను శ్రీనాథుఁడు ప్రయోగించెను. ఖుసిమీఱ- అను పద్యము సుల్తాన్‌ప్రభున కాతఁడు సుగంధి ద్రవ్యముల నొసఁగువాఁడని యర్థ మిచ్చుచున్నది. అందు విశేషములేదు. "నుతియించురా" యనునది తద్ధర్మరూపము. కుమారగిర్యధీశ్వరుని వసంతవైభవము "సర్వము నొక్కఁడ నిర్వహించుచున్‌...." అనిలేదు. "నిర్వహించు మా తిరు మలనాథసెట్టికిని" అని కలదు. ఇక్కడ నిర్వహించు అనునదియును దద్ధర్మవిశేషణమే. "నిర్వహించుచున్" అని శత్రర్థకముగా నుదాహ రించుట యుక్రమము. అచ్చుప్రతులలోఁగాని వ్రాఁతప్రతులలోఁ గాని యట్లుకానరాదు.

కొమరగిరివసంతనృపాగమేత్యాదివిధముగాఁ ప్రతిపక్షవాద మున నుదాహరింపఁబడినపద్య మిట్లుండవలెను.

క. కొమరగిరినృపవసంతా
గమవేళ గంధసారకస్తూరికుం
కుమ కర్పూరహిమాంబు
స్సముదంచిత బహుసుగంధి లాధ్యక్షా!

ఇట్లే వ్రాఁతప్రతిలోఁగలదు. కొమరగిరినృపాలుని వసంతోత్సవములందుఁ "జందనము కస్తూరి మొదలగు సుగంధిద్రవ్యముల కొట్టుపై నధికారముగలవాఁడా!" యని సంబోధనమిది; పయిప్రతిపక్షవాదమున నవచితిప్పయ కొండవీటఁ గొమరగిరిరెడ్డికిఁ బెద్దసెట్టియై సుగంధిద్రవ్యముల కొట్టుపెట్టుకొని వసించియున్నట్టు తలంపు గలదు. అవచితిప్పయ కొండవీట నిల్లుకట్టుకొని కూర్చున్నవాఁడు కాఁడు. కొమరగిరియొద్ద వసంతోత్సవసమయములందే సుగంధిశాలాధ్యక్షుఁడుగా నున్నట్టు పయి పద్యమేకాక యీక్రింది పద్యముకూడఁ దెలుపుచున్నది:

చ. కొమరగిరిక్షమారమణ కుంజరచారువసంతవైభవ
క్రమ సముపార్జితాఖిలసుగంధ హిమాంబు కురంగనాభికుం
కుమఘనసారసంకుమదకుంభమనోహర గంధశాలికా
సముదయ సార్వభౌమ కవిసంఘమనోరథ కల్పకద్రుమా!

తిప్పయసెట్టి మహైశ్వర్యసంపన్నుఁడు. కొమరగిరిరెడ్డిచే రాజార్హపదములఁ బడసినవాఁడు. అతని నివాసస్థలము కాంచీపట్టణము. ఇది చదువుఁడు.

ఉ॥ మంకణమౌనివంశమణిమండన! కాంచిపురీనివాస! యే
డాంకకిరీటదివ్యచరణాంబుజ సేవక! వైరిభద్ర నా
గాంకుశ! హారహీరదరహాసవిపాండురకీర్తి చంద్రికా
లంకృత దిగ్విభాగ! శుభ లక్షణ! వారిరుహాయతేక్షణా!

అవచితిప్పయ కొక్కకుమారరెడ్డితోడనే కాదు సంబంధము. పాండ్యరాజుతోఁ గలదు; తురుష్కప్రభులతోఁ గలదు. ఇంక ననేక ప్రభువులతోఁ గలదు. అతనివిత మ్ములు ద్వీపాంతరములనుండికూడ

వనేక మహార్ఘవస్తువులఁ దెచ్చుచుండెడివారు. వారు తెచ్చుపదార్థములు రాజార్హములు. కొమరగిరిప్రభుప్రభృతులసన్నిధికి వానిని గొనిపోయి వారు విక్రయించుచుండెడివారు. కుమారగిరి ప్రతివర్షమును వసంతోత్సవములు చేయుచుండువాఁడు కావుననే యాతనికి వసంతరాయఁడని బిరుదు కలదు. ఆయుత్సవకాలమునకు సుగంధిద్రవ్యాదుల నీ యవచితిప్పయయు, నాతనిసోదరులు కొనివచ్చి విక్రయించి, తాత్కాలికముగా సుగంధిభాండాగారాధ్యక్షత వహించి యుత్సవము తీఱినతర్వాత కంచికరుగుచుండెడివారు. ఇట్లే యనేక రాజస్థానములకు వా రరుగుచుండెడివారు. అవచితిప్పయ కొండవీడువాస్తవ్యుండనుట కాధారమేమియు లేదు. పైగాఁ గాంచీపురవాస్తవ్యుఁ డని స్పష్టముగాఁ గలదు. మఱియు నాతనికుటుంబము పెక్కుతరముల నుండి కాంచీపురీవాస్తవ్యమనుటకు హరవిలాసము ప్రథమద్వితీయాశ్వాసములు ప్రమాణములు. శ్రీనాథుఁడు బాలుఁడుగా నుండఁగా నవచితిప్పయఁ కొమరగిరి వసంతోత్సవములకుఁ గొండవీటికి వచ్చుచుండఁగా వారికిఁ బరస్పరము సఖ్యమేర్పడినది. శ్రీనాథుఁడుబాల్యముననే కవిత్వమునను బాండిత్యముననుఁ బ్రఖ్యాతుఁడుగా నుండెనను విషయము నిక్కడ స్మరింపఁజేయ నక్కఱయుండదు. అవచితిప్పయ యాయుత్సవములకు వచ్చిన 'కవినైగమికవాదివాంశిక వైతాళికాదులగు నర్థిజనంబులకు నర్థంబులొసఁగుప్పు'' చుండువాఁడు. తిప్పయ యప్పుడు శ్రీనాథునిఁ గూడ సత్కరించియుండును. కొమరగిరితర్వాత గోమటి వేమన కాలమునఁ గొండవీటి కవచితిప్పయ వచ్చుచుండినట్టు తెలియరాదు. శ్రీనాథుఁడు కోమటివేమన కాలమున మహావైభవమున నున్నాఁడు. కుమారగిరికిఁ దర్వాత శ్రీనాథున కిట్టిదశ యించుమించుగాఁ బంచవింశతి వత్సరములు నడచినది. తర్వాత కొండవీడురాజ్యము కూలినది. శ్రీనాథుఁడు యశోధనార్జనకై దేశాటనము చేయవలసిన వాఁడయ్యెను.

ఈస్థితిలో పెదకోమటివేమనకు విరోధులను రాజమహేంద్రవరపాలకులు నగు వేమవీరభద్రారెడ్ల యాశ్రయము కుదురుటకుముందుఁ గొన్నియేండ్లు కడపెను. ఆ సందర్భమునఁ దనబాల్యమునఁ గొంత పీటిపరిచితుఁడును, నైశ్వర్యసంపన్నుఁడును నగు నవచితిప్పయను జూడ నీతఁడు కాంచీపురి కరిగెను. అతఁడాదరించి కృతి కోరెను. అలవోకగా హరవిలాసమును రచియించి శ్రీనాథుఁ డక్కడనే యంకితముచేసి యుండును. అప్పుడు కొంతకాలము శ్రీనాథుఁడు కాంచీపురమున వసించెను. అప్పటికి నవచితిప్పయ మిక్కిలి వృద్ధుఁడుగా నున్నాఁడు. అతఁడు కొమరగిరివసంతోత్సవములు జరుపుకాలమునకు ముప్పదినలుబదియేండ్లవాఁడు కాదగును. తర్వాత నించుమించుగా నిర్వదియైదేండ్లిప్పటికిఁ గడచెను. హరవిలాస కృతికాలమున కాతఁడించుమించుగా నర్వదియైదేండ్లవాఁడు. ఈయర్థమునకు హరవిలాసమందలి యీ క్రిందిపద్యములు సాధకములు.

క. కంటిఁ బ్రవిశుద్ధవంతతి
వింటిఁ బురాణములు పెక్కు విశ్వము పొగడన్
మంటి బహువత్సరంబులు
గొంటి యశోధనము సుకవికోటులచేతన్.

గీ. ఆగమజ్ఞానశాలివి దర్థార్థవిధివి
బహుపురాణజ్ఞుఁడవు శుభభవ్యమతివి
బాలసఖుఁడవు శైవప్రబంధ మొకటి
యవధరింపుము నా పేర నంకితముగ.

ఇప్పుడు శ్రీనాథుఁ డించుమించుగా నలుబదియేండ్లవాఁడు. పంచవింశతి సంవత్సరములనుండి కలపరిచయమును గూర్చి చెప్పునప్పుడు తిప్పయసెట్టి శ్రీనాథుని బాలసఖుఁడ వనిచెప్పుట తప్పుగాదు.

హరవిలాసమునఁ గొమరగిరి వసంతోత్సవాదికమును గొంచె మెక్కువగాఁ బ్రశంసించుటకు గారణ మది శ్రీనాథుని యెఱుకకెక్కిన దగుటయే యని నేను దలంచుచున్నాఁడను. ఆప్రశంస నాధారముగాఁ గొని యది హరిహరరాయ ఫేరోజిషహా కుమారగిరుల పాలనకాలము ననే రచితమయ్యె ననుటకు నేనంగీకరింపఁజాలకున్నాఁడను. అది పెద కోమటి వేమారెడ్డి స్వర్గస్థుఁడైనపిదప రచింపఁబడిన దనుటయే సంగతముగానున్నది.

హరవిలాసము కొమరగిరిరెడ్డి పాలనకాలముననే రచితమయ్యె నని యంగీకరింతుమేని యాకాలము క్రీ. 1385–1400కు నడిమికాల మగును. కొమరగిరిరెడ్డి పాలనకాలమునఁ గడపటి యైదేండ్లలోనే హరవిలాసరచనము జరిగిన దనుకొన్నను, నప్పటికి నవచి తిప్పయ బహువత్సరములుమనినవాఁడగుటయు నాతనికి శ్రీనాథుఁడు బాలసఖుఁ డగుటయు, సర్వథా యసంగతము లగును. హరవిలాసమునఁ "ఆంధ్ర భాషానైషధాబ్జభవుని" అని కలదుకాన హరవిలాసరచనమునకుఁ బూర్వమే శృంగార నైషధరచనము జరిగినట్లేర్పడుచున్నది గదా!

శృంగారనైషధరచనమునాఁటికి శ్రీనాథుఁడు నిండుజవ్వనము వాఁడగుటచేత నాతని జన్మకాల మప్పటి కిర్వదియేండ్లకుఁ దక్కువ కాకుండఁ బూర్వకాలమునకుఁ బోవలసివచ్చును. ఇదియు నసం భావ్యమే. ఈ విషయము జన్మకాలచర్చయందుఁ జూడఁదగును. ఇన్ని యసంగతుల కేల పాలుపడవలెను? శృంగారనైషధరచనము పెదకోమటివేమారెడ్డిపాలనకాలమున రచితమయ్యె ననుట నేల యంగీక రింపకపోవలెను? కొమరగిరిపాలనకాలమునఁగూడఁ గోమటివేమా రెడ్డికి రాజ్యమున్నదని యాకాశహర్మ్య మేలకల్పింపవలెను? శృంగార

నైషధము పెదకోమటివేమారెడ్డిపాలనకాలముననే రచితమయ్యెననుట కింకను సాధకములు గలవు.

శృంగారనైషధకృతిపతియగు మామిడిసింగన తాను స్వయము సోమసిద్ధాంతమునకు వ్యాఖ్యరచయించినాఁడు. గ్రంథకరణకాలము శక 1340 క్రీ. 1418 యని యందుఁ జెప్పుకొన్నాఁడు. (శృంగార నైషధ) కృతిగ్రహణకాలము కూడఁ (సోమసిద్ధాంతవ్యాఖ్యాన) కృతి కరణకాలమునకుఁ జేరువగా నుండఁదగును. కాఁబట్టి శృంగారనైషధ కృతిగ్రహణకాలము క్రీ. 1418 కిఁ గొంతముందుగా నుండఁదగును.

ఇంకను భీమఖండమందలిదగు నీక్రిందిపద్యము గూడ నీయర్థ మునకు సాధకముకావచ్చును.

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణవిద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకంబైన
హర్షనైషధకావ్యమాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణవేళలందు
వెదజల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందు

గీ. ... ... ... ...

శృంగారనైషధ రచనావిషయముతో పాటు తక్కిన వెనుక ముందుచరణములలోఁ జెప్పఁబడిన విషయములు పెదకోమటి వేమా రెడ్డిపాలనకాలమున నడచిన వగుట సునిశ్చితము. వాని నడుమనున్న శృంగారనైషధరచనావిషయముగూడ నాకాలముననే నడచినదనుట

శృంగారశ్రీనాథము

సంగతమగును. ఎన్నివిధములఁ బర్యాలోచించిచూచినను శృంగార నైషధము పెదకోమటివేమారెడ్డిపాలనకాలముననే రచితమయ్యెననుట నిర్బాధముగానే నాకుఁ దోఁచుచున్నది.

## తెలుఁగుచేఁత.

బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిులుగారు విద్వదౌషధ మనఁబడు శ్రీహర్షనైషధమును శ్రీనాఁథుడు విద్వదమృతముగాఁ జేసినాఁడని శృంగారనైషధమునుగూర్చి సముచితమయిన ప్రశంస సల్పినారు. ఆది యట్టిద: "కాశీఖండ మయఃపిండం నైషధం విద్వ దౌషధమ్" అని ప్రతీతికలదు. శ్రీనాథుడీరెండుగ్రంథములను దెలిఁ గించినాఁడు. పయిప్రతీతి మన శ్రీనాథుని తెనుఁగు గ్రంథములను గూర్చి యేర్పడినదేయేమోగదా! స్కాంధపురాణాంతర్గతమైన కాశీఖండ మునకును ప్రౌఢకావ్యమయిన నైషధమునకును బొత్తుగూర్చు నా ప్రతీతి సంస్కృత రచనములఁగూర్చి యేర్పడిన దనుటకంటె నేక కవికృతములయి పొత్తుగాంచిన తెలుఁగు గ్రంథములఁగూర్చి యేర్పడిన దనుట యుచితముగా నుండునుగాదా', ఆంధ్రకావ్యములందు శృంగార నైషధము మిక్కిలి ముఖ్యముగాఁ బరిగణింపఁబడుచున్నది. అపండి తులకు దురవబోధమగు నాగ్రంథమును శ్రీవేంకటరాయశాస్త్రిులుగారు సర్వంకష యను వ్యాఖ్యతో సరిపఱిచి ముద్రించి యిప్పుడు సుబోధము గావించినారు.

## సంస్కృత వ్యాఖ్యలు.

శ్రీనాథుఁడు తెలిఁగించునాఁటికి శ్రీహర్ష నైషధమునకు నేయేవ్యాఖ్యలు మనదేశమున వ్యాప్తిలోనున్నవో స్పష్టముగా నెఱుఁగ రాదు. మల్లినాథుని వ్యాఖ్య యించుమించుగా శ్రీనాథుని కాలముననే

రచింపఁబడెను. ఆవ్యాఖ్య నీతఁడు చూచెనో లేదో తెలియదు. మఱొక గొప్పవ్యాఖ్యాన మప్పటికిఁ గొంచెము పూర్వకాలమున మన తెనుఁగు దేశముననే రచింపఁబడినది కలదు. ఆవ్యాఖ్యాత ప్రఖ్యాతుఁడు, నరహరి. విద్యారణ్యుల శిష్యుఁడు.

శ్లో॥ యం ప్రాసూత త్రిలింగక్షితిపతిసతతారాధితాం ఘ్రిస్స్వయంభూః
ప్రాతివ్రత్యైకసీమా సుకవినరహరిం నాలమా యస్య మాతా
యం విద్యారణ్యయోగీ కలయతి కృపయా తత్కృతౌ దీపికాయా
మాద్యే స్సర్గోఽతిమాద్యత్కవికులవిజయీ చారుసీరాజితోఽభూత్.

ఈ వ్యాఖ్యానమును శ్రీనాథుఁడు చూచియుండవచ్చునేమో! నైషధము గ్రంథగ్రంథులు కలిగి క్లిష్టమయినదగుటచే ననేకులు వ్యాకరించిరి. అందు శ్రీనాథుడు రచించిన దొక్కటి కలదు. ఆ శ్రీనాథుఁడు మన శ్రీనాథుఁడేయేమో యని సందియము పొడమినది. శ్రీవేంకటరాయ శాస్త్రులుగా రిట్లువ్రాసినారు: "కడమ వ్యాఖ్యాతలలో శ్రీనాథుఁడు ఒక్కఁడని పేర్కొనంబడి యున్నాఁడు. ఆ శ్రీనాథుఁడు శృంగారనైషధకారుఁడేయేమో' ఈతఁడే యనుటకు ఈయాంధ్రీకరణాభి మానము కొంత సాధకము."

శ్రీనాథుని వ్యాఖ్యాన మెక్కడకలదో వెదకితిని. బరోడారాజు గారి పుస్తకశాలలో నున్నది. తత్పుస్తక పట్టికలో నీశ్లోకము లుద్ధరింపఁబడినవి.

శ్లో. శ్రీమన్నారాయణం నత్వా కావ్యే శ్రీహర్షనిర్మితే
ప్రకాశనం యథాప్రజ్ఞం శ్రీనాథేన విధీయతే.

.... .... ....

శృంగారశ్రీనాథము

యే యదర్థమజానన్తో వృథావచనవిస్తరైః
దూషయంతి కవేః కావ్యం ధి క్తాన్ పండితమానినః
యదిత్థం కరటోగత్వా సింధోరుపరి కాయతి
తత్కిం పవే త్తి గాంభీర్యం రత్నానిచ తదాశయే.

"గద్యమ్:- ఇతి శ్రీమహోపాధ్యాయ శ్రీనాథాచార్య విరచితే నైషధప్రకాశే" – ఇది మన శ్రీనాథునివిధముగాఁ దోఁపదు. ఈతఁడేతఁడో శ్రీనాథాచార్యుఁడు మహోపాధ్యాయుఁడు. గ్రంథము సమగ్రముగా నుపలబ్ధమయినచో మన శృంగారనైషధమును దానిని పరిచూడఁదగును. అట్లు చూడక, మన శ్రీనాథునిది యగును కాదని స్పష్టముగా నిర్ణయింపఁ గుదురదు. మన శ్రీనాథుడే యగునేని సర్వజ్ఞ సింగభూపతి సంస్థానముననున్న మల్లినాథుఁడు మహోపాధ్యాయుఁడు చేసిన వ్యాఖ్యానమునకుఁ బ్రతిగా సర్వజ్ఞ చక్రవర్తి కోమటి వేమభూపాలునాస్థానముననున్న శ్రీనాథుఁడు మహోపాధ్యాయుఁడు సంస్కృత వ్యాఖ్యనేగాక యాంధ్రరచనమునుగూడఁ జేసె ననవలెను.

## గద్యవిధము

శృంగారనైషధగద్యమున "సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీత" మని శ్రీనాథుఁడు చెప్పుకొన్నాఁడు. సకలవిద్యాసనాథ పదము, తర్వాతి గ్రంథములగు హరవిలాసాదులందుఁ గానరాదు. "సుకవిజనవిధేయ శ్రీనాథనామధేయే" త్యాదివిధములఁ దర్వాతిగ్రంథములందు మార్పు గలదు. ఏిందుజవ్వనమువాఁడై పెదకోమటివేమభూపాలునాస్థానమున విద్యాధికార్యున్నతోద్యోగము నిర్వర్తించుచున్న శ్రీనాథుఁ డిప్పు డిట్లు "సకల విద్యాసనాథ శ్రీనాథ" యని చేర్చుకొనుటయుఁ గాలముకడచినపయి "సుకవిజనవిధేయ శ్రీనాథనామధేయ" యనిమార్చుకొనుటయు సంగతముగానే యుండునుగదా!

తృతీయప్రకరణము

అపపఠిత.

గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు పిల్లలమఱ్ఱి పినవీర భద్రుసచరిత్ర సందర్భమున నీ క్రిందివ్రాఁత వ్రాసినారు

"శ్రీనాథుఁడంతఁ దన యాంధ్రనైషధముంజూపి 'మీరు దీనిని బాగనిచ జగద్వ్యాపకం బవున ట్లొనర్పేదఁ జూడుఁ' డనుడు నాతఁడు 'శ్రీహర్ష నైషధములోనిదగు 'గమి కర్మీకృత నైకనీవృతా' అను దానినెట్లు తెలిఁగించి' తని యడిగెను. అంత 'గమికర్మీకృత నైకనీవృతుఁడనై' అని తెనిఁగించితినని శ్రీనాథుఁడనియె. అపుడు వీరన శ్రీనాథుంజూచినవ్వి "యోయీ! నీవిందు 'నై' తెనిఁగించితివి కాఁబోలు" అనుడు వీరనపల్కులకేమియు నుత్తరమీఁజాలక శ్రీనాథుఁడు తా నాగ్రంథమును దెనింగించుతటిం జేసిన పరిశ్రమ విశేషంబులు దెలుపందొడంగెను. అంత వీరన చిఱునవ్వునవ్వి 'యిది మాబోంట్లకుఁ గాకున్ననేమి సామాన్యులకుఁ బఠనార్హంబగుఁ గావున దీనిని జగద్వ్యాపకంబు సేయు' మనుచు, శ్రీనాథుండు గర్వంబేది నిజావాసంబునకుం జనియె. వీరన యెట్లన్నను శ్రీనాథకృత నైషధము తెనుఁగు గ్రంథంబులలో మిగుల శ్లాఘనీయంబు, సంస్కృతంబునకు సరియైన తెనుఁగని దీనిని బండితులందఱు నొప్పుకొని యున్నారు."-

శ్రీ శ్రీరామమూర్తి పంతులుగారు వ్రాయఁగూడని వ్రాఁత వ్రాసినారు. ఆ యపప్రథ యదఁగార్పఁదగినది, పినవీరన్న శ్రీనాథునిపై గౌరవ ప్రపత్తులు చూపుకొన్నవాఁడు. "శ్రీనాథభట్టు భాషాని గుంభంబులు, సౌరభంబులు వెదసల్ల నేర్చు" అని శృంగారశాకుంతలమున వీరభద్రుఁడు శ్రీనాథునిఁ గొనియాడినాఁడు. శృంగారనైషధమును వీరభద్రుఁడు పలుమారులు పారాయణము చేసిచేసియే ప్రబంధకర్త

కాఁగల్గినాఁడు. శృంగారనైషధముమీఁది ప్రేమనే సూచించుచున్నది శృంగారశాకుంతలమని యాతని కావ్యముపేరు. శ్రీనాథుని చరణముల నాతఁడు, పెక్కుతడవలందుకొన్నాఁడు. శ్రీనాథుని వార్ధకకాలమునకుఁ బినవీరభద్రుఁడు బాలుఁడై యుండుట యుపపన్న మగును. శ్రీనాథు నాతఁడు దర్శించి యుండవచ్చును. ఆతనికి శిష్యత కూడ నెఱపి యుండవచ్చును. లోక ప్రతీతి యట్లేకలదు. శ్రీనాథుని కృతులను పినవీరభద్రుని శృంగారశాకుంతలమును జక్కఁగాఁ బరిశీలించువా రిది విశ్వసింతురు. పిన్నవీరభద్రుఁ డీతఁడు పెద్దవీరభద్రుఁడొక్కఁ డని మనకెఱిఁగించుచున్నాఁడు. ఆతఁడును గవియఁట! ఏవో యాతనికృతులు!

పెద్దిరాజు మన శ్రీనాథునిమెప్పు గొన్నవాఁడు. హరవిలాస కృతినాథుఁడగు నవచితిప్పయ, యాపెద్దిరాజునకు శిష్యుఁడైనట్లు హర విలాసమున శ్రీనాథుఁడు వర్ణించినాఁడు:-

ఉ. పిన్నటనాఁడు సత్కరుణఁ బిల్లలమఱ్ఱిమహాప్రభాని పె
ద్దన్న గురూత్తముండు తగ దక్షరశిక్షయు, దైవమార్గసం
పన్నతయున్ వివేకపరిపాటియునుం గృపసేసె వర్ధి నే
యన్నకు వద్ది పెద్దిత్రిపురాంతకునిం దగుఁ బ్రస్తుతింపఁగన్.

పినవీరభద్రుఁడు, నీపెద్దిరాజును నెట్టి సంబంధము గలవారో యెఱుఁగరాదు. అన్నదమ్ములని ప్రతీతి. ఉపలభ్యమానములగు పిన వీరభద్రుని రెండుగ్రంథములందును నాతని వంశవర్ణనము గానరాదు. తత్పూర్వగ్రంథము "అవతారదర్పణము, నారదీయము, మాఘ మాహాత్మ్యము, మానసోల్లాససారము," ననునవి చేకుఱుటలేదు. అన్నయో పిన్నతండ్రియో కావచ్చును.

తృతీయప్రకరణము

## గృహరాజసౌధము

కోమటి వెంకారెడ్డి యాస్థానమున నున్నకాలమున శ్రీనాథుఁడు విద్యానగరమునకరిగి ద్వితీయ హరిహరరాయల దర్శించినట్లొక కట్టు కత కొండవీటి దండకవిలెలోఁ గలదు. కోమటి వెంకారెడ్డియనువాఁ డాకాలమున నుండెననుట కాధారములేదు. శ్రీనాథుఁడు హరిహర రాయల దర్శనముచేసినప్పుడు మీనివాసదేశ మెయ్యదియని యాతఁ డడిగెనఁట! అంత శ్రీనాథుఁడు:-

సీ. పరరాజ్య పరదుర్గ పరవైభవశ్రీలఁ
గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథిరాజన్య బలముల బంధించు
గుఱుతైన యుఱుద్రాడు కొండవీడు
ముగురురాజులకును మోహంబు పుట్టించు
కొమరుమించినవీడు కొండవీడు
చటుల విక్రమకళాసాహసం బొనరించు
కుటిలారులకుఁజోడు కొండవీడు

గీ. జవనఘోటకసామంత వరవీర
భటనటానేకహాటక ప్రకటగంధ
సింధురార్భటీమోహన శ్రీఁదనరు
కూర్మి వరామవతికి జోడు కొండవీడు.

అని కొండవీటిని వర్ణించిచెప్పెనఁట! సమ్మానమునకై వేచి శ్రీనాథుఁ డక్కడ నుండెనఁట! హరిహరరాయ లొకనాఁ డొడ్డోలగ ముండి, యొంటిస్తంభముతో మన్నతోన్నతమగు మేడ నిర్మింపఁ దలంపుగలదనియు, నామేడ యనన్యరాజ కల్ప్యముగా నుండవలయు

ననియు, సభ్యుల కెఱిఁగించెనఁట! శ్రీనాథుఁ డదివిని తనయేలికయగు రెడ్డిరాజునకుఁ బెంపువెలయింప "దేవా, మాభూపాలుని రాజధానియగు కొండవీటమింటికంటున బ్లొంటికంబపుమేడ నిర్మింపఁబడియె ననియె నఁట! రాయ లదివిని యబ్బురపడి యరసివచ్చుటకు భృత్యుల నంపెనఁట; తనయాడిన యనృతము బయల్పడిన నవమానము వాటిల్లు నని శ్రీనాథుఁడు తనయిష్టదేవత నారాధించి యేడుత్రాళ్ళ పొడుగుమ నేడుమోత్రికులు చుట్టివచ్చు నలవును గల నవులూరులోని తుమ్మ చెట్టును స్తంభముగా నలవరించి కొండవీట గృహరాజుమేడ నప్పటి కప్పుడే నిర్మింపఁజేసెనఁట! ఈవార్త తెలిసికొని రాయలు శ్రీనాథున కమితసమ్మాన మొదవించెనఁట! అభూతాత్యద్భుతకల్పనమయమగు నీకట్టుకథ యెంత వఱకు విశ్వాస్యమో ప్రాజ్ఞులు పర్యాలోచింతురు గాక!

ఇందుఁ బెద్దకోమటి వేమభూపాలుని యేలుబడికాలమునఁ గొండవీట గృహరాజసౌధము నిర్మింపఁబడుట మాత్రము వాస్తవాంశము. ఇట్టిసౌధ మాకాలమున నంధ్రదేశమం దెక్కడను లేదఁట! "మించి కట్టెరి గృహరాజుమేడ కొండవీట" అని చాటుపద్యము. ఇంత ప్రసిద్ధమైనహర్మ్య మాకాలమున నిర్మితమైనప్పుడు శ్రీనాథమహాకవి యెందేని పేర్కొనకపోవునా యను సందియముకల్గి పరిశీలింపఁగా నాతని శాసనకృతియం దీహర్మ్యపుంబ్రస్తావము కన్పట్టెను:-

శ్లో. అశ్రాంతం గృహరాజసౌధనివసల్లక్ష్మీకరాభ్యంతర
క్రీడాంభోరుహతాళవృంత పవనప్రస్తార విస్తారిత॥
వాయుః కేవరవాపనాసురభితో యస్యార్థిచింతామణే
ర్ధాత్రాదామతి దానకేళిజనితం స్వేదాంబసాం జాలకమ్.

—బెలువు శాసనము

ఆగృహరాజసౌధము నిర్మింపఁబడినతర్వాత దాపుదాపుగా నిర్వది ముప్పది సంవత్సరములకే పరరాజులపాలై మాఱుపఱుపఁబడిన దయ్యు నప్పటి కేనూఱువత్సరములు కడచనిన యీకాలమునఁగూడఁ గొండవీటఁ దన సన్నివేశము నెఱిఁగించుచుఁ జరిత్రాన్వేషులకు వ్యసనము గలిగించుచున్నది. ఇప్పటికిఁ దొంటిప్రాముఖ్యముఁ గోల్పోయి పురసామాన్యస్థితి నున్నను గొండవీడు ప్రాచీనౌన్నత్యమును దోఁపించుచుఁ బలు తెలుంగులఁ జూపఱచిత్త మాఁకగొల్పుచున్నది. కొండవీటి కైఫియతునుండి గృహరాజుమేడకు సంబంధించిన భాగము నించుక యుదాహరించుచున్నాఁడను:

"ఈ గుండాలకు దక్షిణం పూర్వం రెడ్లవారు కట్టించిన బహు ప్రబలమయినకోనేరు వున్నది. ఈప్రదేశమందు రెడ్లవారియొక్క రాజగృహములు అవి చెప్పినారు. ఈకోనేటికి పశ్చిమం హద్దు అనుకుని గృహరాజుమేడదిబ్బ అపివున్నది. రెడ్లవారు ప్రభుత్వంచేసే కాలమందు కోమటివేమారెడ్డిగారు శ్రీనాథునివారియొక్క ప్రభావంచేతను నవులూరి పోతురాజుదేవాలయం దగ్గిరవున్న యేడుతాళ్ళపొడుగున్నూ, యేడుమోకులుతిరిగే లావున్నూగల తుమ్మచెట్టు తెప్పించి స్తంభంగా చెక్కించి వంటిస్తంభం మేడకట్టించి తమకు యిష్టమైన ఆదిలక్ష్మికామేశ్వరిఅమ్మవారికి సింహాసనస్థానముగా నేర్పరిచి వైభవములు జరిగించి యీమేడశిఖరానకు బొల్లిమోరు వేంకటేశ్వరస్వామి దేవాలయానకు మకరతోరణం కట్టించినారట! ఇక్కడ వేంకటేశ్వరస్వామివారు వున్న కొండ సహజా తూర్పుగా వుంటుంది. ఈమేడకు ఆనుకునే జడ్డిగాలభావి అనే కోనేరు వున్నది."

ఈ కైఫియతునందు గృహరాజసౌధము ఆదిలక్ష్మి కామేశ్వరికి నాస్థానముగా నుండినట్లు వ్రాయబడినది. ఇది యథార్థమగును. వెనుక

నుదాహరింపఁబడిన శ్రీనాథుని శాసనశ్లోకమునఁగూడ నాసౌధము "లక్ష్మీ" నివాసముగానే వర్ణింపఁ బడెను. పెదకోమటివేమారెడ్డిభార్య యగు సూరమాంబ తనపేర సూరమాంబాపుర మను నొకపేటను గొండవీటిలోఁ గట్టించెనఁట. కొండవీటినిగూర్చి మంచి పరిశోధనము జరుగ వలసియున్నది.

## కొండవీటి గాడిద.

శ్రీనాథునికాలమునఁ గొండవీటిలోఁ గవు లనేకులు సమర్థులు నసమర్థులు నుండెడివారు. ఎక్కడఁజూచినను గవితా రచనములే యెసఁగుచుండెడివి. అసమర్థుల కవితాయాసమును శ్రీనాథుఁ డిట్లవ హేళనము చేసినాఁడు-

ఉ. బూడిదబుంగవై యొడలు పోఁడిమిదక్కి మొగంబువెల్లనై
వాడలవాడలందిరిగి వారును వీరును జొచ్చొచోయనన్
గోడలగొందులం దొదిగి కూయుచునుండెదు కొండవీటిలో
గాడిద నీవునుం గవివికావుగదా యనుమానమయ్యెడిన్.

## శాసనకృతులు

వీరనారాయణుని యాస్థానమున విద్యాధికారిగా నుండి శ్రీనాథుఁ డనేక శాసనకృతులు రచించెనని యావలికే వ్రాసితిని. పెద కోమటివేమారెడ్డి యెన్ని మహాదానములు చేసెనో, శ్రీనాథుఁ డెన్ని శాసనకృతులు రచించెనో, కాని యిప్పటికి నా కుపలబ్ధమయిన వీక్రిం దివి. వీనిలోఁ గొన్ని ముద్రితములు, కొన్ని యముద్రితములు. కొన్నింటి కిప్పుడు ప్రతులే గాని మూలములు దొరకలేదు. కొన్ని యావల కెవ్వరును దదవి యెఱుఁగనివికూడను. కాలక్రమమునుబట్టి

వానిని వరుసగా నిక్కడ వివరించెదను. శా. 1326, క్రీ. 1404, నుండి శా. 1341, క్రీ. 1419 వఱకు నాశాసనము లున్నవి. శాసనకర్తగా శ్రీనాథుఁడే యున్నాఁడు. కొన్ని సంస్కృత శ్లోకరూపమునను గొన్ని యంధ్రపద్యరూపమునను గొన్ని యుభయరూపమునను నున్నవి. ప్రాచీన రెడ్డిరాజశాసనములందలి శ్లోకములు గూడఁ గొన్ని వీని యందుఁ జేర్చుకోఁబడినవి. ఇట్టిసంప్రదాయ మితరశాసనకృతులందును గానవచ్చుచున్నది.

కుఱునూఁతుల శిలాశాసనము: శక. 1326 క్రీ. 1404

ఉపలబ్ధములయిన పెద్దకోమటి వేమారెడ్డి శాసనములలో నెల్ల నిదియే తొల్తటిది. రెండే శ్లోకము లిందున్నవి. అందు 'చూడామణి ర్నృపాణా" మిత్యాదిశ్లోకము మొదటిది. రెండవదిది:-

శ్లో. మహారాజ స్సోయం రసకరహుతాశేందుగణితే
శకాబ్దే శాసజ్యాం శశభృదుపరాగే ప్రకటితే
పరం ప్రీతః ప్రాదా దెఱ (విర) పురీదాశరథయే
వరం గ్రామం కుఱ్నూంతులురితి సమాఖ్యా ముపగతమ్.

సంవత్సరముపేరు చెప్పలేదుగానియది తారణసంవత్సరమగును. ఆసంవత్సరము శ్రావణపూర్ణిమనాఁడు చంద్రోపరాగపుణ్యకాలమునఁ గుఱునూఁతులగ్రామమును ఎఱ (విరః)పురీదాశరథికి (దేవుఁడు కావచ్చును) ఒసఁగెను కుఱునూఁతుల గుంటూరుతాలూకాలో నున్నది. గ్రామము నెల్లలు మొదలగునవి కానరావు. శాసనకృతికర్తపేరు లేదు. శ్రీనాథుఁ డిప్పటికి విద్యాధికార్యుద్యోగమును బడసియుండకపో వచ్చును.

శృంగారశ్రీనాథము

పొన్నుపల్లి తామ్రశాసనము. శక. 1326 క్రీ 1404.

శాసనకాలము:- శ. 1326 అగు తారణసంవత్సర పౌషామావాస్య. సూర్యోపరాగపుణ్యకాలము.

దాత.- పెదకోమటి వేమారెడ్డి.

ప్రతిగ్రహీత:- కప్పయెముకను గ్రుచ్చుకొనుటచే వ్యథపడుచున్న పామును బ్రదికించి "పరహిత" బిరుదమును బడసిన పండితులవంశమున జనించిన పరహితునికుమారుడు; యజుశ్శాఖాధ్యాయి; అపస్తంబసూత్రుడు: భారద్వాజగోత్రుడు; పుణ్యాత్ముడు; భూలోక ధన్వంతరి; పండితశ్రేష్ఠుడు నగు భాస్కరార్యుడు.

దత్తాగ్రహారము:- కొండవీటిసీమను వెలనాటిదేశమున గృష్ణవేణ్ణానదీదక్షిణతీరమునగల పొన్నుపల్లి గ్రామము. వెలనాడనగా దుంగభద్రానదికి దూర్పుగా సముద్రముదాక నున్నదేశము. "తుంగభద్రాతరంగిణ్యాః ప్రాగ్దేశం వెలనాం డితి"- పులివఱ్ఱుశాసనము. ఈ తుంగభద్ర కర్నూలుమండలమందలిది కాదు. గుంటూరుమండలమందున్నది. ఇప్పుడది కొంత మురుగుకాలువగా మార్పబడినది పేరు మాసియున్నది.

ప్రదానము:- కృష్ణవేణ్ణానదియొడ్డున సోమేశ్వరస్వామిసన్నిధిని అగ్రహారములనుండి యరుగుదెంచిన బ్రాహ్మణులయెదుర బుత్త్రపౌత్త్రపారంపర్యముగా ననుభవింప ననుజ్ఞయిడి చేయబడినది. కృష్ణోభయతటములయందును సోమేశ్వరాలయములు రెండుకలవు. ఉభయసోమేశ్వరములని వాని నామములు. పాపవినాశము, కోటిపల్లియని

యా గ్రామముల పేళ్లు. పొన్నుపల్లివైపున గృష్ణయొద్దున నున్నసోమే శ్వరాలయము కోటిపల్లిది.

శాసనకృతి:- సంస్కృతభాషలో శ్లోకరూపముననున్నది. గ్రామసీమాచిహ్నములు తెలుఁగుననే కలవు.

కృతికర్త:- వీరశ్రీ వేమభూపతికి విద్యాధికారియు, విద్యల కాకరము నగు శ్రీనాథుఁడు.

ఈ దానశాసనమునకుఁ దర్వాత మఱి నాల్గేండ్లకుఁ బెదకోమటి వేమభూపాలునిదే వేఱొక పొన్నుపల్లిశాసనము కానవచ్చుచున్నది. దీనికి సీమాచిహ్నములు కొన్ని కలసియుఁ గొన్ని కలయకయు నున్నవి. ప్రతిగ్రహీతలు సంబంధులే యగుచున్నారు. ఇప్పుడు రెండు పొన్నుపల్లెలు తెలియరావు. రెండుశాసనములందును దత్తాగ్రహారమగు పొన్నుపల్లి యొక్కటేయగునేని నాల్గేండ్లలో విద్వరకు భిన్నముగా దానముచేయ నేల ప్రసక్తించెనో యెఱుఁగరాదు. ఈ రెండును తామ్రశాసనములే. రాగిరేకు లిప్పుడు దొరకలేదు. ప్రాచ్యలిఖితపుస్తకశాలలో మెకంజీదొరగారినాళ్లలో వ్రాయింపఁబడిన ప్రతులున్నవి. వేనాపొన్నుపల్లిగ్రామమున కరిగి యాశాసనములనుగూర్చి విచారించితివి. అక్కడివారి దగ్గఱఁగూడఁ బ్రతులేకాని మూలములులేవు. పొన్నుపల్లె యిప్పుడు రేపల్లె తాలూకాలో నున్నది. పయిఁజెప్పఁబడిన రెండుపొన్నుపల్లెల శాసనములలో నిప్పు డుపవర్ణితమయిన శాసనకాలము శాఁ 1326. రెండవదానికాలము శా. 1330. శా. 1326 శాసనమును శా. 1410లో (అదియాతని 28వ రాజ్యసంవత్సరము) నొడ్డెరాజగు పురుషోత్తమగజపతి పరహితపండితులకు దత్తముగా నంగీకరించినాఁడు.

కావున గ్రామము మొదటి శాసనముప్రకారమే చెల్లుబడికి వచ్చెనని తెలియవచ్చుచున్నది. శా. 1330 శాసనము సీమాచిహ్నములు భిన్నముగా నుండుటచేతను నందుఁ బొన్నుపల్లి వేమవరమని నామాంతరముంచినట్లుండుటచేతను నాపొన్నుపల్లె మొదటి పొన్నుపల్లెకు జేరిన వేఱొక గ్రామవాటికయగునేమో యను సంశయమునకును నవకాశముగలదు. పయిశాసనమునఁ బ్రతిగ్రహీత పరహితవంశ్యుఁడు గదా! ఇంతకుఁ బూర్వము వెలసిన ముప్పభూపతి యక్కలపూఁడి శాసనమునఁగూడఁ బ్రతిగ్రహీత పరహితవంశ్యుఁడే. అనితల్లి కలువచేరుశాసనమునఁగూడ నీశాసనమందున్నట్లే పరహితవంశప్రశంస గలదు. అక్కడఁగూడఁ బరహితవంశ్యుఁడే ప్రతిగ్రహీత. పరహితసంహితయని యొకయాయుర్వేదగ్రంథము గలదు. తత్కర్త యేతద్వంశ్యుఁడు కావచ్చును. ఆ కాలమున నంధ్రదేశమున నాయుర్వేదము బహుప్రచారము కలదిగా నుండెననుట కిట్టివి యింకను గొన్నిశాసనములున్నవి. శా. 1330 పొన్నుపల్లిశాసనమునఁ బ్రతిగ్రహీతకూడ నాయుర్వేద విద్వాంసుఁడే. పయిశాసనమున 'కృష్ణవేణ్ణామహానద్యాః' యని కలదు. శ్రీనాథుని యితరశాసనములందును "కృష్ణావేణ్ణాజలక్రీడా వినోదుండు" మొదలగువిధముల గృష్ణవేణ్ణ యనుపదము ప్రయోగింపఁబడినది. కొందఱు కృష్ణవేణీనది యగునుగాని కష్ణవేణ్ణానది కాదనియుఁ బయిశబ్దము తప్పనియు వాదింతురు. అదిసరికాదు. కృష్ణయు వేణ్ణయు నను రెండునదులు కలయుటచే నాపే రేర్పడినది. ఆ రెండు నదులును సహ్యాద్రికడ సంగమించినవట.

"శ్లో॥ సహ్యాద్రేరుత్తరం శృంగం తత్ర బ్రహ్మగిరిస్స్మృతః

* * * *

తృతీయప్రకరణము

తస్మాద్దక్షిణతో విప్రా రమ్యోవేదగిరి స్స్మృతః
తయో ర్మధ్యే మహ త్తీర్థం రమ్యం మామకం స్మృతమ్
యత్రామలకవృక్షశ్చ పుణ్యైరేవ ప్రదృశ్యతే
తస్య మూలా త్సముద్భూతా వేణ్ణా నామమహానదీ
తస్మిన్ ప్రదేశే చాశ్వత్థమూలా త్కృష్ణా సముద్గతా."

—కృష్ణామాహాత్మ్యము

తుంగభద్రయను పదముకూడ నిట్టిదే. తుంగయు, భద్రయుఁ గలయుటచేఁ దుంగభద్ర యయ్యెను. తెనుఁగున జక్కన విక్రమార్కచరిత్రలో యతిలో "నాగమణిహార కృష్ణవేణ్ణావిహార!" యని ప్రయోగమున్నది. కృష్ణవేణీనది యనికూడ నర్వాచీనప్రయోగములు లేకపోలేదు.

కనుకుఱ్ఱు తామ్రశాసనము. శక. 1326.

ఈ శాసనముమూలము ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో మెకంజీ దొరగారికాలమున వ్రాయింపఁబడిన ప్రతి కలదు. కాని యందు దాతృవంశవర్ణనాదికమయినతర్వాతఁ గొంతభాగము చాళుక్యశాసనప్రసక్తవిషయము వ్రాయఁబడియున్నది. అటుతర్వాత శాసనకాలము దత్తాగ్రహారము సీమాచిహ్నాలు గలభాగము సరిగానున్నది. ప్రతిగ్రహీతృవిషయముగల తేకొకటి మూలముననే లోపించి తత్స్థానమున నొక చాళుక్యరాజశాసనముతేకు చేర్పబడియుండుటచే మెకంజీదొరగారి వ్రాఁతప్రతిలోఁబై విధమున నుండుట తటస్థించెనేమో యనుకొనియెదను. ఈశాసన మిదివఱకుఁ జరిత్రకారులు చర్చించినదికాదు. ఇదివఱకు వివరింపఁబడిన పొన్నుపల్లిశాసనమును గల్వవాములశాసనమును నీ శాసనమును నొకకాలమున వెలకొల్పఁబడినవే. శక. 1326 తారణసంవత్సర పౌషామావాస్యాప్రయుక్త సూర్యోపరాగపుణ్యకాలముననే యీ కనుపు

కుఱ్ఱుకూడ సగ్రహారముగాఁ బెదకోమటి వేమభూపాలునిచే నీయఁబడి నది. కసువుకుఱ్ఱు బాపట్లతాలూకాలో పొన్నూరికిఁ జేరువనున్నది. ఈ శాసనముకూడ సంస్కృతశ్లోకరూపమున నున్నది. సీమాచిహ్నాలు మాత్రము తెల్గు. శాసనకృతికర్త విద్యాధికారి శ్రీనాథుఁడే. దీనిఁగూర్చి యింతకంటె నెక్కుడ వ్రాయఁదగినది లేదు.

కల్వపాముల తామ్రశాసనము. శక. 1326.

ఈ శాసనము క్రొత్తగా శాసనపరిశోధకుల ప్రయత్నమున బయల్పడినది. ఇదివఱకు ముద్రితము. పొన్నుపల్లి కసువుకుఱ్ఱు తామ్రశాసనములను నీకల్వపాముల తామ్రశాసనమును నొక్కకాలమున నెలకొల్పఁబడినవే. శక. 1326 అగు తారణ సంవత్సరపౌషామావాస్యా సూర్యోపరాగకాలమునఁ బెదకోమటి వేమభూపాలుఁడు ఖండవాటస్థలమునఁ గల కల్వపాముల గ్రామమును హారీతగోత్రుఁడును యజుర్వేదవేదియునగు పెద్దియజ్వకు దానముచేసి యీశాసనము వెలయించినాఁడు. ప్రతిగ్రహీతయగు పెద్దియజ్వ శక. 1296 సంవత్సరమున ననవేమ నృపాలునిచేఁ బచ్చనితాండిపఱ్ఱుగ్రామము నగ్రహారముగాఁ బడసినవాఁడు. ఈవంశమువారు గొప్పవిద్వాంసులు. కృష్ణాతీరమున ననేకయజ్ఞములు చేసిన మహావిద్వాంసుఁడు భీమేశ్వరయజ్వ యీతని ప్రపితామహుఁడు. షట్తర్కకర్కశాలాప ప్రక్రియాపరమేశ్వరుఁడు,మహావిద్వాంసుఁడు పోతయ యీతని పితామహుఁడు. పౌండరీకయాగముచేసి బ్రహ్మసంతతికి నలంకారమయినవాఁడు గుండయ యీతనితండ్రి. ఈతఁడు బ్రహ్మసూత్రాదిసిద్ధాంతములను దఱచిచూచిన త్రికాలవేత్త, దైవజ్ఞుఁడు, గోదావరీతటమున ననేక యజ్ఞములు చేసినవాఁడు. ఈతఁడే శక. 1333 ఖరసంవత్సరమున మరలఁ బెదకోమటి

వేమభూపాలునిచే నింకొక యగ్రహారమును నందమూరును బడసినాఁడు. ఈ శాసనకృతి విద్యాధికారి శ్రీనాథుఁడు రచించినదే. దత్తాగ్రహారమగు కల్వపాముల యిప్పుడు కల్వపాముల యనుపేరఁబరగుచున్నగ్రామమే కాఁబోలును. అది గుడివాడసీమ నున్నది. ఖండవాటయనునది కొండవీటికిఁ బ్రాచీననామ మగునేమో పరిశోధింపవలసియున్నది.

పినపాడు తామ్రశాసనము శక. 1327.

ఇదికూడ శాసనపరిశోధకుల ప్రయత్నమున బయల్పడినదే కాని యొక్కరేకు మాత్రమే దొరికినది. అం దీశ్లోక మున్నది:—

"శ్లో. దాతా కోమటివేమనామనృపతిః పాత్రం గురు శ్శంకరః
స్థానంచే త్పినపాడు రత్ర తు కవి శ్శ్రీనాథభట్టారకః ;
కాలశ్చే చ్ఛివరాత్రిపుణ్యసమయ స్సాక్షీ మహా శ్రీగిరి
శ్శ్రేయః కిం నతు వర్ణ్యతే సుకవిభి శ్శృణ్వంతు తద్వైభవమ్."

ఇందుఁ బ్రతిగ్రహీతయగు శంకరగురునివంశమువారిప్పుడు పినపాడునం దున్నారు. వా రుద్భటారాధ్యసంతతి వారఁట! కొన్ని పురుషాంతరముల నుండి వారు లింగధారణము వర్జించినారు. దొరకిన యీశాసనపురేకు పయిఁగల గ్రంథభాగమున శాసనకాలము లేదు కాని పినపాటిలోఁ బ్రతిగ్రహీతృపరంపరలోనివారగు మృత్యుంజయారాధ్యులయింట నొక ప్రాచీన తాళపత్రగ్రంథమున నీదానప్రస్తావము వ్రాయఁబడియున్నది. అందీశ్లోకము గలదు.

"శ్లో. శాకాబ్దే గిరినేత్రమూర్తివిధుకే సంవత్సరే పార్థివే
మాఘే ఽస్మిన్ శివరాత్రి పుణ్యదివసే శ్రీవీరనారాయణః;

తస్మై శంకరదేశికాయ విదుషే భద్రానదీప్రాక్తటే
గ్రామం శ్రీపినపాడు మత్తమ మదా దాచంద్రమాతారకమ్."

తప్పక యీశ్లోకము మీఁదిశాసనములోనిదే యగును. శా.శ. 1327 అగు పార్థివసంవత్సర మాఘమహాశివరాత్రి పుణ్యకాలమునఁ బెదకోమటివేమభూపాలుఁడు పినపాడు గ్రామమును శంకరదేశికునకు దానముచేసెనని మీఁదిశ్లోకమున కర్థము. ఈదానము శ్రీశైలమునఁ జేయఁబడినది. శివరాత్రికి వీరందఱు శ్రీశైలమున కరిగిరి. అక్కడ దానము జరిగినది. శృంగారనైషధకృతిపతి "శ్రీగురు శంకరమౌనిదయాగౌరవనిత్యవర్ధితాన్వయ" యని వర్ణింపఁబడినాఁడు. ఆశంకరమౌని యీ శంకరదేశికుఁ డగునేమో? ఎఱ్ఱాప్రెగ్గడగురుఁ డొకశంకరస్వామి యున్నాఁడు.

పోన్నుపల్లి తామ్రశాసనము.

ఇది శా. శ. 1330 సర్వధారిసంవత్సరమునాశ్వయుజామావాస్యా సూర్యోపరాగపుణ్యకాలమునఁ బెదకోమటి వేమభూపాలుఁ డగ్రహారదానము చేయుసందర్భమున రచియింపఁబడినది.

ప్రతిగ్రహీతః- కల్యాణగుణశాలియగు పెర్యపిళ్ళకు నప్తః వేదవేదాంగనిధియగు భట్టభాస్కరార్యునిపౌత్త్రుఁడు; అష్టాదశవిద్యాపారంగతుఁడయిన విశ్వయార్యునకుఁ బుత్త్రుఁడు; సాష్టాంగమయిన యాయుర్వేదవిద్య నధ్యయనము చేసినవాఁడు; పతంజలిమహాభాష్యప్రక్రియయం దాఱితేఱినవాఁడు; పూర్వోత్తరమీమాంసలు చక్కఁగా నేర్చినవాఁడు; కణాదగౌతమతర్కములు నభ్యసించినవాఁడు; యజుర్వేదవేది; ఆపస్తంబ సూత్రుఁడు; శివభక్తుఁడు నగుసింగనార్యుఁడు. వీరు

ద్రావిడులుగాఁ దోచుచున్నారు. ఇప్పుడు పొన్నుపల్లెలో ద్రావిడు లున్నారు.

దత్తాగ్రహారము:- త్రిలింగదేశమున వెల్నాటిదివిసీమను (?) కృష్ణవేణ్ణానదికిఁ జేరువనున్న పొన్నుపల్లి. దీనికే పొన్నుపల్లి వేమవర మని నామాంతరము గాఁబోలును. శాసనము శ్లోకరూపము. గ్రామసీమా చిహ్నాలు తెలుఁగుననే కలవు. అందు "శ్రీనాథభట్టరు శాసనాచార్యదక్షిణ భాగం వకటి" అనుట పరిశీలింపఁదగియున్నది. ఈశాసనము మూల మిప్పుడు లభింపకున్నది. దీనిఁగూర్చి శక 1326 పొన్నుపల్లిశాసన మనఁ గొంతవ్రాసియున్నాఁడను. చరిత్రకారు లిదివఱకు దీని నెఱుఁగుదురు.

పొట్లపాటి తామ్రశాసనము.

శా.శ. 1330 సర్వధారి సంవత్సరమందే యాశ్వయుజామావాస్యా సూర్యోపరాగపుణ్యకాలమందే పెద్దకోమటి వేమారెడ్డి పొట్లపాడనుగ్రామమును బిళిపాటి రామభద్ర సోమయాజులకు సగ్రహారీకరించి దానముచేసినప్పుడు నెలకొల్పెనఁట. ఆశాసన మిప్పుడు దొరకలేదు. దానినిగూర్చి ప్రాచ్యలిఖితపుస్తకశాలలో నీ క్రిందిలేఖనమున్నది.

'లోకల్‌రికార్డు వాల్యూం నెం 3 రు. పేజీ 559.

పొట్లపాటి అగ్రహారం సంతు నాదెండ్ల సర్కారు మృత్తుజాంనగరు తాలూకే సత్తినేపల్లి.

'శ్రీమద్యజనయాజన అధ్యయన అధ్యాపక దానప్రతిగ్రహ షట్కర్మనిరతులైన ఆపస్తంబసూత్రులున్ను యజుశ్శాఖాధ్యాయులున్ను

అయిన భారద్వాజగోత్రోద్భవులున్ను అయిన పిశిపాటి రామభద్ర సోమయాజులుగారు బహుతపస్సంపన్నులున్ను బ్రహ్మవిద్వాంసులున్ను అయివుందురు గనుక వీరిని పూజించి వీరికి ఆచంద్రార్కస్థాయిగాను యీపొట్లపాడు అష్టభోగసహితంగాను అగ్రహారంచేసి స్వస్తిశ్రీ శక వరుషంబులు ౧౩౩౦(A. D. 1408) అగు నేటిసర్వధారినామ సంవత్సర ఆశ్వీజ బ౩౦ లు సూర్యగ్రహణకాలమందు కృష్ణవేణ్యానదీతీర మందు శ్రీమతు కోమటివేమయరెడ్డింగారు పిశిపాటి రామభద్రసోమయాజులు గారికి సహిరణ్యోదకదానధారాపూర్వకంగాను ధారాగ్రహీతం చేసిరి గనుక రామభద్రసోమయాజులంగారు యీస్థలమందు కుటుంబ యుక్తముగా అగ్నిహోత్రములతోగూడా యీగ్రామంలో ప్రవేశించి గృహనిర్మాణములుచేసికొని యాగాద్యనుష్ఠానాది సత్క్రియలు చేసు కుంటూ నిరతాన్నదానపరులయి పయిని వ్రాసిన కోమటి వేమారెడ్డి గారున్ను, వీరితమ్ములయిన రాజనవేమనరెడ్డిగారున్ను శా.౧౩౪౨ (1420) శకంవరకు ప్రభుత్వం చేసినవరకు రామభద్రసోమయాజులు గారు అనుభవించినారు.''

ఫిరంగిపురపు శిలాశాసనము.

శా. 1331 విరోధి ఫాల్గుణ బహుళ ద్వితీయనాఁడు పెద్దకోమటి వేమభూపాలుని భార్యయును, ధాన్యవాటీపురాధిపతియగు గన్నభూపా లుని కుమార్తెయునగు సూరమాంబ త్రవ్వించిన సంతానసాగరమను తటాకము ప్రతిష్ఠోత్సవమున రచింపఁబడినది. శ్రీనాథకృతశాసనము లన్నింటిలో నిది గొప్పది. ఇందు సంతానసముద్రవర్ణనముగా నున్న సంస్కృతశ్లోకములు మిక్కిలి ప్రౌఢములై యున్నవి. చివరఁ దటాక నిర్మాణమును గీర్తించు సంస్కృత భారత శ్లోకములు మూఁ డుదాహ

రింపఁబడినవి. పురాణేతిహాసము లాతనికి సమ్యక్పరిచితములని యెఱుఁగవలయును. కడపట ముచ్చటఁగూర్చు సీసపద్యములు మూఁడు చెప్పినాఁడు. శాసనములయందుఁగూడ సీసపద్యములనే రచించుట యాతని కావద్యములపైఁగల్గు నభిమానమును దెలుపుచున్నది. మఱియు "నుభయభాషాకవిత్వ ప్రయోగకుశలు" నని హరవిలాసమునఁ జెప్పికొన్న సంస్కృతభాషాకవితాకౌశలము నిందలి సంస్కృతశ్లోకములు రాద్ధాంతీకరించుచున్నవి. ఈశాసనమును శ్రీజయంతి రామయ్యపంతులు గారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో సవిమర్శముగా వెల్లడించినారు. విశేషము లక్కడ చూడఁదగును.

నందమూరు తామ్రశాసనము: శా. 1333.

ఈ శాసనము క్రొత్తగా శాసనపరిశోధకుల ప్రయత్నమున బయల్పడినదే. బాపట్లతాలూకా కోడితాడిపఱ్ఱుగ్రామమున దొరకినది. ఇంతవఱ కిది ముద్రితము కాలేదు. ఇది శాక. 1333 అగు ఖరసంవత్సర మార్గశిరశుద్ధత్రయోదశీధనుస్సంక్రమణ పుణ్యకాలమునఁ బెదకోమటి వేమభూపాలునియగ్రహారప్రదాన సందర్భమున వెలయింపఁబడినది.

ప్రతిగ్రహీత.- శక. 1326 అగుకల్వాములశాసనమునఁ బ్రతిగ్రహీతగానున్న పెద్దియజ్వయే యిక్కడఁగూడఁ బ్రతిగ్రహీత.

దత్తాగ్రహారము:- కంద్రవాడసీమనుగల నందమూరుగ్రామము. గ్రామసీమాచిహ్నములు తెల్గున నున్నవి. తక్కినది సంస్కృతశ్లోకరూపము. శాసనకృతికర్త విద్యాధికారి శ్రీనాథుఁడు.

## ఆలపాడు తామ్రశాసనము: శా.శ. 1334.

ఇది శా.శ. 1334 అగు నందన సంవత్సర మాఘబహుళమున శివరాత్రిదినమునఁ (సూర్యగ్రహణ సమయమున?) బెద్దకోమటి వేమ భూపాలుఁ డగ్రహారదానము చేయుసందర్భమున నెలకొల్పఁబడినది.

ప్రతిగ్రహీత.— విద్యావిహారభూమియగు మాధవార్యుని ప్రపౌత్రుఁడు; వేదాదివిద్యలకుజన్మమందిరమగు గుండయార్యునిపౌత్త్రుఁడు; శాపానుగ్రహదక్షుఁడు; లక్ష్మీనరసింహమంత్రసిద్ధుఁడు; సకలకవిసార్వభౌముఁడు;నగు మాధవార్యుని పుత్త్రుఁడు; భారద్వాజ గోత్రుఁడు; విద్యావినయాన్వితుఁడు; విశ్వేశ్వర విద్వాంసుఁడు. దత్తాగ్రహారము:— వెలనాటిలోఁ దుంగభద్రాతీరస్థమగు నాలపాడను గ్రామము. శాసన కృతికర్త — విద్యాధికారి శ్రీనాథుఁడే. విశ్వేశ్వరభట్టారకుఁ డీయగ్రహారమును బడసి యచ్చటనే విశిష్టబ్రాహ్మణులకుఁ దనవంతుగాక మిగిలిన గ్రామము నఱువదిపాళ్ళుగాఁ బంచియిచ్చెను. వారి పేళ్ళు,భాగములసంఖ్య కలదు. ఈశాసన మిదివఱకు ముద్రితముకాదు. దీని మూలము చెన్నపురి మ్యూజియములో నున్నది.

ఈ శాసనమునఁ బ్రతిగ్రహీతగానున్న విశ్వేశ్వరభట్టారకుఁడు చమత్కారచంద్రికాకారుఁ డగునా? ఆతఁడును భారద్వాజగోత్రుఁడే. షష్ఠప్రకరణమున నాతనిఁగూర్చి చూడఁదగును.

## పుల్లరిబోడు శిలాశాసనము: శా.శ. 1337.

ఈశాసన మహీనాబాదునకు నీశాన్యపుఁ బ్రక్కనున్న పుల్లరి బోడు కొండ పడమటివైపునఁ గలదు. శా. 1331 వికృతి వత్సరమునఁ

తృతీయప్రకరణము

దనతల్లి సూరాంబచేఁ ద్రవ్వింపఁబడిన సంతానసాగర మను చెఱువు నకు నీటి వసతిఁ గల్పింపఁగాఁ బెదకోమటి వేమభూపాలుని కుమారుఁ డగు రావవేమారెడ్డి 'జగనొబ్బగండ కాలువ" యనుపేరఁ గాలువను ద్రవ్వించెను. ఆ సందర్భమున నీ శాసనము చెక్కఁబడినది. విషయ మంతగొప్పదికాకపోవుటచేతనో, రాచవేమనయెడ ననాదరముచేతనో, లేక యాఁతఁడప్పటికి రాజుకాకపోవుటచేతనో శ్రీనాథుఁ డీశాసనమును దక్కినశాసనములవలెఁగాక లఘువుగా నొకసీసపద్యముతో ముగించి నాఁడు. శాసనావసానమున 'శ్రీనాథకృతి' యనికలదు.

## రుద్రవరము తామ్రశాసనము శా.శ 1341.

ఇది శా. 1341 అగు వికారి సంవత్సర మార్గశిరమున ధను స్సంక్రమణపుణ్యకాలమునఁ బెదకోమటి వేమభూపాలుఁడు రుద్రవర మనుగ్రామమును దానముచేయుసందర్భమున నెలకొల్పఁబడినది.

ప్రతిగ్రహీత:- ఇదివఱకుఁ గల్వామూల సందమూరు శాస నములందుఁ బ్రతిగ్రహీతగానుండిన పెద్దియజ్వకుమారుఁడును గంగా ధరజ్యోతిషకుని యగ్రజుఁడునునగు రామచంద్ర జ్యోతిషకుఁడు. దత్తాగ్రహారమున ముప్పదిమూఁడుపాళ్ళతఁడును, మిగిలినభాగ ములు మఱికొందఱును బుచ్చుకొనిరి. శాసనకృతికర్త విద్యాధికారి శ్రీనాథుఁడే. ఈశాసనమునుగూడ సంస్కృతశ్లోకరూపమే.

## మూలఁగూరమ్మకొండమీఁది శాసనము.

ఈ శాసన మసమగ్రముగా నున్నట్టున్నది. రచింపఁబడిన కాలము నాకుఁ దెలిసినదికాదు. ఫిరంగిపురపు శిలాశాసనమున కించుక

మిందువెనుకలుగా నుండు ననుకొనెదను. అనవేమభూపాలుఁడు మూలఁగూరమ్మకు శా. 1298 నలవత్సర మాఘపూర్ణిమనాఁడు ధార పోసియిచ్చిన పడిదరము. మూలఁగూరు, పలకలూరు అను గ్రామము లకు నటుతర్వాత ముప్పదియేండ్లకు రాజ్యమునకు వచ్చిన మన పెద కోమటి వేమభూపాలుఁడు సర్వకరపరిహారముగా సాష్టైశ్వర్యముగా సాష్టభోగముగా సర్వకాలమును సర్వమాన్యత (సర్వదుంబాలా యీనాం) దయచేసి మూలఁగూరమ్మకు గుడియుఁ, బ్రాకారమును నిర్మించినసందర్భమున వెలయింపఁబడినది. రెండుసీసపద్యములు- పద్యముల తర్వాతఁ గొంతవచన మున్నట్టు తెలియుచున్నది. ఈశాస నము ప్రతిని శ్రీ జయంతి రామయ్యపంతులుగారికడనుండి నేను కయి కొంటిని. శాసనశిలను బరిశోధించి విశేషములు నిర్ణయింపవచ్చు ననుకొనెదను

## పెదకోమటివేముని కాశీయాత్ర.

పెదకోమటి వేమారెడ్డి కాశీయాత్ర చేసినాఁడనుటకుఁ గొన్ని యాధారములు కలవు. వేమభూపాలచరిత్రమున సంస్కృత గద్య ప్రబంధమున నాతఁడు దిగ్విజయార్థ మాసేతుశీతాచలము యాత్రచేసి నట్లు సవిశేషముగా వర్ణనమున్నది. ఆగ్రంథమునందున్న ప్రధానవిష యమే యది. పెదకోమటి వేమారెడ్డి శాసనములందును గూడఁ గొన్నింట నిట్టి ప్రశంస కలదు.

"శ్లో॥ శ్రీశైలే స్థిరమూలతా మపగతా వృద్ధిం కుమారాచలే
వందారామతలే ప్రతానసుషమా సింహాచలేంద్రే తతః,
శ్రీకూర్మే పురుషోత్తమే కుసుమితా యద్ధర్మకీర్తి ర్లతా
కాశ్యాం విశ్వపతేః పురః ఫలవతీ నిత్యోపహారోచితమ్."

"పెదకోమటివేమారెడ్డికీర్తిలత శ్రీశైలమున స్థిరమూలమై కుమారాచలమున వృద్ధినొంది పంచారామములందును, సింహాచలమునను బందిరియల్లి, శ్రీకూర్మమునను బురుషోత్తమమునను బుష్పించి కాశిలో విశ్వనాథునెదుర నిత్యనైవేద్యమున కుచితముగా ఫలించెను." అని పయిశ్లోకమునకర్థము. అనఁగాఁ బెదకోమటివేమారెడ్డి పయిస్థలములందు దానధర్మములు చేసెనన్నమాట. ఈస్థలములు క్రమముగాఁ గాశీమార్గమున నున్నవి. ఈ స్థలములందు దానధర్మములు చేయుట కాతఁడక్కడకు వెళ్ళియుండవలెను. కాశిలో విశ్వనాథునకు నిత్యనైవేద్యము నిమిత్తమేదో దానము చేసినాఁడఁట. పయిశ్లోకము పెదకోమటివేమారెడ్డిభార్య సూరాంబ వెలయించిన ఫిరంగిపురశాసనమునను (శా.శ. 1331) నఁ గలదు. తర్వాతిదగు రుద్రవరశాసనమునను గలదు. కావున నీకాశీయాత్ర శా. 1330కిఁ బూర్వమున నాతఁడు చేసినట్లు తెలుచున్నది. ఆకాలమునఁ గాశీయాత్రయనఁగా నట్టిరాజులకు నించుమించు సంవత్సరకాలము పట్టునట్టిది యగును. శ్రీనాథకవీశ్వరుఁడు గూడ నప్పుడు వేమభూపాలునితోఁ గాశి కరిగియుండునని నేను దలంచుచున్నాను. కాశీఖండరచనాభిమానమును, నందలి కాశీసన్నివేశవర్ణనావిశేషములును బయియూహకు స్ఫోరకములు. ఈ క్రిందిశ్లోకము గూడ నాతనికాశీరామేశ్వరయాత్రను దెలుపుచున్నది.

"శ్లో. కావేర్యాం త్రిపురాంతకే జయపురే కాళీపురే గోకులే
పంచారామపురీషు పట్టసపురే మార్కండకంబోః పురే,
గంగాసాగరసంగమేషు సిరతం శ్రీకొండవీటీపురే
బాళుక్యామయుతాన్నదాననిరత శ్రీవేమభూపప్రభుః"

## పెదకోమటివేమారెడ్డి యిక్కట్టులు.

రాజమహేంద్రవరమున రాజ్యమేలుచున్న కాటయవేమనతోను నల్లాడ వేమవీరభద్రారెడ్లతోను మన కోమటివేమారెడ్డికిఁ బ్రబల విరోధమయ్యెను. వారితనితోఁ బోరాడి కొంత రాజ్యభాగమును గోదావరీతీరగతము నాక్రమించుకొనిరి. రాచకొండవెలమరాజులశత్రుత్వ మంతకంటెను బలిష్ఠమై మిక్కిలి యిక్కట్టులు గలిగించుచుండెను. మాదయలింగమనేనితో వివాదము దుర్భరముగా నుండెను. ఒకప్రక్క విజయనగరప్రభువులతోఁ గూడ విరోధ మున్నట్టున్నది. ఈ క్రింది పద్యము కర్థసందర్భ మేమో స్పష్టముగాఁ దెలియదుగాని పెద కోమటివేమారెడ్డి యిక్కట్టు నెఱింగించుచున్నది.

సీ. ఆచెంప నుద్దండ (?) అనవేమపురమను
గ్రామంబు తోరణకట్టిరేని
ధరణికోటనుగల్గు ధనధాన్యవస్తువు
లరికట్టుకొని చూఱ లాడిరేని
మమకొని యభిమానముద్ద భక్షింపంగ
సారెకుఁ జేయులు సాఁచిరేని
అభ్యంగనము సేయు నన్న గారికిఁ దెచ్చు
నూనెలోఁ జేతులు నూచిరేని

కఱఁగి శత్రులుచేయు నకార్యమునకు
నోర్చియుంటివి నీసాటి యుర్విఁ గలఁడె
సమదరిపువీరరాజవేశ్యాభుజంగ!
అతులబలభీమ! పెదకోమటన్నవేమ!

ఈపద్యము పెదకోమటివేమారెడ్డి రాజ్యాలాభకాలమునఁ గల్గిన చిక్కులను సూచించునదియుఁ గావచ్చును. వెలుగోటివారివంశ

చరిత్రలనుబట్టిచూడఁగాఁ బెదకోమటివేమారెడ్డి మాదయలింగమనేనితోఁ బోరాడి యోడిపోయినట్లు తెలియుచున్నది. మాదయ లింగమనేఁడు పెదకోమటి వేమారెడ్డి నోడించుటయేకాక రెడ్లవిజయాంకమగు సందికంత పోతురాజను పేరి కటారినిగూడఁ గొట్టుకొనిపోయెనఁట. రేచర్ల వెలమరాజులలో మాదయలింగమనేఁడు నిస్సామాన్యపరాక్రముఁడుగాఁ గీర్తింపఁబడినాఁడు. ఈకాలమునఁ గొండవీటి రెడ్డిరాజ్యము ఛిన్నభిన్నము కాఁజొచ్చెను. కొండవీటిరాజ్యము రాజులకందఱకుఁ గన్నెఱ్ఱ గలిగించునదిగా నుండుటయే కారణము. "ముగురురాజులకును మోహంబు గలిగించు కొమరుమించినవీడు కొండవీడు." విద్యానగర ప్రభువులు, గజపతులు, రాజమహేంద్రవరపు రెడ్డిరాజులు, వెలుగోటి వెలమరాజులు, నాల్గుపక్కలనుండి తాఁకుచున్నప్పుడు పెదకోమటివేమారెడ్డికి రాజ్యనిర్వాహము కష్టసాధ్యముగా నుండెను. అతని కొడుకు రాచవేమన రాజ్యకార్యములు చూచుచున్నను నంతసమర్థుఁడుగాకుండెను. ఈరాజ్యోపప్లవకాలమున శ్రీనాథుఁడు కొండవీడు వీడినాఁడుగాఁడు. రెడ్డిరాజ్యము నిల్వరించుటయం దీతని కభిమానము మెండుగా నుండెను. కటారిని గోల్పోవుట రెడ్డిరాజులకు రాజ్యమే కోల్పోవుటగా నుండెను. అదిలేకయున్న రాజ్యమును నిల్వరించుకొనఁ జాలమను నధైర్యమున వారుండిరి. కులక్రమాగతమగు నాకటారిని మఱలఁ దమయొద్దకుఁ జేర్చుకొనుటకు వారికిఁ బరాక్రమము చాలకుండెను.

## దేవరకొండ ప్రయాణము.

శ్రీనాథకవీశ్వరునిఁ గోరెరి. దేశాభిమానము, రాజ్యాభిమానము, ప్రభుభక్తి, కవిత్వదర్పము ప్రేరేపఁగా శ్రీనాథుఁ డాకటారిని గొని తెచ్చుటకయి దేవరకొండలో రాజ్యమేలుచున్న మాదయలింగమనేనిని

దర్శింప నరిగెను. శ్రీనాథునివంటి మహాకవి వచ్చినప్పుడు లింగమ నేఁడేమి! సింగమనేఁడేమి! యెవ్వ రయినను వినయవిధేయతలు చూపుట తమ ప్రఖ్యాతికివన్నెపెట్టుకొనుటయెగదా! అదిగాక తమ ప్రత్యర్థి రాజులదగ్గఱ నాస్థానకవీశ్వరుఁడుగానున్న యుద్దండపండితుఁడు తమ్ముఁ దర్శింప నరుగుదెంచుట తమకెంతయుఁ బ్రతిష్ఠావహమను కుతూహల ముతో నా లింగమనేఁ డాతని నెంతో బహూమానించెను. శ్రీనాథుఁ డాతనిఁ బొగడెను:

సీ. జగనొబ్బగండాంక! సంగ్రామనిశ్శంక
జగతీశరాయవేశ్యాభుజంగ!
అఖిలకోటగ్రోల! యరిరాయమదభంగ!
మేలందు ధరణీశ మీనజాల!
మూరురాయరగండ! మురియురాజులమిండ!
యతివ్యర్థి రాయచౌహత్తమల్ల!
ఘనగాయగోవాళ! కామినీపాంచాల!
బ్రహ్మయు శశివంశ పరశురామ!

గీ. దండిబిరుదులసురతాణి గుండెదిగుల!
బళిర! యల్లయవేముని పగరమిండ!
రమణమించిన మేదినీరావుబిరుద!
సంగరాటోప! మాదయలింగభూప!

శ్రీనాథుఁడు శత్రుపక్షమువదలితన్ను మెచ్చినందులకై లింగమనేఁ డత్యంతానందభరితుఁడై వలసినవాంఛితము కోరుమని వేఁడుకొనెను రాజ్యమో ధనమో యాచించు ననుకొనెనఁట. స్వామిహితైక పరా యణతతో వచ్చిన మనకవిరాజు కటారినే వేఁడెను. దాని నొక విజయ

ప్రశస్తిచిహ్నముగా ధరింపజేసికొన్నవాఁడయ్యు నాతఁడు కవితా మహిమకుఁ గట్టువడి శ్రీనాథునిస్వామిహితతత్పరత కచ్చెరువందుచు నిచ్చి వేసెను. ఈ విషయము వెల్గోటివారివంశచరిత్రలేగాక నాగ్నజితీయ పరిణయమను ప్రబంధముకూడఁ బ్రశంసించుచున్నది:

మ. ధనరాజ్యంబులుమాని నెమ్మదిఁ బ్రమోదంబంది తన్గోరున
ట్టి నృపాలాగ్రణికోరిక ల్తీర్చుట కకుంఠీభూతచేతస్కుఁడై
చని సాధించినసత్కవిప్రవరు రాజన్యాగ్రణీమాన్యు వేఁ
బ్రణుతింతున్ బహుశైవసంగవిత సంభద్గాథు శ్రీనాథునిన్.

శ్రీనాథుఁడు కటారివి గొండవీటికిఁ గొనివచ్చెను. పెదకోమటివేమారెడ్డిశాసనములు క్రీ. 1420 కిఁ దర్వాత లేవు. ఆతఁడిర్వదియేండ్లు పరిపాలించినట్టు దండకవిలె, కైఫియతు, చాటుపద్యము చెప్పుచున్నవి. శాసనము లీయర్థమును స్థిరపఱుచుచున్నవి. కావున క్రీ. 1400, 1403 నడుమ రాజ్యమునకు వచ్చిన యాతఁడు 1420లోఁ జనిపోయెనని తలంపఁదగును.

## రాచవేమన.

పెదకోమటివేమారెడ్డితర్వాత రాజ్యమున కాతని కుమారుఁడు రాచవేమన వచ్చెను. ఈతనిపాలనకాలము నాలుగువత్సరములు మాత్రమే యని కైఫియతు, చాటువు, చెప్పుచున్నవి. ప్రోలయవేమన నాఁటనుండియు ధర్మోదర్కముగాఁ బెంపుగనుచున్న రెడ్డిరాజ్యమునకుఁ జెడ్డకాలమై రాజ్యమేలవచ్చిన యారాచవేమన తనదౌష్ట్యము కారణముగాఁ దనతో రాజ్యమునుగూడ వినాశపఱుచుకొనిపోయెనని దండకవిలె, కైఫియతు మొదలగు ప్రాచీనలేఖనములు చెప్పుచున్నవి. కొండవీటిరెడ్డిరాజ్య మీనాఁటితోఁ గూలిపోయినది.



# శృంగార శ్రీనాథము

## చతుర్థ ప్రకరణము

సీ. రెడ్డిరాజ్యం బంతరించె మిత్రులు దూర
దేశవంస్థితులు ప్రార్థింపఁ దొరఁగి
రొండె "దేశాటనం పండితమిత్రతా"
యని సూక్తి ప్రౌఢవిద్యావయోని
యోగమ్ము నెసకొల్పినొండె, శిష్యులతో గ్ర
హమువీడి పెక్కు దేశములు తిరిగి
యాప్తమిత్రులకోర్కి హరవిలాసము భీమ
ఖండమ్ము నని కృతుల్ రెండు నింకఁ

గీ. జాటువులు పెక్కు రచియించి, స్వర్ణపాత్ర
భోజనమ్ములు కస్తూరి బగటుగలను
గుదుర సుదురాసదానందపదవిఁ గనిన
సుకవిజనవిధేయుని సముత్సుకతఁ దలఁతు.

### కొండవీటి విప్లవము.

రావవేమనను ప్రజలే కడతేర్చిరని దండకవిలె చెప్పుచున్నది. అతఁడు చనిపోయిన తర్వాతఁ గటకమునందిన లాంగూలగజపతి శ.1420 నుండి 1431 దాఁకఁ గొండవీడు పరిపాలించెననియు నాతఁడు పెద మాంలెకోట, చినమాలెంకోట యని రెండుకోటలను గొండవీటఁ గట్టించి

## హరవిలాసము.

ఇది యేడాశ్వాసముల ప్రబంధము. హరవిలాసమను సంస్కృత గ్రంథమొకటి కలదుగాని దానికి దీనికి సంబంధములేదు. సంస్కృత గ్రంథమున కిది పరివర్తనముగాదు. సిరియాలచరిత్రము, పార్వతీపరిణయము, దారుకావనవిహారము హాలాహలభక్షణము, కిరాతార్జునీయము నను శివకథలనుగైకొని శ్రీనాథుఁడు స్వతంత్రముగా నీ గ్రంథమును రచించినాఁడు. కాళిదాస భారవిప్రభృతుల కుమారసంభవ, కిరాతార్జునీయాదులందలి శ్లోకములు కొన్నిటి కిందుఁ దెలుఁగుపద్యము లున్నవి. హరవిలాసమునఁ గృతిపతిప్రశంసయుఁ గృతికర్తృప్రశంసయు నిట్లున్నది.

"జంబూద్వీపమండలీ మకుట మండనాయమానంబగు కొండవీ (.... ..) లతాధిష్ఠితాష్టాదశద్వీపాంతరాళుండును నగుకొమరగిరిభూపాలువలన నాందోళికాచ్ఛత్రచామరతురంగ భద్రపీఠాది రాజ్యచిహ్నంబులు వడసి, యమ్మహారాజునకుఁ బతివత్సరంబును సంవత్సరో (వసంతో?) త్సవంబులఁ గస్తూరీ కుంకుమ సంకుమదకర్పూర హిమాంబుకాలాగురుగంధసార ప్రధానంబులగు సుగంధద్రవ్యంబులొదఁగూర్చియుఁ జీని సింహళ తవాయి హురుమంజి జోణంగి ప్రభృతి నానా ద్వీపనగరాకరంబులు ధనకనకవస్తువాహనసమాణిక్యగాణిక్యంబులు దెప్పించియుఁ గవిగైగమిక వాదివాంశిక వైతాళికాదులగు నర్థిజనంబులకు సర్వంబుల గుప్పించియు ధీరుండన, నుదారుండన, సదాచారుండన భువనవిఖ్యాతిగైకొని యొప్పు నవచిత్రిప్పప్రభుండొక్కనాఁ డాస్థాన మండపంబున సుఖోపవిష్టుండై:—"

శృంగారశ్రీనాథము

సీ. కమలనాభునిపౌత్రుఁ గవితామహారాజ్య
భద్రాసనారూఢుఁ బరమపుణ్యుఁ
బాత్రు నాపస్తంబసూత్రు భారద్వాజ
గోత్రు సజ్జనమిత్రుఁ గులపవిత్రు
భీమాంబికామారనామాత్యనందను
నఖిలపురాణవిద్యా ప్రవీణు
నధ్వర్యు వేదశాఖాధీతిసిష్ణాతు
సంధ్రభాషానైషధాబ్జభవుని

గీ. నుభయభాషాకవిత్వ ప్రయోగకుశలు
బాలసఖుఁ గారవించి తాత్పర్యమొప్ప
ననఘ దేవయత్రిపురారి యక్షరాజు
హితమితోక్తులు వెలయఁగ నిట్టులనియె:

క. కంటిని విశుద్ధ సంతతి
వింటిఁ బురాణములు పెక్కు విశ్వమువొగడన్
మంటి బహువత్సరంబులుఁ
గొంటి యశోధనము సుకవికోటి నుతింపన్.

గీ. ఆగమజ్ఞాననిధివి తత్వార్థవిదివి
బహుపురాణజ్ఞుఁడవు శుభభవ్యమతివి
బాలసఖుఁడవు శైవప్రబంధ మొకటి
యవధరింపుము నాపేర నంకితముగ.

హరవిలాసరచనావిషయమునుగూర్చి శృంగారనైషధరచనాకాల ప్రశంసలోఁ గొంత వ్రాసితిని. హరవిలాసము రచించుచు

శ్రీనాథుఁ డవచితిప్పయ యాదరానురోధమునఁ గాంచీపట్టణమునఁ గొన్నిమాసము లుండెనని విశ్వసించుట కుపపత్తులు కలవు. కృత్యవతరణిక, సిరియాలకథ యాతని కాంచీపరిచయమును దెలుపుచున్నవి. మఱియుఁ గాశీఖండమందలిదగు నీ క్రిందిపద్యము, శ్రీనాథుఁడు కాంచీపురమున వసించినప్పుడు చెప్పినచాటుధారయనఁదగును.

సీ. ముదువంగనేర్తురు మూఁడుదాఁపటికిరాఁ జికురబంధము లీఁగ జీరువాఱ............కంచి యరవత లసమాస్త్రఖడ్గలతలు.

ఈ పద్యమునకుఁ గాశీఖండమునఁ బ్రసక్తిలేదు. సంస్కృత కాశీఖండమున నిట్టివర్ణనములేదు. 'కాంచి' యనుపురమునకుఁ దీర్థయాత్రాపరుఁడు శివశర్మ పోయిన ట్టందుఁ గలదు. ఆశివశర్మ కిట్టి శృంగారవిషయ మప్రసక్తము. అట్టిచో శ్రీనాథుఁ డీపద్యము నను చితముగా నసంగతముగాఁ జేర్చుటకు, తాను మున్నురచించిన మంచి పద్యము విడిగానున్నచోఁ జెడిపోవునన్న లోభమే కారణమని తలంచుచున్నాఁడను. శ్రీనాథునిదిగా శ్రీరంగపురరాజవీధి విహారవర్ణనపద్య మొకటి చాటుధారగలదు. అది శ్రీనాథునిదే యగునేని యాతఁడక్కడికిఁగూడ వెళ్ళినవాఁడగును.

అవచితిప్పయ.

"సింహవిక్రమపట్టణశ్రేష్ఠుఁడయిన సావాణిసెట్టికి అవచిసెట్టి కుమారుఁడు. ఈతఁడు శ్రీపర్వతమునకు సోపానములు కట్టించిన రెడ్డి వేమనృపాలునకుఁ బ్రాపయినవాఁడు. రామనాథయోగీశ్వరుని శిష్యుఁడు. అవచిసెట్టికి మాచాంబయను భార్యయందుఁ ద్రిపురారి, తిరుమలనాథుఁడు, చామసెట్టి యను మూవురుపుత్త్రులు జనియించిరి వీరిలోఁ బెద్దవాఁడగు త్రిపురాంతకుఁడే హరవిలాసకృతికి భర్త. ఈతఁడు, నీతనిపెద్ద

తమ్ముఁడు తిరుమలనాథసెట్టియు, హరిహరరాయఁడు, ఫిరోజిషాహ, గజపతిరాజు, మెచ్చునట్లు కొండవీటిరెడ్డిరాజగు కుమారగిరిభూపాలుని వసంతోత్సవములను నిర్వహించుచుండెడివారు. రెండవతమ్ముఁడు చామిసెట్టి పంజాబునుండి కర్పూరపుఁజెట్లు, జలనోగినుండి బంగారు మొలకలు, సింహళమునుండి మదపుటేనుఁగులు, హురుమంజినుండి గుఱ్ఱములు, గోవానుండి జవ్వాజి, ఆపనుండి యాణిముత్తెములు, బోటనుండి కస్తూరి, చీనినుండి యంబరములు తెచ్చుచుండెడివాఁడు. వీరికి ద్వీపాంతరములతో నోడలమీఁద వ్యాపారము జరుగుచుండెడిది. త్రిపురారికి అన్నమదేవి భార్య; మాచన, విశ్వనాథుఁడు, చినమల్లు అను వారు కుమారులు. ఈ త్రిపురారివంశమున పూర్వులలో నొకఁడు కంచి యేకామ్రేశ్వరునకుఁ బ్రాసాదములు కట్టించెను. వేఱొకఁడు కంచి వరదరాజస్వామికొద్దున బాలార్కమను మణిని బొదిగించెను. ఇంకొకఁడు తిరువళ్ళూర మూఁడామడల పొడవుగల తటాకము త్రవ్వించెను. మఱియు నొకఁడు కావేరిని గట్టించెను. ఈ వైశ్యులు చిఱుతొండనంబివంశ్యులు. శ్రీనాథకవిసార్వభౌముఁడీ త్రిపురారిసెట్టికి బాలసఖుఁడు.

## గద్యవిధము

శ్రీనాథుఁ డీహరవిలాసమున గద్యవిధము మార్చినాఁడు. శృంగారనైషధగద్యమున 'సకలవిద్యాసనాథ' పదము కలదు. ఇందు సుకవిజనవిధేయ పదముకలదు. దీనితర్వాతి భీమఖండమునఁగూడ నీ 'సుకవిజనవిధేయ' పదమేయున్నది. అతర్వాతఁ 'గవిసార్వభౌమ' పదము కాశీఖండాదులందుఁ జేర్చుకొన్నాఁడు.

శ్రీనాథుఁ డిట్లు దక్షిణదేశ ప్రయాణము జరిపివచ్చినపిదప రాజమహేంద్రవరప్రాంతముల కరిగెను.

## భీమఖండరచనము.

రెడ్డిరాజ్యము కొండవీట నొద్దగిలఁబడిపోవుటయు, రాజమహేంద్రవరమున నెగుపుచెందుటయు నెఱుకకందిన విషయమేగదా! క్రీ. 1405 ప్రాంతములకే రాజమహేంద్రవరరాజ్యము వేర్పడి కొండవీటిరాజ్యమును విరోధించినది. 1424 దాఁకఁ గొండవీటిరాజ్యము కలదు. అంతవఱకును శ్రీనాథునకు రాజమహేంద్రవర రాజాశ్రయము చేకూఱలేదు. ఆతఁడు కోరలేదు. కొండవీటిరెడ్డిరాజ్యము కూలినపిదపఁ గొంతెముకాలము కాంచ్యాది ప్రదేశ ప్రయాణాదులతోఁ గడపెను రెడ్డిరాజ్యముపయిఁ బ్రేమకలదు. రాజమహేంద్రవర రాజాశ్రయము నపేక్షించెను. బంధువులును, రసికులునగు నక్కడి రాజమంత్రులఁజూచెను. శ్రీనాథుని దర్శనము వారికిన్నలకుఁ బచ్చగప్పురమయ్యెను వింతయేమి! అపుడు రాజమహేంద్రవర మేలుచున్న వేమవీరభద్రారెడ్లకు మంత్రియగు బెండపూఁడి యన్నామాత్యుఁడు శ్రీనాథునకు బంధుకోటిలోనివాఁడే. ఆబాంధవము శ్రీనాథునితాతయగు కమలనాభునినాఁళ్లనుండి యుండినది. దీనికి ద్యోతకము:-

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణ విద్యాగమములు
కల్పించినాఁడవు గాథపాకంబైన
హర్షనైషధకావ్య మంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ వేళలందు

వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందు

గీ. పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొక ప్రబంధంబు నీవు
కలితగుణగణ! శ్రీనాథకవివరేణ్య!

ఆయన్నామాత్యుఁడు పయివిధమున శ్రీనాథునిఁ గృతికటాక్షింపు మని వేఁడెను. అట్లాతఁడు కృతి కోరునాఁటికి గాటయవేమనయు నల్లాడరెడ్డియు స్వర్గస్థులయిరి. కాటయవేమన క్రీ. 1416 నాఁటికే స్వర్గస్థుఁడయ్యెనని యీవఱకే వ్రాసియున్నాఁడను అల్లాడరెడ్డిఅటు తర్వాత మఱికొన్ని సంవత్సరములు జీవించినాఁడు. వేమారెడ్డి తన తమ్ముని వీరభద్రారెడ్డి ననితల్లీభ్రాతాకారణముచే రాజ్యాభిషిక్తునిఁ జేసి, తాను నిర్వక్రపరాక్రమముతో సప్తమాడెములు మొదలగు మన్యదేశముల జయించి సింహాద్రిపర్యంతసీమగాఁ గల యంధ్ర మండలమును గైవసపఱచుకొని కాపాడుచుండెను. దొడ్డారెడ్డి, యన్నారెడ్డి యను మఱి యిరువురుతమ్ములుకూడఁ గూడిమాడి రాజ్యాభివృద్ధికారణములుగా నుండిరి. అందు దొడ్డారెడ్డి నిశ్శంక కొమ్మనామాత్యుఁడు శ్రీనాథుని హరవిలాసమును బోలునట్లు రచియించిన శివలీలావిలాసమను కృతికిఁ బతియయినవాఁడు. పట్టిసక్షేత్రమునఁ దపమాచరించుచుండిన ఘోడెరాయ భీమేశ్వరస్వాముని వీరారాధించుచుండిరి. అహమ్మదు షాహా యను తురుష్కచక్రవర్తిపాలనకాలమది:—

ఉ. అన్నయమంత్రిశేఖరుఁ డహమ్మదుషా సురథాణభూమిభృ
త్సన్నిధికిన్ మదిన్ సముచితంబుగ వేమమహీసురేంద్ర రా

శోభోన్నతి వంతశాభ్యుదయ మొందఁగఁ బారసిభాష వ్రాసిరన్
గన్నులపండువై యలరుఁ గాకితమందలి వర్ణపద్ధతుల్.

భీమఖండము.

అహమ్మదుషాహా, ఫిరోజిషాహకుఁ దమ్ముఁడు. ఈతఁడు క్రీ. 1422 నుండి 1435 వఱకు రాజ్యమేలెను. భీమఖండ రచనకాలము 1430 అని తలంపఁదగును. ఈకాలమునకు శ్రీనాథుఁడు ప్రౌఢనిర్భర వయఃపరిపాకమున నుండెను. "ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొనియాడితి భీమనాయకునిమహిమ" - (కాశీఖండము). ప్రౌఢనిర్భర వయఃపరిపాకముగలప్రాయ మించుమించుగా ముప్పదియైదునుండి నలుబదియైదేండ్ల వయఃకాలమగును. నిండారు నారోగ్యభాగ్యముగల వాఁడు గాన శ్రీనాథుఁ డేఁబదియేండ్లప్రాయమునుగూడఁ బ్రౌఢనిర్భర వయఃపరిపాకకాలమని చెప్పుకొని యుండవచ్చుననుటనుగూడ నొప్పు కొనవచ్చును. అంతకుమించిన వయస్సు నట్లనుట విరుద్ధము. భీమ ఖండమునకే భీమేశ్వరపురాణమని నామాంతరము. స్కాందపురాణము పంచాశత్ఖండములలో నిదియొక్కటి. దాక్షారామముమీఁది యభిమా నముచే శ్రీనాథుఁడే సంస్కృతగ్రంథమునుగూడఁ గల్పించెనని యొక కింవదంతికలదు. సత్యము కాకపోవచ్చును. దాక్షారామము, పలివెల, పీఠికాపురము మొదలగు స్థలముల వర్ణన మీగ్రంథమునఁ బౌరాణి కముగాఁ గాక చారిత్రకముగా స్వాభావికముగా నున్నది. మొదటి మూఁడాశ్వాసములందు నీతీరు పరికింపఁదగును. మఱియు నాయాస్థల ములం దనకు సమకూడిన యనుభవానందాదులు వెలికిఁదోచునట్లు పెక్కుపట్టులఁ గవనము రచించినాఁడు. శ్రీనాథుని కవితాచకోరికను బంచారామములందును, బల్వెల యందును, బ్రౌఢేందుబింబప్రతి బింబచంద్రికాచమత్కారములు చూఱలొనఁగి చొక్కించి దక్కఁ

గొన్నవి. యౌవనము నిండారి ప్రౌఢమై నిర్భరమై యీకాలమం దీతని నెన్నోయున్నతభోగముల ననుభవింపఁజేసినది. రాజమహేంద్ర వరమున నీతనిఁ గొందఱువిద్వాంసు లవగణించిరి గాఁబోలును. ఎంత వైదుష్యదర్పము గలవాఁడయినను శ్రీనాథుఁడు ప్రశాంత చిత్తుఁడై కాలము కడచినకొలఁదిని వినయసంపత్తి నెక్కువగాఁ జూపుకొనుచునే వచ్చెను. గద్యమందలి 'సుకవిజనవిధేయ' పద మీయర్థమున నొక సాధకము. శృంగారనైషధగద్యమందలి సకలవిద్యాసనాథపదము మాని హరవిలాసమందును, భీమఖండమందును, సుకవిజనవిధేయ పదము చేర్చుకొన్నాఁడని మున్నే చెప్పితిని. ఆంధ్రకవివ్యగ్రము కృత్యవతరణిక కొకయంగముగా గూరుచుచున్న కుకవినింద నీతఁడీ భీమఖండమునను, శివరాత్రి మాహాత్మ్యమునను దక్క మఱియెక్కడను జేసినవాఁడుగాఁడు. ఈ గ్రంథములనేని యది చేర్చుట కప్పటి యరసికపండితుల మాత్సర్యము కారణము కాఁదగును. అర్హులయెడ శ్రీనాథుఁ డెంతయాదరము చూపువాఁడో పొన్నుపల్లి శాసనాదులందుఁ బ్రతిగ్రహీతలనుగూర్చి చేయఁబడిన ప్రశంసలు తెల్పుచున్నవి. లోకజ్ఞత, నిర్మత్సరత, ప్రశాంతత, వైదుష్యదర్పము శ్రీనాథునెంతగా భూషించెనో యీక్రింది కుకవినింద ధ్వనించుచున్నది :

గీ. బోధ మల్పం బు గర్వ మభ్యున్నతంబు
కాంక్ష నిష్ప్రచ్చరంబు మచ్చరము మనము
కూపమండూకములుపోలెఁ గొంచెమెఱిఁగి
పండితమ్మన్యులైన వైతండికులకు.

గీ. వికటమునను౦డి శ్రుతిపుట నిష్ఠురముగ
నదరి కాకులు బిట్టుబెద్దరచినప్పు

దుడిగి రాయంచ యూరఁ యుంటలెప్ప
నైఁపరాకున్న నె దేనిఁ జనుటయొప్పు.

మఱికొందఱు కవులు నిందించినట్లు ముదుకగాక యీ యవ
హేళన మెంతయు హృద్యమై కవికిఁగల నిదుదనమును దెలుపు
చున్నది. గ్రంథమం దిట్లు మృదువుగా మందలించినను జాటుపద్యము
లందు రాజమహేంద్రవర విద్వాంసుల నీతఁడు పెల్లుగా నుల్లసమాడి
నాఁడు. ప్రధ్వంసాభావ ప్రాగభావములపైఁ గల్పించిన కల్పన కిఁక
నాఁటికి నేఁటికిఁ దార్కికులు తలలు వంపవలసినదేగదా! మఱికొన్ని
చాటువు లున్నవి. ఇక్కడ నుదాహరింపఁదగినవికావు. అప్పటిచాటుధార
నొకదానిని 'హాజలజే' త్యాదికమును లాక్షణికులు లక్షణగ్రంథము
లందుఁగూడ నుదాహరించిరి.

తన పూర్వగ్రంథముల నీతఁడు భీమఖండమం దిట్లు పేర్కొ
న్నాఁడు:

గీ. నవమరుత్తచరిత్రంబు నైషధంబు
సప్తశతి పండితారాధ్యచరితమనఁగ
గావ్యములు పెక్కు చెప్పియుఁ గాంక్షచనక
వెండియును గావ్యమొకటి గావింపఁదలఁచి.

ఆపెక్కులు కావ్యము లేవై యుండునో! హరవిలాస మొకటి
యగును. కావ్యకరణకౌతూహలమును, యశోలిప్సయు శ్రీనాథునెడ
నెంత మెండుకొనియుండెనో యీపద్యము వెల్లడించినది. ఈ గ్రంథ
మునఁ గృతినాథుఁడగు బెండపూఁడి యన్నామాత్యునివంశవర్ణనమునకు

ముందు వేమవీరభద్రారెడ్డవంశమును వర్ణించినాఁడు. వారిప్రాపును బడయుకోర్కి దీనికిఁ గారణము. ఆవంశవర్ణనప్రస్తావ మిట్లుగలదు:-

''చతుర్థకులమౌళిమండనంబై కీర్తివిహారఘంటాపథంబైన పంటదేసటిమహాన్వయంబు వాకనాటిదేశంబున భద్రపీఠంబు నధివసించి సింహవిక్రమనగర దువ్వూరు గండవరాది పట్టణంబులు నిజనివాసంబులుగా, ప్రాలతాదష్టాష్టాదశద్వీపాంతరాళంబగు భూపాలగ్రామణులం ద్రిలింగభూమండలాఖండలునను, బ్రోలయవేమాన్నపోతాన్న వేమకుమారగిరీశ్వరాదులం బూజ్యసామ్రాజ్యపీఠస్థులఁగాంచె. తత్సంబంధబాంధవంబున విజయధాటీసమాటీకనంబుల దేసలల్లాడ నల్లాడభూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రిపర్యంతంబుత్కళ కళింగ యవన కర్ణాట లాటాంతర్వీపంబైన ప్రతాపంబున.... విశ్వవిశ్వంభరాభవనమండలంబుఁ బరిపాలించె. తదనంతరంబ.''

ప్రోలయవేమన మొదలు కుమారగిరివఱకుంజెప్పి యాపై 'నాదు' లనుటకుంగారణము, రామటివేమనాచవేమనలకు విరోధులగుటచేత, తత్ప్రస్తావము వీరభద్రారెడ్లకు సహ్యముగామియు, వారిని స్మరింపకుండుటకు మనసొల్లమియు నగును. రాజ్యప్రాప్తికిఁ బ్రధాన సాధనమును స్పష్టముగాఁ జెప్పినాఁడు కాఁడు. అనితల్లిమూలమున వచ్చిన దనుట యంతగాఁ బ్రతిష్ఠావహము కాదని ''అల్లాడ భూవల్లభుండు.... పాలించె. తదనంతరంబ,'' అనుటచే భీమఖండ మల్లాడరెడ్డి చనిపోయినపిదపనే రచితమగుట స్పష్టము. కాశీఖండ ప్రస్తావమున వీరెడ్లనుగూర్చి మఱికొన్ని విశేషములు వివరింతును. ఇక్కడి వర్ణన మునే హెచ్చుగా నక్కడఁ గూర్చుకొన్నాఁడు.

చతుర్థప్రకరణము

అన్నమంత్రివంశమున పూర్వులు కాకతీయులయొద్ద నుద్యోగులుగా నుండిరి. పారంపర్యముగా వారినివాసము గోదావరీతీరమే: వీరితోఁ బాతలనాఁటి చుట్టఱికముండుట శ్రీనాథుని కాశీపట్టణ వాసవ్యతకు సాధకము. అన్నయమంత్రి శక్తివ్యక్తులును, బాత్రుతయు నిట్లు వర్ణింపఁబడినవి:-

మ. అరభీభాష తురుష్కభాష గజకర్ణాటాంధ్ర గాంధార ఘూ
ర్జరభాషల్ మళయాళభాష శకభాషా సింధుసౌవీర బ
ర్బరభాషల్ కిరహాటభాష మఱియన్ భాషావిశేషంబు ల
చ్చెరువై వచ్చు నరేటియన్ననికి గోష్ఠీసంప్రయోగంబులన్.

సీ. రాజమహేంద్రదుర్గమునఁ గావించె శ్రీ
వీరభద్రునకుఁ బ్రాకారరేఖ
విలిపె మార్కండేయ నీలకంఠునిమ్రోల
రామేశుఁ దమతల్లి నామకముగ
సంగమేశ్వర దివ్య శంభులింగమునకుఁ
గల్పించెఁ గళ్యాణ గర్భగృహము
దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి
మొగలివాకిట ధామమును రచించె

గీ. ప్రాగ్దిశాప్రపగోపుర ప్రాంగణమున
సప్తమునిసింధుసోపానసరణి కెలనఁ
దీర్చె భవనంబు భీమయదేవునగర
మంత్రిదేవయ యన్నయామాత్యవరుఁడు.

ఈ ధర్మకార్యములకు శాసనము లేవేని యుండఁదగును.

శృంగారశ్రీనాథము

పయి సీసపద్యము గీతిలోఁ బేర్కొనఁబడిన ధర్మకార్యమునకు దాక్షారామమున నీ క్రింది శాసనమున్నది:

శ్లో. ఆస్తి ప్రశస్తప్రకృతి రల్లయవేమభూపో
రాజ్యోన్నతో జగతి రాజమహేంద్రపుర్యామ్
ఎంత్రీ హితోఽస్య మతినిర్జితదేవమంత్రి
ర్దివ్యక్రియా జయతి దేవయయన్నమంత్రీ

శ్లో. శాకేపుష్కరబాణవిశ్వగణితే సంవత్సరే కీలకే (1350)
కార్తిక్యాం శనివాసరే మకృతధీ శ్శ్రీయన్నమంత్రీశ్వరః
దాక్షారామజభీమలింగపురత శ్శ్రీసప్తగోదాతటే
ప్రాచీగోపురమండపం సమకరో ద్రమ్యం శిలానిర్మితమ్.

శ్లో. ద్వాదశసంఖ్యాస్తంభే
సదా బహిర్ద్వారమంఁడపే విహరన్
రక్షతు భీమేశోఽయం
శ్రీదేవయయన్న సచివ మాకల్పమ్.

ఈ శాసనము క్రీ. 1428లో నెలకొల్పఁబడినది. ఇందలి పుణ్యకార్యము భీమఖండమునఁ బ్రశంసింపఁబడినది. కావున భీమఖండ రచనము క్రీ. 1428కిఁ దరువాతనే జరిగె నను విషయము విశ్వంమయిన సిద్ధాంతముగా నిలుచుచున్నది. భీమఖండమునఁ బయి పుణ్యకార్యము మఱియు నిట్లు ప్రశంసింపఁబడినది: ''వెండియు భీమేశ్వరుండు.... .... రాజవేశ్యాభుజంగబిరుదాభిరామాల్లయ వేమభూపాల రాజ్యభార ధురంధరుండై బెండపూఁడి యన్నయామాత్యుండు గట్టించిన మొగలివాకిటి మహోత్సవమండపంబునందుఁ బేరోలగం బుండి కుండలీదండ లాసక ప్రేంఖ్ణ పేంకట చిందుకందుదమాళిచేల మత్తల్లి

హల్లీసకాదినృత్యంబు లవలోకించుచు.... ....నాగమంబులు పరీక్షించుచు నిఖిలలోకరక్షణార్థంబుగా వివిధవిద్యాకలాపంబుల వినోదించుచుండు.''

భీమఖండరచనాకాలముననే శ్రీనాథునకు దాక్షారామరామా సమాగమాది సౌభాగ్యములు సంఘటిల్లినవి. అన్నయమంత్రి ప్రభృతుల యాదరానురోధమున నాకాలమున నాతఁడు తఱచుగా గోదావరీ ప్రాంతముల కరుగుచుండెడివాఁడు. వేమవీరభద్రారెడ్ల గాఢపరిచయము కాశీఖండరచనాకాలము నుండియే యీతని కేర్పడినది. అంతకుఁ బూర్వ మంతగా లేదనవచ్చును వేమవీరభద్రారెడ్లపాలనము సింహాద్రి పర్యంతముఁ గలదని యీపఱకే వ్రాసితిని. సింహాద్రి మీఁద వెలసిన నరసింహస్వామికి వేమవీరభద్రారెడ్లు వత్సరోత్సవాదులు జరిపించునప్పు డన్నయమంత్రిభృతులతో శ్రీనాథుఁడుగూడ నరుగుచుండెడివాఁడు. సింహాద్రిమీఁద దేవాలయాది సన్నివేశము కనువిందు గూర్చుచుండును. అనంట్లు, మామిళ్లు, మొదలుగా నెన్నో ఫలవృక్షములును, ఛాయావృక్షములు పూలచెట్లును దోఁపులు దీరియుండును. ఆసింహాచలోత్సవయాత్ర నాఁటికి నేఁటికిఁ గూడ దర్శనీయమే! ఉత్సాహజనకమే! అక్కడికి యాత్రార్థమువచ్చు నానాస్త్రీలనుగూర్చి శ్రీనాథుఁడు చెప్పిన చాటుధారలు పెక్కులు కలవు. వానితో నితరములను మఱికొన్నింటిని గలిపి యచ్చులో నిప్పటివారు శ్రీనాథుని వీథినాటకమను పేర నెలకొల్పినారు. ఆపద్యము లెల్ల నొక యానుపూర్విగల గ్రంథముగా లేవు. అవి విడివిడి చాటుధారలే. వీథినాటకమను గ్రంథము వేఱుగానున్నది. దానివిషయము ప్రకరణాంతరమున రాఁగలదు. శ్రీనాథుని యిప్పటి చాటుధారలను జాటుపద్యమణిమంజరిలోఁ జదువఁదగును.

శృంగారశ్రీనాథము

తెల్గురాయని యాశ్రయము.

భీమఖండరచనము తర్వాత, దాక్షారామరామాసమాయోగము కల్గిన యాపయి క్రీ. 1435, 1440 ప్రాంతమున ఐన శ్రీనాథునకు మేదినీమీసరగండకటారి సాళువసంబురాయనికొడుకగు తెలుంగురాయని యాశ్రయమేర్పడినది. ఈతని శాసనము శక 1350 నాఁటి దొకటి సింహాచలము మీఁదఁగలదు. ఈతని తండ్రియగు సంబురాయని శాసనము నెల్లూరుమండలము పొదిలెతాలూకాలోని కూచిపూఁడి గ్రామమున నాంధ్రరామలింగస్వామి దేవాలయమున నొకటి కలదు. అది శక 1348 సంవత్సరమునాఁటిది. నెల్లూరుమండలముననే యాత్మకూరుతాలూకాలోఁ దెలుంగురాయని పురమను గ్రామముగలదు. అది యీ తెలుఁగురాయనిపేర నేర్పడినదే కావచ్చు. కృష్ణాతీరమున శ్రీకాకుళముతోఁజేరి తెలుఁగురాయనిపాలెమనుపల్లె యొకటిగలదు. కాని యది శ్రీకాకుళాంధ్రనాయకస్వామిపేర నేర్పడినది కాని యీ తెలుంగురాయనికి సంబంధించినదికాదు. ఈతని కీనామముగూడ నా శ్రీకాకుళాంధ్రనాయకునిపేరునుబట్టి వచ్చినదే యగునని నేను తలంచుచున్నాఁడను. ఆకాలమున నీ తెలుంగురాయలను పేరు పలువురు పెట్టుకొనుచువచ్చిరి. శ్రీకాకుళాంధ్రనాయకస్వామియుత్సవాదు లప్పుడు ప్రఖ్యాతముగా జరుగుచుండెడివి. శ్రీకాకుళాంధ్రనాయకస్వామికిఁ దెలుఁగురాయఁడనికూడఁ బేరుండుట తెలియక కొందరీ సంబురాయనికొడుకు తెలుంగురాయఁడు శ్రీకాకుళము నేలినరాజని వ్రాసిరి. ఈ తెలుంగురాయఁడు శ్రీకాకుళమునేలినవాఁడనుటకు నాధారమేమియుఁ గానరాదు. అట్లుంట ప్రామాదికమే! ఈ తెలుంగురాయఁడు రాజ్యమెక్కడ యేలెనో ప్రఖ్యాతముగా లేదు. విద్యానగరాధీశ్వరుని క్రింద సేనానాయకుఁడుగా నుండినట్లున్నాఁడు. బాపట్లతాలూకా నూతులపాడు గ్రామ

మున నీ తెలుఁగురాయనిపుత్త్రిడు తిరుమలరాయని శాసనములు శా॥1466నాఁటివి కలవు. తెలుంగురాయని తండ్రి యగు సంబురా యఁడు శా॥1348నను. నాతని కొడుకగు తిరుమలదేవరాయని శాసనము శా.క. 1466 నను, నుండుటచేఁ దెలుఁగురాయఁడు శా. 1348 తర్వాత 1395 దాక నున్నట్టును, సింహాచలశాసనమునాఁటి కాతఁ డిర్వది యేండ్లకులోపడినవయస్సువాడయినట్లు తలఁపఁదగును. అతఁడిప్పటికిఁ బ్ర ఖ్యాతుఁడుగాక తండ్రిచాటువాఁ డగుటచేతనే యాశాసనమందు "కన్నడ దేశమండలి సంబురాయనికొడుకు తెలుంగురాయండు" యని పేర్కొ-న వలసెను. అతనిశాసనము శా॥ 1364 నాఁటిది నూఁతులపాడుగ్రామ మునం దున్నది.

విజయనగరాధీశ్వరుఁడగు ప్రౌఢదేవరాయనికి లోపడిన యీ తెలుంగురాయఁ డాతనిదండయాత్రతో సింహాద్రి దాఁక వెళ్ళినట్లు శ్రీచిలుకూరి వీరభద్రరావుపంతులుగారు తలంచుచున్నారు. అది సంగ తముగానున్నది. శ్రీనాథుఁ డీతెలుంగురాయని నాసందర్భముననేని తర్వాతనేని సందర్శించియుండవచ్చును. అప్పటివి శ్రీనాథుని చాటు ధార లివి వినవచ్చుచున్నవి:

శా. ధాటీఘోటఖురట్టమట్టనమిళద్ధాత్రీభవశ్యామికా మం
టాటంకారవిలుంఠలుంఠిత మహోన్మత్తాహితక్షోణిభృ
త్కోటీరాంకితకుంభిసీధర సముత్కూటాటవీఝాట! క
ర్ణాటాంధ్రాధిప! సాంప (సంబు) రాయని తెలుంగా! నీకు దీర్ఘాయువౌ!

ఈపద్య మాతఁ డశ్వారూఢుఁ డయి దండయాత్ర సాగించు చున్నప్పుడు చూచి చెప్పినపద్య మనిపించుచున్నది.

శృంగారశ్రీనాథము

శా. అక్షయ్యంబగు సాంవ (సంబు) రాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము సేయురా! సుకవిరాడ్బృందారక శ్రేణికిన్ (స్వామికిన్)
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.

శ్రీనాథునికి వైషయికవాంఛ లత్యున్నతములు. భోగపరాయణత మెండు. ప్రౌఢనిర్భరవయఃపరిపాక కాలమగుటచే నాతఁడప్పుడు శృంగారరససముద్రమునఁ దెప్పదేలుచున్నాఁడు. దాక్షారామాప్సరోరామలయెడశ్రపయి బుగబుగ ల్వాల్పుటకని తెలుంగురాయనిఁ గస్తురి కోరినాఁడు! ఏమికోరిక!! ఉచ్చైర్దశ నుండువారి కప్పు డిట్టియచ్చరల చెలికారము గౌరవము నించుచుండెడిది గావలయు! పయిచాటువు శ్రీనాథునిది గాకపోవచ్చు ననుటకు వలనుపడదు. అక్షయ్యేత్యాది పద్యమువంటి దింకొకపద్యము 'క్ష' ప్రాసముగలది కాశీఖండమందుఁ గలదు. "రంభఁగూడె దెలుంగురాయరాహుత్తుండు కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు" నని యాతని యవసానపద్యమందుఁగూడ నున్నది. పూర్వపద్యమువలె నిదిగూడ నాతెలుంగురాయఁడు "రౌతు" అని తెల్పుచున్నది. ఈ తెలుంగురాయనిఁగూర్చి గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు సంబంధ మంతగాలేని వ్రాతలేమో వ్రాసినారు – అది యేల?

## విస్సనమంత్రి ప్రాపు

ఈతనిఁగూర్చి యేమియును దెలియరాకున్నది. శ్రీనాథుఁ డీత నిబంతిని బంగరుపళ్లెములో భుజించుచుండెడివాఁడఁట! ఈతఁడును రాజమహేంద్రవరముననో, దాక్షారామముననో, మఱి యాచుట్టుపట్టులనో యుండెడివాఁడగునేమో! తెలుంగురాయని పేరఁగాని యావిస్సనమంత్రి

పేరఁగాని శ్రీనాథుఁ డేవేవికృతులు చెప్పెనేమో తెలియదు. శ్రీనాథుఁడు తన యవసానపద్యమందు "స్వర్గస్థుఁడయ్యె విస్సన మంత్రి మఱి హేమపాత్రాన్న మెవ్వని పంక్తిఁగలదు" అని చింతించినాఁడు. ముప్పదియిద్దఱుమంత్రుల సీసమాలికలో విస్సన మంత్రి యొక్కఁడుగాఁ బరిగణింపఁబడినాఁడుగాని యం దాతని చరిత్రాంశమేమియుఁ దెలుపఁబడదయ్యె. ఈ విస్సనమంత్రి పేరూరు ద్రావిడులనఁబడెడు ప్రఖ్యాత బ్రాహ్మణులశాఖకుఁ జెందినవాఁడనియు, నాతని చరిత్రాదికమును బేరూరుద్రావిడులచరిత్రమను గ్రంథమున వెల్లడింప నున్నామనియు నొకశాస్త్రిగారు చెప్పుచున్నారఁట!

శేషధర్మములను రచించిన తాఁపల్లి తిమ్మయకవి తన పెద్దతండ్రి విస్సమంత్రిపేరివాఁ డన్నదాత యున్నాఁడని చెప్పుకొన్నాఁడు. ఆపద్యమిది:

సీ. బహుపురాణగ్రంథపఠనార్థ కరణాత
 శూరుండు మీయన్న సూరమంత్రి
మహితసభాభిరామముఖకావ్యంబులు
 ధరనిల్పె మీతండ్రి శరణమంత్రి
తగవరియై యన్నదానంబుసేయుచు
 వెలసె మీపెదతండ్రి విస్సమంత్రి
వేదపర్వత మన వినుతులఁ గాంచెను
 సరసుండు మీతాత చంద (ద?) మంత్రి

గీ. ప్రౌఢరాయల మెచ్చించి రాయసమునఁ
బైఁడి గంటంబు గొని వ్రాసి భద్రలీలఁ
బైఁడి గంటంబువారని పద్దుతెచ్చి
యలరె మీతాత ముత్తాత యంబమంత్రి.

శృంగారశ్రీనాథము

శ్రీనాథునకు బంగరు పళ్లెరమున సహభోజన మొసఁగిన విస్స మంత్రి యీతఁడు గావచ్చునని కొందఱు తలఁచుచున్నారు. కాని యది సంగతముకాదు. శ్రీనాథుఁడు ప్రౌఢరాయలనాఁటివాఁడు. ప్రౌఢ రాయలను ప్రాయసమున మెప్పించి పైఁడిగంటము గొన్న యంబమంత్రి కీవిస్సమంత్రి నాల్గుతరముల తర్వాతివాఁడు. కావున నాతఁడు శ్రీనాథుని నాఁటివాఁడు కాఁజాలఁడు.



# శృంగారశ్రీనాథము

## పంచమ ప్రకరణము

### కనకాభిషేకము

సీ. ఒడ్డోలగంబునం దర్థ మాఁకయు లేక
వాక్ప్రవాహంబు వెల్వఱిచినాఁడు
అష్టదిగ్గయయశోవర్ణంబు డిండిమ
భట్టారకుని నోరఁ గొట్టినాఁడు
అఖిలవిద్వల్లోక మగ్గింపఁ గవిసార్వ
భౌమసద్బిరుదంబుఁ బడసినాఁడు
కలిత మౌక్తిక సభాగారాంతరమునందుఁ
గనకాభిషేకంబుఁ గాంచినాఁడు

గీ. రాజపరమేశ రాజాధిరాజవిభవ
దక్షిణాధీశ దేవరాయక్షితీంద్ర
రక్షితబుధాభిభటక "కర్ణాటకటక
పద్మవన హేళి శ్రీనాథభట్టసుకవి."

—*—

శ్లో. వంశవీర్యశ్రుతాదీని వర్ణయిత్వా రిపో రపి
తజ్జయాన్నాయకోత్కర్ష వర్ణనం చ ధినోతి నః.

"ప్రత్యర్థికులబలపాండిత్యాదులను గూడ వర్ణించి యట్టివాని జయించుటఁజెప్పి నాయకుని యౌత్కృష్ట్యమునకుఁ బెంపు సంపాదించుటయు నింపుగూర్చును."

— ఆచార్యదండి.

శ్రీరాముఁ డెంతగా రామాయణమునఁ గీర్తితుఁడయినను దత్ప్రతిద్వంద్వి యగు రావణుని కులబలపరాక్రమాదులు గూడ నట్లు పర్యాప్తముగ వర్ణితములు కాకపోయినచో నా రామచంద్రుని గుణౌత్కృష్ట్యము లోకమున కింత యద్భుతావహముకాకపోయెడిది. ప్రఖ్యాతాంధ్రకావ్యకర్తయై యాంధ్రవాఙ్మయమునకు మహోపకృతి సల్పిన శ్రీనాథకవివర్యుని యాభిజాత్య పాండిత్యాదులు పుష్కలముగా వ్యక్తములగుటకై యాయనచే నోడఁగొట్టఁబడిన డిండిమభట్టారకుని యౌత్కృష్ట్యమునుగూడఁ గొండొక విపులముగనే వర్ణింపఁబూనుట యప్రసక్తవిషయచాలనముగాక యా కవీశ్వరుని ప్రశస్తికి మెఱుఁగులుగూర్చు నావశ్యకవిషయోన్మీలనమే యగునని సహృదయులు తలంతురుగదా!

డిండిమభట్టారకులు.

ఈ బిరుదాంకనామధేయముగల కవీశ్వరులు నలువురు గుర్తింపఁబడిరి. ఈ నలువురకును గర్భసంబంధము గలదు. ఏతద్వంశ్యులు కొన్నితరములవఱకును బండితకవులై విద్యానగరప్రభువులచే నాస్థానకవీశ్వరులుగా సమ్మానింపఁబడిరి. రెండవ డిండిమభట్టారకుఁడు రచియించిన యోగానందప్రహసన మనురూపకభేదమును బట్టియు, మూఁడవ డిండిమభట్టారకుఁడు రచియించిన సాళ్వాభ్యుదయ మను

పదునాల్గుసర్గముల మహాకావ్యమును బట్టియు వీరివంశవృత్తాంతము కొంత గుర్తింపనగును.

'అస్తి ఖలు గౌడేషు పరియేంద్రపురాగ్రహారనాయకమణేః సామవేద సాగర సాయాంతిక్రికస్య, అష్టభాషాకవితా సామ్రాజ్యాభిషిక్తస్య, బల్లాళరాయకటకకవికులగర్వపర్వతపవేః, నాగణకవిగజకేసరిణః, శ్రీకవిప్రభోః పౌత్రః, పుత్రశ్శ్రీరాజనాథదేశికస్య, బ్రహ్మాండభాండపిచండమండలితవిజయడిండిమచండిమ్నః, శ్రీకంఠాగమశిఖండమండనమణేః, శ్రీడిండిమప్రభో ర్దౌహిత్రః, శ్రీమదభిరామనాయికాస్తనంధయః, సభాపతి భట్టారకాచార్యభాగినేయః, సరస్వతీ ప్రసాదలబ్ధకవితాసనాథః, శ్రీమా నరుణగిరినాథః తేన కృతేన యోగానంద నామ్నా ప్రహసనేన సభానియోగ మను తిష్ఠామి'' -

పైవాక్యములవలన నీయోగానందప్రహసనకర్త డిండిమకవి సార్వభౌముఁడని బిరుదాంక నామధేయముగల యరుణగిరినాథుఁడను గౌడబ్రాహ్మణుఁడని తెలియుచున్నది. మఱియు నాతని పితామహుఁడు కవిప్రభుఁడనియు, నాతఁడు బల్లాళ (దోరసముద్రము) రాయాస్థాన కవీశ్వరులగర్వ మడంచినవాఁడనియు, నాగణ యను కవీశ్వరు నోడించినవాఁడనియును,- దండ్రి రాజనాథ దేశికుఁడనియును -మాతామహుఁడు డిండిమ ప్రభుఁడనియు, నాతఁడు విజయడిండిమము గలవాఁడనియు, శైవవేదాంతపారంగతుఁ డనియును- దల్లి యభిరామ నాయిక యనియు - మేనమామ సభాపతి భట్టారకాచార్యుఁడనియు- తెలుపబడుచున్నది. శ్రీకంఠాగమపారంగతుఁడై విజయడిండిమము నార్జించిన మాతామహుని యొద్దనుండియే యీయోగానందప్రహసన కర్తకు డిండిమకవిసార్వభౌమబిరుదమును, విజయడిండిమమును

లభించినవి. ఈతని పితామహుఁడే ప్రఖ్యాతకవీశ్వరుఁడుగాఁ గీర్తింపఁబడెను. తండ్రి యట్టివాఁడుగా వర్ణింపఁబడలేదు. పై రూపకమునఁ గొన్నిచోట్ల నప్పటిరాజు దేవరాయలుగాఁ దెలుపఁబడియున్నది. భరతవాక్యమున "దీర్ఘాయు ర్దేవరాయో దధతు వసుమతీచక్ర మాచంద్రతారమ్" అని యున్నది. కనుక నీతఁడు దేవరాయ అను పేరు గల విద్యానగరప్రభు నాస్థానమున నుండినట్లు నిర్ధారింప నగును. దేవరాయ అను పేరు విద్యానగరప్రభువులలోఁ బలువురకు బొసంగు నదియే యైనను ద్వితీయ హరిహరరాయల కుమారుఁడగు దేవరాయల యందును, దర్వాత నాతని పౌత్రుఁడగు దేవరాయలయందును రూఢముగాఁ గన్పట్టుచున్నది. రెండవ దేవరాయల కిమ్మడిదేవ రాయలని ప్రౌఢదేవరాయలని ప్రతాపదేవరాయలని నామాంతరములు గలవు. యోగానందప్రహసనమునఁ బేర్కొనఁబడిన దేవరాయ లీయిర్వురుదేవరాయలలో నొక్కఁడయి యుండవలెను. రెండవ దేవరాయలే కాఁదగుననుట కొక యాధారము కలదు. సంస్కృతమున నిమ్మడిదేవరాయలు రచియించిన ట్లాతనిపేర మహానాటకసుధానిధి యను నొకయింపయిన కావ్యము కలదు. బాలకాండాంతమునఁ గల పద్య మిది:—

శ్లో. శ్రీమా నిమ్మడి దేవరాయనృపతి స్స్వర్లోకకల్లోలినీ
కల్లోలప్రతిమల్లసూక్తివిభవో విద్వజ్జనశ్లాఘితః ।
ధీమా నాదిమకాండవస్తువిషయా న్వ్యస్తా న్మహానాటక
శ్లోకావ్యర్థపదక్రమోజ్జ్వలతరాన్ రమ్యా నకార్షీ ద్విభుః.

ఈ శ్లోకమున గల "కల్లోలప్రతిమల్లసూక్తి విభవ" యనుపద మేభేదమును లేక యట్లే డిండిమభట్టారకుని చాటుపద్యమునఁగూడఁ గలదు. ఉదాహరింతును:—

శ్లో. [1] అగ్రే డిండిమతాడనం తత ఇతో వందివ్రజోద్ఘోషణం
ద్విత్రాశ్చిత్రపటాః కియంతి బిరుదప్రోతాని పద్యాని నః।
ఆస్తాం తావ దిదం మహేశమకుటీకోటీరకల్లోలినీ
కల్లోలప్రతిమల్లసూక్తి విభవై ర్ద్వేష్యాన్విజేష్యామహే

దీనివలన నిమ్మడిదేవరాయలకాలమున డిండిమభట్టారకుఁ డుం డినట్లు తేలుచున్నది. మఱియు, మహానాటకసుధానిధి కూడ నాడిండిమ భట్టారకునికూర్పే యగునో యని సందియము పొడముచున్నది. దేవ రాయలే రచించినట్లుగల రతిరత్నప్రదీపికయను కామశాస్త్రముకూడ నిట్టిదే యగుఁగాఁబోలు! అయియుండును. అన్యకవీశ్వరరచితములై ధన లోభమున రాజుల పేళ్ళఁ బ్రచురింపఁబడిన గ్రంథములు మన తెలుగు దేశముననే పరశ్శతము కలవు. ఆ కుళు వెల్లడింప వేఱ గ్రంథమే కూర్పవలసియున్నది. ఆవిషయ మట్లుంతము. ఈ ప్రౌఢదేవరాయల వారికాలముననే యరుణగిరినాథుఁ డనుకవీశ్వరునిచే ద్రావిడభాష యందుఁ గొన్నిప్రౌఢములగు శైవస్తోత్రగ్రంథములు రచియింపఁ

---

1. మాకు — ఎట్టయెదుర విజయడిండిమపుమ్రోయింపు; ఇటునటు వంది జనులస్తోత్రములు; రెండు మూఁడు చిత్రపటములు (రూపప్రతిబింబ ములు?) మఱి కొన్ని బిరుదాంకితము లగు పద్యములు; గలవు. ఇవి యట్లుండ—పరమేశ్వరుని జటాజూటమునందుఁ దొనఁకులాడు గంగానది తరంగములతోఁ బ్రతిఘటింపఁ జాలు సూక్తివైభవములచేఁ బ్రత్యర్థిపండితు లను జయింతుము.

ఉ. ముంగల జైత్రడిండిమపుమ్రోఁతలు; వందిజన స్తవార్భటుల్
చెంగట; రెండు మూఁడు తన చిత్తరువుల్; బిరుదాంకితంబు లిం
కం గల, వింతకంటె శితికంఠశిరస్సరిదూర్మిభంగి వా
గ్భంగు లెసంగు మాకుఁ బ్రతిపక్షబుధౌఘము నోడఁగొట్టఁగన్.

శృంగారశ్రీనాథము

బడినవి. ఆయరుణగిరినాథుఁ డీయోగానందప్రహసనకర్త యరుణగిరి నాథుఁడే యగునేమో విచారింపవలసియున్నది. కొందఱు ఆతఁడు శూద్రుఁ డనుచున్నారు.

యోగానందప్రహసనము చాలవఱకు సభ్యమై మిక్కిలి హృద్యముగా నున్నది. ఇందలి యితివృత్తము తుంగభద్రాతీరమున విరూపాక్షేశ్వరుని తిరునాళ్ళలో జరిగినదిగాఁ గల్పింపఁబడినది.

ఈ వర్ణింపఁబడిన యరుణగిరినాథునకు రాజనాథదేశికుఁడను కుమారుఁడు గలఁడు. ఈతనికిని డిండిమకవిసార్వభౌముఁడని బిరుద నామము సంక్రమించినది. ఈతఁడే సాళ్వాభ్యుదయమను పదునాల్గు సర్గముల మహాకావ్యమును రచియించినవాఁడు. క్రీ. 1490 ప్రాంతముల విద్యానగరరాజ్యమును వశపఱచుకొని పరిపాలించిన సాళ్వ గుండ నరసింహరాయల ప్రాభవము లిందు వర్ణింపఁబడినవి. ఈకావ్యమునఁ బ్రతిసర్గాంతమునను గద్యములు భేదించుచున్నవి. ఆమూలాగ్రము పరిశీలింపఁగా నిందుఁగొన్ని చరిత్రోపయుక్తాంశములు కన్పట్టినవి. కవికి సంబంధించినవిమాత్రమే యిప్పుడు ప్రసక్తములు గావునఁ గొన్ని బిరుదములను మఱికొన్ని గద్యభాగములు నుదాహరింతును:-

" (1సర్గ) బిరుదకవి ప్రపితామహ (5 సర్గ) దశరూపనారాయణ బిరుదమండన (6 సర్గ) రసికకవితాసామ్రాజ్యలక్ష్మీ పతి (8 సర్గ) నవనాటక భరతాచార్య (10 సర్గ) కవిమల్లగల్లతాడనపటు (11 సర్గ) ప్రతిభట కవికుంజరపంచానన బిరుదమండన (12 సర్గ) చేర చోళపాండ్య ప్రథమారాధ్య హృదయశివాభిఖ్య డిండిమ కవి సార్వభౌమబిరుద శోణాధినాథాత్మజ (14 సర్గ) ద్వాదశ దేశ్యవృత్తి

పారదృశ్వనో ఒష్టభాషాపరమేశ్వర స్యాభినవనాటకభవభూతే ర్మాఘా ద్యతివర్తి చిత్రప్రబంధపరమేశ్వరస్యాష్టదిగ్విజయపటహీకృతబిరుద డిండిమాడంబరస్య షడ్దర్శనషణ్ముఖస్య శైవశాస్త్రజీవాతో రఖిల వేద సాగర సాంయాత్రికస్య డిండిమకవిసార్వభౌమ ఇతి కృతాపరబిరుద నామ్నః శ్రీమదరుణగిరీశస్య తపఃపాకస్య డిండిమకవిరాజనాథస్య కృతౌ శ్రీసాళువాభ్యుదయే''—

ఈతఁడు గద్యములందుఁ బ్రపితామహునిఁ దర్వాతఁ దండ్రినిఁ బ్రఖ్యాతకవీశ్వరులని వర్ణించెను గాని పితామహునిఁబేర్కొననేలేదు. ఈతని తండ్రియగు నరుణగిరినాథుఁడును దన ప్రహసనమునఁ బితృ నామస్మరణము మాత్రమే కావించెను గాని యాతఁడు విద్వాంసుఁడని వర్ణింపలేదు. తన తండ్రియగు రెండవ డిండిమభట్టారకుని పాండిత్య ప్రభావము నీతఁడు గద్యములందు మిక్కిలిగాఁగీర్తించెను తత్తద్వి షయములను దెలుఁగున వివరించుట చర్వితచర్వణ మగునని వదలె దను. చేరచోళపాండ్యదేశములం దాతఁడు ప్రథమారాధ్యుఁడఁట! అష్టభాషాపరమేశ్వరుఁడఁట! అష్టదిగ్విజయపటహమగుబిరుదడిండిమా డంబరము గలవాఁడఁట! సాళ్వాభ్యుదయమును రచియించిన యీ మూఁడవడిండిమభటారకునికుమారుఁ డరుణగిరినాథుఁడు. ఈతనికిఁ గుమారడిండిముఁడని బిరుదు. వీరభద్రవిజయమను పేరుగల డిమము నీతఁడు రచించినాఁడు. దానినుండి కవిచరిత్ర ప్రసక్తమగు గ్రంథభా గము నించుక యుదాహరించుచున్నాఁడను :

''సూత్ర — ఋగ్రుణుతావత్ : సంతి ఖలు సంతతశివలింగారాధన వ్రతినో, గంగాతటాలంకార గౌడదేశచూడాపీడపరేంద్రాగ్రహారనాయక పుణయః, శైవాగమజీవాతవః, చేరచోళ పాండ్యశిష్యకులసత్కృత

శృంగారశ్రీనాథము

మహిమాన, స్వామవేదసీమానః, శ్రౌతాచారపూతాత్మానః, పవిత్రతర గౌతమ గోత్రజన్మానో, ద్విజన్మానః ... తదన్వవాయార్ణవ పూర్ణచంద్రస్య నాగణకవిగజకేసరిణః సరసకవితాసామ్రాజ్యాను భోగ సార్వభౌమస్య కవిప్రభోః సృత్తరాజన్య పౌత్రః, పరమమాహేశ్వరస్య పవిత్రతరచరిత్రస్య శివతత్త్వజ్ఞానశీలస్య శ్రీమతో రాజనాథస్య పురాతనపుణ్యపరిణామ స్సపుత్రః దభూతపూర్వ చతుర్విధ కవితా స్వర్లోక సరిత్కల్లోలమాలా ........ రీప్రచండతర కాహల ఘంటాడిండిమవిరచిత బిరుదఘోషణో డిండిమ కవిసార్వభౌమాపరనామా శ్రీమా నరుణగిరినాథో నామ! —

నటీ – (ఖా) యో బిరుదకవి ప్రపితామహ ఇతి భణితః–

సూత్ర–

శ్లో. తతోఽజని బుధోత్తమా త్తదుపమానవా గ్వైఖరీ
యశోభి రుపశోభితో యమకచిత్రవృత్త్యా కవిః
ప్రచండజయడిండిమః ప్రతిదినప్రబంధ క్రియా
చమత్కృతసమగ్రధీ స్సఖలు రాజనాథః కృతీ!

నటీ – యం దశరూప నారాయణాపరనామానం భణంతి.

సూత్ర – తస్య ఖలు దుర్గాదేవీ సహచరస్య చతుర్విధ కవితా చాతుర్యస్య సూనునా కుమారడిండిమకవినా అరుణగిరినాథేన ప్రణీతో వీరభద్రవిజయాభిధానో డిమప్రబంధోఽస్మాకం హస్తే నివేశితోఽభినీతపూర్వశ్చ.''

పంచమ ప్రకరణము

గ్రంథాంతగద్యము:-

"బిరుదకవి పితామహస్య బిరుదడిండిమవ్యాజ సంతాడితవిమత కవిగండమండలస్య డిండిమకవిసార్వభౌమస్య శ్రీమతోఽరుణగిరి నాథస్య పౌత్త్రేణ విచిత్రతర చిత్రయమకకావ్యధూర్వహస్య అప్రతి రూప బహురూపక సృష్టికౌశలపరమేష్ఠినః పరమమాహేశ్వరస్య చతు ర్విధకవితాచాతుర్యధుర్యస్య రాజనాథాచార్యస్య పుత్త్రేణ పవిత్రతర గౌతమగోత్త్రేణ గంగాతటాలంకార గౌడదేశాలంకార రత్నపీఠపై రందరిగ్రహారమౌళిమణినా దుర్గాదేవీస్తనంధయేన షడ్భాషాసార్వభౌ మేన కుమారడిండిమకవినా అరుణగిరినాథేన ప్రణీతే-"

ఈ యుదాహృతగ్రంథభాగ మింతకుముందు గుర్తింపఁబడిన విషయ ములను గొన్నింటిని స్థిరపఱుచుటేకాక మఱికొన్ని విశేషములఁగూడ నెఱిఁగించుచున్నది. యోగానందప్రహసనకర్తయగు నరుణగిరినాథుని మాతామహుఁడు 'కవిప్రభు' వని యీవఱకు గుర్తించితిమి. అతని పేరు నృత్తరాజు (నటరాజు) అని యిది తెల్పుచున్నది. ఆయరుణ గిరినాథుని తండ్రి యంతగాఁ బండితుఁడు కాఁడనుట నిదియు నెఱిఁ గించుచునేయున్నది. ఈ రెండవ యరుణగిరినాథుఁడు (కుమార డిండిముఁడు) వీరనరసింహరాయల కాలమందును శ్రీకృష్ణదేవరాయల వారి కాలమందును నున్నవాఁ డగును: ఈతని తండ్రి రాజనాథుఁడు. సాళ్వగుండ నరసింహరాయలకాలమందున్నవాఁడుగదా! వీరనరసింహ రాయల కాలమందు డిండిమకవి కలఁడని కుమారధూర్జటికవి రచి యించిన కృష్ణరాయవిజయమను ప్రబంధము తెల్పుచున్నది. విద్యా నగర నిర్మాణాది చరిత్రము తెలుపుమని వీరనరసింహరాయఁడుకోరఁగా

మ. రమణీయాంభతరంగిణీఘుమఘుమారావార్థగంభీరవా
క్క్రమజంఝానిలధూతదుష్కవిమహాగర్వాభ్రసంఘుండు ది
గ్గమణీమౌక్తికహారబంధురయశోరాజద్గుణాఢ్యుండు డిం
డిమపుంభావసరస్వతీంద్రుఁ డనియెన్ కీర్తిన్ బ్రకాశించుచున్.

మ. అని యాడిండిమసార్వభౌమకవి ప్రఖ్యాతంబుగాఁ దత్పురా
తనవృత్తాంతము నెల్లఁ దెల్పినఁ జమత్కారంబు వీక్షించి యా
జననాథాగ్రణియున్ సభాసదులు నుత్సాహంబునంబొంది కాం
చనభూషాదు లొసంగి రెంతయు దయాసంరంభధౌరేయులై.

ఈ నాల్గవడిండిమభట్టారకుని కుమారుఁడు రాజనాథుఁడు. ఈతఁ డచ్యుతదేవరాయల యాస్థానమునఁ గవీశ్వరుఁడుగా నుండెను. అచ్యుతరాయాభ్యుదయ మను పేరఁ బండ్రెండు సర్గముల కావ్యము నీతఁ డాతనిప్రశస్తిని వర్ణించుచు రచించెను. అచ్యుతదేవరాయలకాలము నను శ్రీరంగరాయలకాలమునను సభాపతిభట్టారకుఁడను కవీశ్వరుఁడు శాసనాచార్యుఁడుగా నున్నాఁడు. ఆతఁ డీడిండిమభట్టారకుల మాతృవంశమునజనించినవాఁడయియుండును మొదటియరుణగిరినాథుని మేనమామ సభాపతి భట్టారకుఁడుగాన యీసభాపతి భట్టారకుఁ డాతనిప్రపౌత్రుఁడో ప్రప్రపౌత్రుఁడో కావచ్చును. అరుణగిరినాథకృతులు పంచకావ్య వ్యాఖ్యలున్నవి. మఱియుసౌందర్యలహరీవ్యాఖ్యసత్యభామాపరిణయనాటకము మొదలగు గ్రంథము లనేకము డిండిమ బంధుసంతతివారు రచించినవి కలవు. వీరికి శైవమతమం దభినివేశము మెండు. కవిత్వ దర్పము హెచ్చు. వైదికారచాసంపత్తి శ్రౌతకర్మానుష్ఠాననిష్ఠయుఁ గల్గిఁ రాజపూజ్యులై యాగ్రహారికులై వీరు దిగంతముల విజయ డిండిమము మ్రోగించుచు నఖండప్రతిష్ఠ నార్జించినవారయి యుండిరి.

పంచమప్రకరణము

వయినిజెప్పఁబడిన డిండిమభట్టారకుల సంశవృత్తాంతాదిక మును దెలుపు గ్రంథమొకటి విభాగరత్నమాలయని కలదు. అది డిండిమవంశ్యులు రచించినదే. దానిసారము నిక్కడఁ జెప్పుచున్నా డను :–

చోళరాజు గంగాయాత్రచేసి విశ్వేశ్వరుని దర్శించి కాంచీ మండలమున శివాలయములను నిర్మింపఁగోరి గంగాతీర వాసులయిన బ్రాహ్మణుల నెనిమిదికుటుంబములవారిని బిలుచుకొనివచ్చెను. ప్రాసా దవల్లభయజ్వ, భాస్కరకవి, రాజనాథకవి, సుబ్రహ్మణ్యకవి, జటా ధరేశయజ్వ, నీలకంఠకవి, సోమనాథదీక్షితుఁడు, మల్లికార్జునభట్టు నవి వారిపేళ్ళు. తుండీరమండలమునఁ దల్పగిరికిఁ బడుమట నాచోళరాజుచే నీయఁబడిన యగ్రహారమున వారు వసించిరి. ఆయగ్రహారమునకు రాజనాథపురమని పేరిడిరి. అందు రాజనాథుఁడను శివునిఁ బ్రతిష్ఠించిరి. నాల్గయిదుతరములు కడచినవి. ప్రాసాదవల్లభయజ్వకు సభాపతియను కొడుకు కల్గెను. పాండ్యచేరచోళ రాజు లాతనికి శిష్యులయిరి. అతఁడు ఢక్కావాద్యాదిసమ్మానములఁ బడసెను. అతని మునిమనుమఁడు భాస్కరార్యుఁడు. ఈతడు ప్రసన్నకావ్యకర్త. ఈతనివంశమున త్యాగ రాజు జనించెను. ఇతఁడు కామకోటిపీఠమున విద్యాజయస్తంభమును నెలకొల్పెను. త్యాగరాజునకు స్వయంభూయజ్వ, గురుస్వామిబుధుఁడు ననువారు జనించిరి. ఇట్లే తక్కినయేడ్గురి వంశంబులను బ్రఖ్యాత విద్వాంసులు జనించిరి. పంపకములలో నీ రేకవింశతికులములవా రయిరి. అందు స్వయంభువునకుసభాపతియని కుమారుఁడును, గురు స్వామిబుధునకు నభిరామాంబికయని కూఁతురును, [సోమనాథుఁడను కుమారుఁడును జనియించిరి. ఆ యభిరామాంబికను గౌతముఁడగు రాజనాథుఁడు పెండ్లాడెను. అన్వర్థనామధేయయగు నాయభిరామాంబిక

పుష్పవతికాకముందేపదుమూఁడవయేట నరుణగిరినాథుఁడని కుమారునిఁ గనెను. అప్పటికిఁ గలి నాల్గువేలనాల్గువందలు కడచెను. రాజనాథుఁడు కుమారున కుపనయనముకాకముందే శివలోకమునకరిగెను. అభిరామాంబికయుఁ గుమార్తునిఁ దన సోదరుఁడగు సోమనాథమఖి కప్పగించి భర్త ననుగమించెను. సోమనాథమఖియు మేనల్లుఁడగు నరుణగిరినాథునిఁ దనపుత్త్రిల కంటె నెక్కువ గారాబముతోఁ బోషించుచుండెను. అరుణగిరినాథుఁడు పదమూఁడేండ్లకే వేదాధ్యయనము చేసెను. మేనమామభార్య కకారణక్రోధము జనించెను. అది మేనమామ యెఱుఁగఁడు. బాధపడఁజాలక యరుణగిరినాథుఁ డిల్లువిడిచి నవగ్రామము (పుత్తూరు) చేరి యక్కడ నొక్కశివాలయమున శివు నారాధించుచుఁ బడియుండెను. సోమనాథయజ్వ మేనల్లునిఁ గానక యూళ్ళు నాళ్లు వెదకి వేసారెను. ఘూఁడవనాఁటియుదయమున నదీతటమున నాబాలుఁడు తమ్మియుమ్మిచే నెట్టువాఱిన పెదవితోఁ గానవచ్చెను. సోమనాథయజ్వ యాబాలునిఁ గౌఁగిలించుకొని "నాయనా! ఇదియే" మని యడిగెను. "నవగ్రామమున కూరకవచ్చి బడలికచే నీశ్వరాలయమున నిద్రించితిని అర్ధేందు శేఖరుఁడు ప్రత్యక్షమై నన్ను మేల్కొల్పి నిద్రాస్వభావముచేఁ దెలిపిగానున్న నానోరఁ దమ్మి నుమిసెను. కావున నా నో రెట్టువాఱెను. కడిగికొనుట కిక్కడికి వచ్చితిని." అని చెప్పెను. అతఁ డప్పుడు శివునిమీఁద ననేకస్తోత్రములు రచించెను. క్రొత్తగా నభిషిక్తుఁడయిన ప్రౌఢదేవరాయల నాతఁడు కవిత్వశక్తిచేతను, వివాదచాతుర్యముచేతను మెచ్చించెను. ప్రౌఢదేవరాయఁడు నీతఁడును మిత్రులయి తుల్యాంబరాభరణులయి యేకమనస్కులయి వర్తిల్లిరి. యజ్ఞాంబిక యను కన్యను వివాహమై యాతఁ డనేక యజ్ఞములఁ జేసెను. తల్ప్రగామమునకు దక్షిణముగా నౌదుంబరపుర

మునకుఁ దూర్పుగా నవగ్రామమునకు వాయవ్యముగాఁ బ్రౌఢదేవరాయలొక యారామము నిర్మించెను. తూర్పుపడుమఱలకు క్రోసును, ఉత్తర దక్షిణముల కరక్రోసును నది వ్యాపించి యనేక ఫలపుష్పములతో నాగవల్లీక్షుఖండాదులతోఁ బెంపొందుచుండెను. రా జాతోటకు నీలగిరి యని పేరుగల కోమటి నధికారినిగా నియోగించెను. ఈ యుద్యానమును జూచి రాణియగు రుక్మిణి ప్రమదోద్యానముగాఁ గైకొనెను. ఉద్యానజీవియగు నానీలాద్రి వనికుఁడయి గర్వితుఁడయ్యెను. అరుణగిరి నాథునిపసు లాతోటలోని మేఁత కలవాటుపడియుండెను. నీలగిరి దానిని నిషేధించుచుండెను. ఒకనాఁ డాతఁడు "రేపటినుండి తోఁటకు వచ్చే నేని పసులను గట్టిపెట్టెద" ననియు, "వాని విడిపింప దక్షిణాధీశుఁ డగు దేవరాయలయనుజ్ఞ పొందవలసినదే" యనియు గద్దించి పలికెను. మర్నాఁడును బసువు లరిగెను. నీలగిరి యాపసులఁ గట్టివైచెను. పాలకు విడువఁడయ్యెను. అరుణగిరినాథుఁడు రాజున కది నివేదించి యిట్లు కోరెను: "నీ తోఁట పట్టును నాకగ్రహారముగా నొసఁగుము. అటు కాదేని నన్ను నన్యరాష్ట్రికుటుంబినిగా నెఱుంగుము." రా జిట్లనెను : "అది ప్రమదావనమగుటచే నీయఁబడదు. ఇతరత్ర యొసఁగుదును." కోపించి కవీశ్వరుఁడు ఢిల్లీపట్టణమున కరిగెను. ఢిల్లీసురత్రాణుని దర్శనము దుర్లభమని యెఱిఁగి కోట వాకిట నొకశ్లోకార్థమును వ్రాసెను. "సురత్రాణా! నీ రాణిచెంత నిద్రింప సరుదెంచితిని." అని దాని యర్థము. అసూయాళువులగు తత్రత్యపండితులు సురత్రాణున కెఱిఁగించిరి. అతఁ డాగ్రహభరితుఁ డయ్యెను. అతనికూఁతురు లవంగి వారించెను. "అర్థియు విద్వాంసుఁడు నగువాఁ డెవఁ డిట్లు రచించును? అర్థ మేదో వేఱువిధముగా నుండును. ఆకవీశ్వరునిఁ బిలిపించి విచారించుఁ"డనెను. సురత్రాణుఁడు పిలిపించి విచారించెను. ఆలంకారిక

సమ్మతముగా నుత్తరార్ధమును బూరించి చదివెను: "నీధాటివలని భయమున నన్యదేశము లందు నిద్రలేకపోఁగా నీరాణిచెంత నిద్రింపవచ్చితిని." రాణియనఁగా నిక్కడఁ బరిపాలితదేశము. అనపాయుఁ డను కవిమల్లుఁడు పాదమున జయనూపురమును ధరించి డిండిమవాద్యముతో రాజసన్నిధిఁ బూజితుఁడుగా నుండెను. అతఁ డీతని గర్హించెను ఇద్దరకు వివాదమేర్పడెను. ఇర్వదిమూఁడు దినములు వాదించిరి. సర్వశాస్త్రములందు విచారము జరిగెను. గర్వితుఁడగు నాకవిమల్లుఁడు నిగ్రహింపఁబడెను. అతని బిరుదుల నరుణగిరినాథుని కిప్పించి మణి రంజితమయిన సువర్ణాసనమున నభిషిక్తునిజేసి "విద్యాడిండిమ శోణ శైలకవి" యని యాసురత్రాణుఁ డరుణగిరినాథునిఁ బేర్కొనెను. మఱికొన్ని విద్వత్త్వ కవిత్వపరీక్షలు జరిగెను. సురత్రాణుఁడు కరము సంతోషించెను. "ప్రాచీభాగే సరాగే" యనుశ్లోక మప్పు డాతఁడు రచించినది. ఆయరుణగిరినాథుఁడు డిండిమకవిసార్వభౌముఁడని పేరు వహించి రామపదాంకితమగు కావ్యమును, డిమమను రూపకమును రచించి యక్కడ ప్రఖ్యాతి గాంచెను. ఆసురత్రాణునికడనుండి యాజ్ఞాపత్రమును గొనివచ్చి ప్రౌఢదేవునకుఁ జూపెను. తాను తొలుత కోరిన ప్రమదావనభూమిని ప్రౌఢదేవుఁ డగ్రహారముగా నొసఁగెను ఆయగ్రహారవిభాగాదిక మావలఁ జెప్పఁబడినది. ఈ విభాగరత్నమాల డిండిమ వంశ్యులగు నిటీవలివారిచే రచింపఁబడినట్టున్నది. దీనిలో సత్యమెంతో! అసత్యమెంతో! ఇంతకంటె మన కప్పటివారి గ్రంథములే యెక్కువ ప్రమాణము. జగన్నాథపండితరాయలకు సంబద్ధముగా 'లవంగి'కథ వాడుకగా నున్నది. ఈ విషయమింక నిడిచెదను

మీఁద వర్ణింపఁబడిన డిండిమభట్టారకులలో మన శ్రీనాథకవీశ్వరునకుఁ బ్రత్యర్థియగునాతఁ డేతఁడో కనుఁగొన వలసియున్నది.

పంచమ ప్రకరణము

కవితార్కికసింహ సర్వతంత్రస్వతంత్రాదివిరుదమండనుఁడై విశిష్టాద్వైతమతమును బెంపొందించిన వేదాంతదేశికులకును డిండిమ భట్టారకునకును మహావివాదము జరిగినట్టు దక్షిణదేశమున నొకయైతిహ్యము పండితపరంపరాగతముగాఁ జెప్పుకొనఁబడుచున్నది.

వేదాంతదేశికులకును, డిండిమభట్టారకునకును శ్రీరంగపురమున వివాదము పొసంగెననియు నప్పుడు వారిర్వురును బరస్పరము సమస్యల నొసఁగికొని పూరింపఁజొచ్చిరనియు నందు దేశికులు "కళిందనందినీతటే ననంద నందనందనః" అని నిరోష్ఠ్యసమస్య నొసఁగఁగా నందలిమర్మమును గుర్తింపక భట్టారకుఁడు సోష్ఠ్యముగానే పూరించుటచేఁ బరాభూతుఁడయ్యెననియు దాక్షిణాత్యపండితులు చెప్పుచున్నారు.

ఆవివాదముననే డిండిమభట్టారకుఁడు:-

శ్లో. 1 "ప్రాజ్ఞానా మేవ రాజ్ఞాం సదసి న సహతే వాచ మల్పేతరేషాం
క్షుద్రే ష్వాక్షేపముద్రాం యది చ స సహతే డిండిమ స్సార్వభౌమః
కాంకుర్వ ద్వైకకుక్షింభరిషు భయభర భ్రాంత భోగీంద్రసుభ్రూ
భ్రూణభ్రంశీ కి మంభః ఫణిషు పతగరాట్సంభ్రమి బంభ్రమీతి"

అనియును, - వేదాంతదేశికులు -

---

1. డిండిమసార్వభౌముఁడు ప్రాజ్ఞులే యగు భూపాలురసభలయం దల్పేతరుల వాక్యులను సహింపఁడు. కాని, క్షుద్రులుచేయు నాక్షేపముద్ర నూరకుండును. లెక్కింపఁడు. నెఱ్ఱదామలకు భయాతిరేకముచే గర్భస్రావము గలుగఁజేయు గరుడఁడు, బెకబెకలాడు చిఱుగప్పలతోఁ బొట్టనించుకొనుచుండు బురదపాములపై కాటోపముతోఁ దోఁడుఁదా!

శ్లో 1 బాహ్యై ర్వర్ణాడంబరై ర్మా భ్రమంతు
సమ్యక్ఛిత్వాఽభ్యంతరం శోధయంతు।
నిర్దేశాకో నీరసత్వేన కో వా
డిండీరాణాం డిండిమానాం చ భేదః.

అనియును బరస్పరము వింపించుకొనిరఁట! రసార్ణవ సుధాకరకర్త యనఁబరగు సర్వజ్ఞసింగభూపాలుఁడు వైష్ణవ మతాభిని విష్టుఁడై తనయాస్థానమునుండి కొన్ని మతరహస్యములను దెలిసికొని వచ్చుటకు వైష్ణవులను గొందఱ దేశికుల యొద్ద కనిపెననియు దేశికులును రహస్యసందేశ, తత్త్వసందేశ, సుభాషితనీవ్యాది గ్రంథముల రచియించి సింగభూపాలుని కొఱ కనిపెనవియు నొకయైతిహ్యము కలదు. దేశికుల తత్త్వసందేశోపసంహారమున—

శ్లో. త్రివిధచిదచిదీశలక్షతంత్రే
యతిపతియామున భాషితే నియోక్తుః
ఇద మితి నిగమాంతదేశికేన
ప్రతివమదీశ్యత మాధవాత్మజన్య.

అనియున్నది. ఈమాధవాత్మజుఁడే సర్వజ్ఞ సింగభూపాలుఁడని తర్వాతి వైష్ణవగ్రంథములు వాకొనుచున్నవి.

---

1. ఓప్రాజ్ఞులారా' వయిపయి ర్ణా (అక్షరములు—రంగు డంబరములతో మోసపోవకుఁడు. లిన్నఁగా భేదించి (పదచ్ఛేదముచేసి —చీల్చి) అంతరమును శోధింపుఁడు. నీరసత్వముచే (నిర్ + రసత్వము, నీర+సత్త్వము) డిండీర ములకును డిండిము-కును భేదముగలదా'

శ్లో. వ్యాఖ్యాకృచ్ఛతకోపముఖ్యవచసాం సర్వజ్ఞసింహాయ స
ద్రాజేత త్త్వహితాత్మకాని రచయన్ సూక్తాని యః ప్రాహిణోత్.
— ఆచార్యద్వాత్రింశత్

శ్లో. తతశ్చ సర్వజ్ఞనృసింహభూపః
ప్రాగేవ రామానుజదర్శనస్థః
తీవ్రాం ముముక్షా మధిగత్య తస్మి
న్గురౌ భరన్యాస మపేక్షతే స్మ.
శ్రీవైష్ణవాగ్ర్యా అపి తత్ప్రియుక్తాః
ప్రణమ్య భూయః పదపద్మయుగ్మమ్.
ముముక్షు మేనం గురుసార్వభౌమే
సమర్పయామాసు రనన్యరక్షమ్
సోఽయం మహాకారుణికాగ్రగణ్యో
నిజాంతరంగై ర్వివివేదితార్థః
అంగీచకార స్వయమేవ రక్షా
భరం ముముక్షుప్రవరస్య తస్య!
— నిగమాంతదేశిక సచ్చరిత్రరత్నావళి.

ఇంక ననేకగ్రంథములందుఁ గలదు. రసార్ణవసుధాకర కర్త యనఁబరగు సింగభూపతి క్రీ. 1390 ప్రాంతకాలమున నున్నాఁడు. దేశికులు 1270 మొదలు 1370 వఱకుఁ గలరని గురుపరంపరా ప్రభావమందలి యీ శ్లోకముతెలుపుచున్నది:

శ్లో. శ్రీధీయోగ్యే శకే శుక్ల ఉదభూ ద్వేంకటేశ్వరః
లబ్ధప్రాయే శకే ప్రాయా త్సౌమ్యేన పరమం పదమ్.

వీరిని సమకాలమువారినిగా సంఘటించుట క్లిష్టకల్పన మగుచున్నది. మన శ్రీనాథకవీశ్వరుఁడు సర్వజ్ఞసింగభూపాలుని దర్శించెననునది యెల్లరకును వెల్లడిగాఁ దెలిసినవిషయము. సామాన్యదృష్టితోఁ బరిశీలింపఁగా నైయైతిహ్యములనుబట్టి డిండిమభట్టారకుఁడును దేశికు

లును సర్వజ్ఞసింగభూపాలుఁడును శ్రీనాథుఁడును సమకాలమువారని గోచరించును. వేదాంతదేశికులు మృతినెందినతర్వాతఁ బదునైదు సంవత్సరములకుఁ గాని మన శ్రీనాథకవీశ్వరుఁడు జనింపలేదు. నలుబదిసంవత్సరములకుఁ బైపడిన వయస్సుననే శ్రీనాథకవీశ్వరుఁడు డిండిమభట్టారకునితో వివదించినట్లు నిర్ధారణ మేర్పడుచున్నది. కావున దేశికులతో వివదించిన డిండిమభట్టారకుఁడే శ్రీనాథునిప్రత్యర్థి యగు ననుట సంగతముగాదు. మఱియు డిండిమభట్టారకుని జయించిన తర్వాతనే శ్రీనాథునిచే దర్శింపఁబడిన సర్వజ్ఞసింగభూపాలుఁడు దేశికుల సమకాలమువాఁ డగుననుట యత్యంతాసంభావ్య మగును.

శ్రీకంఠాగమశిఖండమండనమణియై విజయడిండిమముఁ దాలుత నార్జించిన డిండిమప్రభుఁడును (యోగానందప్రహసనకర్తమాతామహుఁడు) వేదాంతదేశికులును సమకాలమువారగుదురు. కావున దేశికునిప్రత్యర్థి ప్రథమడిండిమప్రభుఁ డని నిర్ధారింపఁదగును. శ్రీనాథుని ప్రత్యర్థి ప్రౌఢదేవరాయలకాలమునఁ గల యోగానందప్రహసనకర్త ద్వితీయ డిండిమభట్టారకుఁ డగును. శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయల యాస్థానముననే కనకాభిషేకాదిసత్కారమును గాంచినట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది.

ఇఁక - సర్వజ్ఞసింగభూపాలు రిద్దఱని వెల్గోటివారి వంశ చరిత్రములు తెల్పుచున్నవి. రసార్ణవసుధాకరకర్త యనఁ బరగునాతఁడు తద్వంశముననేడవతరమువాఁడఁట! ఆతఁడు దేశికునికాలమువాఁడు. శ్రీనాథునిచే దర్శింపఁబడిన సింగభూపతి పదవతరమువాఁడట! శ్రీనాథునిచే దర్శింపఁబడిన సింగభూపతి రసార్ణవసుధాకరకర్తనాఁబరగు సింగభూపతి కాఁడనుట నిస్సంశయాంశము. రసార్ణవసుధాకర

కారునకు సర్వజ్ఞబిరుదము లేదని నేను నిర్ణయించుచున్నాను. ఈవిషయమునఁగల ప్రబలకారణములు ప్రకరణాంతరమున వివరింపఁబడును. రసార్ణవసుధాకరమున సింగభూపాలుఁ డనపోతాత్మజుఁడని కలదు. దేశికుని తత్త్వసందేశోపసంహారశ్లోకమునమాధవాత్మజుఁ డనికలదు. ఇదియెట్లో! దేశికులగ్రంథమందు స్పష్టముగా మాధవాత్మజుఁ డనియుండఁగా దానికి విరుద్ధముగాఁ దర్వాతివారు సర్వజ్ఞసింగభూపతి యని వ్రాయువ్రాఁతలు విశ్వసింపఁ దగినవికావు. దేశికులు సర్వజ్ఞసింగభూపతిపేరు చెప్పలేదు. మనకుఁ దెలియవచ్చుచున్న సింగభూపతులు మాధవాత్మజులుగారు. ఆవంశమున మాధవుఁ (మాదానేఁ) డున్నాఁడు అతఁడు రసార్ణవసుధాకరకారుని పిన్నతండ్రి. తత్పుత్త్రినికి దేశికులవారు గ్రంథముల నంపియుందురు. సింగభూపాలుర విషయమును ప్రకరణాంతరమున వివరించి తెల్పెదను.

అష్టదిగ్విజయ పటహీకృతబిరుదడిండిమాడంబరులును, గవిసార్వభౌములును నగు ద్వితీయ తృతీయ డిండిమభట్టారకులు కర్ణాటాధీశ్వరుల యాస్థానకవీశ్వరుని కనుఁగొంటిమి. ద్వితీయడిండిమభట్టారకుఁడు క్రీ. 1446 వఱకుఁ గల్గు ప్రౌఢదేవరాయలయొద్దను, దృతీయ డిండిమభట్టారకుఁడు క్రీ.1490 ప్రాంతములఁగల్గు సాళ్వగుండనరసింహరాయలయొద్దను, గలరవి తెలిసికొంటిమి. వేదాంతదేశికులప్రత్యర్థి ప్రథమడిండిమప్రభుఁడనియు, శ్రీనాథుని ప్రత్యర్థి ద్వితీయ డిండిమకవిసార్వభౌముఁ డనియుఁ దేల్చితిమి. ఇంక శ్రీనాథడిండిమభట్టారకుల వివాద మెక్కడ నేవిధముగాఁ బొసంగెనో కనుంగొనవలసియున్నది.

శృంగారశ్రీనాథము

శ్రీనాథుఁడు కర్ణాటప్రభునాస్థానమున కరిగినట్లు కొన్నియైతిహ్యములే కాక చాటుపద్యములును జాటుచున్నవి. కర్ణాటాధీశ్వరుఁడగు ప్రౌఢదేవరాయని దర్శింపఁగాఁ గొండవీటి నుండి శ్రీనాథుఁడు విద్యానగరమున కరిగెను. రాజదర్శనమునకుఁ బూర్వము తదాస్థాన విద్వాంసులను దర్శించి వారిమెప్పును దోడ్పాటును సంపాదించుకొన వలయునుగదా! ప్రౌఢదేవరాయని యాస్థానమున విద్వాంసులుగా నున్నముమ్మకవి డిండిమభట్టు మొదలగువారిని దర్శించెను. అప్పుడే శ్రీనాథునకు డిండిమునకు బెడసినట్టున్నది. ముమ్మకవిని గూర్చి శ్రీనాథుఁ డార్జవముదోఁపఁగాఁ జెప్పినపద్య మిది :

సీ. పంపావిరూపాక్ష బహుజటాజూటికా
రగ్వధప్రసవసౌరభ్యములకు
తుంగభద్రాసముత్తుంగవీచీఘటా
గంభీర ఘుమఘుమారంభములకు
కళసాపుర ప్రాంత కదళీవనాంతర
ద్రాక్షాలతాఫల స్తబకములకు
కర్ణాటకామినీ కర్ణహాటకరత్న
తాటంకయుగ ధాళధళ్యములకు

గీ నిర్నిబంధనిబంధమై నెనయు కవిత
తెలుఁగునను సంస్కృతంబునఁ బలుకనేర్తు
ప్రౌఢదేవేంద్రరాయ భూపాలవరుని
సమ్ముఖంబున దయఁజూడు ముమ్మసుకవి!

కొండవీటి వర్ణన సీసపద్యము శ్రీనాథుఁ డీసమయమునఁ జెప్పినదిగా నుండఁదగును. ముమ్మకవి యడిగెను: "అయ్యా! మీరు

రెడ్డిరాజుల యాస్థానమున విద్యాధికారిగా నుంటిరి గదా ! మీ బిరుదు లేమి? తెలుపరైతిరే'' యని. శ్రీనాథుఁ డిట్లనెను:

"చ. తరువున గాండివం బిడఁదె ధర్మజునానఁ గిరీటి, యేను వా
క్పరసిజనేత్రయానతి విదారముచొప్పున గర్వహీనతన్
మరలి తెనుంగుభూమి కసమానగతిన్ గొనిపోవువాఁడనై
బిరుదులు నారివాగుకడఁ బెట్టితి సత్కవిసార్వభౌముఁడన్.''

ఈ పద్యమునర్థము మిక్కిలి లోఁతయినది. ''సత్కవిసార్వభౌముఁడన్'' అనుట యష్టదిగ్విజయ పటహీకృత బిరుదడిండిమాడంబరుఁడును గవిసార్వభౌముఁడును నయి యక్కడ నున్న డిండిమభట్టారకునకును దుస్సహమయ్యెను. స్పర్థ యేర్పడెను. డిండిముని పలుకుబడిచేతనో యేమో రాజదర్శనము వెంటనే శ్రీనాథునకుఁ గలుగలేదు. దేశమర్యాదనుబట్టి తలకుఁ గుళ్లాయును, మేని కంగరకాయును దాల్చుట మొదలగు ననభ్యస్తవిషయము లక్కడ శ్రీనాథునకుఁ దటస్థించెను. ఆదేశమువిధము తనకు సరిపడకుండెను. కర్ణాటరాజ్యలక్ష్మికి వేఁడికోలుగా నాతఁ డప్పు డీక్రిందిపద్యముఁ జెప్పెను :

శా కుల్లాయుంచితిఁ గోఁకసుట్టితి, మహాకూర్పాసముల్ దొడ్గితిన్
వెల్లుల్ దీఁపిష్టముల్ మెనవితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ
జల్లా యంబలిఁ ద్రావితిన్ రుచులు దోసంబంచుఁ బోనాడితిన్
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుఁడన్.

''అమ్మా! నాకుఁ బెందలకడ రాజదర్శనాదికము సమకూర్చి స్వదేశమున కరుగ సెలవిమ్మా'' యని యిట్లు వేఁడికొనెను.

దర్శనము లభింపకపోఁగాఁ బ్రౌఢదేవరాయనికడనేదో యసం దర్భముగా శ్రీనాథునిఁగూర్చి ప్రసంగము జరిగెను. శ్రీనాథున కది తెలియవచ్చెను. ఈక్రిందిపద్యముచెప్పి ప్రౌఢదేవరాయల కనిపెను:

సీ. దంబు సూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
కవిమీఁదఁ గాని నాకవచమేయ
నవ్వ్రియోగంబుల దొరకొని చెప్పెడు
కవిశిరస్సునఁ గాని కాలుచాఁప
సంగీత సాహిత్య సరసవిద్యల నేర్చు
కవుల బొమ్మలు గాని కాల్చిపిడుప
చరివి చెప్పఁగనేర్చి సభయందు విలసిల్లు
కవినోరు గాని వ్రక్కలుగఁ దన్న

దంట కవులకు బలువైన యింటిమగఁడఁ
గవులవాదంబు ఎదవేడ్కఁ గల్గెనేని
నన్నుఁ బిలిపింపు మాస్థానసన్నిధికిని
లక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!

తరువాత రాయలు సభ కూర్పించెను. రాయలసన్నిధిని శ్రీనాథునకును డిండిమభట్టారకునకున్ను వైరమువర్ధిల్లెను. కవితావిషయమైన వారిరువురు విజిగీషువులై వివదించిరి. డిండిమభట్టారకునకున్న కవిసార్వభౌమబిరుదమును శ్రీనాథుఁడుకూడఁ దాల్చుటచేతవివాద మేర్పడినదనుటకు "బిరుదులునారివాగుకడఁబెట్టిరి సత్కవిసార్వభౌముఁడన" అని శ్రీనాథుఁడుజెప్పికొన్నపద్యమును శ్రీనాథుని బావమఱఁది దగ్గుఁబల్లి దుగ్గన్నచెప్పిన:' 'కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేతఁ గనకరత్నాభిషేకములు గొనిన" యనుపద్యచరణము కూడ సాధకములు. వివాదవిషయ

విశేషములు తెలియరావు గాని యది యుద్భటముగా జరిగినట్లు మాత్రము తెలియుచున్నది. ప్రౌఢరాయ లప్పుడు బాలను, యువతిని, ప్రౌఢను, లోలను గూర్చి నాలుగుపద్యములు చెప్పఁగోరఁగా శ్రీనాథుఁడు చెప్పెనఁట! అందొకటిమాత్రము చాటుపద్యమణి మంజరి రెండవభాగమునఁ జేర్చితిని : కర్ణాటకక్ష్మానాథేంద్రునభఁ గవిత్వవిజయోత్సాహంబు గైకొన్న మా శ్రీనాథున్'' అని రాధా మాధవకవి చెప్పినాఁడు కాన యా వివాదము కవిత్వవిషయమున జరిగినదని యేర్పడుచున్నది. శ్రీనాథునిది యీ క్రిందిపద్యము :-

సీ. దీనార టంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశుముత్యాలశాల
పగులఁగొట్టించి తుద్భటవివాద ప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషక్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుదు
పలుకుఁదోదై సాంధ్రభాషా మహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకు
నెటుల మెప్పించెదో నన్ను నింక మీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణనికురుంబ! శారదాంబ!

గౌడడిండిమభట్టునకుఁ గంచుఢక్క కలదని యీవఱకే మన మెఱుఁగుదుము. అతఁడు వాదకుశలుఁడు, పాండిత్య దర్పము కల వాఁడు నని కూడా నెఱుఁగుదుము. శ్రీనాథుఁడు మాత్ర మేమి కొఱ కఁబడువాఁడా! నిన్నటిదాఁకఁ బెదకోమటివేమారెడ్డియాస్థానమున నిట్టి

పని పట్టియున్న వాఁడేకదా? శ్రీనాథునకు డిండిమునకు జరిగిన వివాదమునఁ జంద్రభూషక్రియాశక్తిరాయలనువారు మాధ్యస్థ్యము జరిపినవారు కాఁబోలును. "చంద్రభూషక్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుదు," అన్న చరణమున కర్థము పైవిధముగా నుండునవి నే ననుకొనుచున్నాఁడను. "చంద్రశేఖరక్రియాశక్తి" "చంద్రశేఖరుక్రియాశక్తి," యని కవులచరిత్రము మొదలగు వానిలోఁ గలదుగాని ప్రాచీనలేఖనము లన్నింటను "చంద్రభూషక్రియాశక్తి" యన్న పాఠమే కానవచ్చుచుండుటచే నేను దానినే కయికొన్నాఁడను. చంద్రభూషక్రియాశక్తిపస్తిలోఁ గొండూరు శాసనము చదువవలసినది. అనుబంధమునఁ జూడఁదగును. క్రియాశక్తిస్వామి శిష్యుఁడయిన చంద్రభూషణాచారునికిఁ గర్ణాటాధీశ్వరుఁడగు బుక్కరాయఁడు శిష్యుఁడని దానివలనఁ దెలియుచున్నది. ఆశాసనము క్రీ. 1349లో నెలకొల్పఁబడినది. శ్రీనాథునికాలమునకు సరిపడునదికాదు. ఆకాలమునఁ గర్ణాటాధీశ్వరులకు గురువులుగాఁగాశీవిలాస క్రియాశక్తి ప్రభృతులు క్రియాశక్తిపదలాంఛను లుండిరి. వారిపరంపరలోఁ బ్రౌఢరాయలకాలమునఁ గూడ నొక చంద్రభూషక్రియాశక్తి కలఁడేమో;

వివాదమున డిండిమభట్టారకుఁ డోడిపోయినట్టు మాధ్యస్థ్యము నెఱపిన పండితుఁడు నిర్ణయించెను. ఓడిపోయిన పండితునికిఁ గవిసార్వభౌమబిరుదము పోయి నిరాక్షేపముగా శ్రీనాథునికే యది నిలిచినది. మఱియు నాపండితుని డిండిమాడంబరముగూడ నడఁగారినది. "పగులఁగొట్టించి తుద్భట వివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క" యను చరణ మీ యర్థము నెఱిఁగించుచున్నది. దీనినిబట్టి సరిగా శ్రీనాథుఁ డాతని కంచుఢక్కను గొడ్డళ్లచేఁ బగులఁగొట్టించినాఁడని నిర్ణయింప నక్కఱలేదు. మరల నాతఁ డాఢక్కావాద్యాడంబరమును

గొన్నాళ్ళదాఁక సాగించుకొనకుండునంతటి యవమానమువకఁ బాల్ప డినాఁడనుట చాలును. ప్రౌఢదేవరాయఁడు శ్రీనాథుని పాండిత్య శౌం డీర్యమునకుఁ బరితోషము చెందెను. ఆనందర్భముననే మన శ్రీనాథ కవిసార్వభౌమున కాకర్ణాటాధీశ్వరుఁ డత్యంతగౌరవాస్పదమగు తన ముత్యాలశాలలో బహుపండిత పరివార బహూకార పూర్వకముగా నప్పటిబంగరు నాణెములగు దీనారములతోను టంకములతోను స్వర్ణ స్నానోత్సవము సమకూర్చెను. ఈ సత్కారము జరుగుచున్నప్పుడు శ్రీనాథుఁ డీపద్యము చెప్పినాఁడు:

చ. జననాథోత్తమ ! దేవరాయనృపతీ ! చక్రేశ ! శ్రీవత్సలాం
ఛనసంకాశమహాప్రభావ ! హరిరక్షావక్ష ! నాటోటికిన్
గున్పపన్తోత్రిసముద్భవంబయిన వాగ్దోషంబు శాంతంబుగాఁ
గనకస్నానము చేసికాక పొగడంగా శక్యమే దేవరన్.

రాజ్యలక్ష్మీపీఠికాతంత్రమునఁ గనకాభిషేకసత్కారక్రమము చెప్పఁబడినది: రాజు విద్వద్గోష్ఠిలో నసామాన్య వైదుష్యము చూపిన వారికిఁ గనకాభిషేక సత్కారము కావింపవలయు ననియుఁ గనకాభి షేకమనఁగా దీనారములు టంకములు మొదలగు బంగరునాణెములను సభామధ్యమున నున్నతపీఠమునఁ గూర్చున్న విద్వన్మౌళిమౌళిపై జలము గ్రుమ్మరించినట్లు గ్రుమ్మరించుటయనియు, నట్లుగ్రుమ్మరిం చిన నాణెముల నాసమ్మానోత్సవము దర్శింపవచ్చిన విద్వాంసులకుఁ దదితరులకుఁ బంచిపెట్టవలయుననియు నందుఁగలదు. ఈకనకాభిషేక సత్కారమును బ్రాచీనకాలమున, బలువురు విద్వాంసులు పడసినారు. సర్వజ్ఞసింగభూపతిచేఁ గొలచెలముపెద్దిభట్టు కాంచెనఁట! కాకతిప్రతాప రుద్రునిచే నాతనితాత కాంచెనఁట! ఇట్లు మఱికొందఱున్నారు. "దీనా

రటంకారం దీర్ఘమాడించితి దక్షిణాధీశుముత్యాలశాల'' ననుచరణ మీ విష యమును దెలుపుచున్నది. ఇందు దక్షిణాధీశుఁడని కలదుగాన నాతఁడు కర్ణాటాధీశుఁడుగాక వేఱొకఁడు కావచ్చునని కొంద అందురు. కాశీ ఖండముకడపట:

శా. కర్ణాటక్షితినాథమౌక్తికసభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నానజగత్ప్రసిద్ధకవిరాట్సంస్తుత్యచారిత్ర ! దు
గ్ధార్ణోరాశిగభీర ! ప్రాహ్ణముఖమధ్యాహ్నపరాహ్ణార్చితా
పర్ణావల్లభ ! రాజశేఖరమణీ ! పంటాన్వయగ్రామణీ !

ఇందుఁ గర్ణాటక్షితినాథుఁడని కలదు. మఱియుఁ గవిసార్వ భౌముఁడై కర్ణాటవిభుచేతఁ గనకరత్నాభిషేకములు గనిన ''శ్రీనాథ సుకవి'' యని దగ్గుపల్లి దుగ్గనకవి చెప్పినాఁడు. విభాగరత్నమాలలోఁ బ్రౌఢదేవరాయఁడు ''దక్షిణాధిపతిః స్వయమ్'' అని యనఁబడినాఁడు. ఇదివఱ కుదాహరించిన శ్రీనాథునిచాటుధార ''జననాథోత్తమ దేవరాయ నృపతీ!.... కనకస్నానము చేసికాక పొగడంగా శక్యమే దేవరన్,'' అని దేవరాయనిఁ బేర్కొనుచున్నది. ఇంకసంశయమున కెడము కలదా? మఱియుఁ గనకాభిషేకసత్కారమును బడసినపిదప శ్రీనాథుఁడు దేవరాయని నిట్లు పొగడినాఁడు:

శా. జోటీ ! భారతి ! యోర్పుటిన్ మెఱయుమీ చోద్యంబుగా నేను గ
ర్ణాటాధీశ్వరు దేవరాయ నృపతిన్ నాసీరధాటీచమూ
కోటీఘోటకధట్టికాఖురపుటీకుట్టాకసంఘట్టన
స్ఫోటీభూతధరారజశ్ఛటకితాంభోటిన్ బ్రశంసించెదన్.

శ్రీనాథుఁడు కర్ణాటకరాజాస్థానమునఁ బొందిన యీ కవిత్వ విజయగౌరవ మంధ్రకవిలోకమునఁ జిరకాలము ప్రస్తుతమగుచుండెను.

పంచమ ప్రకరణము

శ్రీనాథుని మఱది దుగ్గన ప్రశంసించుటేకాక యచ్యుతరాయాభ్యుదయ కర్తయు నచ్యుతరాయల యాస్థానకవీశ్వరుఁడు, శ్రీనాథునిచే నోఁద గొట్టఁబడిన డిండిమునిమనుమఁడు నగు రాజనాథునితోఁబాటుగా నచ్యుత రాయల యాస్థానముననే కవిగానున్న రాధామాధవకవి యీ విషయము నిట్లు ప్రశంసించినాఁడు:

శా. సూనాస్త్రప్రమద మదస్ఫురిత వక్షోజాతకాఠిన్యముఁ
బూనంజాలు వచోవిలాసమున నింపుల్ మీఱఁ గర్ణాటక
క్ష్మానాథేంద్రుసభం గవిత్వవిజయోత్సాహంబుకైకొన్న మా
శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలతున్ సేవాంజలుల్ గీల్కొనన్.

శ్రీనాథుఁడుకూడ నీ కవిత్వవిజయము నభిమానముతోఁ జేర్కొనుచువచ్చినాఁడు. సర్వజ్ఞసింగభూపాలుని దర్శింప నరిగినప్పుడు చెప్పినపద్య ముదాహృతమేగదా! కాశీఖండము కడపటిపద్యము కూడ నుదాహృతమేగదా! మఱి కాశీఖండము కృత్యవతరణికలోను గద్యము నందును గూడ నీవిషయమును శ్రీనాథుఁడు పేర్కొన్నాఁడు: "అధ్య క్షించుం గవిసార్వభౌమ! భవదీయప్రౌఢసాహిత్యముల్", "తెలుఁగు చేసెదఁ గర్ణాటదేశకటక పద్మవనహేళి, శ్రీనాథభట్టసుకవి", "కవి సార్వభౌమ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన కాశీఖండమునందు" — ఇందుఁ 'గర్ణాటదేశమందలి రాజధాని (లేక ప్రసిద్ధపట్టణములు) యను తమ్మితోఁపునకు సూర్యుఁడు' అని యర్థము. శ్రీనాథునిరాకచే నా రాజ ధాని (అందున్న సరసులు పండితులు ననుట) యంతయు నానందవికా సము గాంచెనని భావము. అట్లు వారందఱు నానంద మందుటకు శ్రీనా థుఁ డక్కడ నెంతవైదుష్య చమత్కారమునెఱపినాఁడో! కొందఱుకవులు పేరుపేర్కొనక కవిసార్వభౌమబిరుదముతోనే శ్రీనాథునిఁ బ్రస్తుతిం

౮౩. నిరతిశయ బహుమానముతో శ్రీనాథకవి కవితావిలాసములను భావనసేయుచుండు నేను "కర్ణాటకటకపద్మవనహేళి" యను నీ వ్రజపుబలుకుఁబోలు పలుకును దత్కవితాలుబ్ధుఁడనై యేతత్ప్రకరణ ప్రారంభమునఁ గూర్చిన సీసపద్యపుంగొన నలంకరించుకొన్నాఁడను.

నాఁటికాలమునఁ బండితు లెట్లు నిరంకుశచర్యులై దీకొనుచుం డెడివారో స్వతంత్రులగు నప్పటిరాజులు విద్యాప్రియులై వారియం దెంత గౌరవప్రపత్తులుకలిగి సత్కారము లొదవించుచుండెడివారో తలంచితిరా! అంతటి యఖండపండితుఁడగు డిండిమభట్టారకునితో ఢీ కొని వాదించి యోడించి యాతని లోహడిండిమమును బగులఁగొట్టించి మన శ్రీనాథ కవీశ్వరుఁడు తా నార్జించిన యశోడిండిమము నాంధ్ర మండలమం దెల్ల నెడతెగక సార్వకాలము మ్రోఁగించుచున్నాఁడు. మనకవీశ్వరుఁ డార్జించిన 'ఢంకా' యరుగుతరుగులులేక పగులఁ గొట్టరాక యేకాలమును మ్రోంగుచుండినది. ఆహా! శ్రీనాథ కవీశ్వరుఁడు నశ్వరమగు భౌతికశరీరమును విడనాడియు శాశ్వతమగు కీర్తి మూర్తితో నాంధ్రలోకమున నెన్నఁటికిని గవిసార్వభౌమపదవి నలంకరించుచునే యుండునుగదా! ఆంధ్రకవీశ్వరులం దిట్టిమహాభాగ్య మెవ్వరే ననుభవించియుందురా?



# శృంగారశ్రీనాథము

## షష్ఠ ప్రకరణము.

మ. ప్రతిభాశాలులు పండితుల్ కవులు వంశావింపఁగాఁ బండిత
చతురుండై సుగృహీతనాముఁడగు నాసర్వజ్ఞసింగక్షమా
పతియాస్థానికి నేఁగి దివ్యకవితా ప్రావీణ్యముం జూపి వ
ర్తృప్తుఁడై వచ్చిన సత్కవీశ్వరునకుం గేల్మోడ్పు సంధించెదన్.

### కర్ణాటదేశాటనము.

శ్రీనాథుఁడు క్రీ. 1485 ప్రాంతమునఁ గనకాభిషేక సత్కార మును గాంచినాఁడని తెలిసికొంటిమి. అప్పు డాతఁడు కర్ణాటదేశమున ననేకస్థలములను దర్శించినాఁడు. "కళసాపురప్రాంతకదళీవనాంతర ద్రాక్షాలతాఫలస్తబకములకు" ననుట దీనికి ద్యోతకము. కర్ణాటదేశ మునఁ గళసాపుర మిప్పుడు గలదు. విద్యానగరమునకు ముప్పదిమైళ్ళ దూరమున నున్నది. అనఁటితోఁటలు, ద్రాక్షాలతలు, నక్కడ నిప్పుడు నెక్కువగా నుండునఁట! ఒక రాజాస్థానమున నెలకొని యునికి యాతని కిప్పుడు లేమిగాన యధేచ్ఛముగాననేక స్థలముల కరుగుచు వచ్చినాఁడు. రాజమహేంద్రవరమున వేమవీరభద్రారెడ్ల యాస్థానకవితా పదము దొఱకువఱకు నీతఁ డిట్లు తిరిగినాఁడు. ఈసంచారమందు రాచకొండలో రాజ్యమేలుచుండిన సర్వజ్ఞసింగభూపతిని గూడ నీతఁడు సందర్శించినాఁడు.

## సర్వజ్ఞసింగభూపతివిషయము

ఇది యింతపఱకు బహువివాదగ్రస్తముగా నున్నది. వెలుగోటివారివంశచరిత్ర మను నొకప్రశస్తచరిత్రగ్రంథమున నీవిషయము జాగ్రత్తతోఁ జర్చింపఁబడినది. అప్పటి రేచర్ల వెలమప్రభువు లేకశిలానగరముచేరువనున్న రాచకొండ, దేవరకొండ మొదలగుస్థలముల నెలకొని రాజ్యమేలిరి. ఆదేశ మిప్పుడు నైజామమండలమునఁ జేరియున్నది. అక్కడిశిలాతామ్రశాసనము లనేకము లింకను బయల్పడలేదు రేచర్లవంశ్యులచరిత్రమును జక్కఁగా గుర్తించుట కట్టిశాసనముల తోడ్పాటు కావలసియున్నది. వెలుగోటివారి వంశచరిత్రమును రచించినవారు బహుప్రయాసమునఁ గొన్ని శిలాశాసనములను సేకరింపఁ గల్గిరి. అవి యావంశమువారి దేశకాలములు నిర్ణయించుట కనర్ఘమయిన సాధనములుగా నున్నవి. ప్రాచ్యలిఖితపుస్తకశాలలో వెలుగోటివారివంశావళి యని యొకప్రాఁతవ్రాఁతగ్రంథ మున్నది. అదియు ననేకవిషయములను దెలుపుచుఁ జరిత్రకారుల కత్యంతసాహాయ్యకముగా నున్నదిగాని దానిలో నల్పప్రమాదము లక్కడక్కడఁగలవు. అట్టివానిఁ గొన్నిటిని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు చెనకినారు. వెలుగోటివారి వంశచరిత్రము రచించుట కిదియే ముఖ్యాధారము. ప్రాచ్యలిఖితపుస్తకశాలలోని ప్రాఁతవ్రాఁతగ్రంథమున శ్రీనాథునిచే దర్శింపఁబడిన సర్వజ్ఞసింగభూపతినిగూర్చి యిట్లున్నది :

"ఆ యనపోతమనేనికి సర్వజ్ఞసింగమనేఁడున్నూ వసంతరాయఁడు పుట్టి రం దగ్రజుండు,

సీ. సకలవిద్యావ్యాఖ్యాన సాహసగరిమ యు

సాటిమీఱఁగఁ దోఁచఁ జూపినాఁడు

కఠినశాస్త్రవయోధమనకంఠరక్తంబు
వేడ్కఁ గాళికి భుక్తిపెట్టినాఁడు
సాధుమార్గక్రియా సౌజన్యమున నీతి
చెలఁగ సర్వ్వర్తనల్ చేసినాఁడు
సంతతార్థివ్రాత సముదయంబులతోడ
వెలయు బాంధవము గావించినాఁడు

గీ. అతఁడు భూపాలమాత్రుఁడే చతురవిభవ
వితతజంభారి సర్వజ్ఞవిగ్రహంబు
వాసికెక్కిన రేచర్లవంశవార్ధి
శీతకరుఁడగు సర్వజ్ఞసింగవిభుఁడు.

* * *

శ్రీనాథుఁడు సర్వజ్ఞునిసమ్ముఖానకు పోతూ శారదాంబను ప్రార్థనజేసిన పద్యం:—

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశుముత్యాలశాల
.... .... .... ....
సరససద్గుణ నికురంబ! శారదాంబ!

సర్వజ్ఞసింగమనేఁడు శ్రీనాథునకు సమన్వయిచ్చిన పద్యము:

ఉ. తక్కక రావుసింగవసుధావరుఁ డర్థుల కర్థమిచ్చుచో
దిక్కులలేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రానుఁ బెం
పెక్కినకామధేనువు శిబీంద్రుల నెన్నెదు భట్ట! దిట్టవై
కుక్కవొ నక్కవో ఫణివొ క్రోఁతివొ పిల్లివొ బూతపిల్లివో!

శృంగారశ్రీనాథము

ఇత్యాది. తర్వాత సింగభూపతి తమ్ముఁడగు వసంత భూపాలునిఁగూర్చి పద్యము లున్నవి.

సర్వజ్ఞసింగభూపతిని శ్రీనాథుఁడు దర్శించినట్టు ప్రతీతి లోకమునఁ బ్రాచీనకాలమునుండీ కలదు. మఱియు బమ్మెరపోతరాజు సర్వజ్ఞసింగభూపతిమీఁద భోగినీదండకము చెప్పినట్టు ప్రఖ్యాతియే కాక గ్రంథముకూడ నున్నది. భాగవతమునుగూడ నా సర్వజ్ఞ సింగభూపతి కోరఁగాఁ బోతరాజుగారు తిరస్కరించి రనియు, నందు కాతఁడు కుపితుఁడై యా గ్రంథమును ధ్వంసపరుప యత్నించె ననియు వాడుక కలదు. కూచిమంచి తిమ్మకవిప్రభృతు లీయైతిహ్యమును గ్రంథస్థము చేసిరి. శ్రీనాథుఁడును, బోతరాజును సమకాలమువారని, బావమఱఁదులవరుసవా రనికూడఁ బ్రతీతి కలదు. సాధకములయిన విషయము లున్నప్పు డింకఁ దప్పక విశ్వసింపఁదగునుగదా? బమ్మెర పోతరాజుకూడఁ బయిఁజెప్పఁబడిన సర్వజ్ఞసింగభూపతిపేరనే భోగినీ దండకమును జెప్పినట్టు ప్రాచీనలేఖనములందుఁగూడ నున్నది. భోగినీ దండకమున వర్ణితుఁడగు సింగభూపతి వసంతభూపాలుని యన్నయుఁ గుమారాన్నపోతానేనికని బోచమాంబకును గుమారుఁడును సర్వజ్ఞ బిరుదాంకుఁడును నగుట విస్పష్టము. భోగినీదండకము చూడఁదగును. శ్రీనాథునిచే దర్శింపఁబడినవాఁడును, భోగినీదండక కృతినాయకుఁడును నొక్కఁడే యనుటకుఁ బ్రతీతి, ప్రాచీనలేఖనములు, శ్రీనాథుని చాటువులు, సాధకములుగా నున్నవి. కాని యిక్కడ నొక్కచిక్కు దాపరించినది. ఇప్పుడు రచింపఁబడిన వెలుగోటివారివంశచరిత్రమున సర్వజ్ఞ సింగభూపాలు రిరువురనియు, రసార్ణవసుధాకరకారుఁ డనఁబడు సింగభూపతి మొదటిసర్వజ్ఞసింగభూపతియనియు, శ్రీనాథపోతనలచే దర్శింపఁబడినవాఁడు రెండవ సర్వజ్ఞసింగభూపతి యనియు, వారిర్వును తాతా

మునిమనుమలనియు వ్రాయఁబడినది. ఇది యసందర్భమని నేఁ దలంచు చున్నాను. వసుధాకరకారునకు సర్వజ్ఞబిరుదము కానరాదు. శ్రీనాథపోతన లచే దర్శింపఁబడిన సింగభూపతికే సర్వజ్ఞబిరుదము కలదు. వారిర్వురును తాతామనుమలే యగుదురు. వివరించితెలిపెదను. రసార్ణవసుధాకరమున వారివంశవృక్ష మిట్లు తెలియవచ్చుచున్నది:




ఇందు నాల్గవవాఁడగు సింగమనాయఁడే రసార్ణవసుధాకర కారుఁడు. వసంతావనీనాథుని యన్నయుఁ, గుమారాన్నపోతనాయని కుమారుఁడును, శ్రీనాథపోతరాజకకవులకుఁ బ్రసక్తుఁడును సర్వజ్ఞ బిరుదాంకితుఁడును నగు సింగభూపాలుఁ డీరసార్ణవసుధాకరకారుని జ్యేష్ఠపుత్త్రుఁడగు ననపోతానాయని కుమారుఁడగునని నాయుద్దేశము. వెలుగోటివారివంశచరిత్రమున రసార్ణవసుధాకరకారుని నాల్గవ కూమారుఁడగు వేదగిరికి చినసింగభూపతియని నామాంతరము కల్పించి (కల్పితమే) యాతని కొడుకనపోతఁ డనియు, నాతనికొడుకు శ్రీనా థాదులకుఁ బసక్తుఁడగు సర్వజ్ఞసింగభూపతియనియు, వ్రాయఁబడి

నది. అందట్లు వ్రాయఁబడుటకుఁ బ్రాఁతవ్రాఁతలోనున్న యసంగతపుఁ బద్య మీ క్రిందిది కారణమయి యుండును:--

సీ. వీరాగ్రగణ్యుండు వెన్నభూపాలుండు
ఖ్యాతి నేరాజు ముత్తాతతాత
నెఱి పెంద్యగజసింహుఁ డెఱదాచభూపతి
ధాత్రి నేరాజు ముత్తాతతండ్రి
వంగరాభంగుండు సింగభూనాథుండు
తనరంగ నేరాజు తాతతాత
అదిగర్వైశ్వరుం డనపోతభూపతి
తర్కింప నేరాజు తండ్రితండ్రి
చిరకీర్తి యగురావు సింగావనీశుండు
ధట్టింప నేరాజు తండ్రితండ్రి
బిరుదభీకరుఁడైన పినసింగనరపతి
చెన్నొంద నేరాజు కన్నతండ్రి

గీ. కూరుఁ డారాచ ... ... ... ...
సారసస్వాంత సేవావిశాలుఁ డయిన
యన్నమాంబా తనూజాతుఁ డనఘమూర్తి
రాయరా వన్నపోతధరావిభుండు.

పాఠకులు పయిపద్యమును జాగ్రత్తగాఁ బరిశీలింతురుగాక ! పయిపద్యమున నసంగతి యిట్టిది: - ముత్తాతతాత, ముత్తాతతండ్రి, ముత్తాత (తాతతండ్రి), తండ్రితండ్రి, తండ్రి యనువిధమున, బితృపరంపరఁ జెప్పఁదగియుండును. ఇందట్లు లేదు. పద్యముతప్పుగానున్నది. ఇట్లుండవలెను: వెన్నభూపాలుఁడు ముత్తాతతాత, ఎఱదాచభూపతి ముత్తాత తండ్రి, సింగభూపాలుఁడు ముత్తాత, అనపోతభూపతి

తండ్రితండ్రి, పినసింగనరపతి కన్నతండ్రి. 'చిరకీర్తియగు''-నిత్యాదిచరణ మసంగతము. తొలఁగింపవలసినది. మఱియు ''సింగ భూనాథుండు తనరంగ నేదాజుతాతతండ్రి'' యని యుండును పయిచర ణమందు ముత్తాతతండ్రి యుండఁగా మరల నిక్కడఁ దాత తాతయని యుండఁగూడదు. ఈ దిద్దుబాటు సరియనుటకు రసార్ణవసుధాకరాది ప్రాచీనగ్రంథములు సాధకము లగుచున్నవి. పయిపద్యమున ''బిరుద భీకరుఁడైన పినసింగనరపతి'' యనపోతభూపతికొడుకగు రసార్ణవసు ధాకరకర్త యగును. (''చిరకీర్తియగు'' నిత్యాది చరణమును దొలఁ గింతుముగాన). అట్లాచరణమును దొలఁగింపకున్నచో, నాదిగర్భేశ్వ రేత్యాదిచరణమునఁ జెప్పఁబడిన సింగభూపతి రసార్ణవసుధాకరకర్త యగును. అతని కుమారుఁడు ''బిరుదభీకరుఁడైన పినసింగభూపతి'' యగును. ఇది యసందర్భము. రసార్ణవసుధాకరకారునికిఁ బినసింగ భూపతియను కుమారుఁడు లేడు. ఆర్గురుకొడుకులని రసార్ణవసుధా కరము చెప్పుచున్నది. వారిపేళ్లు వేఱుగా నున్నవి. ఆది పొసఁగకే వెలుగోటివారి వంశచరిత్రమునందా యార్గురిలో నొకఁడగు వేదగిరికిఁ బినసింగభూపతియని నామాంతరముగా నూహము కావింపఁబడినది. పయిప్రకారము దిద్దుబాట్లు చేసినచోఁ బద్యమున కుచితస్థితి కుదురుటే కాక, రసార్ణవసుధాకరగ్రంథస్థ విషయముతోఁ గుదిరికయు నేర్పడుచు న్నది. మఱియు రసార్ణవసుధాకరకారునికిఁ గుమారసింగభూపతి (పిన సింగభూపతి) యనియే వ్యవహారముకాని, పెదసింగభూపతియనికాదు. పెద్దవాఁడు మొదటిసింగభూపతి యుండుటచే రసార్ణవసుధాకరకారుఁ డగు సింగభూపతికిఁ గుమారసింగభూపతియని వ్యవహార మేర్పడినది. ఆ పెద్దసింగభూపతి జీవించియుండఁగా నీతఁడు జనించి యుండును. రసార్ణవసుధాకరకారుని గ్రంథములందే యాతనికిఁ గుమారసింగ

భూపతియని పేరుండుట నింకఁ గొంచెమాఁగి నిరూపింప నున్నాఁడను. సుధాకరకర్తయగు సింగభూపాలుని జ్యేష్ఠకుమారుఁడగు ననపోతానాయనికిఁగూడఁ గుమారాన్నపోతావనీనాథుఁడనివ్యవహారము ఈతనితాతయు ననపోతానాయఁడేగాన నీవ్యవహార మేర్పడినది. ఈకుమారాన్నపోతావనీనాథుఁడే శ్రీనాథపోతనలకుఁ బ్రసక్తుఁడగు సర్వజ్ఞసింగభూపాలుని తండ్రి. కుమారాన్నపోతావనీనాథుఁడని యీతని పేరగుటనుగూడఁ దత్కాలపు గ్రంథములను బట్టియే కొంచెమాఁగి నిరూపించెదను. ఇది నాయూహమునకు దోహద మొసఁగుచున్నది. ఇఁక నాయారాజులకు సంబంధించిన యప్పటి గ్రంథములఁ బేర్కొనుచున్నాఁడను.

## సింగభూపతి గ్రంథములు.

రసార్ణవసుధాకరము, చమత్కారచంద్రిక, అమరవ్యాఖ్య యను గ్రంథములు మూఁడు సింగభూపాలునకు సంబంధించినవి యున్నవి. మొదటిది ముద్రితము. కడమవి యముద్రితములు. మొదటిదానికిఁ గర్తగాను రెండవదానికిని మూఁడవదానికివి భర్తగాను సింగభూపతి యున్నాఁడు.

## రసార్ణవ సుధాకరము.

ఇది నాయికానాయకరసభావావస్థాభేదాదివిషయములను రూపకభేదలక్షణాదికమును దెలుపు నలంకారశాస్త్రగ్రంథము. ఇందనేక ప్రాచీనగ్రంథములనుండి లక్ష్యములు కైకొనఁబడినవి. మఱియు "యథా మమైవ" యని గ్రంథనామము లేకుండ ననేకశ్లోకము లుదాహరింపఁబడినవి. పెక్కుశ్లోకము లవి యమరుశతకశ్లోకములను బోలి యున్నవి. శృంగారరసభరితములు. యథామమైవ కందర్పసంభవే- యని యొకశ్లోక ముదాహరింపఁబడినది. ఇంక ననేకరూపకములనుండి

శ్లోకములు గద్యములు నుదాహరింపఁబడినవి. అందుఁ గొన్నిరూపకము లిప్పుడు దొరుకుటలేదు. అట్టివాని నిక్కడఁ బేర్కొనుచున్నాఁడను. అభిరామరాఘవము : అనపోతనాయకీయమని దీనికి నామాంతరము. మాయాకురంగిక (ఈహామృగము), మాధవీవీధిక (వీధినాటకము), పద్మావతి, కామదత్తము (ప్రకరణము), కామానందము, కరుణాకందళము (అంకము), వీరభద్రవిజృంభణము (డిమము), మహేశ్వరానందము, ఆనందకోశము (ప్రహసనము), శృంగారమంజరి(భాణము), పయోధిమథనము (సమవాకారము), కందర్పసంభవము (భాణము), వీరానందము. ఇవియన్నియు రూపకభేదములే. ఇందుఁ గొన్నిసింగభూపతికాలమున రచింపఁబడినవే. అనపోతనాయకీయమనఁగా నీతని తండ్రి పేరిదేగదా! వీరభద్రవిజృంభణము, కరుణాకందళము, ననునవి సింగభూపతియాస్థానకవియుఁ జమత్కారచంద్రికాకారుఁడును నగు విశ్వేశ్వరకవిచంద్రునిచే రచింపఁబడినవి. ఉదాహృతశ్లోకములలోఁ దత్కర్తృత్వమును దెలుపునవి కలవు. తక్కినవానిలోఁ గూడఁ గొన్నింటికేని యావిశ్వేశ్వరకవిచంద్రుఁడు కర్తగా నుండునేమో యని సందేహించుచున్నాఁడను. మొదటి కీ రసార్ణవసుధాకరగ్రంథమే విశ్వేశ్వరకవిచంద్రకృతి యగుననుట కాధార మున్నది. ఎట్లనఁగా, రసార్ణవ సుధాకరమున "యథామమైవ కందర్పసంభవే" యని శ్లోక ముదాహరింపఁబడినదని తెల్పితినిగదా! విశ్వేశ్వరకవిచంద్రకృతియగు చమత్కారచంద్రికలోఁ గూడఁ 'గందర్పసంభవమే' తనకృతిగా విశ్వేశ్వరకవిచంద్రునిచే నుదాహరించుకొనఁబడినది. "తథాచ మమైవ, శ్లో॥ ఇతి కందర్పసంభవే." అని కలదు. ఇట్టి వింతలు పెక్కు గ్రంథములలోఁ గానవచ్చుచున్నవి. మచ్చునకు రెండింటిని బేర్కొనెదను. జైమినిభారతకృతిపతియగు సాళువగుండ నరసింహరాయఁడు

రచించినట్టుగా నాతనిపేరనే రామాభ్యుదయమని యొకగొప్పసంస్కృత కావ్యము కలదు. అన్నిసర్గములలోను, రాజుపేరున్నదిగాని, యెదవసర్గము కడపట నరుణగిరినాథుఁడను డిండిమభట్టు (శ్రీనాథుని ప్రత్యర్థియే) రచించినట్టు శ్లోకము గద్యము నున్నవి. మఱియు నా గ్రంథము మహానాటకమున కగ్రజాతమని యందున్నది. ఆమహా నాటక మిమ్మడిదేవరాయలు రచించినట్టుగా నందుఁగానవచ్చుచున్నది. కాని యదికూడ నాయరుణగిరినాథుని కృతియగునని ఈరామాభ్యుదయ విషయము తెలియక పూర్వమే నేను గుర్తించితిని. ఆ విషయ మీవఱకే కనకాభిషేక ప్రకరణమునఁ దెల్పితిని. మఱియు వసుచరిత్రకృతిపతి యగు తిరుమలదేవరాయఁడు రచించినట్లు పీఠికాగద్యములతో శ్రుతి రంజని యనుపేర గీత గోవిందవ్యాఖ్య కలదు. చెఱకూరి లక్ష్మణసూరి రచించినట్లుగా నాగ్రంథమే లక్ష్మణసూరి పీఠికాగద్యములతోనుగలదు. రెండు దెఱఁగుల వ్రాఁతప్రతులు నిప్పుడు దొరకుచున్నవి. ఆతిరుమల రాయఁడు లక్ష్మణసూరి కగ్రహారముల నిచ్చి శాసనములు చెక్కించి నాఁడు. లక్ష్మణసూరి తన గ్రంథమునకుఁ దిరుమలరాయని పేరుపెట్టి రాజాస్థానమున వ్రాఁతపతి నుంచెను. తనయింటను శిష్యవర్గము కడను దన పేరితోనె వ్రాఁతప్రతుల నుంచుకొనెను. రెండింటికిని ఋత్త్రికలు పుట్టినవి. ఒక విశేషము : ఆవ్యాఖ్యలో "యథా మదీయే ప్రసన్నరాఘవ వ్యాఖ్యానే" యని కొంతగ్రంథభాగ ముదాహరింపఁబడినది. ఆయుదా హృతగ్రంథభాగముగల ప్రసన్నరాఘవవ్యాఖ్య లక్ష్మణసూరిరచనముగా దొరకియున్నది. రాజుగారు తమపేరగ్రంథము చెప్పుమనిరి. కృతిలోఁ దమపేరఁ గావింపఁబడిన ప్రశంసలను విని పరితోషించిరి. కవిని సమ్మానించిరి, గాని లోనున్నలిమ్ముల నేమి పరిశీలించిరి! ఇట్టివానిఁ

వష్ఠప్రకరణము

బెక్కింటిని లెక్కింపఁదగును. సుదూరము పోయితిని. ప్రస్తుతము నెత్తుకొనెదను. రసార్ణవసుధాకరమున సింగభూపతి ప్రశంసాత్మకములగు శ్లోకము లున్నవి. రసార్ణవసుధాకర కర్తృత్వము సింగభూపాలునిపై నారోపితమేమో యని నేను సందేహించుచున్నాఁడను. తప్పులతోను గ్రంథపాతములతోను నిండియున్న తెలుఁగు ముద్రణమున సింగభూపాలుఁడు కవీశ్వరుఁడనుటకు సాధకముగా నీక్రింది శ్లోక మున్నది

శ్లో. శ్రీసింగభూపేన కవీశ్వరేణ
విశ్రాణితానేకవిభూషణేన
షట్త్రింశ దుక్తాని విభూషణాని
సలక్ష్మ లక్ష్యాణి మునేర్మతేన

"శ్రీసింగభూపేన కవీశ్వరాణాం" అని యుండవలెను. నాగర లిపిముద్రణమున నశ్లోకలదు.

చమత్కార చంద్రిక.

ఇది యొక క్రొత్తత్రోవగల కావ్యాలంకారగ్రంథము. కావ్య గుణదోషాదు లిందుఁ జక్కఁగాఁ జర్చింపఁబడినవి. రసార్ణవసుధాకరమున లేని విషయముల నిది చెప్పుచున్నది. ప్రసక్తివచ్చినప్పు "డీ విషయము రసార్ణవసుధాకరమున వివరించి చెప్పఁబడినది. అక్కడఁ జూడఁదగును" అని తఱచుగా నిందు రసార్ణవసుధాకరము పరామర్శింపఁబడును. కాన నది దానికిఁ దరువాతిగ్రంథమని యేర్పడు చున్నది. రసార్ణవసుధాకరమున నుదాహరింపఁబడిన కరుణాకందళ వీరభద్రవిజృంభణములకుఁ గర్త యీ విశ్వేశ్వర కవిచంద్రుఁడేగావు నను నందు, సింగభూపాలునిదిగాఁ జెప్పబడిన కందర్పసంభవ మిందు

శృంగారశ్రీనాథము

విశ్వేశ్వరకవిచంద్రుఁడు తనకృతిగాఁ జెప్పుకొన్నాఁడు కావునను, రెండుగ్రంథములు నొక సింగభూపాలునకే ప్రసక్తించినవని స్పష్టముగాఁ జెప్పఁజెల్లును.

రసార్ణవసుధాకరకారుని తండ్రియగు ననపోతానాయని శాసనము శా. 1302 నాఁటిది వెలుగోటివారి వంశచరిత్రమున ముద్రింపఁబడినది. మఱియు, రసార్ణవసుధాకరకారుని యార్గురు కొడుకులలోఁ గడగొట్టువాఁడగు మాధవుని భార్య నెలకొల్పిన శాసనము శా. 1351 నాఁటిది కూడ నందే ముద్రింపఁబడినది. వీనిఁబట్టి చూడఁగా రసార్ణవసుధాకరకర్త శా. 1320, 1325, వఱకు నున్నవాఁ డగునని యేర్పడుచున్నది. శా. 1291లోఁ బశుపతికుమారుఁడగు నాగనాథకవికృతిగ సంస్కృతశ్లోకరూపము శిలాశాసనము వెలుగోటివారివంశచరిత్రముననే ముద్రింపఁబడినది. ఇది మిక్కిలి విలువగల శాసనము. రసార్ణవసుధాకరకర్తతండ్రియగు ననపోతానాయని ధర్మమునుగూర్చి కలదు. పశుపతిపుత్త్రుఁడగు నీ నాగనాథకవి చమత్కారచంద్రికాకారుఁడగు విశ్వేశ్వరకవిచంద్రుని శిష్యుఁడు. అనపోతనాయఁడు రాజ్యమేలుచుండఁగా నాతనిఁ బేర్కొనుచు మదనవిలాస మనుభాణము నీతఁడు రచియించినాఁడు. ఈతని రచనము శా. 1290, 1322 ల నడిమికాలమున నయియుండును. గురుశిష్యులు సమకాలమువా రగుదురుగదా! గురువు పదిదునైదేండ్లు పెద్దవాఁడు కావచ్చును. గురుశిష్యు లిద్దఱును రసార్ణవసుధాకరకారునికాలమువా రగుట కభ్యంతరమేమియు నుండదు. పశుపతికొడుకగు నీ నాగనాథకవి సంస్కృతమున మదనవిలాసమను భాణమునేగాక తెలుఁగున విష్ణుపురాణమును గూడ రచియించినాఁడు. నేను ముద్రించిన ప్రబంధరత్నావళిలో నావిష్ణుపురాణ ముదాహరింపఁ

బడినది. చూడఁదగును. దీనిఁబట్టి క్రీ. 1380 ప్రాంతమునఁ దెలుఁగున విష్ణుపురాణము రచింపఁబడినట్లు స్పష్టపడుచున్నది. ఆకాలమున సంస్కృతాంధ్రములందు గ్రంథములు రచించిన కవి యొకఁ డిప్పు డెఱుకపడుట సంతోషకరమేయైనను నాగ్రంథములు సమగ్రముగా లభింపమి విచారహేతువుగా నున్నది.

పరిశోధింపఁగా చమత్కారచంద్రికలో రసార్ణవసుధాకరమునఁ గలశ్లోకము లనేకములు గోచరించుచున్నవి. రసోపశమమున కుదాహరణముగాఁ జెప్పఁబడిన శ్లోకమందు సింగభూపాలుఁడు కళింగ రాజును జయించినట్టును నాతఁడు తన కూఁతును సింగభూపాలున కుపాయనముగా నిచ్చినట్టును జెప్పఁబడినది. ఇందు సింగభూపతి గ్రంథకర్తయని విశ్వేశ్వర కవిచంద్రుఁడు చెప్పినాఁడు.

"యథాచాహుః సామాన్యవనితా వేశ్యా సా ద్రవ్యపర మిచ్ఛతి. గుణహీనే న చ ద్వేషో నానురాగో గుణిన్యపి. శృంగారాభాస ఏతస్యాం నశృంగారః కదాచన—ఇతి. తన్మతం నానుమనుతే ధీమాం శ్రీ సింగభూపతిః—" ఇత్యాది.

శ్లో. అనుక్తానా మిహాన్యేషాం లక్ష్యలక్షణవిస్తరః
సింగభూపాలరచితే రసార్ణవసుధాకరే
ఆదిద్వితీయయో స్స్వాధుశీలవీ యా విలాసయోః
అన్యత్ర బద్ధదృష్టిత్వా దస్మా భిస్సం(ర్న?) ప్రపంచితః
నహి సర్వత్ర సర్వేషాం విశేషాణాం ప్రదర్శనమ్.

శృంగారశ్రీనాథము

ఈ గ్రంథమున నీ సింగభూపతి కుమారసింగభూపతియని కలదు. "కుమారశ్రీసింగే జలధి రశనాం శాసతి మహీమ్"—

## అమరవ్యాఖ్య.

ఈసింగభూపతి యాస్థానముననే బొమ్మకంటి యప్పయాచార్యుఁడను విద్వాంసుఁ డొకఁడు కలఁడు. అతఁడే యమరకోశవ్యాఖ్యాత. ఉపలబ్ధమయిన తాళపత్త్రప్రతిలో గ్రంథారంభభాగము పోయినది. కడపట నిట్లున్నది :

శ్లో ఆద్యో వేదవిదాం కణాదకపిలవ్యాసాహిరాడంఘ్రిద్రు
క్పాణిన్యాది సమష్టిమూర్తి రవధి స్సాంకేత్రక్రియావేదినామ్
వ్యాచష్టామరసింహనాథరచితం గ్రంథం నిమంటూత్తమం
ఖ్యాతం శిష్యహితార్థ మప్పయసుధీ శ్శ్రీమారపోతాభిధః.

శ్లో. రేచర్లవంశవంభూతే రాస్థానాన్యాం సింగభూపతేః
బొమ్మకంట్యప్పయాచార్యమూర్త్యా జాగర్తి శారదా!

శ్లో కుమారసింగభూపేన లక్ష్యలక్షణవేదినా
శోధితశ్చే దయం గ్రంథః కిం శోధ్య శ్శోధకాంతరైః.

శ్లో. కుమారసింగభూపేన యః కదాపి న శోధితః
సగ్రంథ శ్శోధితో ప్యన్యైః కిం బుధై ర్వ్యవహ్రియతే.

ఈబొమ్మకంటి యప్పయాచార్యుఁ డనర్ఘరాఘవవ్యాఖ్యాత యగు బొమ్మకంటి హరిహరునకు గురుఁడు. అనర్ఘరాఘవవ్యాఖ్య నారయఁ దగును. ఈయమరవ్యాఖ్యలోఁ గూడ నీతఁడు కుమారసింగభూపతి యని పేర్కొనఁబడినాఁడు.

షష్ఠప్రకరణము

## సర్వజ్ఞ బిరుదము.

ఈసింగభూపతికి సర్వజ్ఞబిరుదము కానరాదు. రసార్ణవసుధాకరమున లేదు. చమత్కారచంద్రికలో లేదు. అమరవ్యాఖ్యలో లేదు. ప్రాఁతవ్రాఁతలలో నెక్కడను లేదు. కాని వెలుగోటివారివంశచరిత్రమున నీతఁడు మొదటిసర్వజ్ఞభూపతిగాను, శ్రీనాథునిచే దర్శింపఁబడినవాఁడు రెండవ సర్వజ్ఞసింగభూపతిగాను వ్రాయఁబడినది. అవ్రాఁత యసంగతము. శ్రీనాథునిచే దర్శింపఁబడిన సింగభూపతికే సర్వజ్ఞబిరుదము కలదు. కొలచెలమ నారాయణపండితుఁడు చంపూరామాయణవ్యాఖ్యలోఁ దమపూర్వులను బ్రశంసించుచుఁ గొలచెలమ పెద్దిభట్టు (పంచకావ్యాది వ్యాఖ్యాత) "సర్వజ్ఞేనాభివర్షితః" - సర్వజ్ఞునిచేఁ గనకాభిషేకము గాంచినాఁడని చెప్పెను. మల్లినాథసూరి కూడ శ్రీనాథునిచే దర్శింపఁబడిన సింగభూపతికాలమువాఁడే కావచ్చును. మల్లినాథసూరిగ్రంథములందు రసార్ణవసుధాకర ముదాహరింపఁబడినది గాన నాతఁ డంతకుఁ బూర్వుఁడు కానేరఁడు. సమకాలమువాఁడుగాని తర్వాతివాఁడుగాని కాఁదగును. మల్లినాథునికుమారుఁడు కుమారస్వామి సోమపీథి పెదకోమటి వేమభూపాలుని సాహిత్యచింతామణి నుదాహరించినాఁడు. కావున మల్లినాథుని సత్కరించిన సర్వజ్ఞసింగభూపతి శ్రీనాథునిచే దర్శింపఁబడిన సింగభూపతియే కావలసియున్నాఁడు. కొలచెలమవంశ్యుల చరిత్రమును నేనిదివఱకు వ్రాసితిని; అందు :-

శ్లో. కిం దారుణా వంకరటింకరేణ
కిం వాసపా చీకిరిబాకిరేణ
సర్వజ్ఞభూపాలవిలోకనార్థం
వైదుష్యమేకం విదుషాం సహాయః.

శృంగారశ్రీనాథము

ఈశ్లోకము పండితలోకప్రతీతినిబట్టి పెద్దిభట్టు చెప్పినదిగాఁ దెలిసికొని యట్లు వ్రాసితిని. ఈశ్లోకము చమత్కార చంద్రికలో నుదాహరింపఁబడినది. అందు "శ్రీసింగభూపాలవిలోకనార్థమ్" అనికలదు. కాఁబట్టి యీ శ్లోకము మల్లినాథునిది కాకపోవుచున్నది. శ్రీనాథునిచే దర్శింపఁబడిన సింగభూపతికి సర్వజ్ఞబిరుదము కలదని శ్రీనాథుని చాటుధారలు చెప్పుచున్నవి. బమ్మెరపోతరాజుగారి భోగినీదండక కృతిపతి సర్వజ్ఞబిరుదము గలవాఁడని కుమారాన్నపోతావనీనాథుని కొడుకని భోగినీదండకమే చెప్పుచున్నది:

కుమారాన్నపోతావనీనాథసూనున్, సర్వజ్ఞసింగక్షమానాథు, రాయచౌహత్తమల్లున్, మహారాజవేశ్యాభుజంగున్, సర్వజ్ఞ సింగక్షమానాథపౌత్త్రిన్, సర్వజ్ఞసింగోర్వరాధ్యక్షు."

—భోగినీదండకము.

మీఁది పరిశోధనమువలనఁ దేలిన సారాంశ మిది : రసార్ణవసుధాకరకర్త సింగభూపతియు శ్రీనాథులచే దర్శింపఁబడిన సింగభూపతియు భిన్నులు. మొదటివానికి సర్వజ్ఞబిరుదము లేదు. వా రిర్వురు తాతామనుమలు. తాత శక. 1320 ప్రాంతమునను మనుమఁడు శాక. 1370 ప్రాంతమునను నున్నవా రగుదురు. మల్లినాథుఁడు, శ్రీనాథుఁడు, పోతరాజు, సర్వజ్ఞ సింగభూపతిని దర్శించిరి.

## సర్వజ్ఞ సింగభూపతిదర్శనము

శ్రీనాథుఁడు రాచకొండ కరిగి సర్వజ్ఞసింగభూపతిని దర్శించెను. అతఁడు గొప్పవిద్వాంసుఁడు. కావుననే శ్రీనాథుఁ డాతని

యాస్థాని కరిగినప్పు డక్కడ సభామందిరమునఁ బూజింపఁబడుచున్న శారదావిగ్రహమును గాంచి యీ పద్యమును జెప్పినాఁడు :

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశుముత్యాలశాల
పగులఁగొట్టించి తుద్భటవివాద ప్రౌఢి
గౌడడిండిమభట్టుకంచుఢక్క
చంద్రభూషక్రియాశక్తి రాయలయెద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుదు
పలుకుఁదోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకు

గీ ఎటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు డీవిశాల
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరవసద్గుణ నికురంబ! శారదాంబ!

రాజాస్థానమున నప్పుడు విద్వద్గోష్ఠిలో నేమేమిచర్చలు జరిగినవో యెఱుఁగరావు. శ్రీనాథుఁ డప్పుడు పూర్తిచేసిన సమస్య యిది మాత్రము తెలియుచున్నది :

ఉ. తక్కక రావుసింగవసుధావరుఁ డర్థుల కర్థమిచ్చుచో
దిక్కులలేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రానుఁ బెం
పెక్కిన కామధేనువు శిబీంద్రుని నెన్నెదు భట్ట దిట్టవై
కుక్కవొ! నక్కవో! ఫణివొ! క్రోఁతివొ! పిల్లివొ! బూతపిల్లివో!

క. సర్వజ్ఞనామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే

శృంగారశ్రీనాథము

యుర్వీం జెల్లును దక్కొరు
సర్వజ్ఞం దనుట తుక్క సామజమును చే!

పయిపద్యమునుగూర్చి గాథ యొకటి కలదు. శ్రీనాథుఁడు సర్వజ్ఞ సింగభూపతియాస్థానమునుండి మరలి రెడ్లయాస్థానమునకు రాఁగా రెడ్లాతని నిచ్చకాలమారి యని యాక్షేపించిరఁట. తమకు గర్భశత్రువయిన సింగభూపతిని సర్వజ్ఞుఁడని పొగడినందులకు; శ్రీనాథుఁ డిట్లు బదులు చెప్పెనఁట: "ఆపద్యమున కర్థాంతర మున్నది. గూఢముగా సింగభూపతిని వెక్కిరించితిని. 'సర్వజ్ఞనామధేయము శర్వునకే, రావుసింగజనపాలున కేయుర్వీం జెల్లును? (శివునిఁగాక) తక్కొరు, సర్వజ్ఞం దనుట, తుక్క సామజమను చే;' ఇది యా యర్థాంతరము." అని చెప్పి వారిని సమాధానపఱిచెనఁట! ఈయైతిహ్యమును గొందఱు విశ్వసింపకున్నారు. విశ్వాస్యము కావచ్చునని నా యుద్దేశము. శ్రీనాథుఁడు మరల నిఁకమీఁద (రాజమహేంద్రవరపు) రెడ్లయాస్థానమునఁ జేరఁబోవుచున్నాఁడు. రాజమహేంద్రవరపాలకులయిన వేమవీరభద్రారెడ్లకును, వెలుగోటి వెలమరాజులకును విరోధముండుట వాస్తవము. కొండవీటి రెడ్లకును, వెలుగోటివారికిని వివాదముండుటను గూర్చి యీవఱకే తెల్పితిని. అట్టిచో నాటాల్యము వారియాస్థానమున మెలఁగిన కవీశ్వరుఁడు వారిప్రత్యర్థికడకుఁ బోయి మిగులఁగా నాప్రత్యర్థిని బొగడి వచ్చుట రెడ్లకెవరికిని సహ్యము కాకపోవచ్చును. అట్లు పొగడినందుకయి వారు శ్రీనాథు నాక్షేపించవచ్చును. శ్రీనాథుఁ డట్టియర్థాంతరమును దెలిపి సమాధానపఱుపను వచ్చును. ఇందసంభావిత మేదియును లేదు. కాని శ్రీనాథునివంటి మహాకవి యట్లుచేయునా యని యాయన స్వభావమునుగూర్చి సంశయించుట తగును. రాజుల యవ్యవస్థిత చిత్తత్వమునుగూర్చి శ్రీనాథున కవహేళనబుద్ధి కలదు. వారి

యిచ్చకములను, మెఱమెచ్చులను జక్కఁగా నెఱుఁగును. ఆయా సమయముల కనుకూలముగాఁ దప్పించుకొని పోవలసినదేగాని ప్రబల ప్రత్యయము వారియెడల నునుపఁదగదని యీ కవీశ్వరుఁడు తలఁచెడువాఁడు. కొండవీటిరెడ్లంతరించినపిదప వారికిఁ బ్రబలప్రత్యర్థులగు రాజమహేంద్రవరపు రెడ్లకడఁ జేరినాఁడు. కొండవీట నున్నప్పుడు రాజమహేంద్రవరపురెడ్ల కీతఁడును ద్వేష్యుఁడే యగును. అప్పుడు కొండవీటిరెడ్లను బ్రస్తుతించినాఁడు. తర్వాత రాజమహేంద్రవరపు రెడ్లకడఁ జేరినాఁడు, వారిని వర్ణించినాఁడు. అట్లు వెలుగోటి వెలమరాజులదగ్గఱ కేఁగినాఁడు. వారిని వర్ణించినాఁడు. గుణవద్వస్తువర్ణనము కవికి స్వాభావికము. దానివలనఁ జిక్కువచ్చినప్పుడు తప్పించి నచ్చఁజెప్పఁగల్గు చాతుర్యమును గవికి స్వాభావికమే.

రావుసర్వజ్ఞసింగభూపాలునిచే శ్రీనాథుఁ డెట్లు సమ్మానింపఁబడెనో యెఱుఁగరాదు. బమ్మెర పోతరాజకవీశ్వరునితో శ్రీనాథున కిప్పుడు సమాగమము కల్గియుండును, పోతరా జేకశిలానగరనివాసి గావున; పొలము దున్నుకొనుచున్న పోతరాజుగారిని జూచి శ్రీనాథుఁడు చెప్పినదిగా వినవచ్చు నీ క్రిందిపద్య మిప్పటిది కావచ్చును :

క. తమ్మని గ్రంథం బొక్కటి
యిమ్ముగ నేనృపతికైనఁ గృతి యిచ్చినఁ గో
కొమ్మని యీయరె యర్థం
బిమ్మహి దున్నంగ నేల యిట్టిమహాత్మా?

మెతుకుసీమ ప్రభువులఁ గూర్చి శ్రీనాథుఁడు చెప్పినదిగాఁ దెలియుచున్న యీక్రిందిపద్యము కూడ నాసమయమందలిది కావచ్చును :

శృంగారశ్రీనాథము

చ. తులుకలు కోయ దొంగలకు ఘోరవికారతురుష్కజాతికిన్
మతకపు లంజెతొత్తులకు మాదిగవాండ్రకు మహ్లదార్లకుఁ
కొలకకఁ యిత్తు;రంతె; కవికోటుల కిత్తురె? చత్తు; రంతెపో
మెతుకుదొరల్ .......................భయదాయి దోర్బలల్.

❀

షష్ఠప్రకరణము

# శృంగార శ్రీనాథము

## సప్తమ ప్రకరణము

సీ. రాజమహేంద్రవరమున గోదావరీ
లహరీశీతలగంధవహము లొలయు
త్రైలోక్యవిజయసౌధము చంద్రశాలపై
వేడ్కతో నల్లాడవిభుని వేమ
వీరభద్రారెడ్లు పేరోలగంబుండి
కోరి యెవ్వాని సత్కారపూర్వ
కమ్ముగా రావించి "కవివరేణ్య! బళీ! పె
ద్దాసు! మీవలెఁ గవితాసమర్థు

గీ. లీక్షితిని నేఁటికాలమం దేరి యనుచు
మెచ్చి కాశీఖండము నిచ్చగించి
కృతిపతిత్వంబుచే నిత్యకీర్తి గనిరి
యతనిఁ గవిసార్వభౌము సమ్మతి నుతింతు.

### కాశీఖండరచనము : వేమవీరభద్రారెడ్ల ప్రాపు.

భీమఖండరచనకాలమునకే సనసన్నగా వేమవీరభద్రారెడ్లకు శ్రీనాథకవీశ్వరునియెడ గౌరవాదరములు మొలకెత్తినవి. అందుకొఱకే శ్రీనాథుఁడు భీమఖండమునఁ బ్రసక్తాను ప్రసక్తముగా సందర్భింపఁ

జేసికొని వారిని వర్ణించినాఁడు. అప్పటికిఁ గొండవీటి కోమటి వేమా రెడ్డియుఁ దత్పుత్త్రుఁడు నంతరించి హెచ్చుకాలము కాకపోవుటచేతను వారియెడలఁ గల స్పర్ధ కొంత తదాశ్రితుఁడగు కవీశ్వరుని యెడఁ గూడ నుండఁదగిన దగుటచేతను నప్పుడు వారు శ్రీనాథు నాస్థాన కవివిగాఁ జేసికొన రయిరి. పదపడి శ్రీనాథుఁడు ప్రౌఢరాయ సర్వజ్ఞసింగాదుల యాస్థానముల కరిగి కనకాభిషేకాది సత్కారములఁ బడసి వచ్చెను. ఈవార్తలను భీమఖండకృతిపతియగు బెండపూఁడి యన్నామాత్యుఁడు మొదలగువారు వేమవీరభద్రారెడ్లకుఁ దెలుపుచు నాతనియెడ వారికి విశేషగౌరవ ముదయించునట్లు చేయుచు వచ్చిరి. శ్రీనాథకవీశ్వరు నాస్థానకవీశ్వరునిగాఁ జేర్చుకొనఁ బ్రోత్సాహపఱుచుచు వచ్చిరి. శ్రీనాథకవీశ్వరుఁడు విద్యానగరము,రాచకొండ మొదలగుదేశముల కరిగి తిరిగి కొండవీటికే చేరెను. ఆకాలమున నాతఁడు కాశీఖండమును దెనిఁగింప నారంభించెను. ఎడనెడ బెండపూఁడి యన్నామాత్యాదుల చెలికారముచేఁ రాజమహేంద్రవర ప్రాంతముల కరుగుచుండెను వేమ వీరభద్రారెడ్లు బెండపూఁడి యన్నామాత్యాదుల ప్రోత్సహముచేఁ గాశీఖండమును గృతిగొన నుత్సహించిరి. కాశీఖండమును గృతిగొనుటకుఁబూర్వము శ్రీనాథునకును వేమవీరభద్రారెడ్లకును నప్పుడప్పుడు సంఘటిల్లెడు సందర్శనమేగాని హెచ్చుసంబంధమున్నట్లు కానరాదు. మఱియు నాతఁ డప్పుడు రాజమహేంద్రవరము వాసమేర్పఱచుకొన్నట్లును గానరాదు. కాశీఖండమున: "ఇమ్మహా (కాశీఖండ) ప్రారంభంబు కర్ణాకర్ణికావశంబున నాకర్ణించి కర్ణాంతవిశాలనేత్రుఁడును ...అగు నల్లయవీరభద్రభూపాలుం డొకనాఁడు" అనియున్నది. శ్రీనాథుఁడు రాజమహేంద్రవరముననే వసించుచు వేమవీరభద్రారెడ్లయాస్థానకవితాపదమును బడసియే

యుండునేని యాతనికాశీఖండరచనము వీరభద్రారెడ్డి కర్ణాకర్ణికావ శము నవినఁబడియుండదు. అన్వాహము నాస్థానకవి యగపడుచునే యుం డును. అతఁడే యెఱిఁగించును. మఱియు "నైషధాది మహాప్రబంధ ములు పెక్కు చెప్పినాఁడవు. మాకు నాశ్రితుఁడ వనఘ" అని వేమవీర భద్రారెడ్డి యన్ననట్టున్న పద్యభాగము శ్రీనాథునకు వారితో విశేషపరి చయము లేనట్టు తోఁపించుచున్నది. శ్రీనాథునకుఁ గాశీఖండరచనాభి మానము కోమటివేమారెడ్డితోఁ దాను కాశీయాత్రజరుపుటవేళ నేర్పడి నదయి యుండవచ్చును. కాని దానిని గృతిపతికోరి చెప్పించుకొనలేదు. వేమవీరభద్రారెడ్లుకూడ కాశీయాత్ర చేసిరేమో? ఈయనుమానమున కీక్రిందిపద్యము హేతువు:

క. కాంచీ శ్రీగిరి కాశీ
పంచారామాది దేవభవనంబుల త్రా
యించెఁ వేమమహీధవుఁ
డంచితభూదానశాసనాక్షరపం క్తుల్.

వేమవీరభద్రారెడ్డికాశీఖండరచనమునాఁటికి రాజమహేంద్ర వరమున కుత్తరముగాఁ జీకటి, కళింగపట్టణము, చిల్కసముద్రము పర్యంతముగాఁగల దేశమును జయించి యేలుచుండిరి. వారు జయిం చిన స్థలము లివి కాశీఖండమునఁ జెప్పఁబడినవి. చీడికాడ, మాకవరము, సప్తమాదెములు, దూదెజంతర్నాడు (ఇప్పుడు మావిళ్ళపులకుఁ బ్రఖ్యాత మయిన 'ఆలమండ'ను జంతుర్నాటి యాలమండయనుట విశాఖపట్టణమండలమునఁ గలదు), బారుహ (బారువ), కలువపల్లి, ఒడ్డాది, కసిమికోట కప్పకొండ, మొదలగునవి. చాటుపద్య మిది శ్రీనాథునిది కాఁదగును :

శృంగారశ్రీనాథము

సీ. దండయాత్రాఘోషతమ్మటధ్వనులచే
గంతులు వేయించెఁ గప్పకొండ
కితవ కాలాభీల కీలానలముచేత
నేలఁ బొంగరఁగించెఁ బాలకొండ
ఆరట్టఘాధట్టహయధట్టములచేత
మట్టితూర్పెత్తించెఁ గొట్టునూరు
భూరిప్రతాపాగ్నిఁ బుటములు పెట్టించె
విద్వేషులను గల (?) వెండిపురము

గీ అనఁగ నుతికెక్కుతౌర! కేళాదిరాయ!
ఆరులపండుమఁడువాయవవహరణ!
బిరియదూరియమాళువ బందికార!
విజయరఘురామ! అల్లాడవిభునివేమ!

ఈ క్రింది చాటుపద్యములు వేమవీరభద్రారెడ్లతోఁ బ్రథమ పరిచయము సమయమున శ్రీనాథకవీశ్వరుఁడు చెప్పినవి కాఁదగును:

సీ. వివిధవిద్యోద్దండవిద్వత్కుముద కాండ
హరిణాంక! రూపనారాయణాంక!
నీతోగ్రకరవాల నిర్జితారినృపాల
నప్తాంగ! రాజవేశ్యాభుజంగ!
సకలమహీరాజ్యసంరక్షణోద్యోజ్య
కులశీలగుజ్జరిదళవిఫాళ!
భామాజనస్వాంతపరితోషణలతాంత
కోదండ! రాయచేకోలుగండ!

గీ. జయవిజయజన్యకాంభోజహయవమాజ
ఘురవిపాటనసంభూత కుతలరేణు

పటలవిలిడమనధ్వాంత భరితభువన
విజయరఘురామ! అల్లాడవిభునివేమ!

సీ. ఖండేందుమౌళిపైఁ గలహంసపాళిపైఁ
గర్పూరధూళిపైఁ గాలుద్రవ్వు
మిన్నేటితెఱలపై మించుతామరలపై
మహిమంచు నురలపై మల్లరించు
జంభారిగజముపైఁ జంద్రికారజముపైఁ
జందనధ్వజముపైఁ జౌకళించు
ముత్యాలసరులపైఁ మొల్లక్రొవ్విరులపై
ముదికల్పతరులపై మోహరించు

గీ. వెండిమలయొక్క శేషాహివెన్నుఁదన్ని
తొరిదుగ్ధాబ్ధితరఁగలతోడ నలరి
నెఱతనంబాడి నీకీర్తి నిండె నహహ!
విజయరఘురామ! అల్లాడవిభునివేమ!

సీ. జయ! రాజవేశ్యాభుజంగాంక నిశ్శంక
యభ్యుదయంబు రాజాధిరాజ!
మంగళం బావతమండలీకరగండ
సంకల్పవంసిద్ధి సమరవిజయ!
బ్రహ్మయు వరిరాయబసువ శంకరముద్ర
వర్ధిల్లు గాయగోవాళబిరుద!
మహిమించు రపుచెంచు మలచూఱకారాంక
స్వస్తి కర్పూరవవంతరాయ

గీ. ఆంధ్ర..........సింధుయవవదేది
వీరలక్ష్మీస్వయంవరపీఠవాధ్య!

శృంగారశ్రీనాథము

ధరణిఁ బాలింపు మాచంద్రతారకముగ
విక్రమోపేంద్ర! అన్నయవీరభద్ర!

వీరభద్రారెడ్డితమ్ముఁడు దొడ్డారెడ్డి నిశ్శంకుని కొమ్మనామాత్యునిచే శివలీలావిలాసమను ప్రబంధముఁ జెప్పించి కృతిపతి యయ్యెనని యీవఱకే వ్రాసితిని. అతఁడు రాజమహేంద్రపురపార్శ్వమున నిరువది యాఱుమూళ్ల మేఱ "రాజకుంజరసింహ" మను నశ్వమునెక్కి దుమికించెనఁట! ఈ విషయము శ్రీనాథుఁడును కొమ్మనామాత్యుడునుగూడఁ బ్రస్తావించినారు:-

మ. హరి దాఁటించెఁ బురోపకంఠమున వాహ్యాళిప్రదేశంబునం
దరుదై యన్నయరెడ్డినందనుఁడు దొడ్డయ్యక్షమాధీశ్వరుం
డిరువై నాలుగుమూళ్ళమేర పని గో సెక్కంపఁగా నేల య
ద్ధరణీనాథునికీర్తి దాఁటెఁ గడు నుద్దండించి బ్రహ్మాండముల్.

— కాశీఖండము.

మ. అరుదై యన్నయదొడ్డభూవిభుఁడు వాహారోహరేవంతుఁడిం
పరుదార న్వడి మూలఁ గూరికర వాహ్యాళిన్నలిన్ రాజకుం
జరసింహంబను వారువంబును యదృచ్ఛాలీలఁ దాఁటింపఁడే
తిరమై యిర్వదినాల్గుమూళ్ళవిసు పుత్సేకంబుచే యెత్తుగాన్

—శివలీలావిలాసము.

ఈతఁడు శృంగారంకోట లోతుగడ్డలను జయించెనఁట! రాజమహేంద్రవరమున వీరభద్రారెడ్డి త్రైలోక్యవిజయసౌధము చంద్రశాలపైనుండిన. గోదావరీతరంగతాండవ మగపడుచుండెడిదఁట!

సప్తమప్రకరణము

క. త్రైలోక్యవిజయసౌధవి
కాలమహోత్తుంగ చంద్రశాలాసరత
వ్యాలోకిత గౌతమక
న్యాలహరివిహారతాండవాటోపనకున్.

ఇప్పుడు చిత్రాంగిమేడ యని చెప్పఁబడెడు దిబ్బ యీ త్రైలోక్య విజయసౌధపుఁ బాటిదిబ్బ యగునాయేమిః

వీరభద్రారెడ్డి పాలనకాలమున బ్రాహ్మణుల వైభవ మీవిధముగా వర్ణింపబడినది :

సీ. ధరియింపనేర్చిరి దర్భపెట్టెడు వ్రేళ్ళ
లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింప నేర్చిరి గంగమట్టియమీఁదఁ
గస్తూరికాపుండ్రకములు నొసల
నవరింపనేర్చిరి జన్నిదంబులఁ బ్రోలఁ
దారహారములు ముత్యాలసరులు
చెరువంగ నేర్చిరి పిగల సెన్నదుములఁ
గమ్మని క్రొత్త చెంగల్వ విరులు

గీ. ధామముల వెండిపైఁడియుఁ దడబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములలోన
వేమభూపాలుఁ దనుజన్ము వీరభద్రు
ధాత్రియేలింప గౌతమీతటములందు.

ఇది స్వభావోక్తి. అప్పుడు విద్వాంసులగు బ్రాహ్మణులస్థితి యట్టే కలదనుట స్పష్టపడుటకును మఱికొన్ని విషయము లెఱుక పడుటకును వీరభద్రారెడ్డికాలమున నెలకొల్పఁబడిన చెఱుకుమిల్లి

శృంగారశ్రీనాథము

ధర్మశాసనము చూడఁదగినది. వీరివంశవృక్ష మీక్రిందఁ జూపుచున్నాఁడను:




## కాశీఖండము.

"కాశీఖండ మయఃపిండమ్" అని ప్రతీతిఁగాంచిన సంస్కృత గ్రంథమున కిది తెలుఁగు. అయఃపిండ మన్నప్రతీతి తెల్గుగ్రంథము నకే యయి యుండవచ్చునని నాతలంపును ముందే తెల్పితిని. శ్రీనాథుని గ్రంథములలోనెల్ల నిది ప్రౌఢతమరచనము గలది. సంస్కృత గ్రంథమున కిది సరియయిన తెనుఁగు గాదు. మిక్కిలి సంక్షిప్తముగా నున్నది. సంస్కృతమునఁగల గ్రంథభాగ మెంతో యిందు విడనాడఁబడనది. తన పూర్వకావ్యరచనము నీగ్రంథమున శ్రీనాథుఁడు "చిన్నారి పొన్నారి—" పద్యమందుఁ బేర్కొన్నాఁడు. ఇంచుమించుగా నీకావ్యము రచించునాఁటికి శ్రీనాథుఁ డర్వదియేండ్ల ప్రాయము వాఁడగునని "ప్రాయమింతకు మిగులఁ గైవ్రాలకుండ" ననువాక్యము వ్రాయుచున్నది. వీరభద్రారెడ్డి యొడ్డోలగముండి శ్రీనాథునిఁ గృతి గోరు విషయ మిట్లు వర్ణింపఁబడినది:—

సీ. త్రైలోక్యవిజయాభిధంబైన సౌధంబు
చంద్రశాలాప్రదేశంబునందు
సచివసైన్యాధీశసామంతనృపవార
సీమంతినీజనశ్రేణి గొలువ
శాస్త్రమీమాంసయు సాహిత్యగోష్ఠియు
విద్వత్కవీంద్రులు విస్తరింప
కర్పూరకస్తూరికా సంకుమదగంధ
సారసౌరభము దిక్పూరితముగ

గీ. నిజభుజావిక్రమంబున నిఖిలదళలు
గెలిచి తను రాజ్యపీఠ మెక్కించినట్టి
యన్న వేమేశ్వరునియంక మాశ్రయించి
నిండుఁగొలువుండెఁ గన్నులపండువగుచు.

వ. అప్పుడు నన్నుం బిలువం బంచి సముచితాసనంబునఁ గూర్చుండ నియమించి యున్నయవసరంబున:-

సీ. వచియింతు వేములవాడభీమనభంగి
నుద్దండలీల నొక్కొక్క మాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వప్రకారమురసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరునితేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు

గీ. నైషధాదిమహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ!

శృంగారశ్రీనాథము

యిపుడు చెప్పఁదొడంగిన యీ ప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్యవేఁద!

శా. ఈక్షోణిన్ నినుఁబోలు సత్కవులు వేరీ నేఁటికాలమ్మునన్
దక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసార ఘుసృణద్వైరాజ్యభారంబున
ధ్యక్షించున్ గవిసార్వభౌమ! భవదీయప్రౌఢసాహిత్యముల్.

"కర్ణాటకటకపద్మవనహేళి" "కవిసార్వభౌమ" పదములఁ గూర్చి యీవఱకే కనకాభిషేక ప్రకరణమునఁ బ్రస్తావించితిని. మఱియు శ్రీనాథుఁడు తన సాహిత్య సౌష్ఠవమునకుఁ గారణములని, యుద్బోధకములని వేమభూపతి దయావీక్షణాదులను బేర్కొని చెప్పిన పద్యము నింతకుముందే వివరించితిని. మీఁద నుదాహరింపఁబడిన "వచియింతు వేములవాఁడ" యని సీసపద్యము వీరభద్రారెడ్డి యన్నయగు వేమారెడ్డి తన్నుఁగూర్చి ప్రశంసించినదిగా శ్రీనాథుఁడు చెప్పుకొన్నాఁడు. ఈ పద్యమునుగూర్చి నే నిట్లు తలఁచుచున్నాఁడను. వచియింతు, భాషింతు, వాక్రుత్తు, పరిఢవింతు – అనుపదములు మధ్యమ పురుషక్రియలుగాఁ బ్రయోగింపఁబడినవి. అవి ఘుటితిస్ఫూర్తిలో నుత్తమపురుషక్రియలుగా గోచరించును. ఎత్తుగీతి నెత్తుకొనిన పిదపఁగాని యవి మధ్యమపురుషక్రియలుగాఁ దెలియరావు. ఈపద్యమును శ్రీనాథుఁడు కర్ణాటరాజాస్థానమునఁగాని మఱియేదేనియెడఁగాని తన కవితాప్రాభవము నెఱిఁగించుకొనుచు నుత్తమపురుషక్రియా ఘటితముగానే రచించి పదపడి కాశీఖండరచనకాలమునఁ గ్రొత్త యెత్తుగీతిని జేర్చి వేమారెడ్డి పలికినట్లు మధ్యమపురుషక్రియాన్వయ మేర్పరచి కూర్చుకొని యుండును. ఇట్లుచేయుటచే నాత్మస్తుతి

దోషము లేకపోవును. మధ్యమపురుషక్రియాఘటితముగానే యాతఁడు రచించి యుండునేని నాల్గుక్రియలలో దేనికయినను "వు" చేర్చి యుండును.

విద్యానగరమున కరిగి డిండిమభట్టునోడించి రాయనిచేఁ గనకాభిషేకాదిసత్కారములఁ బడసివచ్చినతర్వాత నల్పకాలమునకే రచింపఁబడినదగుటచే నీకాశీఖండమున శ్రీనాథుఁడు ప్రసక్తి కల్పించుకొని యా విషయమునుగొంత చెప్పుకొన్నాఁడు. గ్రంథమున సందర్భమిది:- మేరు వింధ్యపర్వతములకు నారదమహర్షి స్పర్థపెంచెను. అవమానమోర్వఁజాలక వింధ్యపర్వత మాత్మగతముగా నీక్రిందివిధము ననుకొనుచున్నది' పరిభూతుఁడయిన పండితుఁ డనుకొన్నవిధముననున్నదిగాని యిది యవమానితమయిన యద్రియనుకొన్న విధమున లేదు. చదువఁదగును:

గీ. విబుధమునిమాట చెవికిఁ గ్రొవ్వేఁడిగాఁగ
వంధ్యగర్వోదయుండైన వింధ్యశిఖరి
చాల నుద్వేగమందె విచారపరత
నాత్మగతమునఁ దాను నిట్లనుచు నుండె.

గీ. శాస్త్ర మాచార్యసన్నిధిఁ జదువఁడేని
యుద్ధబోధంబు మది సంగ్రహింపఁడేని
తెగువమీఱి ప్రతిజ్ఞ సాధింపఁడేని
జ్ఞాతి జయమందఁడేని త జ్జనుఁడు జనుఁడె?

ఉ. కంటికి నిద్రవచ్చునె, సుఖంబగునే రతికేళి, జిహ్వకుఁ
వంటకమిందునే, యితరవైభవముల్ పదివేలు మానసం

బంటునె మానుషంబుగలయట్టి మనుష్యున కెట్టివానికిన్
గంటకుఁడైన నాగ్రహముఁడాకందు తనంతటి వాఁడు కల్గఁగన్.

క. ఎవ్వనితో నెచ్చోటం
జివ్వకుఁ జేఁ జాఁపవలదు చేఁ జాఁచినచో
నివ్వల నవ్వల నెవ్వరు
నవ్వకయుండంగఁ బగసవన్ దీర్పఁదగున్.

సంస్కృతమున నింత లేదు. శ్రీనాథుఁడు డిండిమభట్టారకుని తోడి వివాదసందర్భమున నాత్మగతముగా ననుకొనిన విషయమే యిందిట్లు ప్రసక్తపఱిచి చొప్పించినాఁడని తలంపఁ దగును. లక్ష్మి నిట్లు స్తుతించినాఁడు:-

ఉ. పండితుఁ డాతఁ డాతఁడు ప్రభావసమగ్రుఁ డతండు శూరుఁ డా
తండు వివేకి యాతఁడు వదాన్యుఁ డతండు మహాకులీనుఁ డా
తండు కళావిదుం డతఁడు ధన్యుఁ డతండు మనోజ్ఞమూర్తి యె
వ్వండు భవత్కృపాకలన వైభవలక్ష్మికిఁ బాత్ర మిందిరా!

గీ॥ కమలనయన నీవు కలచోటు కలచోటు
నీవు లేనిచోటు నీరసంబు
కంబుకంఠి నీవు కలవాఁడు కలవాఁడు
లేనివాఁడు నీవు లేనివాఁడు.

మఱికొన్ని విశేషములు శ్రీనాథుని స్వభావమును గూర్చి వ్రాయుపట్టునఁ దెలుపుదును.

డిండిమభట్టారకుని జయించుట యాతనికి మహోత్సాహకరముగా నున్నది. కాశీఖండమునఁ గవిసార్వభౌమ బిరుదమును గ్రంథావ

తరణికలోను, గద్యమునందును జెప్పుకొన్నాఁడు. గ్రంథాంతమునఁ గూడఁ జెప్పుకొన్నాఁడు:

శా. కర్ణాటక్షితినాథమౌక్తికసభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధకవిరాట్సంస్తుత్య చారిత్ర! దు
గ్ధార్ణోరాశిగభీర! ప్రౌఢఘుణమధ్యాహ్నవరాహార్చితా
పర్ణావల్లభ! రాజశేఖరమణీ! పంటాన్వయగ్రామణీ!

కాశీఖండము రచించి కృతియొసఁగినప్పుడు వీరభద్రారెడ్డి మన దొడ్డకవీశ్వరున కేమేవి సత్కారములఁ గావించెనో యెఱుఁగ రాదు. "కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి, రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు" నని యవసానపద్యమునఁ జెప్పుకొన్నాఁడు. కాశీఖండరచన కాలమునుండి శ్రీనాథుఁడు "వీరభద్రారెడ్డి విద్వాంసుఁ" డయినాఁడు.

వేమవీరభద్రారెడ్ల యవసానము.

వీరి యవసానమునుగూర్చి యింతవఱకు స్పష్టముగా నేమియును దెలియరాకున్నది. శాక 1356 వఱకు వేమవీరభద్ర దొడ్డయాన్నయలు నల్వురును జీవించియున్నట్టు దాక్షారామశాసనములవలనఁ దెలియు చున్నది. శాక 1366 లో దాక్షారామమునఁ బ్రౌఢదేవరాయలశాసన మున్నది. శాక 1376లో గజపతులశాసనములు కొండవీడుప్రాంత ములఁగూడనున్నవి. 'రెడ్డివొడ్డెకర్ణాటరాజ్యము'లని తెలుఁగుదేశమునఁ బ్రతీతికలదు. రెడ్డిరాజ్య మంతరించినతరువాత నొడ్డెరాజ్యము వచ్చి నట్టు ప్రఖ్యాతి. కృష్ణదేవరాయవికాలమున నాయొడ్డెరాజ్యము చెఱుపఁ బడినది. రాజమహేంద్రవరమున రెడ్డిరాజ్యము పేరులేకుండ సమసి పోవుటకు గారణమేమో స్పష్టముగాఁ దెలియరాకుండుట వింతగా నున్నది. కర్ణాటరాజులో గజపతులో రూపుమాపియుందురేమో!

శృంగారశ్రీనాథము

కాశీఖండరచనకాలమునాఁటికి వేమవీరభద్రారెడ్లు కర్ణాటులతో గజపతులతో నత్యంతమైత్రి కల్గియుండిరి. కాశీఖండమం దిట్లు వీరభద్రారెడ్డి వర్ణింపఁబడినాఁడు:

"కర్ణాటోత్కళ పారసీకనృపసఖ్య ప్రాభవశ్రీనిధీ!"
"ఉత్కళ కర్ణాట తురుష్కరాట్పరమమిత్రా!"

"కర్ణాటక్ష్మాపతి కానుకయంపిన బాగాహయంబులు వాగెవచ్చు! యవనాధిపతి యుపాయనముగా ననిపిన ముక్తాతపత్రంబు ప్రోల మెఱయు! ఒడ్డెధాత్రీనాథుఁ డుపద పుత్తెంచిన బంగారుజోష్ఠి సంబెళ వహించు." ఈమువ్వురలో నొకరు రాజమహేంద్రవరరాజ్యమును నిర్మూలపఱచియుందు రనుటకు సరియయిన ప్రమాణము దొరకకున్నది. వేమవీరభద్రారెడ్లకు వెలుగోటివెలమరాజులు ప్రబల విరోధులుగా నుండిరి. అనుబంధము చూడఁదగును. మాదయలింగమనేనిఁగూర్చి కల సీసమాలికలో "గంగసాక్షిగ మీఱి కదిసి రాజమహేంద్రవరము చూఱలుకొని వచ్చినాఁడు" అనియు, "వీరభద్రుని దొడ్డవిభువేమ నృపతులఁబట్టఁడై కాలం దెబెట్టినాఁడు" అనియుఁ గలదు. మఱికొన్ని పద్యములు గలవు. కాని రాజమహేంద్రవరమును వెలుగోటివెలమ రాజులు పరిపాలించినట్లెక్కడను గానరాదు. బలవత్ప్రమాణములు లేక యిది యిట్లే యని నిర్ధారింపరాదు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు వేమవీరభద్రారెడ్ల యవసానమునుగూర్చి యిట్లు వ్రాసినారు:

"....మంత్రియగు కపిలేంద్రగజపతి రాజ్యారూఢుఁడయ్యెను. ఇతఁడు మిక్కిలిసమర్థుఁడు విక్రమాఢ్యుఁడు నగుటచేతఁ దనరాజ్యమును విస్తరింపఁజేయ సంకల్పించెను. రెడ్డి రాజ్యము నాపోసనము బట్టినఁగాని తనసంకల్పము నెరవేరఁజాలదు. అందులకై పదిసంవ

త్సరములు కృషిచేసెను. 1444 వ సంవత్సరమునఁ గపిలేంద్రగజపతి రాజమహేంద్రపురముపై దండయాత్ర వెడలివచ్చెను. ప్రౌఢదేవరాయలు రెడ్లకు సాహాయ్యముఁజేయవచ్చెను. ఉభయపక్షములవారికి యుద్ధములు జరిగినవి. కపిలేంద్రగజపతి యుద్ధమున గెలువఁజాలక యాతడవకు మరలిపోయెను గాని తనపట్టువిడచినవాఁడుగాఁడు. ప్రౌఢదేవరాయ లాసంవత్సరమున దాక్షారామభీమేశ్వరుని సందర్శించియొక దానశాసనమును వ్రాయించి వెడలిపోయెను. తరువాత రెండు సంవత్సరములైన తరువాత విద్యానగరమునందు ప్రతాపదేవరాయలు మృతుండయ్యెను. ఇట్టి మహాసమర్థుఁడైన శత్రువు మరణమునొందినందునఁ గపిలేంద్ర గజపతికి బలమెక్కువయయ్యెను. అతఁడు కర్ణాటసామ్రాజ్యమును స్వాధీనపఱచుకొని పిమ్మట తురుష్కులను జయించి దక్షిణహిందూదేశమున నేకసామ్రాజ్యమును స్థాపింపవలయునని సంకల్పించి కృషిచేయుచుండెను.''

## అన్నదేవచోడుని వీరకృత్యములు.

ఇట్లుండగా మధ్యాంధ్రదేశమున నొక మహావీరుఁ డావిర్భవించెను. ఆతఁడు చోడవంశమున జనించినక్షత్రియుఁడు. ఇతని శాసనమొకటి రాజమహేంద్రవరము మ్యూజియములో నుండెను. ఈ తామ్రశాసనములోని కొన్నిపలకలు పోయినవి. అయినను గొంత వఱకు నీతనిచంద్రము దెలిసికొనవచ్చును.... .....................

కామభూపాలునిపుత్త్రుఁడే అన్నదేవచోడుఁడు. సూర్యవంశమున జనించిన పిన్నుండిరాజుయొక్క సోదరియగు ఇరుగాంబికను వివాహము జేసికొనియెను. 1383వ సంవత్సర ప్రాంతమున నుంద్రాజు శూరవరపట్టణము రాజధానిగాఁ బరిపాలనముజేయుచుండెనని పూర్వప్రకర

ణమున దెలిపియున్నాఁడను. ఈపిన్నుండి యనునాతఁడు చాళుక్యరాజు వంశమున జనించినవాఁడుగఁ గన్పట్టుచున్నాఁడు వీరికి సంతానములేని హేతువుచేత వీరభద్రుఁ డనువానిని దత్తుచేసికొన్నట్లు గన్పట్టుచున్నది. అన్నదేవచోడుఁడు బహమనీసుల్తానగు అల్లాఉద్దీన్ షాహాతో నొడంబడిక చేసికొని తురుష్కసైన్య సహాయ్యముతో రాజమహేంద్రపుర రాజ్యములో గొంత భాగమాక్రమించుకొనియెను. రాజమహేంద్రపురమునకుఁదూర్పుభాగమున గజపతికిని వీరభూపాలునకును ఘోర యుద్ధములు జరుగుచుండెను దక్షిణము నుండి లింగమనాయఁడు, సింగమనాయఁడు మొదలగు పద్మనాయకులు కర్ణాటనృపతులకు సామంతులు గావునఁ గర్ణాటసైన్యములతో దండెత్తివచ్చిరి. రాజమహేంద్రపురరాజ్య మిట్లు యవనకర్ణాటకటక సైన్యములతో నొక్కమారు పోరాడవలసివచ్చెను. ఈ ఘోరయుద్ధములలో వేమవీరభద్రపృథ్వీశుల సైన్యము హతమయ్యెను. వీరశిఖామణులైన సోదరులు మువ్వురును వీరస్వర్గమును జూఱగొనఁబోయిరి.... .........

శ్రీ వీరభద్రరావుగారు వ్రాసినవిషయము సంగతముగాఁ దగను. రాజమహేంద్రప్రాంతములం దన్నదేవుఁడను క్షత్రియుఁడు రాజుగానుండెనని, ప్రసంగరత్నావళికూడఁ బలుకుచున్నది. అందుఁ గొన్ని శ్లోకము లన్నచోడదేవునిగూర్చి కలవు. శ్రీవీరభద్రరావుగారు పేర్కొనిన శాసనము మిక్కిలి విలువగలది. ఆ శాసనమందలిపిగా వారు వివరించినవిషయము లింతకుముందుఁ దెలియరాలేదు. ఆశాసనము సవిమర్శముగా ముద్రితము కావలసియున్నది. వీరభద్రరావుగారు శాసనరచనాకాలమును బేర్కొనలేదు. అందుఁ గొన్నిరేకులు పోయినవఁట!

సప్తమ ప్రకరణము

భీమఖండమునందుఁ జూడఁగా సూర్యవంశ్యులయిన వీరభద్రాన్న దేవభూపాలుర గర్వసంరంభము నడఁగించి యరియేటి లింగనమంత్రి యల్లాడభూపతిని దెలుఁగుభూమి నేలించెనని కలదు :

సీ. యూదేశ వనస త్తమాదెబారుహదొంతి
 వంతునాదిక్షితీశ్వరులఁ గెలిచి
యొడ్డాది మత్స్యవంశోదయార్జునుచేతఁ
 బల్లవాదిత్యుచేఁ బలచమంది
దండకారణ్యమధ్య పుళిందరాజ రం
 భాహివంశజులకు నభయమొసఁగి
ధాన మత్కులవీరభద్రాన్న దేవేంద్ర
 గర్వసంరంభంబుఁ గట్టిపెట్టి

గీ. యవన కర్ణాటకటక భూధవులతోడఁ
జెలిమి వాటించి యేలించెఁ దెలుఁగుభూమిఁ
దన నిజస్వామి నల్లాడధరణినాథు
ధీరె యరియేటిలింగన ప్రభువరుఁడు.

అల్లాడభూపతి కాటయవేమారెడ్డి చనిపోయినపిదపఁ గొంత కాలమువరకు జీవించియుండెను. భీమఖండరచనకాలమున కాతఁడు చనిపోయెను. "అల్లాడభూపుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రిపర్యంతం బుత్కళకళింగయవనకర్ణాటలాటాంతర్దేశంబైన ప్రతాపంబున....... ప్రభావుండై విశ్వంభరాభువనమండలంబుఁ బాలించెఁ దదనంతరంబ"- భీమఖండము.

శ్రీ వీరభద్రరావుగారు పేర్కొన్న యన్నలదేవుఁడే పయి భీమఖండపద్యమునఁ బేర్కొనఁబడినవాఁడు. భీమఖండరచనకాలమునకు

కాతఁడు పరాభూతుఁ డగుచువచ్చి తర్వాతఁ గాశీఖండరచనానంతరమున విజయము గాంచెనేమో! ఆశాసనము సమగ్రముగా ముద్రితమయినఁగాని నిశ్చయపరిజ్ఞానమేర్పడదు :

## శ్రీనాథునకు మరలఁ జిక్కులు.

ఎట్లోగాని, వేమవీరభద్రారెడ్డి ప్రభృతులు క్రీ. 1450 ప్రాంతము నంతరించి రనుమాట వాస్తవము. తర్వాత రాజమహేంద్రవరరాజ్యము రెడ్లపాలనమున లేకుండుట వాస్తవము. శ్రీనాథుని యాలంబము మరలఁ జిదికినది. కష్టము! అధికగౌరవముతోఁ ద న్నాదరించుచుండిన కోమటి వేమనను గోల్పోయినాఁడు. కొండవీటిరాజ్యము కూలెను. ఉదయించెను మరల రెడ్డిరాజ్యము రాజమహేంద్రవరమున; అక్కడ భోగభాగ్యములతోఁ దొప్పదోఁగినాఁడు అంతలో నదియు నస్తమించెను. ఇస్సిరో! ఎట్టివిప్లవములు! నేఁటివఱకును శ్రీనాథుని వర్తనము విశృంఖలమే! ఆదరించురాజులయొద్ద నానందముతోఁ గడపవలసినకాలమింక; ప్రాయపుఁబొద్దు పడుమటికిఁ దిరిగినది. అయిననేమి! దేశాటనము తప్పదయ్యెను. వేమవీరభద్రారెడ్లు చనిపోయినతర్వాత శ్రీనాథుఁ డించుమించుగా నిర్వదియేండ్లు జీవించినాఁడు. ఆ కాలమున కుటుంబభరము హెచ్చుగానుండెను గావలయు. దౌహిత్రాది పోష్యవర్గమును ఉప్పనిదిగా నుండియుండును.

## పంటమైలారుని యాశ్రయము.

శ్రీనాథుఁ డిల్లుగదలవలసి యున్నాఁడు. కాని కొండవీటనున్న సంసారమునకు జీవనోపపత్తి కల్పింపవలసియున్నది. అదికుదిరినఁగాని తాను హెచ్చుకాలము దేశాటనము జేయ నసిపడదు. ఇందుకయి

పంటరెడ్డియు, విద్యానగర ప్రభువులకు లోపడిన సామంతుఁడును నగు మైలారరెడ్డిని దర్శించినాఁడు. ఈరెడ్డి శఠమర్షణగోత్రజులగు శ్రీవైష్ణవులకు శిష్యుఁడు. శక. 1350 కీలకసంవత్సరమున మైలారరెడ్డి కోర్కెపై ప్రౌఢదేవరాయఁడు తక్కెళ్లపాడు, పోలవరము, అను రెండు గ్రామములను బ్రాహ్మణులకు దానముచేసెను. మైలారరెడ్డి తనకు యుద్ధవిజయములను గల్గించినందులకుఁ బరితుష్టుఁడై, ప్రౌఢదేవరాయ లాతని యభీప్సితము నెఱవేర్చినాఁడు. పెదకోమటివేము ననంతరము కొండవీడు నాక్రమించుకొనుటలోఁ బ్రౌఢరాయలకీతఁడు తోడ్పడి యుండవచ్చును. కొండవీడుప్రాంతదేశ మీతని యేల్బడిని గొంతకాల మున్నది. మైలారరెడ్డి కంకితముగా శ్రీనాథుఁ డేమేని కృతులు రచియించెనేమో యెఱుఁగరాదు. శ్రీనాథుని కృతులుగాఁ బేర్లు మాత్రము తెలియునవి నందనందనచరిత్ర, వల్లభాభ్యుదయము మొదలగునవి కొన్నికలవు. అందొకటి యాతని కంకితమయి యుండవచ్చునేమో! శ్రీనాథుని నిర్యాణకాలపద్యమున "కైలాసగిరిఁ బంటమైలారవిభుఁడుండె దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు?" అని కలదు.

పల్నాడు ప్రయాణములు.

ఈకాలమున శ్రీనాథుఁడు కొండవీటికిఁ జేరువనున్న పలినాడు మొగలగు ప్రదేశముల కరిగి కొంతధనమార్జించుకొని వచ్చుచుండెడివాఁడు. పల్నాటిసీమనుగూర్చి శ్రీనాథుఁడు రచించినవిగాఁ జెప్పఁబడెడు చాటుపద్యము లీకాలమందలివి కాఁదగును. చాటుపద్యమణిమంజరి, ప్రథమ, ద్వితీయభాగములలో నాపద్యములఁ గొన్నిటిఁ జేర్చితిని. కొన్నింటినిమాత్ర మిక్కడఁ జూపుచున్నాఁడను:-

శృంగారశ్రీనాథము

క. రసికుఁడు పోవఁడు పల్నా
డెసఁగంగా రంభయైన నేకులె వడకుఁ
వసుధేశుఁడైన దున్నును
గుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్.

పలినాటిసీమలో నెంతోలోతు త్రవ్వినఁగానిఁ నీళ్లూరవు. అక్కడఁ జేఁ త్రాళ్ళు కొండవీటిచేఁ త్రాళ్లకు ద్విగుణితమై యుండవలయును. అంతలోఁతు త్రవ్వినను గొన్నిచోట్ల నీరూరక రాతిచట్టు వచ్చును. కాన నీళ్లకై యెంతో సొమ్ము వ్రయిపెట్టియు నొక్కపుడు భంగపడ వలసివచ్చుచుండును. ఇది తెల్పుచుఁ జెప్పినపద్యము:—

ఉ. అంగడి యూరలేదు, వరియన్నములేదు, శుచిత్వమేమిలే
దంగన లింపులేరు, ప్రియమైన వనంబులులేవు, నీటికై
భంగపడంగఁ బాల్పడు కృపాపరు లెవ్వరులేరు, దాత లె
న్నంగను సున్న గాన పలినాటికి మాటికిఁ బోవ నేటికిన్?

పల్నాటిదేశమున గ్రామమున కెవ్వరేని పెద్దలు వచ్చినప్పుడు గ్రామపురోహితునింట విడిదలసేయింతురు. వారిండ్లలోఁ దమతమ యాశ్రితులయిండ్లకుఁ గుట్టియిచ్చుటకై విస్తరాకులు నిల్వయుంచు కొందురు. అక్కడఁ బురోహితులే కరణముగార్లకు విస్తళ్లుకుట్టి ఇవ్వ వలెనఁట! శ్రీనాథుఁ డొకపురోహితునింట విడిసి యారోఁత నిల్లు వర్ణించెను:

ఉ. దోసెఁడు కొంపలోఁ బసులత్రొక్కిడి, మంచము, దూదరేణమున్
బాసినవంటకంబు, పసిబాలురశౌచము, విస్తరాకులున్
మాసినగుడ్డలున్, దలకుమాసినముండలు, వంటకుండలున్
రాసెడుకట్టెలున్ దలఁవరాదు పురోహితులింటికృత్యముల్.

సప్తమప్రకరణము

క. జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలె తప్పన్
వన్నన్నము సున్నసుమీ
పన్నుగఁ బల్నాటిమన్న ప్రజ లందఱకున్.

గీ. చిన్నచిన్నరాళ్లు చిల్లరదేవుళ్లు
నాగులేటినీళ్లు నాఁపరాళ్లు
సజ్జజొన్నకూళ్లు సర్పంబులును దేళ్లు
పల్లెనాటిసీమ పల్లెటూళ్లు.

## మొరసరాజ్యము.

మఱియు మొరసరాజ్యమునుగూర్చి శ్రీనాథునివిగాఁ గొన్ని చాటుపద్యములు గలవు. మొరసరాజ్యమనఁగాఁ గర్నూలుమండల మనియు, మొరసరాళ్లు విస్తారముగా నుండుటచే నాదేశమున కాపేరు వచ్చెననియుఁ దెలియుచున్నది. శ్రీనాథుఁ డీ కాలమున నక్కడికిఁ గూడ నరిగెడివాఁడు. చాటుపద్యము లున్నవి. ఉదాహరింతును:-

ఉ. గొంగడి మేలపచ్చడము కుంపటి సల్లిబి కుక్కిమంచమున్
జెంగటవాయుతైలము లజీర్ణపుమందులు నుల్లిపాయలున్
ముంగిట వంటకట్టెయలమోపులు దోమలు చీఁకపోతులున్
రంగ! వివేకి కీ మొరసరాజ్యము కాఁపుర మెంతరోఁతరా!

ఉ. వంకలపాగలున్ నడుమువంగిన కత్తులు మైలకోఁకలున్
సంకటిముద్దలున్ జనుపకాశములున్ బలుపచ్చడంబులున్
దెంకగునోరచూపులును దేఁకుపదప్పిన యేసబాసలున్
అంకులబ్రహ్మ యీమొరసరాజ్యము నెట్లుసృజించె నక్కటా!

# శృంగార శ్రీనాథము

## అష్టమ ప్రకరణము

సీ. వీరభద్రారెడ్డి చేరెను దివికి రా
        జమహేంద్రవరపుటాశ్రయము తొలఁగె
విప్లవంబులఁ గొండవీడు చేర్పడియుండె
        సేకరంబగు సౌమ్య రేఖపోయె
పడమటఁదిరిగెను బ్రాయంపుఁబ్రౌఢ్మ లేఁ
        జరముపైకొనె విల్లు జరుగదయ్యెఁ
ఇచ్చుచుండెను దినవెచ్చము మైలారుఁ
        డార్జించెఁ బల్నాటి కరిగి కొంత

గీ. వీరకథ, వీథియును, మకుమారచరిత
మొదలుగాఁ గబ్బములు చెప్పె బ్రదికి బ్రదికి
నిస్వతకుఁబాలుపడి దానిదుస్స్వభావ
మెఱిఁగెఁ గవిసార్వభౌముఁ డిట్లెఱియువాఁడె?

### పల్నాటి వీరచరిత్రము.

రాజావలంబము విఱిగిపోయిన తర్వాతఁ గొండవీటినెలకొని పల్నాడుప్రాంతములఁ బర్యటించునప్పు డక్కడి ప్రజల ప్రార్థనము చేతఁగాని, దేశచరిత్రాభిమానముచేతఁగాని, శ్రీనాథుఁడీ గ్రంథమును రచియించియుండును. పల్నాటివీరచరిత్రము భారతమువంటిది. అంద

నేకభాగము లున్నవి పద్యములవంటివి. అమూలాగ్రముగా శ్రీనాథుఁ డాగ్రంథమును రచించినట్లు తోఁపదు. ఇప్పుడుపలభ్యమానము లగుచున్న పల్నాటి వీరచరిత్రభాగములలో శ్రీనాథుని కృతు లేవో స్పష్టముగా నిరూపింపఁ గుదురదు. కొన్నింట శ్రీనాథరచనానుసారముగా రచనము చేయఁబడినట్టుండును. కొన్నింట శ్రీనాథరచనమే యన్నట్టుండును. ఆదిని శ్రీనాథునిపేరు, అంతమున నన్యునిపేరు, దీనికి విపరీతముగాఁ గొన్నింటనుగూడ; కొన్నింటఁ గవిసార్వభౌమబిరుదముకానఁబడును. కొన్నింట శ్రీనాథకవిరాజరాజనిమాత్రమే యుండును. కొన్ని మంజరీరచనముగానున్నవి. కొన్నిద్విపదరచనముగానున్నవి. కొన్నింటి కొకరచనము మాత్రమేయున్నది. కొన్నింటికి రెండుదెఱఁగుల రచనములును మఱి కొన్నింటికి మూఁడుదెఱఁగుల రచనములును గలవు. పల్నాటి వీరచరిత్రభాగములు కొన్ని యీక్రిందివిధమున వేర్పఱుపఁబడియున్నవి. రాజులపుట్టుక, కోళ్ళపోరు, గోపుయుద్ధము, కన్నమనేనియుద్ధము, మందపోటు, రాయబారము, గురిజాల యుద్ధము, కళ్ళిప్రతిష్ఠ, బాలునికథ, కొమ్మరాజుకథ, బ్రహ్మనాయనివిరుగు, – అవి. వీనినిఁగూర్చి యిఁకముందుఁ గొంతవిస్పష్టపరిజ్ఞాన మేర్పడఁగలదు. శ్రీనాథుఁడురచించిన పల్నాటి వీరచరిత్రము ద్విపదరూపమయి యుండవచ్చునని నాతలంపు. క్రీడాభిరామములో నీక్రింది పద్యమున్నది :

మ. ద్రుతతాళంబున వీరగుంఫితకథాధుంధుం:ధుంకిటాత్కార సం
గతివాయించుచు నాంతరాళికయతి గ్రామాభిరామంబుగా
యతిగూడవ్ ద్విపదప్రబంధమున వీరానీకముంబాడె నొ
క్కతె ప్రత్యేకముగాఁ గుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్.

ఇందు ద్విపదగ్రంథమే పేర్కొనఁబడినది. మఱియు నాక్రీడాభిరామమునఁ బల్నాటి వీరచరిత్ర విషయము హెచ్చుగాఁ గలదు. ఆ

గ్రంథము శ్రీనాథకృతియే యగునని నేను నిశ్చయించుచున్నాను. ఆ విషయము ప్రకరణాంతరమున రాఁగలదు. పల్నాటివీరచరిత్రగ్రంథ కర్తల విషయము చిక్కుగా నున్నది: ప్రాచ్యలిఖితపుస్తకశాలలోఁ బల్నాటి వీరచరిత్రపుఁ బ్రతులు పెక్కులుగలవు. కాని యవి యన్నియు భిన్నదేశప్రతులు కావు. కొన్నిపుత్రికలు. శ్రీనాథుఁడు, కొండయ్య, మల్లయ్య యనువారు వీరచరిత్రగ్రంథకర్తలుగాఁ దెలియవచ్చు చున్నారు. ఒకానొకరు బలరామిసెట్టి యనువాఁడుకూడ గ్రంథకర్త కలఁడనిరి. సరికాదు. బలరామిసెట్టి కొండయ్యతండ్రికాని, వేఱుగా గ్రంథము రచించినవాఁడుగాఁడు. పయిమువ్వురలో శ్రీనాథుని కాలము మనమిప్పు డెఱుఁగుదుముగదా! కొండయ్య శ్రీనాథుని తర్వాతి వాఁడే. అతనిగ్రంథము నాద్యంతములం దిట్లున్నది :

ద్వి॥ శరధితల్పునిపేర సర్వేశుపేర
గిరిధీరుఁడగు చంద్రగిరిరంగపుని
వేంకటవిభునకు విభవంబులొసఁగు
పంకజాక్షునిపేరఁ బరమాత్ము పేర.

చంద్రగిరిలో రాజ్యమేలిన శ్రీరంగరాయలకొడుకగు వేంక టాద్రి పయినబేర్కొనఁబడినవాఁడు కావచ్చును. అట్లైన యాకొండయ గ్రంథము శ్రీనాథునకుఁ దర్వాతనే చేయఁబడినట్లు స్పష్టమగుచున్నది. మల్లయరచనకాలము గుర్తింపనాధారము నాకు దొరకలేదు. ఈ మువ్వురుకవులును వేర్వేఱుగా సమగ్రముగా గ్రంథములను రచించి నట్టు కన్పట్టదని చెప్పితిని. ఎవ్వరేయేభాగములను రచించిరో యది కూడ విస్పష్టముగా నెఱుఁగరాకున్నది. కొన్నిపట్టుల రచనములు సంకర మయినవి. కృత్యవతరణికావసానములు తార్మారయినవి. చిరకాలము

నుండియు నీచరిత్రము నీచజాతుల కంఠస్థమగుచుండి ప్రాయిక ముగాఁ దప్పులమూల వ్రాఁతకెక్కుచు నుండుటచేత నట్టివికృతిని గాంచినదని నేను దలంచుచున్నాను.

ఆంధ్రభాషోద్ధారకులలోఁ గలకాలము స్మరింపఁదగిన రసిక శిఖామణి, సి పి. బ్రౌనుదొరగారు వీని నన్నింటిని బరిశీలించి యీ క్రిందివిధమున నభిప్రాయమిచ్చిరి. "శ్రీనాథుని కృతినిజూచి తక్కిన యిర్వురును గ్రంథరచనముచేసిరి గావున వారు శ్రీనాథునిఁ దమ గ్రంథములందుఁ బ్రశంసించిరి." ఇది యుక్తముగా నున్నదని నేనును దలంచుచున్నాను. ద్విపద రూపమున మిక్కిలి సంగ్రహముగా నొక రచనము ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోనే కలదు. అది మంచి రచనముకలదై చక్కఁగానున్నది. శ్రీనాథునిది కావచ్చునని నేను దలంచుచున్నాను. కాని యది సంపూర్ణముగా లేదు. తక్కిన యిర్వుర రచనములుగూడ మొదటినుండి తుదదాఁక లేవు. వీరచరిత్ర మందలి యేకదేశమగు "బాలునికథ"ను శ్రీయక్కిరాజు నుమాకాంతముగారు బృహత్పీఠికతో నీనడుమఁ బ్రకటించిరి. వారు ప్రకటించినపిదపనే యాకథ ననేకు లెఱుఁగఁ గల్గిరి. మంజరీ రూపమునమన్న గ్రంథమును వారుప్రకటించిరి. కాని వారి ముద్రణ మున నాకృతియాకృతి చెడినది. గ్రంథావతరణికలో రెండు దెఱఁగుల రచనములు కలసిపోయినవి. అదియెల్ల నిక్కడ నిరూపింపఁ బూనినచో గ్రంథవిస్తరమగునని వెఱచి విడుచుచున్నాఁడను. ప్రాచీన గ్రంథములను ముద్రించు నప్పుడు గ్రంథకర్తల రచనములను మార్పకుండుట న్యాయ్యము. కవిప్రయుక్తపాఠముగుర్తింపఁ గుదురనప్పుడు గ్రంథకర్తృ మతానురోధమున నుచిత సంస్కారము చేయఁదగును. గ్రంథపాతము లున్నప్పుడు కథాసమన్వయమునకై పూరణములు

సయితము చేయఁదగును. ఆ పూరణములేవో తెలియఁ దగినట్లు చిహ్నితములుగా నుండవలెను. ఈ గ్రంథసంపాదకులు యథేచ్ఛముగా గ్రంథమును మార్చిరి. కొంతచేర్చిరి. ఆమార్పులు చేర్పులు వన్నియుఁ దిన్నఁగాఁ దెలుపరయిరి. దానిఁ జూచి శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రమును రచించెననుటయే కల్లయని కొందఱు మూలచ్ఛేదమే చేయుచున్నారు. శ్రీనాథుఁడు పల్నాటి వీరచరిత్రము రచించెను. కొన్ని భాగములు నిర్దుష్ట రచనములఁగలవి కలవు. అట్టివి శ్రీనాథునివిగా నిలువఁగలవు. వాచకలేఖకాదులమూలమున దొరలినతప్పులనుబండితులు నిపుణముగాఁ బరిశీలించినచోఁ దొలంగింపఁగల్గుదురు. ఉపలభ్యమానములగు వీరచరిత్రప్రతులనుగూర్చి తెలుపఁదగిన విషయ మెంతోగలదు సంక్షేపించితిని. ఆంధ్రదేశము, ఆంధ్రభాష, ఆంధ్రులయాచారవ్యవహారములు, ఇంతయేల, —'ఆంధ్రత' యనునది యీ గ్రంథమునఁ బరిస్ఫురించుచున్నది. ఉన్నంతవఱకు దాని నెన్నటికేని తిన్నఁగా వెల్లడింప నుత్సాహపడుచున్నాఁడను. పల్నాటి వీరచరిత్రమునకుఁ గథాసంగ్రహ మిది:

పల్నాటిరాజయిన యనుఁగురాజునకు వీరవిద్యాదేవి, భూరమాదేవి, మైలమాదేవి యని మువ్వురుభార్యలు. మైలమాదేవియందు నలగామరాజును, దక్కు నిర్వురందు మలిదేవ రాజాదు లేడ్వురును, బుత్త్రులు జనించిరి. అనుఁగురాజునకు దొడ్డనాయఁడు మంత్రి. ఈతని పుత్రులలో బాదయ్య యనువానిని దొలుత ననుఁగురాజు పెంచుకొనియెను. బ్రహ్మయ్య యనునతఁడు మహానుభావుఁడు. దొడ్డనాయనితర్వాత నితఁడే మంత్రి. అనుఁగురాజు రాచపుండుచే మృతి నెందెను. మరణ సమయమునఁ దనపుత్త్రిలను బ్రహ్మనాయని కప్పగించి యరసి కాపాడుచుండుమని చెప్పెను. తదనంతరము నలగామ

రాజును బట్టాభిషిక్తునిఁజేసి బ్రహ్మయ్య తాను దోడై రాజ్యమేలించు చుండెను. ఒకప్పు డాతఁడు కప్పములఁ గొనితెచ్చుటకై యన్యదేశముల కరుగఁగా, నారువెల్లి నాయకురా లను నొకవీరవనిత స్వశక్తిచే నలగామునొద్దఁ గార్యనిర్వాహకురాలై యాతని హృదయసీమయం దప్పటికి బాలురుగానున్న మలిదేవరాజాదుల యెడ విద్వేషాంకురముల నాఁటెను. నలగాముఁడు నత్కాశకు లోనై యాదుర్మంత్రిములకుఁ జిక్కి తమ్ములఁ జెఱసాలలోఁ బెట్టించెను. బ్రహ్మనాయఁ డదియెఱిఁగి రాజ్యమును విభజించి మలిదేవరాజాదులకు మాచెర్ల రాజధానిగా నేర్పఱిచి వారి నక్కడి కనిపి తానును దోడై వారిచే నక్కడ రాజ్యమేలించు చుండెను. నలగాముని రాజధాని గురిజాల. అతనికి మలిదేవాదుల రాజ్యము నపహరింపవల నను దురాశ మెండయ్యెను. నాయకురాలు తన మంత్రశక్తిచే మలిదేవరాజాదులకును నలగామునకును గోడి పోరాటము నమకూర్చెను. ఎవ్వరి కోడి యోడునో వారేడేండ్లు రాజ్యము వీడి యన్యదేశములకుఁ బోవలసినటు పందెము. బ్రహ్మనాయఁడు కోడిని గొనిపోయెను నాయకురాలు మంత్రప్రయోగముచే బ్రహ్మనాయునికోడి యోడిపోవునట్లు చేసెను. తర్వాత బ్రహ్మనాయఁడు చచ్చుటకు విషాన్నము పెట్టించెను. కాని దానివలన నాతనికి వికృతి కలుగకపోయెను. బ్రహ్మనాయఁడు విష్ణ్వంశ సంభూతుఁడుగాఁ దలఁపఁ బడుచున్నాఁడు. నాయకురాలిని మనము కర్ణునంశమున జనించిన దానిఁగాఁ దలంతము. ఒక గ్రంథకర్త యీ యిర్వురజన్మ చిత్రప్రకారము ముగాఁగల్పించెను. పందెముప్రకారము మలిదేవరాజాదులు మండాది యనుగ్రామమునకు రాజ్యమువీడి యరిగిరి. నాయకురాలిపన్నుగడ చేతనే నలగాముఁ డక్కడ మలిదేవరాజాదుల గోగణమును బాడిపించెను. అగ్రిహోద్రగుఁడై బ్రహ్మనాయఁడు గురిజాలకువచ్చి యలగా

మునకు మిక్కిలి చిక్కుగల్గునట్లు యుద్ధమునల్పెను. మలిదేవరాజాదులు మండాదిపీడి శ్రీగిరిప్రాంతములకరిగి భిక్షావృత్తిమఠమువారివలన గొన్నిభూములు గుత్తకుఁ దీసికొని ఆకాలమెట్లోగడిపిరి. పదపడి తమరాజ్యముఁ దమకిమ్మని యల్లమలురాజు (నలగామాదులకల్లుండు)ను రాయబారిగా నంపిరి. నలగాముఁడు రాజ్య మీ నంగీకరింపకపోయెను. అల్లుమల్లుఁడు తిరిగివచ్చునెడఁ ద్రోవలో నాయకురాలు విషగర్భితమగు పూఁబంతి మూలమున నాతనిఁ జంపించెను. పదపడి యిరువాగుల వారికిని గార్యమపూఁడియొద్ద యుద్ధము జరిగినది. అర్వదియేడ్గురు వీరులు వీరశయనమున శయించిరి. నాయకురాలియొక్కయు బ్రహ్మనాయనియొక్కయు శక్తిసామర్థ్యము లత్యద్భుతములు. బ్రహ్మనాయనితో సయితము నాయకురా లెదిరినిల్చెను. తుదకు శరణాగతుఁడయిన యలగామరాజును బ్రహ్మనాయఁడు రాజ్యమున నిల్పెను. ఈయుద్ధమున వీరశయనమున నొఱఁగిన వీరులెల్లరును బ్రమథులుగా భావింపఁబడుచున్నారు. కార్యమపూఁడిలో వీరికాలయములు కట్టఁబడినవి. సంవత్సరోత్సవములు జరుగుచున్నవి. కానిక లర్పింపఁబడుచున్నవి. యుద్ధమారంభింపఁ బోవునపుడు బ్రహ్మనాయఁడు కార్యమపూఁడి గంగధారమడుగుకడఁ గలుపోతురాజును బ్రతిష్ఠించెను. ఈ క్రింది చాటుధార శ్రీనాథునిదని వాడుకకలదు :

ఉ. వీరుల దివ్యలింగములు విష్ణువు చెన్నఁడు కల్లుపోతురా
ఘోరయఁగాలభైరవుఁడు నంకమశక్తియు నన్నపూర్ణ యా
కేరెడు గంగధారమడుగే మణికర్ణికగాఁ జెలంగు నీ
కారెమపూఁడిపట్టణము కాశిగదా పలినాటి వారికిన్!

పల్నాటి వీరుల సంగరము జరిగిన తర్వాతఁ జిరకాలమునకా కథ గ్రంథరూపమున నెలకొన్నది. పల్నాటిసీమయందుఁ బ్రజ లాయా

యెడల నాయాచరిత్రాంశములు జరిగినట్టు ఐతిహ్యములఁ జెప్పు కొనుచుండెడివారు. ఇప్పటికిని జెప్పుకొనుచున్నారు. ఈ విషయము క్రీడాభిరామమున నిట్లు తెలుపఁబడెను.

సీ. ఇచ్చోట భుజియించి రేకకార్యస్థులై
సామంతనృపతులు దాపకూడు
ఇచ్చోటఁ జింతించె నిచ్చ నుపాయంబు
నళినాక్షి యార్వెల్లి నాయిురాలు
నిజమనుశుద్ధికై నిప్పుటేయేటితో
నోలాడె నిచ్చోట బీలపాని
యిచ్చోటఁ బోరిరి యిలపజ్ఞంబుగఁ గొల్ల
సవతితల్లులబిడ్డ లవనిపతులు
ధీరులగు వారలేవురు వీరపురుష
లైమదోద్ధతి నిచ్చోట నాజిఁబడిరి
యనుచుఁజెప్పుదు రైతిహ్య మచటనచట
జనపపెద్దలు పల్లెదేశములయందు.

నాఁటికి నాఁటికి నందుఁ గల్పితాంశములు హెచ్చినవి. యుద్ధ వీరులయెడ మాహాత్మ్యము సుస్థిరపడినది. గ్రంథరూపమగునాఁటి కీచరిత్రము భారతభాగవతాదులవలెఁ బరమపవిత్రమగు పుణ్యకథగా నభ్యర్హితమయ్యెను. వీరభాగవత మనియు, వీరరామాయణ మనియు నీకథాంశము ప్రస్తుతింపఁబడుచున్నది. కాని యిది యనేకసందర్భము లందు భారతకథతోఁ బోలుచున్నది. బ్రహ్మనాయఁడు, నాయకురాలు మొదలగువారి జన్మాదిసందర్భములందు మూలముట్టుగాఁ గథలు కల్పింపఁబడినవి. బ్రహ్మనాయనిమాహాత్మ్య మెక్కువగాఁ జెప్పఁబడినది. అనుఁగురా జుత్తరహిందూదేశమునుండి పాపపరిహారార్థమై దేశాటనము

శృంగారశ్రీ—థము

చేయుచుఁ గృష్ణాతీరముసేరి పాపవిర్ముక్తుఁడై పదపడి యక్కడ నెలకొనెనన్న సందర్భమునఁగూడ భూతార్థము కలదో లేదోయని సందేహము కల్గుచున్నది. భారతయుద్ధముతో నీయుద్ధమును బోల్చుటకై యనేక కథాభాగములు సమకూర్పఁబడినవి. భారతకథయందు మాయాద్యూతముఁ గలదు. ఇందును గలదు. అందుఁ బాండవులకు శ్రీకృష్ణుఁడు తోడు. ఇందు మలిదేవరాజాదులకు బ్రహ్మనాయఁడు తోడు. అందు దుర్యోధనాదులకు శకుని కర్ణాదులతో దురాలోచనము. ఇందు నలగామునకు నాయకురాలితో దురాలోచనము. ద్యూతమున నోడినవారు ప్రవాసము సేయవలసినట్లు పందె మందును గలదు. ఇందును గలదు. విషాన్నము పెట్టించుట యందును గలదు. ఇందును గలదు. గోగ్రహణ మందునుగలదు.ఇందును గలదు. రాయబార మందును గలదు.ఇందును గలదు. ఉత్తరకుమార ప్రజ్ఞ లందుఁ గలవు. అట్టివే తంబళకొమ్మయ్య ప్రజ్ఞ లిందుఁగలవు.

ఇట్లెన్నియేని పోల్చిచూపనగును. అనుఁగురాజు మొదలగువారు కార్తవీర్యార్జునుని వంశమున జనించిన క్షత్రియులఁట. ఈ యుద్ధము పండ్రెండవశతాబ్దిలో జరిగినది. పల్నాటి సీమలో మాచర్ల, గురజాల మొదలగు స్థలములందు ఇష్టకామేశ్వరస్వామిదేవాలయము లున్నవి. అనుఁగుగామరాజు (అలగామరాజు, అనుఁగురాజు అనుగుగామరాజు ఒకవిపేళ్లే) చనిపోయినపిదప నాతనిపేర శివలింగములు ప్రతిష్ఠింపఁబడినవి కాఁబోలును. భీమేశ్వర, గణపేశ్వరాది శివలింగములిట్లు ప్రతిష్ఠింపఁబడినవే ఇట్టియాచార మీనాఁడును గలదు.

### పాటలు–పదాలు.

శ్రీనాథుఁడు పల్నాటి వీరచరిత్రము మాత్రమేకాక యట్టిరచనములను మఱికొన్నింటినిగూడఁ జేసినట్టు తెలియుచున్నది. ఈవిషయ

మున శ్రీగురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారిట్లు వ్రాసిరి: "ఈతఁడు (శ్రీనాథుఁడు) పండితాదరణీయములగుకావ్యములను జెప్పుటయేకాక స్త్రీ శూద్రాదుల కుపయుక్తములై సులభశైలితో నొప్పు పాటలు పద్యములు రచియించెను. మనదేశములోఁ బెండ్లిపాటలు మొదలగునవియు, గొల్లలు మొదలగు పాటకపుజాతి పాడుకొను గొల్లసుద్దులు మొదలగునవియు, పగటివేషగాండ్రు చెప్పెడు కథాలాపములును శ్రీనాథునిచే విరచితములేయని ప్రసిద్ధిగలదు." అని. పెండ్లిపాటలు మొదలగునవి యేమిరచించెనో యెఱుఁగరాదుగాని గొల్లసుద్దులు రచించినది సత్యమే. ఆంధ్రదేశమున నెఱగొల్లలు, పిచ్చుగుంటులు మొదలగుజాతులవాండ్రు తెగలుతెగలుగా నూళ్ళవెంటఁ దిరుగులాడుచు శూద్రుల గోత్రప్రవరాదులఁ దెలుపుచుఁ గానుపీసములు గడించి జీవించుచుందురు. వాండ్రు పంటసమయములందుఁ గాఁపుటిండ్ల కడ కరుగుదెంచి పాడుచుండు పదములకే గొల్లసుద్దులనిపేరు. గొల్లసుద్దులలోఁ బ్రధానమయినది కాటమరాజుకథ. ఇక్కడఁ గొంతవిస్తరించి వ్రాయవలసిన విషయమున్నది. తెలుఁగుభాషలో వెలసిన రచనములను బ్రధానముగా రెండుదెఱఁగుల విభాగింపవచ్చును. సంస్కృతచ్ఛందోనుసారముగా వక్షరగణములతోఁ జంపకోత్పలాదివృత్తరూపమున సంస్కృత పదజటిలమైన రచనమొకటి. భారతవర్షమునకెల్లను సామాన్యములైన భారతరామాయణాది గ్రంథాల్ మిట్టిరచనములతో వెలసినవి మాత్రాగణఘటితమై తాళలయాన్వితమగు ఛందోబంధముకలిగి దేసిపలుకులతో నంధ్రదేశమునకు సహజమైవెలసిన రచనమొకటి. ఈరచనములందు దంధ్రిలప్రత్యేక ధర్మము స్పష్టముగా స్ఫురించుచుండును పాటలు పదాలు, రగడలు, ద్విపదలు, సీసములు, అక్కరలు, తరువోజలు మొదలగువృత్తము లీజాతిలోఁ జేరును. సీసమునకు

ద్విపదమునకు, రగడలకు, అక్కరలకు. చేరికగానుండు వృత్తభేదము లనేకములున్నవి. వీనింగూర్చి సంపూర్ణచర్చ విమర్శభాగమునం జేయుదును. తెనుంగునకుం దోడిభాషలగు ద్రవిడ కర్ణాటభాషలలో వీని వంటి వృత్తభేదములున్నవి. సీసగీత్యాదు లయిదాఱుమాత్రమే వీని నుండి యానంస్కృతచ్ఛందోఘటితమయిన రచనలలోనికిం జేరినవి. ఈ రచనములందు 'ముఖ్యముగా నంధ్రదేశవిషయములే యితివృత ములు. కురవంజులు, ఏలలు, జోలలు, పదాలు, మొదలగునవి యెన్నియో ప్రాచీనాంధ్రవ్యంజకములు రచనము లున్నవి. ఇట్టిరచన ములలోంగూడ జగత్పవిత్రములయిన భారతరామాయణాది కథాంశ ములు చేరినవి. కుచ్చెలకథ,' లంకాయాగము మొదలగునవి యిట్టివే. అధికారిభేదమునుబట్టి వానిరచనములును భేదించుచుండును. ఈ విష యమునం దెలుపవలసిన దెంతో కలదు. ఉపేక్షించుచున్నాండను. యాదవరాజులకథలని, శక్తికథలని, పల్నాటికథలని, ముతెలుఁగుల కథలను జెప్పువాండ్రు, మూండు సంప్రదాయములవాండ్రు, తెలుంగు దేశమునం గలరు. పల్నాటి కథలంగూర్చి పూర్వప్రకరణమున వ్రాసి తిని. వానిని జెప్పువాండ్రు పల్నాడుప్రాంతములం దున్నారు. ఆ తెగ కాచార్యపురుషులు కారెమపూండిలో నున్నారు. వారుబ్రాహ్మణులు. శక్తికథలం జెప్పువాండ్రకుంగూడం బల్నాటిలోనే యాచార్యపురుష లున్నారు. వీరును బ్రాహ్మణులే. పంబవాండ్రు బవినీండ్రు మొదల గువాం డ్రీశక్తికథలం జెప్పుదురు. మొక్కుబళ్ళు, శక్తిజాతరలు మొదలగునవి జరుగునప్పుడు వాండ్రవసుద్దు లత్యావశ్యకములుగా నుండును. మాతపురాణము, పరశురామరామాయణము, గౌతమపురా ణము,మఱ్ఱిచెట్లకథ, రేణుకయుదము, కాకతమ్మకథ, అంకమ్మ కథ, గంగానమ్మకథ, మాతంగికథ దలగునవి వాండ్రగ్రంథములు.

అష్టమప్రకరణము

అవియుఁ బల్నాటివీరచరిత్రమువలెనే ద్విపదమంజరీనిబద్ధములుగానే యుండును. క్రీడాభిరామమున నీగ్రంథార్థములు మిక్కిలి ప్రశంసింపఁ బడినవి. వానిఁగూర్చి క్రీడాభిరామప్రశంసలో ముందు వ్రాయుదును. మూఁడవతెఱఁగుకథలు యాదవరాజులకథలు; ఎఱ్ఱగొల్లలు మొదలగువాం డ్రీకథలను జెప్పుదురు. ఈ తెగ కాచార్యపురుషులు కలరో లేరో తెలిసినదికాదు కాటమరాజుకథ, కదియాఫలరాజుకథ, పోలురాజుకథ, వల్లురాజుకథ మొదలగునవి వీండ్రగ్రంథములు. ఇవియు ద్విపద మంజర్యాది దేశిచ్ఛందోనిబద్ధములే. యాదవరాజుల కథ లనేకములు కలవఁట. "యాదవశాస్త్రం యెద్దుమోతపరిమాణ" మని చెప్పుదురు. పయివానిలోఁ గొన్నింటఁ జరిత్రోపయోగములగు విషయము లున్నవి. ఒంగోలు, వినుకొండ, పల్నాడు, నర్సారావుపేటతాలూకాలలో నీ గ్రంథాధ్యేతలు పెక్కురున్నారు. ఆగ్రంథములన్నియుఁ బరిశీలింపఁ దగినవి. బహుయత్నమున నేను వానిలోఁ గొన్నింటిని జూడఁగల్గినాఁడను. ఇప్పు డిక్కడ మనకుఁ బ్రసక్తము కాటమరాజుకథ.

## కాటమరాజుకథ.

ఇది పదుమూఁడవ శతాబ్దిని నెల్లూరుసీమ నేలిన మనుమసిద్ధి రాజునకును, నెఱగడపాటిమేలికయగు కాటమరాజునకును జరిగిన యుద్ధ చరిత్రము. పుల్లరియిచ్చు నొడంబడికపైఁ గాటమరాజు తనపశువులను మనుమసిద్ధిరాజు మేఁతబీళ్లలో మేపుకొని యక్కడ దనకో దెలలో నేదో నష్టమువచ్చినదన్న కారణమున నీయవలసిన పుల్లరి నెగఁగొట్టెను. దానిపై మనుసిద్ధి పశువులఁ బోనీఁడయ్యెను. పరస్పరయుద్ధమున కిది కారణము. ఈయుద్ధముననే తిక్కనసోమయాజుల పెద్దతండ్రి కొడుకు రణతిక్కన నిహతుఁడయినాఁడు. స్వల్పమగు నీచరిత్ర విషయమును

శృంగారశ్రీనాథము

శ్రీనాథుఁడు తనకవితాధార పాఱించి కట్టము కట్టినాఁడు. దీనిలోఁ గూడఁ బల్నాటివీరచరిత్రము తీరునఁ బ్రకరణభేదము లున్నవి. శ్రీనాథుని గ్రంథము సాంకర్యమును బొరసినట్టున్నది. శ్రీనాథ గ్రంథానుసారముగాఁ దర్వాత మఱికొంద ఱీకథను బెంచి రచించిరి. పిన యల్లయ యనుకవి యిట్లు వ్రాసికొన్నాఁడు:

ద్విపద. గురుతైన కౌమవాలగోత్రాబ్ధిచంద్రుఁ
దరయంగ గంగులయల్లయ కూర్మి
తనయుండు సర్వవ తగుసహోదరుఁడు
పినయల్ల యనువాఁడు ప్రియముతో జనుల
వలనొప్ప శ్రీనాథు వచనపద్ధతిని
సలిపెను యదుశాస్త్ర చరితమంతయును
వినువింతు యాదవవీరులచరిత.

ఇప్పటికి నముద్రితములుగానున్న పల్నాటివీరచరిత్రము, కాటమరాజుకథ, యను రెండు గ్రంథములందును దేసితెలుఁగు పలుకుబళ్లు పెక్కులున్నవి. భాషాపరిశోధకుల కీగ్రంథము లమూల్య నిధులు. కాటమరాజుకథయను పద్యప్రబంధముగూడ నున్నది. అది ముద్రితము. ఆ పద్యప్రబంధకర్తకూడ నాకథను శ్రీనాథుఁడు తొలుత రచించెనని చెప్పినాఁడు.

సీ. ఒకకుకదినమున నొగి కుత్రమతి శౌర
పూజావిధానంబు పొందుపఱచి
హరికథ వినివిని యారాత్రి నిద్రింవ
శ్రీనివాసుండిట్లు చెప్పెఁ గలను
శ్రీనాథుఁడను కవిశ్రేష్ఠుండు ద్విపదగా
రచియించెఁ గాటమరాజుచరిత

మది నీవు నా పేర నంకితంబుగఁ బద్య
గద్యాత్మకంబుగా ఘనత నుడువు

గీ. మనివచించి తిరోహితుఁడయ్యె నంత
నేను మేల్కాంచి యాస్వామి నెంచి మదిని
గాల్యకృత్యంబులనుదీర్చి కడుఁదలిర్చి
పండితావళిఁగనుఁగొని భక్తిమెయిని.

మఱికొన్ని గ్రంథముల నిట్టివానిని శ్రీనాథుఁడు రచించెనందురు గాని యవియేవో యెఱుఁగరావు. శ్రీనాథునిరచన మిదియని నిరూపింపఁదగిన కాటమరాజుకథ నాకు గోచరింపలేదు. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోఁ గొన్నిప్రతులున్నవి.

## వీథీనాటకము.

శ్రీనాథకృతములును దదితరకృతములును నగు చాటుపద్యములను గ్రంథస్థపద్యములను గొన్నింటినిజేర్చి యచ్చువచ్చిన తర్వాతఁ గొందఱు శ్రీనాథుని వీథీనాటకమను పేర నొకగ్రంథమును ముద్రించు చున్నారు: ఆ పేరుతో నాపద్యసముదాయము ప్రాఁతప్రాఁతప్రతులలోఁ గానరాదు. అట్టి పద్యములఁ గొన్నింటిని చాటుపద్య మణిమంజరిలో నేను సంధానించినాఁడను. శ్రీనాథుని వీథీనాటకమందలి పద్యములు కొన్ని పయిపద్యసముదాయమునఁ జేరిన వనవచ్చును. కాని ఆపద్యసముదాయమే శ్రీనాథుని వీథీనాటకమనుట సరిగాదని నేను దలంచుచున్నాఁడను. శ్రీనాథుని వీథీనాటకములోనివని యప్పకవి మొదలగువా రుదాహరించిన పద్యములు "కందుకకేళిసల్పెడు ప్రకారమునన్" "కుసుమంబెట్టిన చీరకొంగు వాలయన్" ఇత్యాదికములు పయిపద్యసముదాయమందుఁ జేరినవి.

శృంగారశ్రీనాథము

అట్లని శ్రీనాథుని వీథీనాటకమేది? యని విచారము ప్రసక్త మగును. అప్పకవ్యాదులు శ్రీనాథుని వీథీనాటకము లోనివని యుదాహరించిన పద్యము లేగ్రంథమున నానుపూర్వితో నుండునో యా గ్రంథమే శ్రీనాథుని వీథీనాటకమగునుగదా! ఆగ్రంథము దొరకినది. దాని పేరు క్రీడాభిరామము. అది వీథీనాటకమే. ప్రదర్శనానుకూలముగా లేక, కొంచెము మార్పుతో నేకాశ్వాసప్రబంధముగా నున్నది. కాని దాని గద్యమున నది వీథీనాటకమనియే పేర్కొనఁబడినది. ఇంతతోనే యది శ్రీనాథుని వీథీనాటకమని సిద్ధాంతమేర్పఱుపను గుదురదు. ఆ గ్రంథమున వినుకొండ వల్లభరాయఁడు తత్కర్తగాఁ జెప్పఁబడినాఁడు. అప్పకవ్యాదులు చెప్పినది తప్పుకావలెను. లేక శ్రీనాథుఁడే యాగ్రంథము రచించి వల్లభరాయని పేరుపెట్టఁగా గ్రంథమున వేఱుపేరున్నను రంగనాథరామాయణాదులవలె నీగ్రంథముగూడఁ గర్తపేరనే లోకమునఁ బ్రచారము గాంచియుండుటచే నప్పకవ్యాదులట్లు చెప్పియుండవలెను. అప్పకవ్యాదు లుదాహరించిన పద్యములు పయిగ్రంథమున నానుపూర్వితోనున్నవి. ప్రక్షిప్తములనఁ గుదురదు. మీఁది రెండు పక్షములలో రెండవపక్షమే ప్రబలమని నెనుతలంచుచున్నాను. ఇఁకమీఁద దానిని దెలిపెదను

రావిపాటి త్రిపురాంతకుఁడు

సంస్కృతమున ప్రేమాభిరామ మను పేర రావిపాటి త్రిపురాంతకకవి రచించిన వీథీరూపకమునను సరించి యీ క్రీడాభిరామము తెలుఁగున రచింపఁబడెనని గ్రంథమునఁగలదు. దానికిది తెలిఁగింపు

* తంజాపురపు సరస్వతీభాండాగారమున నున్నది. బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు దానిని ముద్రించినారు.

గాదు. తెలిఁగింపయినచోఁ బేరు మాఱఁగూడదు. సంస్కృతమునఁ బ్రేమాభిరామమును రచించిన త్రిపురాంతకుఁడు ప్రఖ్యాతాంధ్రకవి. ఆతనికవిత యతిప్రశస్తమయినది. ప్రాచీన కవీశ్వరు లాతని హెచ్చుగా మెచ్చుకొనిరి. క్రీడాభిరామకారుఁ డిట్లు ప్రశంసించుచున్నాఁడు:

ఉ. నన్నయభట్టతిక్కకవినాయకులన్న హుళక్కిభాస్కరుం
డన్నమ చిమ్మపూఁడి యమరాధిపుఁడన్నను సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజలులు నింతురు చేయని రావిపాటి తి
ప్పన్నయ వంతవాఁడ! తగునాయిటు దోసపుమాటలాడఁగన్?

త్రిపురాంతకుని కృతులు అంబికాశతకము, చంద్రస్తుతి, త్రిపురాంతకోదాహరణము* ననువానినుండి పెదపాటి జగన్నాథకవి పద్యములను బ్రబంధరత్నాకరమునఁ గూర్చినాఁడు. మదనవిజయ మను గ్రంథమొకటికూడఁ గలదని శ్రీరామకృష్ణకవిగా రనుచున్నారు. ప్రేమాభిరామము దొరకలేదు.

## వల్లభరాయఁడు.

వల్లభరాయఁడు విద్యానగరాధీశ్వరుఁడగు హరిహరరాయల యొద్ద రత్నభాండాగారాధ్యక్షుఁడయి ములికినాటిలోని మోపూరును బాలించిన తిప్పనకుఁ గుమారుఁడు. హరిహరరాయంద్రు ముగ్గురున్నారు రెండవ మూఁడవవారు క్రీ. 1402, 1412, వఱకునుండిరి. తిప్ప వారిలో నెవనియొద్దనుండినను దత్పుత్త్రుఁడు వల్లభరాయఁడు శ్రీన థుని కాలమువాఁడే యగును. శ్రీనాథుఁడు క్రీడాభిరామకర్తయనుఁ

* త్రిపురాంతకోదాహరణము తంజావూరు లైబ్రరిలో నున్నది. శ్రీ రామకృష్ణకవిగారు దాని ముద్రించిరి.

శృంగారశ్రీనాథము

కితరసాధనము లెన్నియున్నను వల్లభరాయనికాలము వేఱగునేని అవి యెల్లను బొల్లపోవును. కాలము సరివచ్చినది అదికృ_లేదు. క్రీడాభి రామమున వల్లభరాయని వంశవర్ణన మత్యధికముగా నున్నది. అంతే కాదు, వల్లభరాయని వాగ్వైభవాది వర్ణనము మితిమీఱియున్నది.

ఉ. ఆహారవధిసమయన్నృత్య
తుహినాంశుధర ప్రచారధూతా భ్రభుపీ
లహరీ భ్రమఘుమఘుమములు
వహిఁ దిప్పయవల్లభన్న వాగ్వైభవముల్.

ఇత్యాదిగాఁ బద్యాష్టకమున్నది.

క ఉపమించెదధారాధర
తపనజరై రాజరాజధారావగరా
ధిపధారాధరవాహులఁ
త్రిపురాంతకవల్లభుని వితీర్ణిప్రౌఢిన్

త్రిపురాంతకవల్లభుని వితీర్ణిప్రౌఢిని ధారాధరాదులతో నుప మించెద నని యావల్లభుఁడే యనుకొనునా! ఎంతయసంగతము! ఆ కందపద్యాష్టకము భీమఖండాదులలోని కృత్యవతరణికాపద్యముల పోలికకలది. గ్రంథాంతపద్య మీ క్రిందిది :

చ. మదమున మల్కినాటిపుర మోహనశైలసువర్ణకందరా
సదనుఁడు కాలభైరవుఁడు శంభువిపత్తి సమగ్రవైభవా
భ్యుదయపరంపరావిభవముల్ కృపసేయుఁ గవీంద్రకాంక్షిత
త్రిదశమహీరుహాంకునకుఁ దిప్పయవల్లభరాయమంత్రికిన్.

భరతవాక్యరూపమననేవి గ్రంథకర్త పై విధమునఁదన్నుఁ దా నాశీర్వదించుకొనుట తుమ్ముకొని తానే శతాయువనుకొన్నట్టుండును.

అష్టమప్రకరణము

గ్రంథకర్త వల్లభరాయఁడు కాఁడని పయిపద్యములు పలుకుచున్న వనుట యసంగతముకాదు. వల్లభరాయఁడు "కవీంద్రకాంక్షితత్రిదశ మహీరుహము" కావున విశేషధనమొసఁగి కవి యశోలోభమున నేతత్కావ్య కర్తృత్వమును దనపై వేయించుకొన్నాఁ డనఁదగును. గ్రంథకర్త శ్రీనాథుఁడే యనుట కింకను బలిష్ఠమగు హేతూపత్తి చూపెదను.

## పోలికలు.

శ్రీనాథుఁడు తన గ్రంథములలోఁ గొన్నిపద్యములను, బద్య భాగములను, భావములను, మార్పుచేయక యొకతీరుననేకూర్చుకొనుచు వచ్చినాఁడు. స్వరచనమే యగుటచే సరిపడిన పట్టులందుఁ ముందు రచించిన గ్రంథములలోని కూర్పులను జేర్చుకొనుట దోషముకాదు కదా! తిక్కనాదులుకూడ నిట్లుచేసరి ఎన్నటికిఁగూడఁ గ్రీడాభిరామము శ్రీనాథకృతి కాదనువాదము పుట్టకుండుటకో యనునట్లు శ్రీనాథకవి యనేకస్థలములు నిందుఁ దనతక్కిన గ్రంథముల రచనములను జేర్చెను. ఆపోలిక లీగ్రంథము శ్రీనాథకృతమేయని చెప్పకచెప్పుచున్నవి. ఇతర కృతులందలి సరససంవిధానములను గాఁజేయు దొంగకవులు కొందఱున్నారు. వల్లభరాయఁ డట్టివాఁడై శ్రీనాథరచనములను గొన్నింటిని జేర్చుకొని యుండరాదా యనరాదు. గ్రంథమామూలాగ్రము శ్రీనాథ రచనముగానే కన్పట్టుచున్నది. తస్కరకవుల తక్కిన స్వరచన మస్వరసమై, పొందిపొసఁగక తెలియవచ్చుచుండును. క్రీడాభిరామమునఁ బదసంవిధానము, అన్వయక్రమము, కారకప్రయోగవైచిత్రి, పద్యోపక్రమనిర్వాహములు, ప్రతిపదము శ్రీనాథుని పేరుగ్గడించుచున్నవి. శ్రీనాథుని రచనా చమత్కారముల నెఱిఁగిన వారిది చక్కఁగా గుర్తిం

పంగల్గుదురు. శ్రీనాథుని యితర గ్రంథములకు వీగ్రంథమునకుం గలరచనాసామ్యమునుగొంతచూపుచున్నాఁడను:

శా. సారాచారమునన్ వివేకసరణిన్ సౌభాగ్యభాగ్యంబులన్
ధౌరంధర్యమునన్ బ్రతాపగరిమన్ దానంబునన్ సజ్జనా
ధారున్ దిప్పనమంత్రివల్లభు నమాత్యగ్రామణిం బోల్పఁగా
వేరీమంత్రులు? సింధువేష్టితమహోర్వీచక్రవాళంబునన్.

—వీథి.

శా. వేరీ? నిన్నెదిరింపఁగా జగమునన్ వీరల్ ప్రతాపోద్ధతిన్
ధౌరంధర్యమునన్ బ్రభావమహిమన్ ధైర్యంబునన్ జాపలీ
లారంభంబున సాహసిక్యమున బాహాశక్తిదివ్యాయుధో
దారప్రౌఢిమ దేవదైత్యనరగంధర్వాదిసంఘంబులన్.

—హరవిలాసము.

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకునమూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము.

—వీథి.

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకునమూనుట యది బృహస్పతిమతంబు
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము
సర్వసిద్ధాంత మభిమతసమ్మతమగు. —భీమఖండము.

శా. వ్రాలెన్దిక్కుల భానుభావ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాల జటాలజాంగలతటీ వాచాలకోయష్టులై

రోలంబంబులు మూతిముట్టవెఱచెన్ గ్రావ్వేఁడి బీరెండలన్
జాలం గ్రాఁగి కరంబు వేఁడియగు కాసారాబ్దిమైరేయముల్.

—వీథి.

శా. మాళింగోపాళి సంఘటించివ క్రియన్ మధ్యాహ్నవేళన్ మహా
కాళంబైన నభోవిభాగమున వీఁకంగాసె బీరెండ యా
ప్రాలేయాహిత సంప్రదీప్తకిరణప్రక్రీడదర్కోపల
జ్వాలాజాల జటాలజాంగలతటీ వాచాలకోయష్టియై.

—హరవిలాసము.

పైపద్యముల సమానసమాససంవిధానము భట్టమురారిప్రణీత మగు నసర్ఘరాఘవ నాటకమునందుఁ గలదు. శ్రీనాథునకు భవభూతి, భట్టమురారి నాటకములమీఁద నభిమానము మెండు. వారి నాటకముల లోని రచనములను బెక్కుచోట్లఁ బుడికి పుచ్చుకొన్నాఁడు.

శ్లో. ఉద్దామద్యుమణిద్యుతివ్యతికర ప్రక్రీడదర్కోపల
జ్వాలాజాల జటాలజాంగలతటీ నిష్కూజకోయష్టయః
భౌమోష్మ ప్లపమానసూరకిరణ క్రూరప్రకారాదృశో
రాయుష్కర్మ సమాపయంతి ధిగమూర్మధ్యాహ్నశూన్యా దిశః

—అనర్ఘరాఘవము.

ఈ క్రిందిపద్యము కూడ భట్టమురారిశ్లోకచ్ఛాయగలది:

శా ఆమిత్రావరుణాంశసంభవుని వింధ్యాటోపవిధ్వంసి లో
పాముద్రాసహితుం గనుంగొనిరి యుత్పన్నప్రమోదంబునన్
వ్యామగ్రాహ్యపయోధరల్ కుటిలనీలాగ్రాలకల్ తథ్యమి
థ్యామధ్యస్థితమధ్యలాటవికసేనాధీశసీమంతినుల్.

—కాశీఖండము.

శృంగారశ్రీనాథము

శ్లో. వ్యామగ్రాహ్యస్తనీభి శ్శబరయువతిభిః కౌతుకోదంచదక్షం
కృచ్ఛ్రాదన్వీయమానః క్షణమచల మసౌ చిత్రకూటం ప్రతస్థే.
—అనర్ఘ రాఘవము.

వ్యామగ్రాహ్యపదప్రయోగమున శ్రీనాథునకు మక్కువమెండు. బహువారము లాపదమును బ్రయోగించును. అది యాతని సర్వగ్రంథములందును గలదు. "వ్యామగ్రాహ్యనితంబబింబ" —వీథి "వ్యామగ్రాహ్యస్తనులగు భామినులు" — నైషధము.

వ. టిట్టిభ! యదె చూడు వరుణరాజవారాంగనావిలాసదర్పణానుకారియై యహర్పతి క్రుంకఁబోయె— వీథి.

క. చరమాచలశిఖరంబునఁ
దిరమై యొక్కింతదడవు దినకరుఁడొప్పెన్
వరుణుని శుద్ధాంతంబున
నరవిందాక్షులకు మించుటద్దంబగుచున్.
—భీమఖండము.

వ.......నెఱవంజయు మసమసకనిచీఁకటియుఁ గలసి దిక్సౌధకూట వాటీనికరంబుల వ్రేలవిడిచిన గురివెందపూసలపేరునుంబోలెఁ బొలుపుమిగిలె .... —వీథి.

క. వసుఁబాప యెండకొనలును
మసమసకనియిరులు గలసి మనమలరించెన్
దెసల నలుగడల గుంజా
విసరంబుల సరులు వ్రేలవిడిచినభంగిన్. —నైషధము.

వ.... వంజకెంజాయయున్ గలయబెరసి గురివెందపేరులయందంబు వహించుటయును....— నైషధము. సీ. గన్నేరుఁబూచాయ కరమొప్పునీర్కావి, మడుగుదోవతిపింజె విడిచికట్టి — వీథి. సీ. గన్నేరుఁబూచాయఁ గనుపట్టు జిలుగైన । వలిపకాషాయ వస్త్రంబుగట్టి — నైషధము. సీ. గొజ్జంగిపూనీరు

తులికిమేదించిన। గంగమట్టి లలాటకమునఁదీర్చి —వీథి. సీ గొజ్జంగి పూనీరు తులికిమేదించిన కమ్మకస్తురి మేనఁ గలయనలఁదు - కాశీఖండము. సీ. సిద్దంపు వెలిపట్టు నెటికదూలినయప్డు తొడలమించులు వెలిఁ దొంగలింప—వీథి. సీ. అచ్చవెన్నెలచాయ వవఘళింపఁగఁజాలు సిద్ధంపువెలిపట్టు నెటికగట్టి — నైషధము. సీ.తోకచుక్కలఁబోలు తోరంపుఁ దెలికన్నులాపైశమున సిగ్గువతకరింప. తే. తోకచుక్కలఁబోలు దృక్కోయజములు — నైషధము. సీ. అదెముద్దరాలుసానమ్మ నివాసమ్ము —వీథి. గీ. మోసపోక ముసానమ్మ ముద్దరాలు - కాశీ. వ చరణాంగుళీకుటిలనఖశిఖాకోటి కుట్టనంబున —వీథి సీ. కుటిలచంచూపుట కోటికుట్టనమున—నైషధము. సీ. కుటిలపాటల జటాంకురకుట్టనంబున—కాశీ. వ....కంఠగ్రైవేయఘంటికాటంకారంబులును—వీథి. వ....ఆఖండలదిశావేదండ కంఠగ్రైవేయఘంటికాటంకారంబులుఁబోలె — భీమఖండము. వ....కరిఘటాగ్రైవేయ ఘంటికాటంకారంబులం బ్రోదిసేయుచు — నైషధము. వ....దాంపేయ కునుమచ్ఛదచ్ఛాయాదాయాదంబులైన ....-వీథి. వ....కఠోరహరీతచ్ఛాయాదాయాదంబులైన- భీమ.వ....సుకుమారశుకచ్ఛదచ్ఛటాచ్ఛాయాదాయాదంబులై-కాశీ. వ....ముఖరవీణాక్వాణ పాణింధమంబైన మధురస్వరంబున —వీథి వ...కల మధురవీణాక్వాణ పాణింధమంబైన యెలుంగెత్తి —భీమఖం. వ....కాలకూట చ్ఛాయాపాణింధమంబైన...-కాశీఖం. వ...సంధ్యారాగంబు నింగియింగిలీకంబు నంబెట్టి —వీథి. గీ ....నింగి యింగిలికాన నభ్యంగమూర్చె — కాశీ. ఉ. ఘ్రాణ పుటీ కుటీరములఁ గాపురముండఁ దొడంగె-వీథి వ...నాసికాపుటకుటీకుటుంబి యగు పక్వాన్నగంధంబు.

శా. పంచారించిన నీపయోధరము లాస్ఫాలింతునో లేఁతబొ
మ్మంచుం గెంజిగురాకుమోవిజిసిధాత్వర్థం బమష్ఠింతుమో
పంచాస్త్రోపనిష దహస్యపరమబ్రహ్మస్వరూపంబు నీ
కాంచీదామపదంబుముట్టుదునొ యోకర్ణాటకాటంకినీ!

మర్మజ్ఞు లీపద్యమును వినఁగనే శ్రీనాథుని రచనమని గుర్తింపఁగల్గుదురు. జిసిధాత్వర్థప్రయోగమున శ్రీనాథునకు మిక్కిలి యభి

రుచి: "జిసిధాత్వర్థ మనుగ్రహింపఁగదవే! నీరేజపత్రేక్షణా!" — నైషధము.

సీ. చంద్రఖండములతో సరివచ్చు ననవచ్చు
విమలదంష్ట్రాప్రరోహములవాని
పవడంపుఁగొనలతోఁ బ్రతివచ్చు ననవచ్చు
కుటిలకోమలజటాచ్ఛటలవాని
ఇంద్రనీలములతో నెనవచ్చు ననవచ్చు
కమనీయతర దేహకాంతివాని
ఉడురాజరుచులతో నెఱవచ్చు ననవచ్చు
చంచన్మదాట్టహాసములవాని

గీ. సిగ్గుమాలిన మొలవానిఁ జిఱుతవాని
నెల్లకాలంబు మురికినాదేలువాని
నధిపు మోహూర నవతారమైనవాని
భైరవునిఁ గొల్వవచ్చిరి భక్తవరులు.

ఈ పద్యము క్రీడాభిరామపుప్రస్తావనలోనిది యగును. తంజావూరుప్రతిలోఁ బ్రస్తావన సంపూర్ణముగాలేదు. ప్రబంధరత్నాకరమున నీపద్యమున్నది:

సీ. సరివచ్చు ననవచ్చు శతమన్యుపీఠికి, ప్రతివచ్చు ననవచ్చుఁ బాలమున్నీటికి, ఎనవచ్చునవపచ్చు నిందుబింబమునకు, దొరవచ్చు ననవచ్చుఁదోయజాక్షునిమూర్తికి.

—భీమఖండము.

చదువువారికిఁ జాలుననిపించునేమోయని నిలుపుచున్నాఁడను. ఇంకనెన్నియేని చూపవచ్చును. "ప్రేమసంధుక్షణాగర్వంబైన—గోధూళిలగ్నంబునం బురంబు ప్రవేశింపవలయు—బాలార్క-కిరణ

సంపర్కంబు -వీథీవిటంకంబు-కుసుమంబెట్టినచీర - పదియార్వన్నె పసిండి - చెక్కుటద్దములు - కోకిలము పంచమశ్రుతి కొసరినట్లు- విజ్జోడు - నిద్దంపుఁజెక్కుల నీడసూడ - కలకంఠీకలకంఠకోమల కుహూకారంబు- ఘంటాఘణాత్కారముల్ - కప్పురబోగివంటకము- పెసర్పప్పు - అదెదారువనభూమి - (ఇత్యాదిసీసము) ద్యావాపృథ్వ్యవకాశముల్ - పంచారించు - ఓలగందము - మిసిమింతుఁడు - కట్టెఱ - ఉబ్బూఁతలు - ఇట్టింకులు మొదలగు పదములకు, సంవిధానములకు, శ్రీనాథుని సర్వగ్రంథములందును సంవాదములుగలవు. రచనాచమత్కారము చక్కఁగా నెఱుఁగనేర్చినవారికి శ్రీనాథరచనమనుట కీగ్రంథమెల్ల నుదాహరణమే.

దోషములు.

కొంద ఱీగ్రంథము దోషభూయిష్ఠమనియు శ్రీనాథుఁడు దుష్ట ప్రయోగములఁ గావించువాఁడు కాఁడు గావున నీగ్రంథమాతనిది కాఁజాలదనియు వాదించుచున్నారు. ఇప్పుడు ముద్రితగ్రంథము తప్పులతోనున్నదన్నమాట యొప్పుకోవలసినదే. కాని యవి ముద్రాప్రమాదములు. అట్టివానిని విడచెదను. కవిపాఠములే కొన్ని తప్పులని చూపఁబడునవికలవు. వానినిక్కడ తెలిపెదను. వసివాళ్వాడుచు -ఇది తప్పు కాదు. శ్రీనాథున కిట్టిప్రయోగమునెడ మక్కువయెక్కువ. గ్రుక్కిగ్రిమ్మంగుచు - అని కాశీఖండము. ఇది దుష్టమనుట కేమి ప్రమాణము? విశేషచర్చ యిక్కడ తగదని విడుచుచున్నాఁడను. పువ్వులు వేడుకైనఁ గడివోయిన వాళ్ ముడువంగవచ్చునే - నాచనసోమనాథుఁడు. చాలదా? "భూదేవా ప్రశాంతం మహాపాపం" - తప్పుకాదు. "నమో విశ్వసృజే వినుమింతకు"- నాచనసోమన. అనుకరణముండి తీఱవలెనేమి? ఎన్ని ఇట్టివే తప్పుల నఁబడునవి? ఎందుకు! తొలుత నా కొక్క

ప్రయోగము నెడసంశయము కల్గినది: "సుక్షత్రియకులంబు నిక్షత్త్రము గఁజేయు కొడుకుఁగాంచిన యట్టి కోపకత్తె." ఇక్కడఁ గోపకత్తె యనుట శ్రీనాథున కిషమగునా యని. ఈపదమే కాశీఖండమునఁగూడఁ గన్పట్టినది: "అన్న మీయన్న కోపగాఁడౌనొ కాఁడొ." ఇంతనేమి? పరిశోధింపఁగా నిది ప్రాచీనతరకవిసమ్మతమేయని తేలినది. ఇంతట నీవిషయము ముగింతును. ఈ గ్రంథము శ్రీనాథరచన మనుటకుఁ బలువురు విశ్వసింపక పోయిరి. అటియవిశ్వాసము నమసిపోవుటకై యింతవ్రాయవలసెను. నాకీగ్రంథమునెడ నభిమానముమెండు. చరిత్ర కారుల కీగ్రంథము నిధి. ఇందు వర్ణింపఁబడిన విషయములు కొన్ని పేర్కొనెదను. "దేశభాషలందుఁ దెలుఁగులెస్స." ఇది కృష్ణ రాయఁడు మెచ్చిన మెప్పుగాఁ దలంపఁబడుచున్నది. "జనని సంస్కృతంబు సకలభాషలకును దేశభాషలందుఁ దెలుఁగులెస్స" యని శ్రీనాథుఁ డీగ్రంథమునఁ దనమెప్పు చెప్పెను కృష్ణరాయఁడు దాని ననువదించెను. ఈనాటకము మోహనభైరవుని తిరునాళ్లలోఁ బ్రదర్శింపఁబడి నట్టున్నది. అది ముఖ్యనాటిలోనిది. ఇందలి యితివృత్తమేకశిలా నగరవీధిని దిరుగుచుఁ గానల్లాటి మంచనశర్మయు నాతనికట్టనుఁగుఁ జెలికాఁడు టిట్టిభసెట్టియుఁ బ్రభాతకాలముమొదలు చంద్రోదయ సమయముదాఁక సంచరించుచు జరిపికొనిన ప్రసంగముగా నున్నది. మేదరమెలఁత, మాలవనిత, కాపుఁగన్నియ, కర్ణాటకాంత మొదలుగాఁ గొంతయంగనాజన మిందు దభివర్ణింపఁబడినది. ఏకశిలానగరవర్ణన మిందుఁ జక్కఁగాఁ గావింపఁబడినది. రాజప్రాసాదముమీఁద గడి యారమున మధ్యాహ్నకాలమునకు పదునాఱుగంటలు మ్రోసెనట! అక్కడ భైరవుఁడు, చముదేశ్వరి, వీరభద్రుడు, బుద్ధదేవుఁడు, మునానమ్మ, కుమారస్వామి, పాండవులు, కర్తారుడు (మసీదు) ననుదేవతల గుళ్లున్నట్టు చెప్పఁబడినది. కేశవస్వయంభూదేవుల దేవాలయ

ములు ప్రధానములుగాఁ జెప్పఁబడినవి. ప్రతాపరుద్రీయాదులందుఁ గూడ నాదేవాలయముల ప్రస్తావము కాననగును. రాజమార్గము వారణ ఘోటకశకటికాభటకోటి సంకులమట! మఱియు నక్కడఁ బల్నాటి వీరులకును నేకవీర, కాకతమ్మ, మాహురమ్మలను శక్తులకును జరుగు జాతరలు వర్ణింపఁబడినవి. పంబవాండ్రు బవినీండ్రు నేకవీరాపరశు రాములకథలను బాడుట మొదలగు జాతరవిషయము నేఁడును జరుగు చున్నవిధముననే వర్ణింపఁబడినది. జక్కులాండ్రనోదెయు మైలార భటుల (శివశక్తులు) సాహసకృత్యములు వర్ణింపఁబడినవి. పూటకూళ్ళ యిళ్లు వర్ణింపఁబడినవి. పూటకు రూకయిచ్చిన సమృద్ధమయినభోజనము దొరకునట్లు చెప్పఁబడినది మఱియు నిందు "ప్రతాపరుద్ర ధరణీశో పాత్త గోష్ఠీ ప్రతిష్ఠాపారీణ" యగు మాచల్దేవియను వారాంగన ప్రస్తావము గలదు. ఆమాచల్దేవి శ్రీనాథుని కాలమువ కుండనేరదు గావున నేతద్గ్రంథము శ్రీనాథరచితముకాఁగూడదని యొకవికటవాద మున్నది. కవివర్ణించిన విషయము లప్పుడు వర్తిల్లితీరవలయునా? సంస్కృత ప్రేమాభిరామమున నున్నదానిఁ దెల్గునకుఁ దార్చియుండరాదా? మొత మున కీగ్రంథము సంస్కృతగ్రంథమునకు సరియగు తెనుఁగుకాదు. కొన్ని మార్పులుండును. సంస్కృతగ్రంథమునకుబేరువేఱు; దీనికి వేఱు గదా! శ్రీనాథుఁడు కాకున్నచో వల్లభరాయఁడే గ్రంథ కర్తకావలయును. ఆతవికాలమునకు మాచల్దేవియుండుట సంభావ్య మగునేమి? శ్రీనాథుఁడు నాతఁడును సమకాలము వారేగదా! మాచల్దేవి ధనసంపన్నురాలు. నాఁటి కాలమున గొప్పప్రఖ్యాతిగాంచినది. బెజవాడలో మాచల్దేవి కావించిన ధర్మకార్యములకు శాసనము గలదు. కానియాశాసనమునఁ గాలనిర్దే శములేదు. ఆశాసన మీమాచల్దేవిదేయని స్పష్టముగా ననుట కాధారము లేదు. ఉన్నంతవఱకాశాసనము నుదాహరించుచున్నాను:-

''బెజవాడగ్రామమధ్యమందు వేంచేసిన శ్రీ భ్రమరాంబామల్లే శ్వరస్వామివారిదేవాలయం గర్భాలయంముందర పడివున్న నల్లసీసపు రాయిమీద శాసనం:-

''బెజవాడ పాపవినాశనదేవర రుద్రపాదాలస్థానాల ధర్మాలకు, పెనకూన తలాభక్తుని కూతురు మాచలేవితనకు జెల్లిన వృత్తిక్షేత్రాలు:- పాత్రితూరున పుట్టెండుక్షేత్రమున్ను. తాదేపల్లిని పుట్టెండుక్షేత్రమున్ను. పెనుంబాకను పుట్టెండుక్షేత్రమున్ను. గొల్లపూండిని పుట్టెండు క్షేత్రమున్ను, నరసూరుగ్రామానను పుట్టెంతు క్షేత్రమున్ను, నున్నగ్రామాన పుట్టెండుక్షేత్రమున్ను. గుడుదలగ్రామాన పుట్టెండుక్షేత్రమున్ను, వెనకపల్లిగ్రామాన పుట్టెండుక్షేత్రమున్ను, యీ పదిగ్రామాల కేసరి పాటి పదిపుట్లక్షేత్రమున్ను పృథివింగలగోత్రమువారికి పుణ్యంగాను ధారవోసియిచ్చిన ధర్మశాసనం. మంగళ మహాశ్రీంజేయును.''

మఱియు శ్రీకాకుళముతిరునాళ్ల వేడుక లిందు వర్ణింపఁబడినవి. నెల్లూరితూముకాలువ, మండపాక, పెనుబాక, మాహురము, నాగవరము, పానుగంటి కలుకోడి, బొన్నగడ్డ తమిలేఖ, దాక్షరామము, అరవపిళ్ల, యిందు ప్రస్తావింపఁబడిరి. గ్రంథాంతమం దీపద్యమున్నది.

క. నటులందు దోరసముగ్రముఁ
విటులది యొర్గల్లు కవిది వినుకొండ మహా
పుటభేదమున మీగ్రిత్రయము
నిటగూర్చెను బ్రహ్మ రసికులెల్లరు మెచ్చఁగ.

ఈగ్రంథము శ్రీనాథునికృతియయి వెల్లడి కాఁగల్గి నందుల కెంతయు సంతోషించుచున్నాఁడను. ఇందు పల్నాటి వీరచరిత్రపాటలు,

పంబవాంౘ్రదపాటలు మొదలగునవి వర్ణింపఁబడుటను జూపట్టు కవితో
త్సాహమునుబట్టి చూడఁగా శ్రీనాథున కట్టిరచన మిక్కిలి రుచితమయి
నట్టు తోఁచుచున్నది. అతఁడిట్టి రచనలేన్నో రచించిన ట్లైతిహ్య
ములు గలవవి వ్రాసితిని గదా!

## *శివరాత్రి మాహాత్మ్యము.

ఈగ్రంథ ముపలబ్ధములయిన శ్రీనాథుని గ్రంథములలోఁ
గడపటిదవి నేను దలంచుచున్నాఁడను. కాశీఖండరచన లిందుఁ బొందు
పడినవి. విస్తరభయముచే వాని నిక్కడ వివరింపకున్నాఁడను. అవి
యీగ్రంథమునుండియే కాశీఖండమునకుఁ జేరియుండరాదా యనరాదు.
''కాశిలోఁ జంద్రపుష్కరిణీదుష్కరకుష్కగహనావళీదావదహనజిహ్వ'
ఇత్యాదులు కాశీఖండరచనానుస్మృతిని జెప్పుచున్నవి. దాక్షారామవేశ్యల
ప్రశంస యిందున్నది. ''కర్ణాటదేశతాటంకినీదశన వజ్రాంకురముల
కాంతి'' యిందు స్మరింపఁబడినది. కవిసార్వభౌమబిరుద మిందుఁ
గానవచ్చుచున్నది. రాజమహేంద్రవరము ప్రాపుపోయినపిదపఁ
గొండవీటనుండి పల్నాడుప్రాంతముల సంచరించుచుండినకాలమున
శ్రీనాథుఁడు దీని రచించెను.

## భిక్షావృత్తిమఠము.

శ్రీశైలమున భిక్షావృత్తిమఠ మను జంగమమఠ మొకటికలదు.
అది నేఁటికిని గలదు, తన్మఠాధీశ్వరులు శ్రీశైలపర్వతతత్ప్రాంతదేశ
ములకుఁ బాలకులుగా నుందురు. ఆకాలమువారు మహైశ్వర్యసం

---

* ఇది యాంధ్రసాహిత్య పరిషత్తువారిచే సంపాదితమై వారిపత్రికలోఁ
బ్రకటింపఁబడినది. గ్రంథపాతములున్నవి.

న్నారు. ఆమఠ మంతకుఁ గొంతప్రాచీనకాలమునుండి కలదని తెలియుచున్నది. పల్నాటి వీరచరిత్రకాలమున కామఠము కలదు.

## శాంతభిక్షావృత్తి.

తన్మఠాధీశ్వరులకు భిక్షావృత్తు లనిపేరు. వారిలో శాంతభిక్షావృత్తి మహోన్నతుఁడుగాఁ దెలియవచ్చుచున్నాఁడు. మన శ్రీనాథుని శివరాత్రిమహాత్మ్యమునకుఁ గృతిపతియయిన శాంతస్వామి యా శాంతభిక్షావృత్తికి మూలభృత్యుఁడు. ఒకప్పుడు శివరాత్రిమహోత్సవ సమయమున మల్లికార్జున దేవదర్శనార్థము శ్రీనాథుఁడు శ్రీశైలమున కరిగెను. అక్కడ ధర్మకర్తలుగానున్న యాభిక్షావృత్తి మఠాధీశ్వరులు శ్రీనాథుని సత్కరించి కృతికోరిరి. మల్లికార్జునదేవుని ముఖమంటపమున నధ్యాసీనుఁడయి శాంతభిక్షావృత్తియతీశ్వరుఁడు శివకథావినోదమునఁ బ్రొద్దుపుచ్చుచుఁ దనభృత్యుఁడగు శాంతయ్యను శ్రీనాథునిచేఁ గృతి గొనుమని విబోధించినట్టు శివరాత్రిమహాత్మ్యమందున్నది. శాంతభిక్షావృత్తి యతీశ్వరుని శాసనములు కొన్ని కర్నూలుమండలమునఁ గలవు. అతఁడు సరిగా శ్రీనాథునికాలమువాఁడే. ఆంధ్రకవిత్వమం దాతని కత్యంతాదరముండెను. ఆకాలమున నామఠాధీశ్వరు లంధ్రులయి యుండిరేమో; కాని యిప్పటివారు కర్ణాటకులు. శాంతభిక్షావృత్తి తన భృత్యునికిఁ గృతి నిప్పించుటయేకాక తానుగూడ గౌరనమంత్రిచే నవనాథచరిత్రమను తెనుఁగుకృతి మల్లికార్జునదేవున కంకితముగాఁ జెప్పించుకొనిపోయెను.

నవనాథచరిత్రకారుఁడు గౌరన సరిగా శ్రీనాథుని కాలము వాఁడు. ఆతఁడు సంస్కృతమున లక్షణదీపికయను గ్రంథమును రచించెను. ఈతనిఁగూర్చి "శ్రీనాథునికాలపుకవులు" అను ప్రకరణ

కోమలకుహూకారంబు,'' "చిఱుబంతిపసుపు,'' "ఓలగందము,'' "నీర్కావిదోవతి మొదలగునవి. "జనంగమప్రమద, కర్ణాట తాటంకిని,'' ఇత్యాదులు కొన్ని యీగ్రంథములందుఁ గలవు.

## మఱికొన్ని గ్రంథములు.

ఇంతవఱకుఁ బేర్కొనఁబడిన గ్రంథములుగాక శ్రీనాథుని గ్రంథములు మఱికొన్ని లక్షణగ్రంథాదులం దుదాహృతములయిన పద్యములఁబట్టి తెలియవచ్చుచున్నవి. అవి యేవయస్సున నెవరికంకితముగా రచింపఁబడినవో యెఱుఁగరాదు. పేర్కొనెదను.

## నందనందన చరిత్ర.

శ్రీనాథుని నందనందన చరిత్రమందలివని రంగరాట్ఛందమునను ప్రయోగరత్నాకరమునను రెండు సీసపద్య పాదము లుదాహరింపఁబడినవి. అవి యివి :– "రామానుజుండు నిరంతరము పదాఱువేల నూటెనమండ్రు వెలఁదులతమి''– "శాశ్వతవిశ్వవిశ్వంభరాభారమీరాజకుమారుఁ దేలంగలండు.'' వీని నాధారముగాఁ గొని నందనందన చరిత్రమను శ్రీనాథకృతి కలదని విశ్వసింపరాదని నాయభిప్రాయము. రంగరాట్ఛందము మొదలగు కొన్ని లక్షణగ్రంథములందు నన్నయభట్టారకాదుల యింద్రవిజయాదులందలివని కొన్ని పద్యము లుదాహరింపఁబడినవి. వాస్తవముగా నాయాకవు లాయాగ్రంథములను రచించిరాయని సందేహము కలుగుచున్నది. తనకిష్టమయిన భాషాచ్ఛందప్రయోగములను నిల్వరించుటకయి యాతఁడెక్కడివో కొన్నిపద్యములను బ్రాచీనప్రఖ్యాతకవికృతములుగా నుదాహరించుచు వచ్చినాఁడ నేను దలంచుచున్నాఁడను. ప్రసిద్ధములయియున్న యాయా కవీశ్వరు

గ్రంథములందలి రచనలకును రంగరాట్ఛందఃకర్త యుదాహరించు కొనిన యపరిజ్ఞాతప్రబంధపద్యముల రచనములకును బోలిక యుండదు. రంగరాట్ఛందమందే గాక యాంధ్రకౌముద్యాదులగు మఱి కొన్ని గ్రంథములందుఁ గూడ నిట్టితీరు గలదు. భాషాచరిత్రవేదు లీవిషయము నంగీకరింతురు. రంగరాట్ఛందమున నుదాహరింపఁబడిన యాసీసచరణములలో మొదటిది కుంటినడకతో నున్నది. రెండవది రేఫలకారముల యతిమైత్రికలది. అవి శ్రీనాథరచితములుగా నేను విశ్వసింపఁజాలకున్నాఁడను. విశ్వసించుట కితరప్రమాణము లేవియుఁ గానరావు.

## వల్లభాభ్యుదయము.

శ్రీనాథుని వల్లభాభ్యుదయమందలిదిగా నీక్రింది పద్యము పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నావళిలో నుదాహరించినాఁడు.

సీ. రజనీవధూకర్ణ రత్నతాటంకంబు
వలరాజు ధవళోష్ఠ వారణంబు

## కామశాస్త్రము.

శ్రీనాథుఁడు కామశాస్త్రవిషయమున నేదో గ్రంథము రచించినట్టు తెలియుచున్నది. నెల్లూరిశివరామకవి కామకళానిధియను గ్రంథమున నావిషయమును బ్రస్తావించినాఁడు. పద్యైకదేశ ముదాహరింతును:

గీ. మఱియు శ్రీనాథుఁడాదియౌ సరసమతులు
ఎంతదుష్కరమతినైన వృద్ధనైన—

ఈ శ్రీనాథుఁడు మన శ్రీనాథుఁడగునో కాఁదోయని సందేహించుటకుఁగూడ నవకాశమున్నది.

## ధనంజయవిజయము.

శ్రీనాథుఁడు ధనంజయవిజయమను పేరుగల గ్రంథమును దంతులూరి గన్నభూపాలునిపేర రచించినట్లు మూర్తిత్రయోపాఖ్యానమను ప్రబంధమునఁ గలదు. మూర్తిత్రియోపాఖ్యానము దంతులూరి బాపిరాజు రచించినది. ఆతఁ డిప్పటికి నూఱేండ్లనాఁటివాఁడు.

సీ. అహితదుర్గాధ్యక్షు లద్భుతం బందంగఁ
 గ్రీడికై వడి నిల్చి దాడినాడ
అక్షీద్రదాన విద్యాశాస్త్రములచేతఁ
 బతి యెవ్వరునులేక ప్రతిభఁగాంచె
తనకీర్తి దశదిగంతరగీయమానమై
 కనుపట్ట ధర్మమార్గంబు నెఱపె
శ్రీనాథసుకవీంద్రుచే ధనంజయవిజ
 యంబను సత్కావ్యమంది వెలసె

గీ. నృపతిమాత్రుండె నిజపాదపీఠజాత
ఘటితకోటీరవైరిభూకాంతమాన
సాంతరభయాపహారి! శ్రీదంతులూరి
గన్నభూపాలమౌళి, దోర్గర్వశాలి.

—మూర్తిత్రయోపాఖ్యానము.

ధనంజయవిజయమునఁ గిరాతార్జునీయకథ వర్ణితమై యుండు నేమో। పయిమూర్తిత్రియోపాఖ్యానమందే గన్నభూపాలుని పూర్వుఁడు హరిసీమ కృష్ణుఁడు ధాన్యవాటీపురాధిపతిగా వర్ణింపఁబడినాఁడు.

మ. కురియించెన్ బహుధాన్యవర్ష మఖిలక్షోణీప్రదేశంబునన్
హరియించెన్ విమతాంధకారములు బాహాగ్రాసిసూర్యప్రభన్

సిరిమించెఁగా నృపవర్యులెంచ ఘనుఁడై శ్రీ ధాన్యవాటీపురీ
చిరసామ్రాజ్యరమాసమాశ్రయరమాసింహాసనాసీనుఁడై.

గన్నభూపాలుఁడు గూడ ధాన్యవాటీపురాధిపతిగా నుండవచ్చును. "క్రీడికైవడి నిల్చెఁ దాడినాడ" నని కలదు; గాని యక్కడనిల్చుట యుద్ధకార్యార్థమయి కావచ్చును. తాడినాడ కయికలూరు తాలూకాలో నున్నది. పూర్వులు ధాన్యవాటీపురాధిపతులగుటచే నక్కడ నుండ కున్నను దర్వాతివారికి "ధాన్యవాటీపురాధిపతి" బిరుదము పరంపరాగతముగా నుండవచ్చును. ఒరయూరిపురవరాధీశ్వరేత్యాది బిరుదము లిట్టివి యితరరాజుల కున్నవి. బమ్మెరకేసయమల్లయలు రచించిన విష్ణుభజనానందమున నీ హరిసీమకృష్ణునిఁ గూర్చియు నాతనికిఁ దర్వాత బహుపురుషాంతరములఁ గూర్చియు గృత్యవతరణికలో వర్ణన మున్నది. ఉదాహరించెదను:

సీ. కురియించె నేరాజకుంజరుం డింపొంద
 ధరణాలకోటలో ధావ్యవృష్టి
ధరియించె నేధరాతలనాథుఁ డొగవేడ్క
 ఘనమైన జగమెచ్చుగండబిరుదు
వరియించె నేచంద్రవంశపావనుఁ దద్ద
 నమరేశ దేవకటాక్షలక్ష్మి
హరియించె నేభూపహంవీరుఁ డుప్పొంగి
 ప్రత్యర్థి రాజన్యపట్టణంబు

గీ. అతఁడు చెలువొందె జన్యరంగాగ్రణాగ్ర
దుగ్రఘనవిద్విషద్బలోదగ్రజఠర
పిఠరవృక్కాగ్రజాత సర్పిర్విశేష
కృతవిమతహేతి హరిసీమకృష్ణనృపతి.

ఆతనివంశమం దనేకపురుషాంతరములతర్వాతివాఁడు:

ఉ. కొండమదేవి కృష్ణనృపకుంజరువల్లనుగాంచెఁ బుత్త్రిఁగా
ఖండనభీము నన్నజనపాలుని సింధురాధినాథు నా
ఖండలతుల్యుఁ బద్మనృపగణ్యుని శౌర్యకళాధురీణుఁడిన్
గండరగండుధాన్యకటకస్థిరసద్బిరుదాంకధుర్యుఁడిన్.

కృతిపతిని గూర్చి యాశ్వాసాంత పద్యమున :— "గండర గండ! ధాన్యకటకప్రవణైకధురీణ!" అని కలదు. ఈ గ్రంథము శ్రీనాథునికిఁ బిదప బ కాలమునకు రచింపఁబడినది. మూర్తిత్రియో పాఖ్యానకృతికారులు, విష్ణుభజనానందకృతిపతులు, నొక్కవంగడము వారగుదురు. కాని విష్ణుభజనానందకృతిపతులు "పెనుముచ్చ" ఇంటి పేరువారుగా నునారు.

శ్రీనాథునికాలమున ధాన్యవాటీపురాధిపతియనఁబడు గన్న భూపాలుఁడొకఁడు, మన కింతకుఁబూర్వ మెఱుకపడినాఁడు. ఆతఁడు పెదకోమటి వేమారెడ్డిమామ. సంతానసాగరశాసనమున "శుక్రవారం బున శుభముహూర్తంబున శ్రీ ధాన్యవాటీపురాధిపతియుఁ, గృష్ణవేణ్ణా జలక్రీడా వినోదుండు నగు గన్నభూపాలుననుఁగుఁబుత్త్రి, వీరనారాయ ణుఁడు వేమవిభునిదేవి, భూరిసద్గుణ నికురుంబసూరమాంబ" అని కలదు. ధనంజయవిజయకృతిపతి గన్నభూపాలుఁ డీతఁడు కావచ్చు నేమో! అగుననుటకు ధాన్యవాటీపురాధిపతిత్వము, శ్రీనాథకాలీనత్వము, సరిపోవుట సాధకము. దంతులూరివారు క్షత్రియులుగాను, రెడ్లు శూద్రులుగాను, నుండుట బాధకము. కాని సాధకము బలవంతము గాను బాధకము దుర్బలముగాను నున్నట్టు నేను దలంచుచున్నాఁడను. కోమటివేమారెడ్డి యాస్థానకవియగుటచే శ్రీనాథుఁ డాతనిమామకుఁ గృతి

మగును శ్రీనాథునికాలమున రాజ్య మేలుచున్న రెడ్డిరాజులకు క్షత్రియులతోఁ జుట్టరికములు నడచినట్లు తెలియవచ్చుచున్నది. ఈ విషయమును శ్రీవీరభద్రరావుగా రింతకు ముందు వెల్లడించియున్నారు. శ్రీవీరేశలింగముపంతులుగారు దాని ననువదించియున్నారు. అది యించుక పేర్కొనెదను. కోరుమిల్లిశాసనములో నీక్రిందిశ్లోకమున్నది:

శ్లో. పౌత్రీం కాటయవేమయక్షితిపతేః పుత్రీంచ కాటప్రభో
ర్దౌహిత్రీం చతురర్ణవీం హరిహరక్షోణీపతే శ్శాసితుః
తన్నామ్నా విదితాహ్వయాం హరిహరాంబాం చారు మగ్రాహయ
త్పాణౌ వేమమహీశమల్లనృపతిస్సామాజ్యలక్ష్మ్యా సమమ్

ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోని వ్రాఁతపుస్తకములలో నీ శ్లోకమిట్లున్నది. శాసనము రాగిరేకులది. ఆరేకులు సీమ కేఁగినవి. శ్రీ వీరభద్రరావుగారు ప్రాచ్యలిఖితపుస్తకశాలలోని వ్రాఁతప్రతినుండి యీ శ్లోకము నుద్ధరించి యిట్లేయుదాహరించిరి. శ్రీవీరేశలింగముగారు వీరభద్రరావుగారిపుస్తకమునుండి యెత్తికొనిరి. ఈశ్లోకమం దొక యసంగతికలదని నేను దలంచుచున్నాఁడను. కొంచెమాఁగి యాయసంగతిని దెల్పెదను. అల్లాడరెడ్డి పెద్దకుమారుఁడగు వేమారెడ్డికి హరిహరాంబ యనునామె భార్యయనియు, నాహరిహరాంబ కాటయవేమునకుఁ గొడుకుకూఁతురనియుఁ గాటయకుఁ గూఁతురనియుఁ జతుస్సముద్రములను నేలుచున్న హరిహరక్షోణీపతికిఁ గూఁతు కూఁతురనియుఁ బయిశ్లోకమునకర్థము. అప్పుడుచతుస్సముద్రముల నేలువాఁడనఁదగిన హరిహరక్షోణీపతి నిస్సంశయముగా విద్యానగరాధీశ్వరుఁడే. అతఁ డా కాలమువాఁడే. క్షత్రియుఁడే. కాటయవేమాదులు శూద్రులే. వీరిచుట్టరికము సంగతము కాఁగూడదుగదా! ఇట్టిదే యిప్పుడు తెలుఁగుదేశమున

నొక తగవు రగులుచున్నది. అది కాకతీయుల విషయము. వారు క్షత్త్రియులగుట ప్రఖ్యాతముకదా! వారుశూద్రులతో జుట్టఱికములు చేసిరనియు శూద్రులనుటకుఁగూడ నాధారములు గలవనియుఁ గొంద ఱును అట్లుకాదని కొందఱును వాదప్రతివాదములు చేయుచున్నారు. అది యెట్లేని యగుఁగాక! నాకిక్కడనంతగాఁ బ్రసక్తముకాదు. ఈరెడ్డి రాజులకును విద్యానగరరాజులకును సంబంధమునుదెలుపు శాసన శ్లోకమును బ్రోసిబుచ్చఁజాలము. రెండ్లందఱు సామాన్యముగా శూద్రు లనిపించుకొనుచు వచ్చినను రాజ్యాభ్యుదయము కలిగినపిదప రాజు లయినరెడ్లు క్షత్త్రియులనికూడ ననిపించుకొనిరనుట కాధారమున్నది. శ్రీనాథాదులందఱును రెడ్లు చతుర్థవర్ణజనితులని పేర్కొనిరి. శివ లీలావిలాసకర్త నిశ్శంకుని కొమ్మనకూడ నట్లేపేర్కొనెను. కాని రాచఱికము నెఱపిన యల్లాడరెడ్డిని వర్ణించునప్పుడు మాత్ర మాతఁడు దిక్పాలకాంశోద్భవుఁడని చెప్పెను. ఇంతతో విశేషమేమియు లేదు గాని యటుతర్వాత రాజయిన వీరభద్రారెడ్డిని వర్ణించునప్పు డాతఁడు చెప్పిన యీక్రిందిపద్య మావీరభద్రారెడ్డి క్షత్త్రియుఁడయినట్లు తెలుపు చున్నది.

చ. వరకమలాత్తవంశమున వర్ధవగాంచి యమోఘమార్గణా
దరమునమించి శాంభకథాసరణి న్మదినుల్చి యుల్లస
ద్భరతమతప్రవర్తన ముదంబువహించి తనర్తు రింపుసొం
పరుమగ రామభద్రుఁడుమ నల్లవ్రపాలకు వీరభద్రుఁడున్.

'పౌత్త్రీం కాటయవేమయే' త్యాది శ్లోకముననొక యసంగతి కలదని కొంచెమాఁగి దానిని జెప్పెదనని వ్రాసియుంటిని. అది యిది: ఆశ్లోక మిప్పుడున్నట్లే యుండునేని, కాటయవేమునకుఁ గాటయయని

కుమారుఁడు కలఁడనియు, నాతఁడు హరిహరరాయల యల్లుఁడనియు, నాకాటయకూఁతురు హరిహరాంబయనియు నేర్పడును. హరిహరాంబను బెండ్లియాడిన వేమారెడ్డి యల్లయకుమారుఁడగుట, వీరభద్రారెడ్డియన్న యగుట, మనమింతకుముం దెఱుఁగుదుము. మఱియు నావీరభద్రారెడ్డి, కాటయవేమునికూఁతురగు ననితల్లికి భర్తయనికూడ నెఱుఁగుదుము. కాటయవేమారెడ్డి తనయల్లునియన్నకుఁ దనకొడుకుకూఁతునిచ్చి వివాహముచేసినవాఁడగును. ఇట్టిది యెక్కడనేని సంగతముగా నుండునా? అనితల్లికి మేనగోడలగు హరిహరాంబ తోడికోడలయినట్లు; అల్లయ వేముని సంబంధమునుబట్టిచూడఁగా ననితల్లి వీరభద్రారెడ్డికిఁ బినతల్లి యగును. తల్లివరుస తలఁపరాదందురు. ఈశ్లోకమింత యసంగతముగా నున్నది. కాటయవేముఁడు క్రీ. 1416 వఱకు జీవించియున్నాఁడు. అతనికిఁ గుమారగిరితోఁబుట్టువగు దొడ్డాంబయం దనితల్లియను కూఁతురుకలిగెను. మల్లాంబికయనునామె మఱొకరెకూడఁ గాటయ వేమునకు భార్యకలదు. శ్రీవీరభద్రరావుగారు, వీరేశలింగముపంతులు గారు మొదలగువారు మల్లాంబికయే కుమారగిరితోఁబుట్టువని వ్రాసిరి. అది సరికాదు. కుమారగిరి తల్లాంబిక కుమారుఁడు.

ఈ విషయ మింతకుముందుఁగూడఁ దెలిపితిని. కాటయవేముని తర్వాత నాతని కొమారుఁడు కుమారగిరి కొన్నినాళ్లు మాత్రమే జీవించెను. కాటయవేముని వంశము నిర్వంశమగుటచే రాజ్య మనితల్లికి సంక్రమించెను. ఆమెభర్త వీరభద్రారెడ్డి రాజయ్యెను. ఇంతయేకాని కాటయవేమునకుఁ గాటయయను కొమారుఁ డున్నట్టుగా నేశాసన మందుఁగాని, యేగ్రంథమందుఁగాని కానరాదు. అతఁడేమో బాల్యము ననే చనిపోయియుండవచ్చుననుటకును గుఱుతు. అతఁడు హరిహర రాయని యల్లుఁడట! హరిహరాంబయను కూఁతునుగనెనట. శ్రీవీరభద్ర

రావుగారుకూడ నీ విషయమును విశ్వసించియు విశ్వసింపనట్లు వ్రాసిరి. ఈశ్లోకమున నొక చిన్నతప్పిదము దొరలినదని నేను దలంచు చున్నాను. అది శాసనము జెక్కువారివలనఁగాని, దానిఁజదివి వ్రాసిన వారివలనఁగాని ప్రసక్తించియుండును. శ్లోకమందలి ప్రథమచరణ మీక్రిందివిధముగా నుండఁదగును:

శ్లో. పుత్త్రీం కాటయవేమయక్షితిపతేః పౌత్త్రీంచ కాటప్రభోః.

హరిహరరాయని యల్లుఁడే కాటయవేమనయని దీనివలన నేర్ప డును. హరిహరాంబ కాటయపౌత్త్రి. కాటయవేముని పుత్త్రియగును. కాటయవేముని వంశక్రమమిది.—

శ్లో. నప్తా కాటయశౌరేః పౌత్త్రో మారస్య కాటనృపసూనుః
వీరాన్నపోతనృపతే ర్జామాతా జయతి వేమభూపాలః.

తల్లాంబిక హరిహరరాయని కూఁతురగునేమో! ఒక శాసనము మల్లాంబిక సోదరుఁడు ముక్కంటిరాజనియున్నది. ఆశాసన మపరిశోధితము. కాటయవేముఁడు తన కుమార్తెల నిద్దఱను, వేమ వీరభద్రారెడ్లకిచ్చి పెండ్లిచేసెను. బాంధవముచేతనే రాజమహేంద్ర వరమున వారు కలిసియుండగలిగిరి. అక్కచెల్లెండ్ర నన్నదమ్ముల కిచ్చి వివాహముచేయ గూడదను నాక్షేపమున్నది. దానికిఁ దగిన సమాధానముకూడ నున్నది. ఒక్కతల్లికడుపునఁ బుట్టిన యక్క సెల్లెండ్ర నొక్క తల్లికడుపునఁ బుటిన యన్నదమ్ములకిచ్చి పెండ్లి చేయరాదుగాని వైమాత్రేయత యున్నప్పుడది తప్పుకాదు. అట్టి వివా హము లనేకములు జరుగుచున్నవి. కాటయవేముని తర్వాత రాజ మహేంద్రవరరాజ్య మాతనియల్లుం డిద్దఱకును జెందఁదగుననరాదు. కాటయవేమునకు రాజ్యము పిత్య్రముకాదు. భార్యయగు దొడ్డాంబిక

మూలమున నరణముగావచ్చినది. కావున నారాజ్య మనితల్లికివిఁ దద్ద్వారమున నామెభర్తకును మాత్రమే సంక్రమించినది. 'పుత్రీః పౌత్రీశ్చతజ్జశ్చ, పుత్రికా, పుత్రీవచ-పుత్రికా, అనంతరం తత్పుత్రీః'' అనిదాయార్హులక్రమము. శ్రీనాథుఁ డీవిషయమును గాశీఖండమున సూచించినాఁడు. కలువచేరుశాసన మీవిషయమును స్పష్ట పఱిచినది. అందిట్లున్నది :

శ్లో. దురితరహితచిత్తో దొడ్డయాల్లాదభూపో
భువమరిజనవశ్యాం భూయసాహ్యత్యదోష్ణా
విమలగుణయుతాయాం వేమభూపాత్మజాయా
మవనిసురసుధాయా మన్నిశల్యాంవ్యధత్త.

కోరుమిల్లిశాసనము బార్నెటుదొరవారిచే విటీవల సవ్యాఖ్యానముగాఁ బ్రకటింపఁబడినది. ఆదొరగారుకూడ ప్రాచ్యలిఖితపుస్తకాలలోని వ్రాఁతప్రతిపాఠము విధమునసే ప్రకటించిరి. వా రాశాసనము ప్రతిబింబమును బ్రకటింపరయిరి. కాని మనకుఁ జిక్కుఁ దెచ్చిన పట్టున వారు శ్లోకమునఁ గొంత (సజెషన్) ఊహాముల చేర్చిరి. మూల మెట్లున్నదో! సుదూరము పోయితిమి రెడ్లకును, క్షత్రియులకును జుట్టరికములు నడచె ననుటకు సంశయాస్పదమయిన సాధకము మఱియొకటి కలదు. అదియుఁ జక్కఁగాఁ బరిశోధింపవలసియున్నది. వేమవీరభద్రారెడ్లతల్లి యనవేమక్షితిపాలుని పౌత్త్రియని కాశీఖండాదులందున్నది. శివలీలావిలాసమున నిట్లున్నది:-

మ. ధరి(ర?)త్రీవిధియమ్మహీరమణుఁ డొప్పన్ జోళబ్రత్తిక్షితీ
శ్వరసూనుండగు భీమలింగమనుజేంద్రశ్రేష్ఠసత్పుత్త్రి ధా
స్వరకారణ్యదళాజనావవవిధాసంధాత్రి వేమాంబికన్
వరియించెన్ బతిభక్తి గౌరవదృఢవ్యాపారరీత్యంబికన్.

కోరుమిల్లి శాసనమం దిట్లున్నది.

శ్లో. శచీవ శక్రస్య శివేవ శంభోః పద్మేవ సా పద్మవిలోచనస్య,
వేమాంబికా చోళకులేందుభీమభూపాత్మజా భూన్మహితాస్య జాయా.

అనవేమక్షితిపాలునికూఁతును బెండ్లాడిన భీమలింగమనుజేంద్రుఁడు చోళవంశజుఁడట! బత్తీశ్వరుని కొడుకట! వీరెవరో! ఏ చోళులో! తెలియవలెను. అల్లాడరెడ్డిభార్య యనవేమనృపాలుని కొడుకు కూఁతురని పూర్వము కొందఱు వ్రాసిరి. శ్రీమానవల్లి రామకృష్ణకవి గారు శివలీలావిలాసమును జూచి కూఁతుకూఁతురుగాని కొడుకుకూఁతురు గాదని తొలుత గుర్తించిరి. అల్లాడరెడ్డివంశ్యులు ననవేమారెడ్డివంశ్యులు వియ్యాలవా రనుతలఁపు దీనిచేఁ దొలఁగిపోయెను. శ్రీవీరభద్రరావుగా రావల నారెండు కుటుంబములవారు దేసటివారనియు నొక్కయింటి వారనియు గుర్తించిరి. దేసటియనునది యొకయింటిపేరో లేక యొక తెగకుఁ బేరోయని నాకిక్కడ సంశయమున్నది.

ఇప్పు డల్లాడరెడ్డిమామయై మనయెఱుకకువచ్చిన భీమలింగమనుజేంద్రుఁడు సూర్యవంశక్షత్రియుఁడువోలె నున్నాఁడు. భీమలింగమనుజేంద్రునితండ్రి చోళబత్తిగదా! ప్రసంగ రత్నావళిలోని యీ క్రింది శ్లోకము లింతకుముందుఁ బేర్కొనఁబడినవే:

శ్లో. పూర్వో యస్య కులేశ్వరో గుణనిధి శ్శ్రీచోళబత్తిః పితా
వంత్రాణం శరణార్థినాం వదవనం షట్కాల మీశార్చనమ్
కించావారిత మన్నదాన మఖిలే నిత్యవ్రజం భూభుజాం (?)
ధన్యోఽయం చిర మన్నదేవనృపతిర్జాగ ర్త్యజయ్యః పరైః.

శ్లో. రాజవేశ్యాభుజంగాంకో రాజన్యపరమేశ్వరః
అసి చోళోఽన్నదేవేంద్రో గండభేరుండలాంఛనః.

శృంగారశ్రీనాథము

ఈశ్లోకములం దభివర్ణితుఁడైనచౌళబత్తి యనవేమారెడ్డివియ్యంకుం డగునేమో! కాలము సరిపోవుచున్నది. అల్లయరెడ్డి క్షత్రియ కన్యను బెండ్లాడుటచే వారికి జనించినవీరభద్రారెడ్డి "వరకమలాప్త వంశమున వర్ణనగాంచి" నాఁబడినాఁ డనఁదగును. శ్రీవీరభద్రరావు గారు రాజమహేంద్రవరపు వస్తుప్రదర్శనశాలలో నున్నదన్న తామ్ర శాసనము సుపరిశోధితమగునేని మఱికొంతవిషయము బయల్పడఁగల దనుకొనెదను.

ధనంజయవిజయము మనల నింతదూరమునకుఁ గొనివచ్చినది. శాఖాచంక్రమణము చేసితిమి. ఇక్కడివిషయము కొంత రెడ్లచరిత్ర ప్రకరణమునకు సంబంధించినది. చరిత్రచర్వణమగునని దీని నింతగా నక్కడఁ జెప్పనయితిని. ఇక్కడ చెప్పుటయే యెక్కువ సంగతముగా నుండునని తలఁచితిని.

ఈనడిమికాలమునఁ గూడ మనతెనుఁగుదేశమున రాజ్యప్రాభవమున నున్నవారు క్షత్రియత నాదేశించుకొని ప్రఖ్యాతక్షత్రియులతో బాంధవము నెఱపినవా రున్నారు. పేర్కొనుటేల! పూర్వకాలమునఁ గూడ నట్లుజరుగుచుండవచ్చును. క్షత్రియులు శూద్రస్త్రీలనుగూడఁ బెండ్లిచేసికొనుటయుఁ దన్మూలమున నాశూద్రులుకూడ క్షత్రియులగుటయు నాకాలమునఁగూడ సంభవించుచుండవచ్చును. ఈ విషయము నింతకంటె నెక్కువగా నిరూపింపఁబూనుట యనర్థహేతువని విడనాడుచున్నాఁడను.

❀

అష్టమప్రకరణము

# రెడ్ల వంశవృక్షము




పయివంశము వియ్యమువంశము.




* కలువచేరు శాసనము:

శ్లో. పుత్రాః శ్రీపతేస్తస్య త్రిమూర్తయ ఇవ త్రయః
అన్నపోతాన్నమాచాన్నవేమనామ విభూషణాః

వారు ప్రయోజకులగుదురేని శ్రీనాథునకు వార్ధకమునఁగూడ సంసారపుబరువు మోవఁబనియుండదు. వారట్టివారు కారుగాన తాను సంసారపుబండిని సాగఁబవలసినవాఁడయ్యెను. ఆదరించెడు ఱేఁడు లేఁడయ్యెను. కొండవీడు రాజమహేంద్రరాజ్యములు కూలిపోయినవి. ఒడ్డెరాజులు వచ్చిపడ్డారు. వారురాజ్యమును సుప్రతిష్ఠితమునుజేసికొను గజిబిజిపాటుతో నుండిరి. అపుడు సాహిత్యవినోదమునకు సందెక్కడ దొరకును? మఱియు వారు తెనుఁగువారుకారు. అప్పటి ప్రభువు కపిలేశ్వరగజపతియో పురుషోత్తమగజపతియో యగును. ఆయన కొండవీటఁ రుచున్నవాఁడుకాఁడు. కటకము నుండి యుదయగిరి పర్యంతమయిన దేశము నొక్కుమ్మొగిని వశపఱుచుకొని వ్యవహరించుటకుఁ దికమకలు పడుచున్నాఁడు. తిరుగులాడుచున్నాఁడు. పూర్వమంత్రుల ప్రాభవము పోయినది. పాత్రులు మహాపాత్రులు పెరుగుచుండిరి. సుకవితా వైభవమును జూచుకొనుచు శ్రీనాథుఁడింతదాఁక ధనమును లెక్కగొనకయేయుండెనుగాని దానివలని యనర్థము నిప్పు డనుభవింపవలసినవాఁడయ్యెను. పెదకోమటి వేమారెడ్డియొద్ద, వీరభద్రారెడ్డియొద్ద, వారివారి మంత్రులయొద్ద, నింక నితరరాజులయొద్ద నీతఁ డెన్నియేని యగ్రహారములు సంపాదించియుండఁదగును. ఎందుకు? ఆకాలమున నారాజులకంటె, నారాజమంత్రులకంటె నీతఁడే యధికభోగముల ననుభవించువాఁడుగ నుండెను. అయిపోయినది యది. ముదిసి యిప్పుడు ముప్పున మునిఁగినాఁడు. దేశాటనముచేయ దేహదార్ఢ్యములేదు. అంతకు ముందుఁ దనయెడ నత్యంతాదరము చూపిన రాజులు రాజమంత్రులు గూడ స్వర్గస్థులయిరి. క్రొత్తప్రాపులింక నెక్కడ యార్జింపఁగలఁడు? వైదుష్యవైభవమును మెచ్చి ధనమిచ్చి పోయెడు ప్రభువులులేరయ్యెను. పుత్త్రులో దౌహిత్రులో పసిపాటులకు మాత్రము పనికివచ్చువా రింట

నున్నారు కావలయు. వారిని జూచుకొని కృష్ణాతీరమున బొడ్డుపల్లెను గుత్తకుఁగొని కృషిచేయింప నారంభించెను. బొడ్డుపల్లె యెక్కడ నున్నదో నాకెఱుఁగరాలేదు. అది బెజవాడకు దిగువను కృష్ణా సాగరసంగముదాఁకఁగల దేశమునఁ గృష్ణదరి నుండవలెను. కృష్ణ వెల్లువవలనఁ బైరుపంటలు పాడుపడుట కది బెజవాడకు మిక్కిలి దిగువను గృష్ణదరిని నున్నదే కావలెనుగదా! శ్రీనాథునినాఁటికే యది చిన్న పల్లెయయియుండును. తర్వాతనది ''చేచిరా''కయి యుండవచ్చును. ఒక గ్రామమునే గుత్తకుఁగొనువాఁడు సామాన్యసంసారియై కాసకాసలతో నిఱుగడవఁదగినవాఁడయి యుండఁడు శ్రీనాథున కెంతో పోష్యవర్గ మెక్కువగా నుండవలెను. ఆగ్రామమునకు సిస్తేడునూర్లుటంకములట! కృషి తిన్నగా నెఱవేఱి పంట యింటికివచ్చెనేని యది యెంత గొప్ప సంసారమునకు సరిపడియుండునో? దాని విలువెంత యుండునో యప్పుడు? అది యిప్పు డెంతవిలువ యుండునో? మైలారరెడ్డి దినవెచ్చ మిచ్చువాఁడనఁగా నా వెచ్చము 'సేరుబియ్యము, చిట్టెఁడునెయ్యి' యయి యొకటిరెండు పొట్టలకు సరిపోదగినట్లుండదు. శిష్యసంఘము, బంధుసంగము మొదలుగా నాతనిబంతిని భుజించువారు పలువురుండిరీయుందురు. రేపటికని చూచుకోక యతఁ దేపూటకాపూట యిష్టోపభోగములతో ధనము వెచ్చించెడువాఁడు. గ్రామము కృషికి గుత్తకుఁగొనెనఁగాఁ గమ్మతగాఁ డెందఱో యుందురు. పెద్దజంజాట మేర్పడినది. బ్రాహ్మణకృషి తిన్నగా నెఱవేఱదందురు! కవితాకృషియం దసమానుఁడయ్యును శ్రీనాథుఁ డీకృషిలోఁ గృతార్థుఁడు కాఁజాలకపోయెను. కృష్ణవెల్లువవలన నాపైరు పంటలు పాడుపడెను. ఉన్నదియుండఁగా నుయ్యారు పైఁబడ్డదన్నట్టు గొడ్డువోయిన యాభూమికిఁ బన్నుగా నేడునూర్లుటంకములు (టంక మొక బంగరు

నాణెము) శ్రీనాథుఁ డామెుద్దెరాజుల కీయవలసినవాఁడయ్యెను. ఎక్కడఁదెచ్చి యీయఁగలఁడు? విద్యాగౌరవములేక యారాజులో రాజమంత్రులో శ్రీనాథుని సిలుగులకుఁ బాల్పఱిచిరి. శ్రీనాథకవి సార్వభౌముఁ డీక్రింది పద్యమును జెప్పి యాంధ్రవాఙ్మయ మున్నంత కాలమును శాశ్వతమగున ట్లా రాజుల కపకీర్తి నెలకొల్పెను:

సీ. కవిరాజుకంఠంబుఁ గౌగిలించెనుగదా
పురవీథినెదురెండ పొగడదండ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ
సార్వభౌమునిభుజాస్తంభ మెక్కెనుగదా
(1) నగరివాఁకిటనుండు నల్లగుండు

గీ. కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేఱి మోసపోతి
నెట్లుచెల్లింతుఁ దంకంబు లేదునూర్లు.

తలంచిన మిక్కిలి వ్యసనముకలుగుచున్నది. కటకటా! కర్ణాట రాజుల ముత్యాలశాలలోఁ గనకాభిషేక సత్కారమందిన మనకవిసార్వ భౌమునకా యిట్టికష్టదశ! అతఁడు తన నిర్యాణకాలమునఁ జెప్పికొన్న పద్యమునే నేనీ ప్రకరణప్రారంభమునఁ జెప్పినాఁడను. "దివిజకవి వరుగుండియల్ దిగ్గురనఁగ, నరుగుచున్నాఁడు శ్రీనాథుఁడమరపురికి." ఆపద్యమున బేర్కొనఁబడినవానిని గూర్చి యింతకుముందు మనము

(1) 'నాగిరౌతుపసించు నల్లగుండు' అని బ్రౌణ్‌దొరగారి పాఠము.

కొంతయెఱుఁగుదుము. వీరభద్రారెడ్డి, పంటమైలారరెడ్డి, సంబురాయని తెనుంగురాయఁడు, విస్సనమంత్రి (రాయని) భాస్కరుఁడు, ననువారు. పెదకోమటివేమారెడ్డి, మామిడి సింగనామాత్యుఁడు మొదలగువారెప్పటికి నలుబదియేండ్లకుఁ బూర్వమే స్వర్గస్థులగుటచేత, శ్రీనాథుఁడువారి నీ పద్యమునఁ జేర్పనలేదు. పయిపద్యమునఁ జేర్పఁబడిన వారికే గాక మఱియెందఱకో కూడ శ్రీనాథుఁడు రేపలకుఁదేయుల నామె తలపెట్టి బహుధనమార్జించెను ఎంతయార్జించిననేమి? తుదకా మహా నీయుని మనుప్పకద కేఖుపఱియున సలుకదచెందదయ్యెను ఆనాఁటి కానఁ దేదోకృత్రిమపు ఘనతఁగూర్చు ధనమేమి ధనము! దంభనము! కీర్తిధనమే ధనము! శ్రీనాథుఁడు లేవడిచేఁ జివికి చీకాకుపడుచుండఁగా నాకాలమున నైశ్వర్యగర్వమున విశ్వము మఱచియున్న ధనోన్మదు లెందఱో యుండుదు గదా! వారి ధనమెక్కడపోయెనో? తనువులెక్కడ పోయెనో? ఊరు? పేరు? కీర్తిధనమార్జించుకొన్న శ్రీనాథుని వాఙ్మయ మూర్తి నాఁటికీ నేఁటికి, నేనాఁటికిఁగూడఁ గనుగొందుడు కవితామహా రాజ్యభద్రాసనాసీనుఁడై, కవిసార్వభౌమ బిరుదమునఁ గవిలోకము నేలుచునేయుండునుగదా! ఔరా! శ్రీనాథకవిసార్వభౌమా! నిప్పచ్చరమును దలంచుకొని నీ వెంతపప్పరింతలు వెట్టితివోగదా! చాటు నేయక చాటిచెప్పితివి! ఐశ్వర్యమత్తులను దలమొత్తుటకా, ఉసురు విడుచునప్పుడు కూడఁ గవితావిశేషమున నీవెంతగండరగండఁడవోయి!! 'దివిజ కవివరుగుండియదరి దిగ్గురనఁగ' నమరపురీప్రస్థానము కావించితివా?

## స్వభావము.

శ్రీనాథుఁడు మహాభోగపరాయణుఁడు. ఈ విషయమున సమ కాలమువాఁడయిన పోతనామాత్యునకును, నితనికిని మిక్కిలి ప్రాతి

కూర్చుముకలదు. శ్రీనాథుఁడు నిర్వ్యాజముగా నొక్కగ్రంథమేని పారలౌకికఫలము నపేక్షించి భగవదంకితము చేసినట్టు కానరాదు. స్వర్ణపాత్రభోజనములు, దీనారటంకాలతీర్థమాడుటలు, జాంబూనదాంబరాభరణధారణములు, కస్తూరికాసుగంధాంగరాగానులేపనములు, ఉద్యానవిహారములు శ్రీనాథుఁ డపేక్షించెను. తదుపలబ్ధికయి గ్రంథముల రచించెను. అతనికీ యశోలిప్సయు వారిము: ''కావ్యములు పెక్కు చెప్పియుఁ గాంచనము, వెండియును గావ్య మొకటి నిర్మింపఁదలచి'' (భీమఖండము). పోతరాజుగా రీతెఱుఁగువాఁడు కాఁడు:

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురమ్ములు వాహనమ్ములున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటప్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

ఈ పద్యము శ్రీనాథునుద్దేశించి చెప్పినది కావచ్చును. శ్రీనాథుఁ డెక్కడి కరిగినను గవితామహారాజ్యభద్రాసనాసీనుఁడయి శిష్యసంఘముతోఁ గవితావిజయధ్వజముతో బయల్వెడలెడివాఁడు. అనుభవము చూచిన సుందరివిగూర్చియో, యనుభవించిన యానందమును గూర్చియో, కాంచినకష్టమును గూర్చియో, పద్యము పట్టుచుండెడివాఁడు. అట్టివాని వాగుటచేతనే మన కాతనిచరిత్ర మీమాత్రము తెలియఁదగినదయినది. అతఁడు సౌందర్యాభిమాని. చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాఁడు, నూనూఁగుమీసాల నూత్నయౌవనము, ప్రౌఢనిర్భరవయః పరిపాకము ననుపదము లీవిషయమును దెలుపుచున్నవి. మఱియు నాతఁడు శృంగారశేఖరుఁడు. భీమఖండ కాశీఖండ గ్రంథభాగములు, వీథీనాటకము, శివరాత్రి మాహాత్మ్యము,

టుధారలు, ఐతిహ్యములు, ఇతర కవిస్తుతులు, నీవిషయమును ద్ధాంతపఱచుచున్నవి. ఈ విషయము నిరూపించుటకయి కొంత గంథము వివరించి వ్రాయ మనసొల్లకున్నది. కొందఱు శ్రీనాథుఁడు ృంగారియనుట కొప్పుకొనకున్నారు. అట్టివారు శ్రీనాథుని గ్రంథము ను జదువనివారో, చదివినను గవితాతత్త్వము నెఱుఁగనివారో, ఱిఁగినను గప్పిపెట్టఁదలంచువారో కావలెను. కడపటివిధమువా గుదురేని వారిసద్హృదయమును సన్మానింతము. మన మిక్కడ శ్రీనా నిఁ దిట్టుటలేదు. కవితాదర్పణమునఁ గన్పట్టుచున్న యావిషయమును ప్పిపెట్టిన మాసిపోదు. శ్రీనాథుని చాటుధార లనేకము లుదాహరిం జాలకున్నాను. వానిలోఁ గొన్నింటిని ప్రాచీనులు లక్షణగ్రంథము ందు శ్రీనాథుని పేరనే యుదాహరించినారు. అట్టివానినెల్ల నే నిక్కడ దాహరింపకున్నను, జూచినట్లు సూచించియైన విడువవలెనుగదా! శ్రీనాథునిశృంగారవర్తనము' అను పేర నొకపెద్దప్రకరణము రచిం ము నది పముగురుసుజదువఁదగినది కాదనుకారణమున దూరీకరించి ). ఇంతదాఁకలోకమున జీవించియున్న శ్రీనాథునిచాటుధారలిప్పుడు న మచ్చుపఁ దీర్చుకున్నంతమాత్రానఁ జచ్చిపోవు. వానియందుఁ ఎతాగౌరవమున్నది. శ్రీకంఠమహారి వీరేశలింగముపంతులుగా రీసంద ్రమున శ్రీనాథునిఁ గొంత యవగణించిరి. ఆతఁడు వార్ధకమున దారి ద్యమనుభవించుట పాపఫలమనికర్మవిపాకముచెప్పిరి. అట్లు చెప్పుట రికేచెల్లినది. దాని కేను విస్మరింతము. ఈసందర్భముననే ధీమఖండ ఐదాఁరిపకు లొకతప్పిదమును శ్రీనాథునిపై నారోపించిరి. అదియిది: స్కృతధీమఖండమున " కాలకూటోపసంహారీ సమర్థస్సహి దేవ ట్"–అనియుండఁగా శ్రీనాథుఁడు "కాలకూటోపసంహారకారి తఁడు, సంతతము దేవతేజ్యాభుజంగుఁడతఁడు" అని తప్పుగాఁ

ృంగారశ్రీనాథము

దెలిగించెనట! శ్రీనాథుఁడు దేవునికిఁగూడ నిక్కడబోగపుటాంగ్రడతో సంబంధము చెప్పెనట. శ్రీ వీరేశలింగముపంతులుగారును గతానుగతి కులై కొంతయేదేని వ్రాసిరి. ఆ తప్పిదము శ్రీనాథునిదికాదు. శ్రీనాథుని తెలిఁగింపు సరియయినదే. దేవవేశ్యాభుజంగ రాజవేశ్యాభుజంగ పదము లనేక గ్రంథములం దున్నవి. రెండవది రాజుల కనేకులకు బిరుదుగానున్నది. రాజులనెడ వేశ్యలకు మిందఁడవి దాని యర్థము. "రాజవేశ్యాభుజంగస్య కుమారగిరిభూపతేః శస్త్రీకాటయవేమస్య ప్రగల్భా తత్రిదూతికా"– ఇత్యాదు లీయర్థమును స్పష్టపఱుచుచున్నవి. దేవవేశ్యాభుజంగపదముకూడ దేవతాధిపుఁడను నర్థముగలదే! "దేవరాట్" అనుపదమునకు నుచితమయిన పరివర్తనమే. వారనుకొని నట్టు గుడిబోగపుటాంగ్రదని యర్థముకాదు. స్థలాంతరములం దాతఁడట్లు చెప్పినది వాస్తవమేకాని యిది యట్టిదికాదు.

ఈ క్రిందిపద్యములు శ్రీనాథునిస్వభావము నెఱిఁగించుచున్నవి.

క. ఎవ్వఁడు నిసర్గకఠినుం
డెవ్వఁడు సన్మార్గరోచి యార్జవపరుఁడై
యెవ్వఁడు తన కధికునితోఁ
జివ్వకుఁజేసాఁచు వాని సిరు లధ్రువముల్.

గీ. అతిథి కడు సల్పుఁడై నను నధికుడైన
నింటికేతేరఁ బ్రియమెందు నెవ్వఁడేని
వానిగౌరవ మది గౌరవంబుగాని
కాదు గౌరవ మాకారగౌరవంబు.

క. ఎవ్వనితో నెచ్చోటం
జివ్వకుఁజేసాఁపవలదు చేసాఁచినచో

నివ్వల నవ్వుల నెవ్వరు
నవ్వక యుండంగఁ బగసనండీర్చెదరున్. —కాశీఖండము.

ఈకడపటిపద్యమునకు వెనుకముందులుగా నున్నపద్యత్రిని. ములు మఱిరెండు డిండిమభట్టారకవివాదసందర్భమున నుదాహరించి పయిపద్యములందు గర్హింపఁబడిన దోషములు శ్రీనాథునికడ లేకుండవలెను. అతఁడు శ్లాఘాపరుఁడు కాఁడనుటకుఁ బెదకోమటివేమారెడ్డికాలమునఁ జెప్పఁబడిన శాసనము నుదాహరణము. అందుఁ బ్రతిగ్రహీతలను శ్రీనాథుఁడు మిక్కిలి ప్రశంసించెను. మఱియు 'ఎవ్వఁడు నిసర్గకఠినుం' డను పద్యమునఁ జేయఁబడిన గర్హణమునకు డిండిభట్టు మనస్సునమెదలుచుండఁదగును. రెండవది తనదేశాటనానుభవమును బట్టి చెప్పినది. మూఁడవది తన్నుఁగూర్చి చెప్పుకొన్నది.

కవులు వర్ణించిన వర్ణనములెల్ల ననుభూతములే కావలయునా యను నాక్షేప మెఱుఁగుదుము. అయినను గవియొక్క భావము కావ్యమునఁ బ్రతిఫలించుచుండుననియుఁ, గొన్ని పట్టులందది మిక్కిలి విస్పష్టమగుననియుఁ గవితాతత్త్వపరిశీలన పరాయణు లైకకంఠ్యముగా నంగీకరింతురు. ఇతిహాసములను వినరే, చాటుధారలను పరికింపరే, తత్కాల తారతమ్యములను గుర్తింపరే, శ్రీనాథుఁడు శృంగారియను నంశము నాతని కావ్యములఁ బరికించి కవితాతత్త్వపరిశీలకులు నిర్ణయింపఁగలుగుదురు. ఆయావిషయములందుఁ గవితోజ్జృంభణము కావచ్చుటకు మానసికమగు ప్రవృత్తియే కారణమగుచుండును. ఏరాఁబ్రాలకలమాహా•ము-కప్పురభోగి వంటకము-పెసరుఁబప్పు - నీతఁడు మక్కువతో పేర్కొనును. శ్రీనాథుని కృతులందు దివ్యములగు భోజనవర్ణనము చెప్పఁబడిన పట్టులందుఁ గలవు. అట్లు దేశాటనముచేసియు, ప్రతిభావ్యాపారమున నఖండపరిశ్రమముకావించియు

వైషయికవర్తనమున నగ్ర్యకోటినధిష్ఠించియు, మొగ్గతిలఁబడక చిర జీవితము సాగించుకొనఁగలిగినవానికిఁ దిన్నని మేలయిన యాహార విహారములు పొసఁగకయెట్లు? కలవు చాటుపద్యము లీసందర్భమునఁ గొన్ని. ఉదాహరింప మనసొల్లకున్నది. ఒకానొక చాటుధార యాతఁడు విశాలోన్నతకాయుఁడని తెలుపుచున్నది. అతని భోజనప్రీతిని దెలుపు చాటుధారలును గ్రంథభాగములును గొన్ని చూపుచున్నాను :

గోధూమసేవికాగుచ్ఛంబు లల్లార్చి – (నైషధము) ఖండశర్క రజున్న – (భీమఖండము). ఇత్యాదిపద్యములును,

ఉ. పప్పును దిండిపంటలును బావకముల్ ఘృతముల్ గుడంబులున్
(?)గుప్పులుగాఁగఁ జట్టునను గూర్పఁగఁగూడిన యేరుఁబ్రాలతె
ల్గప్పురబోగివంటకము గమ్మని తాలిపుసొజ్జెపిండితో
నొప్పులుగా భుజించిరి బుధోత్తము లాఁకటిచిచ్చు పెచ్చునన్

శా. ద్రాక్షాపానకఖండశర్కరలతో రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెఁగలతోఁ గ్రొన్నేతితోఁ బప్పుతో
నక్షయ్యంబగు నేరుఁబ్రాలకల మాహారంబు నిశ్శంకతన్
గుక్షుల్ నిండఁగ నారగించితిమి యక్షుద్రక్షుధాశాంతికిన్.

వీథినుండి :-

ఉ. కప్పురబోగివంటకముఁ గమ్మని గోధుమపిండివంటయున్
గుప్పెరు పంచదారయును గ్రొత్తగఁగాచిన యాలనేపెస
ర్పప్పును గొమ్మువల్లనఁటిపండ్లును నాలుగు నైదు నంజులున్
లప్పలతోడఁ గొంబెరుగు లక్ష్మణవఝ్ఝలయింట రూకకున్.

కాశీఖండమున :

"వ. అనంతరం బావిశాలాక్షీమహాదేవియును భావంబున నమ్మహామునుల ముందటఁ గనకరంభాపలాశపాత్రంబులయందు, విచిత్రంబుగాఁగల వంటకంబులు, నపూపంబులు, లడ్డువంబులు, నిడ్డెనలు, కుడుములు, నప్పడంబులు, నిప్పట్లు, గొల్లెగలు, జిల్లెడుకాయలు, దోసియలు, సేవియలు, నంగరపోలియలు, సారసత్తులు, బొంతర కుడుములు, ఇక్కిలంబులు, మడుఁగుఁబూవులు, మోరుండలుఁ, ఖండ్రేఖఖండంబులు, పిండఖర్జూరద్రాక్షానారికేళకదళీపనసజంబూచూతలికుచదాడిమీకపిత్థకర్కంధూఫలంబులు, గపగసలు, పెసరుంబులుఁ గములు, చెఱకు గుడములు, నరిసెలు, బిసకిసలయముల వడుగులు, చిరుగడములు, ఖడిదెములు, బుఱపలు, బులివరకలు, (నప్పడంబులు), బప్పురొట్టియలు, చాఁపట్లు, వాయసంబులు, కర్కరికారవేల్ల కూశ్మాండ నిష్పావపటోలికా కోశాతక్యలాబూసి గూడుంబరవార్తాక బింబికా కర వింద శలాటువులును గందయుం బొందయుఁ జారుబుఁ దియ్య గూరలు బచ్చడులు బజ్జులు, గిజ్జిఱులు వడియంబులు గడియబుఁలు గాయంబులు, గంధతోయంబులు, నుండ్రాలు, నానుబ్రాలను, ననుములు, మినుములు, బుగుకులు, నడు. కులు, నిలిమిడియును జలిమిడియును, ద్రబ్బెడయు, వడయును, నుక్కెరలు, చక్కెరలు, నేతులుఁ, దేనెతొలలు, ఓట్టును, గట్టును, బాలతిమ్మనంబులును, దోఁపలుపూఁపలు, మోదకంబులు, గుడోదకంబులు, ముక్కులుముఱియని చొక్కంపుఁ బేరుఁబ్రాల మిలమిలని రాజనంపుమడుఁగు బోగిరంబులు, షాడబంబులతోడం బానకంబుల తోడం దిమ్మనంబులతోడ దధిపిండఖండంబులతోడ మీఁగడలతోడ మజ్జిగలతోడ నూరుఁగాయలతోడ నంబకబళంబులతోడ రసావళుల

శృంగారశ్రీనాథము

తోడంగూడి బుగబుగమను బొగపుఁగంపులతోడం బ్రతిఘటించు రామ తామోదంబును, రామతామోదంబుతో మంతనంబాడు మెంతులనెత్తావులు, మెంతులనెత్తావులతో బిత్తరించు జీరకంబుల సౌరభంబును, జీరకంబుల సౌరభంబుతోడం బ్రసరించు కుస్తుంబరికిసలయ వాసనలును, గుస్తుంబరికి సలయ వాసనలతోడం బిసాళించు కటివేఁ పాకుఁబరిమళంబును గటివేఁపాకుఁ బరిమళంబుతో సంబంధించు, కమ్మకసింద గంధంబును, గమ్మకసిందగంధంబుతోడం దార్కొను నేలకుల సౌరభంబును, నేలకుల సౌరభంబులతో సాళగించు కాలాగురుకురంగ నాభికాకర్పూర గంధ సారనీహారవాఃపూరంబులతోడం గలహించు మహిసాక్షిగుగ్గులు ధూపధూమంబుల కమ్మఁదనంబును భోజనాగార గవాక్షమార్గంబుల వెడలి కాశికానగరఘంటావీథులం బౌరనాసికాపుట కుటీరములకుం గుటుంబకంబుగా మిరియంబు పెరిమెయుఁ, బసపుఁబసయు, కొంతిసొబగు, నావతేవయు, సిందుప్పుచాగయుఁ గరాం(?) బువుమవ్వంబును, బిప్పలి యొప్పును, నల్లంబు మొల్లంబును, జింతఁ గొజ్జురజ్జును, చేలపిండి యొప్పును, విప్పపూమొగ్గల యగ్గలికయు, వెన్నపెన్నాటకంబును, గలిగి యొక్కొకమాటియుఁ దనకుం బానసులి వేఁడికట్టావితో నావిర్భవించిన" —

మతము.

శ్రీగురుజాడ శ్రీరామమూర్తిపంతులుగారు తిక్కనను గూర్చి వ్రాయుచు శ్రీనాథునియోగ్యత నిట్లు ఁదుకఁగొట్టినారు:

"ఇదియునుగాక వేదవేదాంతార్థములు కేవలము తెలిసినను దదుక్తకర్మాచరణము లేనివారల కట్టిపట్లు తెలిఁగింప సమర్థతయుండదని శ్రీనాథుఁడు తానట్టివాఁడు కాకుండుటంబట్టి యూహించియుండును.

నవమప్రకరణము

శ్రీనాథుఁడేగాక యాతని తండ్రియుఁ దాతయుగూడ వైదికసంపత్తి లేనివారే. తిక్కనసోమయాజివంశ మట్టిదిగాదు. తిక్కనసోమయాజి తండ్రి సాంగవేదవేది యనియుండె. తిక్కనసోమయాజి వేదవేదాంగముల నేర్చినవాఁడేగాక వైదికమార్గనిష్ఠమగు వర్తనమును నిర్వహించు నట్టి యజ్వగానుండెను. కావునఁ బై విషయములో శ్రీనాథుఁడు తన కంటెను భారతామ్నాయమును దెనిఁగించుటకుఁ దిక్కన యొక్కఁడే లౌకికవైదికములు రెండింటను సమర్థుఁడని యెంచి యారీతిగా వర్ణించెను.''

శ్రీనాథుఁడు వైదికాచారదూరుఁడనుటకుఁ దగిన యాధారము లేదు. ఆతని తాతతండ్రులనుగూర్చి మనకేమియు నెఱుఁగరాదు. నిరాధారముగా శ్రీరామమూర్తిగారు నెలకొల్పిన పయివిషయము మనకు నిరాకరింపఁదగినది. శ్రీనాథుఁడు వేదాదివిద్యాసంపన్నుఁడనుట కనేకాధారము లున్నవి. హరవిలాసమున -'పరమపుణ్య' 'కులపవిత్ర' 'అఖిలపురాణవిద్యాప్రవీణ' 'అధ్వర్యువేదశాఖాధీతినిష్ణాత' 'ఆగమజ్ఞాననిధి' 'తత్త్వార్థఖని' 'బహుపురాణజ్ఞ' పదము లున్నవి. నైషధమున 'ఈశ్వరార్చనకళాశీలుఁ' డనియున్నది. కాశీఖండమందీతని వైదికవిద్యాసంపత్తిని దెలుపు భాగము లనేకములున్నవి. పంచబ్రహ్మ షడంగమంత్రములతోఁ బ్రాసాదపంచాక్షరి నీతఁడు బహువారములు స్మరించినాఁడు. పట్టిసక్షేత్రవాసియగు భీమయదేశికున కీతఁడు శిష్యుఁడుగదా! శ్రీనాథుఁ డుపనిషద్వాక్యములు పెక్కులు కాశీఖండమం దుదాహరించినాఁడు. శబ్దశాస్త్రజ్ఞుల స్ఫోటాదివాదముల నెఱిఁగినాఁడు పాతంజలయోగదర్శనమం దీతనికిఁ బరినిష్ఠహెచ్చు. శివపారమ్యమం దాదరమెక్కువ. కాని విష్ణుద్వేషముగల వీరశైవుల త్రోవవాఁ డీతఁడు గాఁడు. ఒక రీతఁడు లింగధారినియోగిబ్రాహ్మణుఁడని తలంచిరి.

నాకది యంగీకారార్హముగాఁ దోఁపదు. లింగధారులకు విష్ణుద్వేషము విహితము. ఈతని కదిలేదు. అద్వైతమందే యాస్థకానవచ్చును. బహుభేదములతోఁ బరస్పర ద్వేషములతో నుండు తాంత్రికమంత్రములం దీతనికిఁ దత్పరత యున్నట్టు తోఁపదు. "బహుధాపి ప్రతిపత్తిధీవిషయమున్ పాదైనశాస్త్రార్థముల్-" "బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధానమవు" అను పలుకులీభావములను బలపఱుచుచున్నవి. ఈతని నాదరించిన రాజులు, రాజమంత్రులు, శైవమతాభివిష్టులగుటచేత వారి యభిమానము చొప్పునీతఁడు వీరశైవగ్రంథమగు పండితారాధ్య చరిత్రమును రచించినాఁడు. దానిఁ బట్టియే యాతఁడు లింగధారియనరాదుగదా!

ఇతర కవులుచేసిన ప్రశంసలు.

నాగ్నచిత్తీపరిణయము – వల్లూరి నరసింహకవి:

మ. ధనరాజ్యంబులుమాని నెమ్మదిఁ బ్రమోదంబంది తన్గోరున
ట్టి నృపాలాగ్రణి కోర్కి తీర్చుట కకుంఠీభూతచేతస్కుఁడై
చని సాధించవ సత్కవిప్రవరు రాజన్యాగ్రగణ్యమాన్యు నేఁ
బ్రణుతింతుం బహుశైవసంగదిరి కుంభద్గాఖ శ్రీనాథునిన్.

తారకబ్రహ్మరాజీయము – రాఘామాధవకవి:

శా. నూనాస్త్రప్రమదామదస్ఫురిత వక్షోజాతకాఠిన్యమున్
మానంజాలు వచోవిలాసముల నింపుల్ మీఱఁ గర్ణాటక
క్ష్మానాథేంద్రుసభం గవిత్వవిజయోత్సాహంబుగై కొన్న మా
శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలుతుం సేవాంజలుల్ గీల్కొం

మొల్లరామాయణము - కుమ్మరమొల్ల:

సీ. గీ. స్తుతగుణోద్దాము నాచనసోము భీము
నవ్యమంజుల వాగ్ధుర్యు నన్నపార్యు
రసికులైనట్టి శ్రీనాథు రంగనాథుఁ
దిక్కకవిరాజును నుతించి ధీమించి.

వసుచరిత్రము - భట్టుమూర్తి:

మ. మహిమన్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.

శృంగార శాకుంతలము - పినవీరన:

సీ. నన్నపార్యుని ప్రబంధప్రౌఢవాసనసంపత్తి సొంపు పుట్టింపనేర్చు
దిక్కన యజ్వవాక్ఫక్కి కామోదంబు చెలువు కర్దముల వాసింపనేర్చు
నాచిరాజునిసోము వాచామహత్త్వంబు సౌరభ్యంబులు వెదచల్లనేర్చు
శ్రీనాథభట్టు భాషాగుంభంబుల పరిమళంబులంగూడఁ బఱచనేర్చు

గీ. మహితగుణశాలి పిల్లలమఱ్ఱివీర నార్యుఁ డాయింటఁ బైతామహంబనుచును
వెలయుచున్నది నేఁడు కవిత్వలక్ష్మి యఖిలసత్కవినికరంబు నాదరింప.

సాంబోపాఖ్యానము - రామరాజు రంగప్పరాజు:

సీ. అభివందనము సమర్పించి నన్నయభట్టుమార్గము కొంత పరిఢవిల్ల
తిక్కనమఖిసూక్తఫక్కిక యొకకొంత పెనుపొంద నెఱ్ఱనప్రెగడభణితి
యొకకొంత తులకింప నొకకొంత నాచనసోముగీర్వైభవంబు సొంపుమీఱ
త్రిపురాంతకుని వచస్సౌమ్యంబు నొకకొంత కొరలఁ శ్రీనాథోక్తి కొంత నిగుడ

గీ. మఱియుఁ దక్కిన సుకవుల మధురవచనరచనలను గొంతరాణింప రసనిబంధ బంధురముగాఁగ నేనిచ్చు భవ్యకావ్య హీరమునకుఁ గథాక్రమం బెట్టులనిన.

పట్టమెట్ట సోమనాథసోమయాజి — సూతసంహిత:

సీ. సర్వజ్ఞమౌళిభూషణమైన శబ్దశాసను బహుముఖ రవజ్ఞతఁ దలంచి
యోగ్య శుతిహిత ప్రయోగుఁడౌ సోమయాజులరీతి వృత్తిసంశుద్ధినెన్ని
నిర్దోష సుసమాధినియత క్రియగు శంభుదాసు ప్రసాదపాత్రత నుతించి
నిస్తులౌజఃకాంతినిధులైన సోమభాస్కరుల శబ్దగణప్రవృత్తిఁ బొగడి

గీ. రుచిరపదసిద్ధధారానిరూఢమహిమఁ దగిన శ్రీనాథు నవ్యకర్తృత్వము గ్రహించి
తత్కవిత్వకథాసుధాదానసంత తాపదానైకచిత్తుఁడనై కడంగి

చారుచంద్రోదయము (చెన్నమరాజు).

సీ ప్రకృతికృదవ్యయ ప్రత్యయ సుప్రతిష్ఠాపను శబ్దశాసను భజించి
సరసమౌళిప్రియంకర పదాలంకారవృత్తి సోమేంద్రుని సుగలింద్రు నెంచి
సర్వజ్ఞగణమనస్సంప్రీతికరకవిత్వవిలాసు నలశంభుదాసుఁ బొగడి
బహుముఖప్రఖ్యాత మహితశయ్యా విశేషసనాథు శ్రీనాథు సన్నుతించి

గీ. అధికలక్షణసంపన్నులైన తనర్చు భైరవు ననంతు భీమునిఁ బ్రణుతిచేసి
పృథివినెంతయు వాణీధురీణులయిన యఖిలసత్కవీంద్రుల నాత్మఁదలఁతు.

బహుళాశ్వచరిత్ర — (నవరము చిననారాయణకవి):

మ. ఉపమానైపుణిఁ గాళిదాసు లఖిలార్థోత్పాదనా భారవుల్
సుపదస్థాపనరూఢిఁ దండికవిరాజుల్ జాతివార్తారస
స్థపదోజ్జృంభణశబ్దజృంభణకళా శ్రీనాథులేకాక యే
కపదశ్రీమ్మదసంప్రదాయకవులా మర్షింప మాకో ట్లకున్.

నవమప్రకరణము

జానకీరాఘవము - [బేతపూడి కృష్ణయ]:

శా. వాగీశుండు తెనుంగుపద్యకవితా వారాశిఁ గల్పింప వి
ద్యాగణ్యుం డగు కుండలీంద్రుఁడు గుణాఢ్యత్వమ్మునన్ మీఱ నా
నాగీర్వాణ వచస్తుతిన్ మెలఁగు శ్రీనాథుండు కావ్యామృత
శ్రీ గైకొంచు బుధాళి కిచ్చు మహితోత్సేకంబు వర్ణించెదన్.

పృథుచరిత్రము - పట్టమెట్ట సరస్వతిసోమయాజి:

ఉ. నన్నయభట్టుఁ దిక్కమఖినాథుని నెఱ్ఱయప్రెగ్గడన్ వచః
పన్నగసార్వభౌము లని భక్తిఁ దలంచి మహాప్రబంధముల్
చిన్నటనాఁటనుండియును జేసిన సత్కవిసార్వభౌమునిన్
సన్నుతిచేసెదన్ సరససాహితికావ్యము లాకలించుచున్.

చంద్రరేఖావిలాపము - కూచిమంచి జగ్గకవి :

క. భీమకవి రామలింగని
శ్రీమన్మథుఁ డైన వెలుఁగు శ్రీనాథకవిన్
రామకవి ముఖ్యులను బ్రో
ద్దామగతిం జిత్తవీథిఁ దలఁచి కడంకన్.

బాలభాగవతము - కోనేరునాథుఁడు:

క నన్నయభట్టారకుని భీ
మన నం దిక్కయ్య నెఱ్ఱయాహ్వయు శ్రీనా
థు న్నుతియించెద మిగులఁ బ్రబ
సన్నాత్ముల నంద్రకావ్యజలజాసనులన్.

ఇందుమతీపరిణయము - కుమారధూర్జటి :

సీ ........ .......................
...........................................
...........................................
తనదు శ్రీనాథత్వ మనుపమన్రపసభాంతర చిత్రరచనబంధురత మెఱయ

శృంగార శ్రీనాథము

గీ. నలరు నన్నప దిక్కనాఖ్యాంధ్రకవిని। నెఱ్ఱనామాత్యు నిషధరాజేంద్రసుచరి
త్రాంధ్ర కవనసపీనవాగమృతలీల। నతిశయించిన నెఱ్ఱాప్రెగడ నభినుతింతు.

ప్రబంధరాజవిజయవేంకటేశ్వరవిలాసము.

—గణపవరపు వేంకటకవి:

సీ. అల విన్నకోట పెద్దన లక్షణజ్ఞుల.

అరుణాచలపురాణము: — పెదపాటి సోమయ:

సీ. ప్రతిభావిలంఘిత భారతబహుకథాపుట్టు నన్నయభట్టుఁ గడుభజించి
ఉభయభాషాప్రౌఢిమోద్యన్మహారాజ్యభాజిఁ దిక్కనసోమయాజిఁ బొగడి
వార్ప్రితోషితదక్షవాటీమహాస్థాన భీము వేములవాడభీముఁ గొలిచి
భావబంధనిబంధ పరమేశచరిత్రప్రశర్మ నెఱ్ఱయశర్మ సన్నుతించి

గీ. భారతీహారు భవదూరుఁ బ్రణుతిచేసి। సుకవికులసోము నాచనసోము నెన్ని
నవ్యకవితాసనాథు శ్రీనాథుదలఁచి। సరససకలాంధ్రకవుల కంజలియొనర్చి.

రాజరాజాభిషేకము - అంగర రామకృష్ణకవి

క. పాథోధిపయోభర ని
ర్మాథచలద్ధుమధుమాయమానలహరికా
పాథేయదాయిసూక్తి స
నాథుఁ శ్రీనాథు నెమ్మనంబునఁ గొలుతున్.

మఱియు "నచ్యుతైకసమాఖ్య నంచితపదధారఁ బ్రకటించు శ్రీనాథ సుకవివరుని" నని కోడూరువేంకటాచలకవి శివరహస్యఖండమున శ్రీనాథునిఁ బ్రస్తుతించినాఁడు. సిరిప్రెగడ ధర్మనాదులు కూడ పెక్కురుకవులు శ్రీనాథునిఁ బ్రస్తుతించిరి. మొత్తమునకు శ్రీనాథునిఁ

గూర్చి ప్రాచీనకవులుచేసిన ప్రస్తుతు లాతనిశబ్దరచనాచాతుర్యమును ప్రశంసించునవిగా నున్నవి.

## సమకాలము కవులు.

బమ్మెరపోతన, నిశ్శంకుని కొమ్మన, దగ్గుబల్లి దుగ్గన, నాగనాథుఁడు, గౌరన, పినవీరభద్రుఁడు, చెన్నమరాజు, భైరవుఁడు, జక్కన, మడికిసింగన, అనంతామాత్యుఁడు, గోపరాజు, తాళ్ళపాక అన్నమయ్య, అయ్యలార్యుఁడు, నందిమల్లయ ఘంటసింగయలు మొదలగువారు తెలుఁగుఁ గవీశ్వరులును, మల్లినాథుఁడు, విశ్వేశ్వరకవిచంద్రుఁడు, బొమ్మకంటి అప్పయాచార్యుఁడు, వామనభట్టబాణుఁడు, కాటయవేముఁడు, డిండిములు మొదలగువారు సంస్కృత కవులును శ్రీనాథుని కాలమువారు. ఇందు మొదటి యయిదుగురు శ్రీనాథు-సమకాలమువారగుట యిదివఱకే నిరూపింపఁబడెను. గౌరన, హరిశ్చంద్రచరిత్ర [ద్విపద], నవనాథచరిత్ర [ద్విపద], లక్షణదీపిక [సంస్కృతము] యను గ్రంథములు రచించినాఁడు. నవనాథచరిత్రము శాంతభిక్షావృత్తిప్రేరణముచే నాతఁడు రచించెను. ఈశాంతభిక్షావృత్తి ప్రేరణముననే శ్రీనాథుఁడుగూడ నిమ్మడిశాంతయ కంకితముగా శివరాత్రిమాహాత్మ్యమును రచించినాఁడు. అనుబంధమున నవనాథచరిత్ర కృత్యవతరణికాభాగమును జూడఁదగును. పినవీరభద్రుఁడు శ్రీనాథుని శిష్యుఁడని ప్రతీతిగలదని యిదివఱకే వ్రాసితిని

చెన్నమరాజకవి :- ఈతఁడు శ్రీనాథుని శిష్యుఁడే. వేంకటపతిరాయల కాలమందున్న చెన్నమరాజకవి (చారుచంద్రోదయకారుని) కీతఁడు తాత. వీరేశలింగముపంతులుగారు ముత్తాతయని తప్పుగా వ్రాసిరి. దానినెల్ల నిక్కడ నిరూపింపనేల ? చారుచంద్రోదయముఁ

శృంగారశ్రీనాథము

జూచినఁ దెలియఁగలదు. అన్మల చింతల చెన్నమరాజునకు లక్ష్మీపతి, కొండయ, కృష్ణయ యని మూఁగురు కొడుకులు. లక్ష్మీపతికి వెంకట, చెన్నమరాజ, రామచంద్ర, తాయనాఖ్యులు నల్గురు కొడుకులు. ఇందు రెండవవాఁడగు చెన్నమరాజే శ్రీనాథుని శిష్యుఁడు. పద్యమిది చదువఁ దగును.

క. సన్నుత కవిత్వవిద్యా
భ్యున్నతి శ్రీనాథసుకవిపుంగవు కరుణన్
జెన్నమరుఁ డ లక్ష్మీపతి
చెన్నమరాజ ప్రధానశేఖరుఁ డెలమిన్.

—చారుచంద్రోదయము

ఈచెన్నమరాజునకు శేషాద్రికొడుకు. శేషాద్రికి తిమ్మన, లక్ష్మీపతి, చెన్నయ, తాయన యనువారు కొడుకులు. మూఁడవవాఁడగు చెన్నయయే చారుచంద్రోదయకారుఁడు.

భైరవుఁడు: — ఈతఁడు శ్రీరంగమాహాత్మ్యరత్నశాస్త్ర కవిగజాంకుశము లను గ్రంథముల రచించినవాఁడు. ద్విపదహరిశ్చంద్ర చరిత్రకర్తయగు గౌరనకుఁ గుమారుఁడే కావచ్చును.

జక్కన: — ఈతఁడు శ్రీనాథుని సమకాలమువాఁడో, లేక కొంచెము పూర్వకాలమువాఁడో యగును. జక్కనవిక్రమార్కచరిత్రలో శ్రీనాథుని రచనములఁబోలిన రచనము లున్నవి.

పడికి సింగన:— తఁడు సరిగా శ్రీనాథుని సమకాలము వాఁడే.

నవమ ప్రకరణము

**అనంతామాత్యుఁడు** :- ఈతఁడును సరిగా శ్రీనాథుని సమకాలమువాఁడే. అంతేకాక, శ్రీనాథుని జన్మదేశమునకు మిక్కిలి దగ్గరగానున్న పెరమకూరుపురము నందున్నవాఁడుకూడను.

**గోపరాజు**:- ఈతఁడు పినవీరన కించుక తర్వాతివాఁడు. ద్వాత్రింశత్సాలభంజికల కథల రచించినవాఁడు.

**తాళ్లపాక అన్నమయ్య**:- తిరుపతి తామ్రశాసనములచే నీతఁడు శ్రీనాథుని సమకాలమువాఁడుగాఁ దెలియఁబడుచున్నాఁడు.

**అయ్యలార్యుఁడు** - ఈతఁడు వేదగిరినాయనింగారి ప్రేరణమున రామాయణారణ్యకాండశేషమును బూరించినాఁడు. వేదగిరినాయనింగారు శ్రీనాథున కించుక పూర్వులు. నందిమల్లయ్య ఘంటసింగయలు శ్రీనాథున కించుక తర్వాతివారు. వీరుగాక బొప్పరాజు వేంకటనాథకవి, దూబగుంట నారాయణకవి, తాతంభట్టు, హరిభట్టు, మొదలగువారు [ఆంధ్రభాగవతమందలి లుప్తభాగములను బూరించినవారు] అయ్యంకి మాదయప్రభృతులుగూడ శ్రీనాథున కించుక తర్వాతి కాలమందున్నవారే యగుదురు. మల్లినాథాదులగు సంస్కృతకవులు శ్రీనాథుని సమకాలమువారగుట యిదివరకే నిరూపింపఁబడెను.

## పరిసమాప్తి.

శ్రీనాథకవిసార్వభౌముఁ డాంధ్రలోకమునఁ జిరప్రతిష్ఠ గడించినవాఁడు. శృంగారనైషధాది గ్రంథము లెందాఁక లోకమున వ్యాపించియుండునో యందాఁక నాకవీశ్వరుఁ డవినశ్వరమగు ప్రతిష్ఠ నందియే యుండును. ఆయన గ్రంథములే యాయన స్మారకచిహ్నములు. కాని చారిత్రకముగా నాకవీశ్వరుఁడు జన్మించినపట్టును,

గవితావైభవముఁ గన్పఱచిన పట్టును మనకిప్పుడు తెలియవచ్చినవి. కావున శాశ్వతనిర్మాణ మొకటి యాస్థలములం దెందేనొకచోట వెలయించి యప్పుడప్పు డాయనవాఙ్మయమూర్తి నారాధించుచుండుట మనకావశ్యకకార్యమని నేను దలంచుచున్నాఁడను. జన్మదేశము కృష్ణామండలమును, బ్రిధానముగా విద్యావిలాసములను వెలయించినదేశము గుంటూరుమండలమును నగుటచే మచిలీపట్టణమునఁగాని, గుంటూరను గాని యిట్టిప్రతిష్ఠాపనమును నెలకొల్పుట యుక్తముగానుండును. శ్రీనాథుని జన్మగ్రామము కాళీపట్టణమయినను గలపటమయినను మచిలీపట్టణమునకు మిక్కిలి చేరువనే యున్నవి. విద్యావిలాసములుచూపిన కొండవీడుగూడా గుంటూరికిఁ జేరువగలిగియున్నది. అచ్చటి యాంధ్రభాషాభిమానుల యాలోచనమున కిది వచ్చుఁగాకయని కోరుచున్నాఁడను.

ఇప్పటికి నా కుపలబ్ధములయిన చరిత్రసాధనములఁబట్టి శక్యమయినంతవఱకు శ్రీనాథకవిసార్వభౌముని జీవితవిషయమును విస్తరించి ప్రస్తుతింపఁగల్గితి ననుకొనుచున్నాఁడను. కాని యింకను నాకిప్పటికి గోచరింపని ప్రధానవిషయము లెన్నియున్నవో! ఉపలబ్ధవిషయములనుగూడ నపరిజ్ఞానముచే నెన్నింటి నన్యథాకరించితినో! కొంక నేల? కోవిదులున్నారుగదా సరిపఱుపఁగలరని సంతోషించుచున్నాఁడను.

సమాప్తము.

# శృంగారశ్రీనాథము

## అనుబంధము

### శ్రీరామాభిషేకపద్యములు

ఉ. ఆమునినాథువంశకలశాంబుధిపూర్ణసుధాకరుల్ గుణ
స్తోములు సత్యసంధు లతిశోభితచిత్తు లుదారులున్ మహో
ద్దాములు పుట్టి రందు నొకధన్యునివంశములోన నొక్కఁడున్
బ్రేమతొ కొండవీట నరభీషణుఁడై తనరారుచుండియున్.

శా. పాథోరాశిగభీరుఁ డుజ్జ్వలకళాపారీణుఁడై నట్టి శ్రీ
నాథుండన్న కవీశ్వరోత్తము సుతన్ నందంబుగాఁ బెండ్లియై
సాధుస్తోత్రగులైన సూనులను భాస్వత్తేజులం గాంచె భూ
న భుక్ మెచ్చఁ బ్రపంచశాలులకు సన్మార్గక్రియాలోలులన్

క. వారలమాతామహుఁ డతికూరిమితో సింటనుంచుకొని పెంచుటచే
నారూఢిగ శ్రీనాథునివారై వర్ధిల్లిరాగివి వసుధాస్థలిలోన్.

క. వారలవంశపరంపర లారూఢిగ విస్తరించె నతివైభవమునన్
వారిలో మాధవమంత్రియు ధారుణిలోఁ బొగడుగనియె ధన్యతమెలయన్
ఈ మాధవమంత్రి కైదవతరమువాఁడు శ్రీరామాభిషేకకర్త.

—

### వెలుగోటివారి వంశచరిత్ర.

ఉ. దన్నడకోటముందర నుదగ్రబలోన్నతి గంగదాఁటి సం
పన్నబలుండు సింగజనపాలునిమాదఁడు రెడ్డిపోతనిన్

బన్ని నసేనలం దునిమి పాఱఁగఁద్రోలె విరాటుపీట న
త్యున్నతవిక్రమంబున సుయోధనుఁద్రోలు కిరీటి కైవడిన్.

మ. ఘనశౌర్యుండగు మాధవాధిపునిధాకన్ క్షితిం బ్రభ్రష్టసా
ధనుఁడై దన్నడకోట వద్ద ననపోతారెడ్డి మానంబు సి
గ్గును బోనాడి రయంబునం బరవ నాక్షోణిస్థలిన్ జూడ నేఁ
డును నచ్చో నడియాలమై కసవుపాటున్ లేదు తో పౌటచే....

దన్నాల కోటకడ రెండుమార్లు రెడ్డివారిని గెలిచి జగనొబ్బగండ, సంగ్రామధనంజయ, రాజవేశ్యాభుజంగ బిరుదు చెప్పినవారు రావు అనపోతానేడున్ను మాదానేడున్ను రాజకొండ, దేవరకొండ రెండుపురంబులు పంచుకొని రాజకొండ అనపోతానేడు, దేవరకొండ మాదానేడు పంచుకొనిరి. అమాదానేని కొమారుడు పెద వేదగిరినేడే వేములకొండకడ సత్యగదేవుని చాళుక్యదేవుని కస్నదదేవుని ... దేవుని ఉపయునదేవులఁ గొట్టి వేములకొండ రణరంగస్థలమైరి రాజ జీమూతపవన ఏకశిలానగరసమీప ... త్రవరాజన్యదహనదావానల బెండపూడి ... ఖాని పుదువహించినవాడు రావుపెదవేదగిరినేడు. ఆపెదవేదగిరినేనికి రామచంద్రుడున్ను కుమార మాదానేడు పుట్టిరి.... ....అమాదానేనికి పినవేదగిరినేఁడు లింగమనేడు పుట్టి రండ్రగజుండు....

ఉ. వేమనతోడఁబుట్టువట వింతయనేఁ దదిగాకమానెఁబో
కోమటివానిబిడ్డఁడటగోనకుఁడె కృషిసేయువాఁడిఁకన్
స్వామిఁ గుమారవేదగిరిపుణ్యపరుండవు నీసమక్షమం
దేమని చెప్పవచ్చు గుణహీనునిఁ గోమటిరెడ్డిమాచనిన్—

ఆ కొమార వేదగిరినేనే అనపోతారెడ్డితమ్ముని మాచారెడ్డిని గొట్టి తమ్మపడిగానం బొదిగించిన యా అనవేమారెడ్డి పినవేదగిరినేనిని జంపి తమ్మపడిగాన పొదిగించి సింహతలాటబిరుదున్ను

బుచ్చుకొని యుండిన వేదగిరినేనితమ్ముఁడు లింగమనేఁడే ద్వాదశ వర్షంబులవాఁడై యుండితనబంధువర్గంబుల హితపరిజనంబులఁగూర్చుక అమరులకు వెక్కసంబగు యుద్ధంబుచేసి అనవేమారెడ్డిని గొట్టి తమ్మ పడిగానబొదిగించి సింహతలాటబిరుదును తనచేత శ్రీనాథుండడిగి కొంచుబోయిన నందికంతపోతరాజనే కఠారిని బుచ్చుకొనెను. అంతకు ముందే అనవేమారెడ్డికి పెద్దలు పెదవేదగిరినేన్నితమ్మపడిగాన బెట్ట వద్దని బుద్ధిక్రమంబుగా జెప్పిన విధంబెట్టవిన - (పెదకోమటివేమా రెడ్డియని యుండవలసియుండగా నిందుఁ దప్పుగా ననవేమారెడ్డియని కలదు.)

సీ దర్పాలకోటోద్ధ నన్నపోతారెడ్డి తా విరుగుతలంపు తలఁపవైతి
సింగయమాధవుఁజీరిన యనవేముఁ డోడి పాటుకొలంత చూడవైతి
కొమరగిరెడ్డికి కోరిసింగయమాదు తవరబెట్టినచొమ్మ తలఁపవైతి
సురధాను మన్నన చూచుకొండివిగాని వారితో దొరయుట వలవదనవు

గీ. అనుపమంబుగఁ గొమరవేదాద్రి సిట్లు। ఘనతరంబుగఁదమ్మపద్గమునఁబెట్టి
యొరుల ఒద్దులవిని యిటు దొరలఁబడియు।విన్నబుద్ధిని పెదకోమటన్న
వేమ.

ఈలింగమనేనిచేత శ్రీనాథుఁడు నందికంతపోతరాజనేకఠారిని కొంచుపోయినపద్యము:- జగనొబ్బగండాంక - ఇదియుదాహృతమే. ఆలింగమనేదే సోమకులము రాజులు మొదలయిన రాచవారినెల్లఁగొట్టి కాలిపెండెము పొందిగించెను. అనవేమారెడ్డి మొదలయినవారినెల్లఁ గొట్టి తమ్మపడిగాన బొదిగిన పంటరెడ్లున్ను తమలోతమరు భాషింపుచున్న విధంబెట్టిదనిన:-

శృంగారశ్రీనాథము

శా. శ్రీలాలిత్యుఁడు రావులింగనృపతి శ్రీపాదపద్మంబువన్
వ్రేలేరాజులు కొందరశ్వయసుతున్ వీరాంకుఁజూపింత్రు వీ
దేలాకంపమునొందె భీతి, నదిగా దీకాపుజాణండు దాఁ
గాలాంజందుల తమ్మ మెక్కవణకున్ గర్వారవన్నెక్కనన్.

ఉ. అంకితరాయరావు బిరుదాంకము రాజుల గొట్టి యందె గీ
లించిన మాదభూవిభుని లింగనృపాలున కొప్పుగాక గ
ర్వించిన నీకుఁజొప్పడునె వేమరు నల్లయవేమరెడ్డి పో
కొంచెపు దమ్మదిండితను గూళకు సింహతలాటమేటికిన్?

ఉ. ఆజిముఖాతిభీతులగు నల్లయవేమనవీరభద్రుఁడున్
రాజకులాభిరామ రణరాఘవలింగనృపాల నీమహా
రాజితపాత్రతమ్మదిని రాజ్యమునిల్పిరి యింకయేమనన్
రాజమహేంద్రదుర్గములు రాజులు గైకొనకుంద జూతురే?

ఉ. వాదులు వాదవిద్యల సువర్ణము గాంచుట యద్భుతంబె యీ
మాదయలింగశౌరి గరిమంబుగ నల్లయ వీరభద్రుడున్
వాదముచేసి దేహము సువర్ణమయంబుగ వానియందియ
ఖేదముదక్కియుండ్రు దలక్రిందయి వ్రేలుచు విఱ్ఱవీగుచున్.

అపినసింగమనేని వంశావతారం బెట్టిదనిన : సీ. వీరాగ్ర గణ్యుండు వెన్నమాపాలుఁడు ఖ్యాతి నేరాజుము త్తాత - ఈ పద్యమిదివఱ కుదాహృతమే—

ఉ. మేదిని రాయరావనెడు మేటిమహాబిరుదప్రతాప సం
పాదవ మన్నవోతనృపాలుఁడు జేసినఁజెల్లుగాక యీ
పాదతిమన్నెబందలక పాతపురాజుల కేలగల్గనే
అదటఁదాండవంబు శివుఁడాడిన జోగులకాడఁ జెల్లనే!

అనుబంధము

సీ. ఛప్పన్న రాజన్య సంగరస్థలిలోన వాఁడెరాజని కానవచ్చు నిన్ను
బిరుదునూపురరాజ భీకరస్థలిలోన వాఁడెరాజని కానవచ్చు నిన్ను
పరభేదనాటోపపట్టభద్రులలోన వాఁడెరాజని కానవచ్చు నిన్ను
సర్వ పర్వంసహాచక్రవర్తులలోనె వాఁడెరాజని కానవచ్చు నిన్ను

గీ. చండభుజదండఖండితసకలవైరి । మండలేశ్వరనుతకీర్తిపుండరీక
పరిమళాపూర్ణదిగ్దంతిబలవిహార । అహితనిర్ఘాత రాయరావన్నపోత!

క. ఒక మెతుకున నొకనాఁకలి । ప్రకటితముగి దీర్చరాదు పదివేపుర నీ
వొకమెతుకున రక్షింతువు । అకలంకా రాయరావు అనపోతాంకా ।

క. సమ్మెటసోముని రేపలి । తిమ్మని నం కొండవీటి డెక్కున మెరయం
దమ్మటమువేసిగెలిచితి । నమ్మకా రాయరావు అనపోతాంకా!

ఆయనపోతమనేనికి సర్వజ్ఞసింగమనేడున్నూ వసంతరాయడు పుట్టిరం దగ్గిజుండు:

సీ. సకలవిద్యాభ్యాస సాహసగరిమంబు సూటిమీఱగ దోడు చూపినాఁడు.... ఇత్యాదిపద్య ముదాహృతమే. సీ. రాధేయుదానంబు ప్రాభవం బంటిమా (పూటలో వాటలోపు?) రాదు । సురభూజముల వార్త సొబగుపొమ్మంటిమా యెందునో పందునో యెఱుఁగరాదు । జలజంబు చాగంబు చర్చింతమంటిమా మెఱచునో వఱచునో మెచ్చరాదు । కామధేనువు సివి గణుతింతమంటిమా కట్టునో పట్టునో కానరాదు । తోలుచూపక యుడిపోక తూలిపోక । కొమ్ము గ్రువ్వక కయికొందు కోర్కులనుచు । ప్రదనవిజయుండు ఖడ్గ నారాయణుండు । ఇచ్చుకవులకు శింగభూమీశ్వరుండు. శ్రీనాథుఁడు సర్వజ్ఞని సముఖానకుపోతూ శారదాంబను ప్రార్థనచేసిన పద్యం : సీ. దీనారటంకాల–

ఇత్యాదిపద్య ముదాహృతమే. సీ. ఏమిచ్చె రావోరి యెమ్ములిచ్చె దధీచి యెమ్మ లర్థులకు దా సొమ్ములగునె। మహిమచే నెదవోరి మాంస మిచ్చెను శిబి కండలర్థులకు బంగారమగునె జీమూతవాహనుం డేమిచ్చెరా వోరి యడిగిన ప్రాణముల్ విడిచెనపుడు। కర్ణునితేగంబు వర్ణించెదవు భట్ట చర్మమర్థికి పట్టుసాలువ గునె। గీ. పూని కలిఁజెప్పఁ జూపఁగా రాని యీవు। లెన్నఁడో నాఁటి వార్త లిఁకేమిచెప్ప। ప్రధనవిజ యుండు ఖడ్గనారాయణుండు। ఇచ్చుకవులకు సింగభూమీశ్వరుండు. సర్వజ్ఞసింగమనేడు శ్రీనాథునకు సమస్యయిచ్చిన పద్యము:– 'తక్కక రావుసింగ' ఇత్యాదిపద్య ముదాహృతమే. ఉ. ఇమ్మహి రావుసింగ మనుజేంద్రుడు వసంతురి యీవులెన్నుచో। గమ్మి దధీచిభానుసుత కల్పకమేఘులఁ జెప్పనేలయా। బొమ్మిక వెట్టులాటయును బూని కలా సపు మొత్తలాటయున్। దుమ్ముల చల్లులాటయును తూకొని నీళ్ల చల్లులాటయున్. అతని యనుజుండు: క. భట్టొగ రుద్రరూపము। భట్ట నగా రాచవేల్పు పాటించని యా,తొట్టికిరాజులకబ్బునె। రట్టడిసత్కీర్తి కాంతరావువసంతా। చ. పదవదిచక్కగాద యొకనాడును పుక్కటిచేడు మానదే। వ్రద విసఁ జెప్పలేదు, పెనుబందువునందును గాలిద్రావునీ। బడుగొనేలపొంద నని పాసిపెనన్ జనుదెంచికాదె యా। పుదమి వరించె వేద్కనృపపుంగవు రావువసంతరాయనిన్.

శ్రీనాథునిగ్రంథముల కాలనిర్ణయము

అను వ్యాసమునుండి —(ఇది గ్రంథాలయసర్వస్వమున గలదు. శ్రీ కొ. వెం. లక్ష్మణరావుగారిచే రచింపబడినది.)

"పైని చెప్పినదంతయు హరవిలాసముయొక్క నిర్మాణకాల మునుబట్టి చేయఁబడిన యూహ. కాని హరవిలాసము కుమారగిరిరెడ్డి కాలమునందు రచింపఁబడలేదనియు, శ్రీనాథుని చరమదశయందు వ్రాయఁబడియెననియుఁ జెప్పు పూర్వపక్ష మొకటికలదు. ఇదివఱకు

శ్రీనాథుని గుఱించి వ్రాసిన వారందరును ఇట్లే వ్రాసినారు. కాని ఇందుకు వారు కారణములను ఇచ్చియుండలేదు. మన మాకారణము లను ఊహించి నివారింపవచ్చును. హరవిలాసము చివరగ్రంథముగ నెంచుటకును 1400 లో రచింపఁబడినది కాదనుటకును హరవిలాస గ్రంథమునందు నేవిధమైన యాధారమును కానఁబడదు. అది కుమార గిరియొక్క పెద్దసెట్టికి నంకితము చేయఁబడినది. కావున నది కుమార గిరికాలమునందే రచింపఁబడె ననుకొనుట స్వాభావికము. కుమారగిరి చనిపోయినతరువాత 30 సం॥లకో 40 సం॥లకో వ్రాయఁబడిన దనుకొ నుట యస్వాభావికము. ఇదియుఁగాక యీగ్రంథమునందు, కృతిపతిని అతని బంధువులను గుఱించి వ్రాసిన యీ క్రింది గద్యపద్యముల వలన కుమారగిరిసేవలో వీరుండగ నీగ్రంథమును వ్రాసినట్లు మన మూహింపవలయును. కాని, కుమారగిరి చచ్చిపోయినతరువాత సుమారు బదియేండ్లకు వెనుకటి సంగతులు జ్ఞాపకము తెచ్చుకొని వ్రాసెననుట పొసఁగ నేరదు .... ....'కొమరగిరి నృపాలువలన నాందోళికాచ్ఛత్ర చామరతురంగాది రాజ్యచిహ్నములు వడసి యమ్మహారాజునకుఁ బ్రతి సంవత్సరోత్సవంబునకుఁదగిన ........ సుగంధద్రవ్యంబు లొదఁ గూర్చియుఁ జీనిసింహళతవాయిహురుమంజిజలనోగి ప్రభృతి నానాద్వీపనగరాకరంబులకు ధన....గాణిక్యంబులు తెప్పించియు.... సమాచారుండును సమ ప్రఖ్యాతిగాంచిన యవచిదేవయ తిప్పప్రభుం డొక్కనాఁడాస్థానమండపమున సుఖోపవిష్టుండై :'

మ. ఘనిమారన్ సురధాణి నిందు కొలువై గర్పూరనానాచో నీకరా। వ్యసనంబు న్నుడియించురా యవచితిప్పా.... చ. కుమార గిర్యధీశ్వరుని వసంత వైభవముసర్వము నొక్కడ నిర్వహించు చున్. క.కొమరగిరిరాజ దేవేంద్రకార్మహితుడు. కొమరగిరి వసంత

నృపా। గమకవివరగంధసార కస్తూరీ కుం। కుమకర్పూరహిమాంథ। స్సముదంచిత బహుసుగంధి శాలాధ్యక్ష! ఇట్లుహరవిలాసము వ్రాయునప్పుడు. కుమారగిరి బ్రతికియుండెననియు, కొండవీటిలో రాజ్యము చేయుచుండెననియు ఆతని యొద్ద పెద్దసెట్టిగా అవచితిప్పయ యుండెననియు జూపువాక్యము లీగ్రంథమునందు బెక్కులుగలవు. ఇట్టి వాక్యములున్నను, కుమారగిరి చనిపోయినతరువాత తిప్పయఅధికారమూడిపోయినపిదప, హరిహరపేరోజాషాల కీర్తిశేషులైన యెన్నియో వత్సరములకుదరువాత నీకావ్యము రచింపబడియెనని చెప్పుటకంటె విపరీతమైన సిద్ధాంతము మఱియొకటి యుండదు. ఇది కుమారగిరిరెడ్డికాలమున రచింపబడలేదని చెప్పునెడల నైషధము పెదకోమటి వేమారెడ్డి కాలమున వ్రాయలేదనియు, భీమఖండము అల్లాడవేమవీరభద్రులు బ్రతికియుండగ చెప్పబడలేదనియు. నొప్పుకొన వలసివచ్చి విపరీతసిద్ధాంతపరిసంగము ప్రాప్తించును....''

శాసనము.

లోకల్ ॥ వాల్యూం.... పెద్దాపురంతాలూకా .. కిమ్మూరులో తిరుపతి అనే గ్రామములోనున్న శృంగారవల్లభరాయని ఆలయములో ...8 నెం. దీనికి ఉత్తరంపువైపునున్న స్తంభముమీది శాసనము.

శ్రీశకవరుషంబులు ౧౩౩౦ అగు నేటి సర్వధారి సంవత్సర మార్గశిర శు ౧ సోమవారము కొమరగిరిపురం శృంగారరాయనికి మున్నంటి రాజుగారు కాటమరెడ్డి వేమారెడ్డింగారిదేవులు అయి తమతోబుట్టువులయిన మల్లసానమ్మ గారికిన్ని తమతండ్రి ...ధరాజుగారికిన్ని సుకృతముగాను నగరికి కాలోచిత మూల్యము సమర్పించి పెట్టించిన బృందావనము నేసినవారికి క్షేత్రము ... ఈ క్షైంకర్యము శృంగారరాయడు ఆ చంద్రార్కముగాను అవధరించువారు.

లోకల్ 11 వాల్యూం 217 పేజి (చాళుక్యభీమవరంలో) దీనికి ఉత్తరంవైపున రెండోస్తంభంమీఁదవున్న శాసనం:

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౫౬ అగునేటి ఆనంద సం॥ పుష్య బ ౧౩ బుధవారము ఉత్తరాయణ మకరసంక్రాంతి పుణ్యకాలమందు శ్రీమత్కుమారారామచాళుక్యభీమేశ్వర శ్రీమన్మహాదేవరలకు అల్లాడ భూపాలుని కుమారుడు వేమారెడ్డిగారిదేవులు జయమ్మలసానమ్మ తమకు నక్షయమౌనట్టుగాను వీరారెడ్డింగారిఅనతిక్రమానను కుమారారామచాళుక్య భీమేశ్వర స్థానసమ్మతిని భీమవరము ఉత్తర సమీపాననుకుమారీనది పశ్చిమదరిని నానాతోయాలపుష్పాల ఫలవృక్షాలతోటపట్టు... సర్వ కరపరిహారముగాను ఆచంద్రార్కస్థాయిగాను భీమేశ్వరదేవరకు జయమల్లసానమ్మ సమర్పించెను.

లోకల్ 11 వాల్యూం (155 పేజి) దాక్షారామంలో తూర్పు స్తంభంపైనున్న శాసనం:

సహాకాటయరేః – ఇటువంటి కాటమరెడ్డి వేమారెడ్డింగారికి నిజభృత్యుండైన ఒడియంమాచినేనింగారు వారకు స్వామియయిన కాటమరెడ్డి వేమారెడ్డిగారికొమారుడు కొమరగిరిరెడ్డిగారికిన్ని వారి దేవులకున్ను అక్షయసుకృతమౌనట్టుగాను దాక్షారామ శ్రీభీమేశ్వర మహాదేవరకు అస్థానశిలామండపము కట్టించి సమర్పణచేసెను. స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౩౬ అగు నేటి జయసంవత్సరకార్తిక శు ౧౫ భానువారం.

లోకల్ 11 వాల్యూం 161 పేజి.

అనపోతప్రభోః పత్నీ సపత్నీధరణీశ్రియోః। అనేకసుగుణశ్లాఘ్యైర-బికా మనుమాంబికా – కుమారగిరిభూపాలరత్నాకరసుధాకరః।

అనపోత కుమారేంద్రో లోకానందాయ వర్ధతే। శ్రీమత్కుమారగిరి భూమిపతేః కుమారోపిరాన్నపోతనృపతిః-ఈమీదరాయి పగిలిపోయినది.

II [స్వస్తిశ్రీజ]యాభ్యుదయశాలి [వా][2][హన] శకవరుషంబులు ౧ (4652) అగు నేంటి శోభకృత్సంవత్సర ఆ[శ్వ]జ బ ౧౧ బు నూంతు[5]ల[పాటి] కేశవనాథునికిన్ని రఘు[6]నాథునికిన్ని శ్రీమన్మహామండ[7][లేశ్వ]ర ధరణీవరాహ మేది[8]నీ మీసరగండ కటారి సాళ్వన [ర]ంబురాయని తెలుంగురాయని తిరుమలయ్యదేవ [11][మహా]రాజులంగారు దండం[12] సమర్పించియిచ్చిన భూదాన ధర్మశాసనము. తిమ్మరుసయ్యవారు మానాయంకరానకు పాలించి యీ పవధరించిన వినికొండసీమలోని నూంతులపాడు అనే గ్రామానను. ఈ రెండు దేవళ్ళ అమృతపళ్ళకున్ను అంగరంగ వైభవాలకును సమర్పించి ....ఇత్యాది - ఈపుణ్యము రాజులుగారికి విన్నపముచేసి యీ చేర్చినవాండు పొన్నమరాజులుగారు.

III స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౭౫ అగునేంటి శోభకృత్ సంవత్సర ఆశ్వీజ బ ౧౦ లు నూంతులపాటి భాయామల్లిఖార్జునికిన్ని, వీరేశ్వరునికిన్ని శ్రీమహామండలేశ్వర ధరణీవరాహ మేదినీ మీసరగండకటారి సాళువసంబురాయని తెలుంగురాయని తిరుమలయదేవ మహారాజులుంగారు దండం సమర్పించి యిచ్చిన భూదానధర్మశాసనము. తిమ్మరుసయ్యవారు మానాయంకరానకు పాలించ యీపవధరించిన వినికొండసీమలోని నూంతులపాడు అని గ్రామానను యీరెండుదేవళ్ల అమృతపళ్లకున్ను అంగరంగ వైభవాలకున్ను సమర్పించి యిచ్చినారము....ఈపుణ్యము రాజులుంగారికి విన్నపముచేసి యీచేర్చినవాండు పొన్నమరాజులుంగారు.

IV స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౩౬౪ అగునేంటి దుందుభి సంవత్సర వైశాఖ శు ౧౫ గు శ్రీమన్మహామండలేశ్వర మీసరగండ కఠారు సాళువ తెలుంగురాయ దేవరాయనింగారి నూఁతులపాటి అధికారి పోలమరాజు తిరుపరాజుంగారు నూఁతులపాటను పూనూరిసందుకట్టునను రాజుంగారి ధర్మంగా ప్రజలధర్మంగా ఆచంద్రార్కస్థాయిగాను చెఱువుకట్టించి ప్రతిష్ఠచేసిరి. మంగళమహాశ్రీంజేయు.

సింహాచలంమీద దేవాలయందగ్గఱ హంసమూల పెద్దరాసనం దిగువది:

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౫౦ అగు నేంటి ప్లవ సం॥ రఫాల్గున కృష్ణ ౩ గురువారాసను కనడదేశమండల సంబురాయనికొడుకు తెలుంగు రాయందు తనకు అభీష్టార్థసిద్ధిగాను శ్రీ నరసింగనాథునికి నిత్యమును సన్నిధిని వెలుంగను అఖండదీపాలు రెండుసమర్పించెను. ఇందుకై వడ్డాదివేసమంపు ప్రాంత విటు గొల్లగార నరసబోయండు పల్లయజ్జబోయండును ఈ ౨ రు వసారపు మోదాలు ౧౦౦ పెట్టిరి- ఇత్యాది.

బల్జేపల్లిలో చావలి వెంకటేశ్వర్లుగారియొద్దనున్న తామ్రశాసనము నకలు (వారిదగ్గర దీని మూలము చూచి నేను వ్రాసికొన్నాను.):

1. రక్షాంతణం జగతాం, 2. లీలాద్యూతజితాం, 3. తమోహరేతాం, 4. భవతు భవతాం ఫలాప్త్యై. 5. యస్మాశా, 6. విష్ణోః పాదాదుదీర్ణే సురసరిత ఇవ స్రోతసి స్వచ్ఛవృత్తౌ వర్ణే జాతస్సుజన్మా శరణభవవచ్ఛక్తిమాన్ ప్రోలభూపః । తస్మాన్మాచక్షితీంద్రో జనివహ

త్రిభువనం యద్భుజేయచ్చరిత్ర శ్లాఘామాత్రే ముఖానాం వహతి దళ
శతీం వ్యాపృతాం భోగిరాజః॥ 7 తస్యాసీ దనుజో హరేరివ హరి
ర్నిస్సీమవిశ్వంభరా। దానాధఃకృతభర్గ (సూను) విజయీ వేమక్షమా
వల్లభః। యేన శ్రీగిరిసానుసీమ్ని విహితా పాతాళగంగాజుషాం సోపా
నావళీ రూర్జితా తనుభృతాం స్వర్గాప్తి నిశ్రేణికా॥ 8 మాచక్షోణిపతి,
9. వేమాధిపో 10. తస్యానుజో వేమనృపస్య మాచక్షితీశ్వరో లబ్ధమహీ
విభాగః। శ్రీకొండపల్లీం నిజరాజధానీం కృత్వా సుఖీ దీవ్యతి ధర్మ
ధుర్యః, 11 కులమివ విపులం యశో యదీయం త్రిజగతి వేష ఇవో
జ్జ్వలః ప్రతాపః। వితరణమివచ శ్రీతం విశాలం భవతిచ వాక్య
మివోర్జితం చరిత్రం 12 జ్ఞాతాయది నహిదాతా దాతాచేత్కోపి భువి నచ
జ్ఞాతా, జ్ఞాతా దాతాచభవన్ పెదకోమటి మాచభూపతిర్జయతి. 13 సస
ప్తాం పాలయ న్నుర్వీ ముర్వీశకులశేఖరః యం దత్త్వా న్యగహారం
తద్దానప్రక్రియోచ్యతే। శాకాబ్దే రసరామరామవసుధా సంఖ్యే జయే
వత్సరే। మార్గే కృష్ణ బుధాన్విత ప్రతిపది ప్రాప్తే రవౌ కార్ముకం।
స్వర్గాప్త్యై పెదకోమటి క్షితిపతేః శ్రీబల్ల్యపల్లీపురం। ప్రాదాత్త్రాకృయ
పోతనాఖ్యవిదుషే మల్లేశ్వరస్యాంతికే। అకలంకసకలభాషా కవితా
మూర్ధాభిషిక్తాయ, విద్వన్నిరూఢరాజాస్థానసుధాంభోధి పూర్ణచంద్ర
మసే. గద్యశ్రీబాణకవేః పద్యేపి తథైవ కాళిదాసకవేః, తూర్కృయ
బన్నయ సుధియః పౌత్త్రాయ యజుర్వేదిజ్ఞాయ। ఉజ్జ్వలతరాష్టభాషా
కవితాసామ్రాజ్యపట్టబంధస్య, పుత్త్రాయాన్నయ సుకవేః శ్రీభారద్వాజ
గోత్రాయ, అనుజేన పాణిబదరీకృత పాణివిఫణిత ఫణితిమార్గేణ,
త్రిపురారిసుకవిమణినా సంస్మరయిత్రే సలక్ష్మణం రామం పాల్గుమి
శ్రీకంఠగురోః పంచాక్షరమంత్ర పౌనరుక్త్యస్య, శిష్యాయ శిష్యపరిష
ద్రక్షా దాక్షిణ్యసత్కటాక్షస్య, దత్వాగ్రహారం వెల్లాందౌ సాష్టైశ్వర్యం

నృపాలకః తస్య శ్రీపెదకోమటి పురసంజ్ఞామకల్పయత్, లబ్ధ్వానపోత నార్యోపి గ్రామం శ్రీమాచభూవరాత్ । శ్రీకృష్ణాప్పృష దున్మేష ముషితాశేషకల్మషం।పంచాశీత్యంశరూపేణ విభజ్యాస్మి న్నదాత్కృతీ। తృతీయాంశం పితృప్రీత్యై విద్వద్బాంధవరాజయే। సీమాచిహ్నాని దేశభాషయా లిఖ్యంతే.............. స్వదత్తా మిత్యాది ॥ విద్వాన్నాన్వయ నారణ్ణనామా శ్రీమాచ భూపతేః॥ అకరోద్వచసాం భూమిః విర్మలం ధర్మశాసనం। శ్రీజగ నొబ్బగండస్య.

లోకల్ 48 వాల్యూం చెఱుకుమిల్లిలో దొంకిన

తామ్రశాసనము:

ఈ శాసనము మీఁదిశాసనమందు దాతయయిన పెదకోమటి మాచారెడ్డి కుమారుఁడగు తిప్పయరెడ్డిది. ఇది పెద్దశాసనము. దీని నుండి యించు కంత యుదాహరించుచున్నాను:

శాకాబ్దే గిరిరామవిశ్వగణితే భాద్రే గురౌ మాన్మధే, కృష్ణాయాం పులినే గణాధిపచతుర్ధ్యా మేకమూరుం పురం।మాచాఖ్యం విదితాష్టభోగమతులం శ్రీతిప్పభూపాలకః। ప్రాదాదెట్టియ బిక్క (బంక?) మల్లపమహామాత్యాయ సిత్యాదరాత్........ మలాపహారిణీ భీమరథ్యంతర్వేది సంస్థితమ్। భోగై శ్వర్యాష్ట సంయుక్త మేకమూరుం పురోత్తమమ్। ప్రతాపరుద్ర దేవస్య భాండాగారాధిపస్యచ । యట్టమహా మల్లనార్యస్య పౌత్రాయ గుణశాలినే। యఱ్ఱయామాత్యచంద్రస్య మానవేసయశాలినే। శ్రీపరాశరగోత్రాయ యజుశ్శాఖాయధీమతే। బంక మల్లాఖ్య విప్రాయ దేవార్చన పరాయచ। అచంద్రతారకం ప్రాదాత్ శ్రీమాచ తిప్పమహేశ్వరః ........ పెదకోమటి మాచేంద్ర సూనోస్తి

ప్రమహీపతేః । విద్వాన్నరహరిస్స్వస్తు (?) మకరో ద్ధర్మశాసనం । శారీమాత్రక్షేత్రం శాసనం భావనార్ధమేకాంశం। భావయ నరహరి విదుషే ప్రాదా చ్ఛ్రీబంకమల్లయామాత్యః

## కల్వపాముల శాసనము.

1. శ్రీనాథస్య వరాహదివ్యవపుషో వః పాతు దంష్ట్రా చిరం
న్యూతోన్నతమహీతలోపరితటీ నిర్యాత శృంగాంకురా
యామాత్మీయ జలోదితాం శశికలా మాశంక్య జాతః క్షణం
సౌహార్దేన విజృంభమాణసలిలారంభో మహాంభోనిధిః.

2. లీలాద్యూతజితాం 3. భవతుభవతాం 4. తమోహరేతాం 5. యస్మాత్ 6. తస్మాదభూత్ ప్రోలయవేమనామా 7. వేమక్షితీశో వృషమేకపాదం 8. మాచక్షోణిపతిః 9. వేమాధిపో మాచవిభుశ్చ 10. చూడామణిర్నృపాణాం 11. అభిమన్యుకరగ్రాహ్యాం 12. సోయం వేమమహీపాలో 13. శాకాబ్దే రసనేత్రాగ్ని చంద్రసంఖ్యాముపేయుషి। తారణేవత్సరే పాషే రాహుగ్రస్తే దివాకరే। పితుః పితామహోయస్య బ్రహ్మవిద్యా పితామః । ఆసీ ద్భీమేశ్వరోవిద్వానగ్రణీస్సోమపాయినామ్। వషట్కృత పురోడాశే శ్రీభీమేశ్వరయజ్వని। కృష్ణవేణ్ణా తటాన్యాసన్నావాసాస్త్రిదివౌకసామ్।షట్కర్కశ కర్కశ గాలాపప్రక్రియా పరమేశ్వరః।పోతయాఖ్యో మహావిద్వా నాసీదస్యపితామహః।పుండరీకదృశో విద్యాఖండచంద్రభృతోభిధా । గుండయార్యఃపితా యస్య మండనం బ్రహ్మసంతతేః। బ్రహ్మ సూర్యాదిసిద్ధాంత సింధుమంథాన కాద్రిణా। జ్యోతిషజ్యోతిషా యేన త్రైకాల్య మపరోక్షితం। తారకబ్రహ్మ తత్త్వార్థస్థాపించదశమేచకం। లక్ష్మణానుచరంధామ రామాఖ్యం యస్య

దైవతం ఆహర్త్రాసప్తతంతూనాం యేన గోదావరీతటే। శూలాని పాప చోరాణాం యూపస్తంభాః ప్రతిష్ఠితాః। తస్మైహరితగోత్రయ యజురామ్నాయవేదినే, నిత్యాన్నదాన వ్రతినే శ్రీమతే పెద్దియజ్వనే ప్రాదాత్త్రిలింగవిషయే ఖండవాటాహ్వయేస్థలే । కల్వముటునామానాం గ్రామమాచంద్రతారకం। శ్రీరాఘవేశ్వర ప్రీత్యై ధారా పూర్వం ధరాధిపః॥ అస్యగ్రామస్య సీమాచిహ్నాని దేశభాషయా లిఖ్యంతే—కలువపాములు వేమవరానకుం దూర్పునకు వంట్రిపెగ్గడ పొలిమేరదగ్గటిన కుంట తూర్పుగట్టుమీందిరావి. అందుండి దక్షిణమై పోంగ జమ్మిచెట్టున్న పుట్టను, ఆపుట్టకు దక్షిణముఖమైన కునినుండి తీగకోడు దాంటి ఆగ్నేయముఖమై పోంగాను నల్లఋట్టమీందంగాను. ఆగ్నేయాన వన్నెఋమోటె. ఆవన్నెటిదరే పడుమఋముఖమై రాంగా నంత నుండి కునిగా నుత్తరపుముఖమై రాంగా నంతనుండి కునిగా నప్పదిన్ని పడుమటిముఖమైవచ్చి బెల్లంకుల పుట్టమోచెను, ఆ పుట్టమోచేకునిగా నుత్తరముఖమైవచ్చి పంటకోసు మోచెను దక్షిణానకు కాటూరిపొలము సందునకు ఆపంట కోట అవలిదరి నైఋతికి కాటూరికిపోయా బండి దెరువుదాంటి ఆకోటి అద్దరే పడుమటికి వన్నేటి మూలను కోడు ఉత్తరముఖమై దాంటి నందమూరి పొలిమేర శిలా స్తంభము - వాయవ్యానకు నాగులచింత ఉత్తరానకు కుంటాను ఇట్టిక నూయిన్ని ఈశాన్యానకు మట్టికోటి అద్దరిని ఒఱలనూయి. సీమలు, స్వదత్తాత్ - విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః - శ్రీవీరనారాయణస్య -

కసుకుఱ్ఱు తామ్రశాసనము.

1. కళ్యాణం జగతాం, 2. లీలాద్యూతజితాం, 3. భవతు భవతాం, 4. తమోహరేతాం 5. యన్మోహానిహితం 6. తస్మాదభూత్

7. వేమక్షితీశో, 8. మాచక్షోణిపతిః 9. వేమాధిపో మాచవిభుశ్చ. 10. చూడామణి ర్నృపాణాం. 11 యత్కీర్తిగాన 12 సోయంవేమ మహీపాలః (ఇటుతర్వాత కొంత చాళుక్యశాసనము చేరియున్నది.) శాకాబ్దే శర నేత్రాగ్ని చంద్ర సంఖ్యాముపేయుషి, తారణే వత్సరే పౌషే రాహుగ్రస్తే దివాకరే, ప్రాదాత్త్రిలింగ విషయే వెల్నాండౌ పుణ్యసీమని। తుంగభద్రా తరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితం। గ్రామం కసువుకుట్టాఖ్యం సాష్టభోగాష్టభూతికం........అస్యగ్రామస్య అష్టదిక్సీమా చిహ్నాని శిలాస్తంభాః। పూర్వతః తుంగభద్రా, దక్షిణతః పొటికవాగు, పశ్చిమతః తుంగభద్రా, ఉత్తరతః తుంగభద్రా - స్వదత్తా ద్విగుణం - పుణ్యాది - పుణ్యాధికారీ శ్రీనాథో వీరశ్రీ వేమభూపతేః, అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనమ్.

## పొన్నుపల్లి తామ్రశాసనము.

1. కళ్యాణం జగతాం, 2. లీలామూర్త. 3. భవతుభవతాం, 4. తమోహరేతాం, 5. యన్మౌక్తా, 6. తస్మాదభూత్ 7. వేమక్షితీశో 8. మాచక్షోణిపతిః, 9. వేమాధిపో, 10. చూడామణిర్నృపాణాం 11. అభిమన్యుపరగ్రాహ్యం 12. యత్కీర్తిగాన సమయే - సోయం వేమమహీపాలో భూపాల పరమేశ్వరః, భూదానవీరమూర్ధన్యో ధీరోదాత్త గుణోత్తరః। శాకాబ్దేరసనేత్రాగ్ని చంద్రసంఖ్యా ముపేయుషి, తారణే వత్సరే పౌషే రాహుగ్రస్తే దివాకరే। పుణ్యాయాం కృష్ణవేణ్యాయాం శ్రీసోమేశ్వరసన్నిధౌ సమస్తగ్రహారేభ్యస్సమాయాత ద్విజన్మనామ్। మండూక శల్యవ్యధిత సర్వప్రాణాభిరక్షణాత్। అనేదుషాం పండితానాం కులేపరహితాభిధామ్ జాతాయాపస్తంభసూత్రే సూత్రమార్గానుసారిణీ, కాశ్యపాయ యజుశ్శాఖాధ్యాయినేసుకృతాత్మనే, భూలోక

ధన్వంతరయే సతః పరహితస్య చ। పుత్త్రియ భాస్కరార్యాయ పండితేంద్రాయ ధీమతే। శ్రీకొండవీటి సీమాయాం వెలనాటిస్థలే శుభే। కృష్ణవేణ్ణా మహానద్యా దక్షిణే రోధసి స్థితమ్। పొన్నుపల్ల్యాహ్వయం గ్రామం సర్వసస్యసమన్వితమ్। వాపికూపాది సహితం సాక్షితోదక పూర్వకమ్। భుజ్యతాం త్వత్పుత్త్రపౌత్రపారంపర్యా దితి బ్రువన్। కర్మణా మనసా వాచా ప్రాదా దాచంద్రతారకమ్. అస్య గ్రామస్య చిహ్నాని దేశభాషయా లిఖ్యన్తే: పొన్నుపల్లివేమవరానకు తూర్పునను మూలనూతులకుంట, గంగులవానికుంట వాగునడిమి కలువలవానికుంటను, గరుడని జువ్విన్ని, ఆగ్నేయానకు మోటవర సందివాగున్ను, దక్షిణానకు నెమిళ్లకుంటవాగున్ను, నక్కతిప్పలున్ను, నైఋతికి గోనెల కుంటలసందుకు వచ్చేవాగున్ను, వదిరెవాగున్ను పడమటికి గుళ్లపల్లెచెరువున్ను, మల్లమచెరువున్ను, చవటకుంటలు రెండున్ను, వాయవ్యానకు గురివుకుంట, ఉత్తరానకు కర, యీశాన్యానకు బండ్లదొంక, మొగదొంకను రాంగాను వాగర్తను వెలగకుంటాను తొగకుంటాను సీమాచిహ్నలు—స్వదత్తామిత్యాది. విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః ఆకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనం॥

పొన్నుపల్లె తామ్రశాసనము. ॥

1 కళ్యాణం జగతాం, 2. లీలాద్యూత, 3. భవతుభవతాం, 4. తమోహరేతాం, 5. యస్మాశా, 6. తస్మాదభూత్, 7. వేమక్షితీశో, 8. మాచక్షోణిపతిః 9. వేమాధిపో 10. చూడామణిర్నృపాణాం 11. యత్కీర్తిగానసమయే 12. సోయం వేమమహీపాలో భూపాల పరమేశ్వరః। భూదాన వీరమూర్ధన్యో ధీరోదాత్త గుణోత్తరః। అరామరామేందుమితే శకాబ్దే సర్వధారిణి। ఉపరక్తే సహస్రాంశౌ. మాఘే

బాశ్వయుజాహ్వయే। వప్తేరి శ్రీ పెర్యవిశ్లస్య కళ్యాణగుణశాలినః। ఆక ర్తృకాణాం సాంగానా మాద్యానాం వచసాం విధేః। శ్రీభటభాస్కరా ర్యస్య పౌత్రాయబ్రహ్మవాదినః। అష్టాదశానాం విద్యానా మధ్వన్యస్య మహద్యసు। పుత్రాయవిశ్లయార్యస్య వేద వేదాంగ వేదినః। ఆయుర్వే దంచ సాష్టాంగం నిర్నిరోధమధీతినే॥ 16 ఫణిరాజ మహాభాష్యఫక్కికా పరమేష్ఠినే। కర్మబ్రహ్మపరామర్శ మీమాంసా మాంసళాత్మనే। 17. కణభుగ్గ్రథిత గ్రంథి సింధుమంథానభూభృతే। అక్షపాదమత పేటిక పత్మలీకృతచేతసే। 18. తస్మై కాశ్యపగోత్రాయ సింగనార్యాయ ధీమతే। శాంతాయ శివభక్తాయ యజురామ్నాయవేదినే। 19 ప్రాదా త్రిక లింగవిషయే వేల్నాండోర్ధివిషీమని। కృష్ణవేణ్ణాత్తరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితమ్। 20. పొన్నుపల్ల్యాహ్వయం గ్రామం నిధానం సస్యసంప దామ్। సాష్టైశ్వర్యం సాష్టభోగం ధారాపూర్వం ధరాధిపః 21. అస్య గ్రామస్య చిహ్నాని దేశభాషయాలిఖ్యంతే........ ఈశాన్యానకు పిన్న కుంటసీమలు—శ్రీనాథభట్టరుశాసనాచార్య దక్షిణభాగం వకటి – స్వదత్తా మిత్యాది. విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీవేమభూపతేః ॥

నందమూరు తామ్రశాసనము.

1. కళ్యాణంజగతాం 2. లీలాదూతజితాం 3. భవతుభవతాం 4. తమోహరేణాం 5. యస్మాకౌనిహితం 6. తస్మాదభూత్ 7. వేమ క్షితీశో 8. మాచక్షోణిపతిః 9. వేమాధిపో 10. చూడామణిర్నృపాణాం పెదకోమటి వేమభూపతిర్జయతి 11. సోయంవేమమహీపాలో భూపాల పరమేశ్వరః। భూదానవీరమూర్ధన్యోధీరోదాత్తగుణోత్తరః। శ్రీశాకాబ్దే రామ రామ రామచంద్రాభిసమ్మితే। శరమార్గత్రియోదశ్యాం సితాయాం చాపగేరవౌ, పరవాదీభసింహస్య నృసింహస్యమహాత్మనః। ప్రణప్త్రే వేద

వేదాంగ విద్యావిద్యోతితాత్మనః సోమసుత్వార్వభౌమస్య శ్రీభీమేశ్వర యజ్వనః। పావనోభయదంశస్య పవిత్రాయామితౌజసః । అకర్తృకా ణాం సాంగానామాద్యానాం వచసాంనిధేః। పౌత్త్రియపోతిభట్టస్య పవిత్రా చారశాలినః । పుత్త్రియ గుండయార్యస్య పాండిత్యం(దపురోధసః । మండితస్య యశోహారైః శరకాండవిపాండుభిః । బ్రహ్మసూర్యాది సిద్ధాంతజ్ఞాన వైజ్ఞానికాత్మనే।శ్రీరామ మంత్రోపనిషద్విద్యా విష్కృతి వేశ్మనే । నిత్యాన్నదాన శౌండాయ బ్రహ్మవర్చస శాలినే । అస్మై హరిత గోత్రాయ ధీమతే పెద్దియజ్వనే(పాదా త్త్రిలింగ విషయే కంద్ర వాటాఖ్యసీమని । శ్రీనందమూరు నామానం గ్రామం పారే మలాపహం అస్య గ్రామస్య సీమా చిహ్నాని దేశభాషయా లిఖ్యన్తే .... విద్యాధి కాగ్ శ్రీనాథో వీర శ్రీవేమభూపతేః । అకరోదాకరో వాచాం నిర్మలం ధర్మశాసనమ్ ॥ వీరనారాయణస్య.

ఆలపాటిపేమవరం తామ్రశాసనము.

1. కళ్యాణంజగతాం 2 లీలాద్యోత 3. భవతుభవతాం 4. తమో హరేతాం 5. యస్మైకౌహితం 6. తస్మాదభూత్ 7. వేమషితీశో 8. మాచక్షోణి 9. వేమాధిపో 0. చూడామణిః 11. సోయం వేమమహీ పాలో 12. శ్రీశాకాబ్దే పయోరాశి రామరామేందు సమ్మితే । నందనే మాసిమాఘాఖ్యే శివరాత్ర్యాం రవిగ్రహే । పితుః పితామహో యస్య మహనీయ యశోనిధేః । మాధవో నామ మేధావీ విశ్వవిద్యావిహా రభూః । పితామహో మహావిద్వాన్ యస్య శ్రీగుండయాభిధః । వేదాదీనాం విశుద్ధానాం విద్యానాం జన్మమందిరం । శాపానుగ్రహదక్షో లక్ష్మీనరసింహమంత్రసంసిద్ధః । సకలకవిసార్వభౌమో మాధవభటః పితా యస్య । శ్రీవిశ్వేశ్వర విదుషే భారద్వాజాన్వయావతంసాయ

స్మయవిరహితాయ తస్మై విద్యావినయాన్వితాయ పుణ్యాయ। ప్రాదాత్ త్రిలింగవిషయే వెల్నాండౌ మనోరమే। తుంగభద్రా తరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితం। ఆలపాడురితిఖ్యాతం గ్రామమాచంద్రతారకం। సాష్టైశ్వర్యం సాష్టభోగం ధారాపూర్వం ధరాధిపః। అస్య గ్రామస్య సీమాచిహ్నాని దేశభాషయాలిఖ్యన్తే....స్వదత్తాత్. విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీ వేమభూపతేః। అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనమ్॥ వీరనారాయణస్య.

## రుద్రవరం తామ్రశాసనము

1. కళ్యాణంజగతాం 2. లీలాద్యూతజితాం 3. మానుషాకార 4. తమోహరేభ్యం 5. యస్మా 6. తస్మాదభూత్ 7. వేమక్షితీశో 8. మాచక్షోణిపతిః 9 చూడామణిర్నృపాణాం 10. అభిమన్యుకర గ్రాహ్యం 11. యత్కీర్తిగానసమయే 12. శ్రీశైలేస్థిరమూలతాం 13. శాకాబ్దేశశివార్ధివిశ్వగణితేవర్షే వికార్యాహ్వయే। మాసే మార్గశిరో భిధే గ్రహపతౌ చాపంపమాసేదుషి। సోయం విప్రగణాయ వేదవిదుషే ధారాపయఃపూర్వకం। గ్రామం రుద్రవరాహ్వయం గుణనిధి శ్రీవీర నారాయణః॥ (క్రియాపదములేదు.) 14 అథాస్మిణ వేమభూపతినా సాష్టైశ్వర్యం సాష్టభోగంచ సర్వమాన్యతయా దత్తే కోటభూమి విభూషణే రుద్రవరనామనిగ్రామే వేదశాస్త్రపారంగతాః శ్రౌతస్మార్తానుషాననిష్ఠా అనూపానసంతతయః ప్రతిగ్రహీతారో వర్ణ్యంతే 15 బ్రహ్మ సూర్యాది సిద్ధాంతరహస్యార్థైకవేదినా। జ్యౌతిషజ్యోతిషామీసత్రైత్రి-కాల్య మపరోక్షితం 16. సోయం పోతయభట్టస్య నప్తా గుండయభట్టస్య పౌత్త్రిః పెద్దియజ్వనఃపుత్త్రిః గంగాధరజ్యౌతిషికాగ్రజన్మా రామచంద్ర

జ్యౌతిషికః హరితగోత్రః త్రయస్త్రింశద్భాగః ఇత్యాది - గ్రామసీమా చిహ్నాలు.స్వదత్తామిత్యాది - విద్యాధికారీ శ్రీనాథోవీరశ్రీ వేమభూపతేః.

మూలఁగూరమ్మ కొండమీఁది శాసనము.

ఈ శాసనమును అమీనాబాదుకుపోయి, నేనే పరిశీలించి వచ్చితిని. అది కొండమీద గుడికడ జారుబండపై చెక్కబడియున్నది. ఇరువది బంతులున్నవి. 8 1/2 బంతులు స్పష్టముగా చెక్కఁబడినవి. అవియిం దుదాహరింపఁబడిన రెండుపద్యములు. 11 1/2 బంతులు అక్షరములు పయిపయిని జెక్కఁబడినవి గావున కొంతకొంత చెఱిగిపోయినవి, చదువరాకున్నవి. అందు పడిదరము మూలఁగూరు పలకలూరు గ్రామముల సీమాచిహ్నాలు వ్రాయఁబడినట్లు కొంతకొంత చదువఁదగియుండుటచేఁ దెలిసికొనఁగల్గినాను. "విశ్వోత్తరుం డన్నవేమ-భూపాలుండు" అని స్పష్టముగా శాసనమునఁ గానవచ్చుచున్నది. ఆ రెండు సీస పద్యములు నొక్కనిచేఁ జెక్కఁబడినవే. పెదకోమటి వేమారెడ్డి నాటివే మొదటిపద్యము అనవేమారెడ్డిధర్మమును జెప్పునది.

సీ. శాకాబ్దములు సహస్రమును నిన్నూంట లొం
బదియెనిమిది యగు భవ్యసంఖ్య
గలిగి యొప్పారెడు నలవత్సరంబున
మాఘమాసము పూర్ణిమా దినమున
విశ్వోత్తరుం డన్న వేమభూపాలుండు
తమకులస్వామిని కమృతకిరణ
రేఖావతంసకు శ్రీమూలఁగూరమ్మ
కఖిలజగన్మాత కంగరంగ

శృంగారశ్రీనాథము

గీ. భోగసంసిద్ధికై ధారవోసియిచ్చె
గ్రామములు మూఁడు శ్రీకోటభూమియందుఁ
బడిదరము మూలగూరంబ (వ) పలకలూరు
వానఖచరేంద్రు డాచంద్రతారకముగ.

సీ. కర్మపత్రప్రాప్త సామ్రాజ్యసింహాసనా
ధ్యాసియై యఖిలరాజాధిరాజ
పరమేశ్వరుం డాజిపార్థుండు పెదకోమ
టన్న వేమాధీశుఁ డర్థిసురభి
తనకూర్మి పినతండ్రి యనవేమభూపతి
చేసినపుణ్య మూర్జితముగాఁగ
నీ గ్రామములుమూఁటి కెల్లకాలంబు భో
గైశ్వర్యసర్వమాన్యతల నొసఁగె

గీ॥ నంబికకు మూలఁగూరమ్మ కఖిలజనని
కర్థిఁగట్టించె భువన మోహనముగాఁగ
సమధికోన్నతి స్థంభకషంబులైన
గుడియుఁబ్రాకారవలయంబుఁ గొమరుమిగుల.

కొండూరు శాసనము.

ఇది గొప్పతామ్రశాసనము. అముద్రితము. ఓరియంటల్ లైబ్రరీలోనున్నది. విస్తరభీతిచే సమగ్రముగా నుదాహరింపఁ జాల కున్నాడను. శ్లో. మరీచి బ్రహ్మణః పూర్వం బ్రహ్మణాం కాశ్యపోఽభని। జగత్పితామహో యస్య సాక్షాద్దేవః పితామహః.... తద

న్వయే సముత్పన్నా బ్రహ్మణ్యా బ్రహ్మవాదినః । యజ్వానస్సర్వ యజుషాం ద్రష్టాంతా దృష్టిపావనాః । తేషాం మహాన్వతే వంశే సంజాతో రాజభూషణః। సువృత్తో రుచిరః కశ్చిన్ముక్తామణిరివద్విజః । సర్వజ్ఞతా మనితరాస్పద మీశ్వరత్వం । లోకోత్తరం సుచరితం జిత మన్మథత్వం । అత్యప్రసాదమపి సత్ఫలదం విలోక్య । యం చంద్ర భూషణ ఇతి ప్రవదంతి లోకాః....విశ్వం విస్మయతే య స్స్వగుణ గ్రామైః ప్రతిక్షణం ససర్వజ్ఞః క్రియాశక్తి రాత్మా యస్య తపోమయః ....తస్య శ్రీచంద్రభూషణాచార్యస్య చరణసరసిజ ... రాజాధిరాజో మహారాజ పరమేశ్వర శ్రీమన్మహామండలేశ్వర శ్రీవీరబుక్క భూపాలః ... చంద్రభూషణాచార్యాయ.... రిపుబలారణ్యసమున్మూలన నిజభుజ శ్రమవిజయమహోత్సవం ..సమర్పితవాన్-కించ శ్రీచంద్ర భూషణాచార్యపదపంకజయో స్తథా గ్రామం కొండూరునామానం బుక్కక్ష్మాపతిరార్పయత్. .. యతీంద్రస్య క్రియాశక్తిగురోః ప్రీతయే శ్రీచంద్రభూషణాచార్యః...కొండూరునామానం గ్రామం ద్విపంచాశ ద్బ్రాహ్మణేభ్యః ప్రజాయ క్రియాశక్తి గురోరుపదేశయతి నామ్నా తస్య గ్రామస్య దేవేశపురమితి నామ కృతవాన్.

నవనాథచరిత్ర పీఠికనుండి.

ద్వి. ఒకనాఁడు మద్భాగ్యయోగంబుకతన, శ్రీమహానీయ ప్రసిద్ధిఁ బెంపెసఁగ, శ్రీమల్లికార్జున శ్రీమహాలింగ, సర్వలోకోత్తమ సామ్రాజ్యభార, నిర్వాహకప్రౌఢనీతికోవిదుఁడు, కుహనావిరుదజైన కోలాహలుండు, మహితబిజ్జలరాయమానమర్దనుఁడు, సన్నుతశైవ దీక్షాగురుం డనమ, సన్నాహగజపతిసప్తాంగహరుఁడు, శ్వేతాంబర ప్రాజ్ఞవితతజీమూత, జాతమహోదగ్రి జంఝూనిలంబు, పరసమయాం

భోధి బడబానలుండు. వరశరణాగత వజ్రపంజరుఁడు. మలయ మౌక్తిక కంఠమాలిక మెఱయఁ, గరభూషణంబుల గలవజ్రరుచులు, పరగి నభోమణిప్రభలపై సడఁగ తళతళ మను నవతంస మాణిక్య, లలిత కాంతులు కపోలములపై బొలయ, సవరగాఁ జుట్టిన జడల నెట్టె మునఁ, జివురుకెంజాయమించిన పాగమెరయ, పొలుపుగాఁ గర్పూర మున మేళవించి, పలుచగా నలఁదిన భసితాంగరాగ, సన్నుతోజ్జ్వల కాంతిచంద్రికల్ జనుల కన్నుఁగల్వలకు వికాసంబు నెఱప, ప్రమథ వర్గము గొల్వ రజితాద్రిమీఁద ప్రమదమారఁగనున్న పరమేశుఁడనగ ....రూఢికెక్కిన మునీంద్రులు తత్త్వవిదులు, మఱి పదవాక్యప్రమాణ జ్ఞులగుచు, బరగువిద్వాంసులు బహువిధకావ్య, నాటకాలంకారవైషణిఁ జాల, జాటువ కెక్కిన సత్కవీశ్వరులు, నలరాగదోషంబు లాఱు నెప్పిడియుఁ, దొలఁగించి గుణము లైదును రెండ నెలమిఁ, దలకొని గాత్రయంత్రమ్ములనేర్పు, గలిగి వాసికి నెక్కు గాయకోత్తములు,... దొరలు భృత్యులు సహాత్యులు పురోహితులు, పరిచారకులు రాయ బారులు పెద్ద, వరులు దైవజ్ఞులు వరుసతోఁ గొలువ ... నిరుపమ శివతత్త్వ నిర్మలమతికి, పావసునకు సర్వభాషావిశేష, కోవిదునకు రాయగుణశిఖామణికి, దుర్వారవైనసింధురమృగేంద్రునకు, సర్వజ్ఞ నకు ము కిళాంతరాయినికి.

దాక్షారామ శాసనము.

"శకవర్షంబులు ౧౩౦౩గు నేంటి వైశాఖ శు ౧౦గు"

సీ. నందిదీపావళి నాట్యకలాబహో
    మ శనివారగయార్క మంటపములు
  తిరు చుట్టుమాలియ దివ్యలింగంబులు
    గుళ్లు వజ్రింపు టాకోటగోపు

రములు పాతాళగేహములు సోపానభాం
డాగార వివిధధాన్యాలయములు
వంటయిండ్లు (?) సతుర్ద్వారవాటములు (న)
పేర్మిమహా శారామ భీమనాథు

గీ. నగరనాచంద్రతారకోన్నతులు దిశల
వెలయజేయించె ననవేము (వేచురాను?)
విజయచండర్థముని? జగనొబ్బగండఁ
దహిత ఖండనోద్ధతదోర్దండమండనుండు.

సీ. అమరాద్రిభీమేశ్వరావాస మధిస
ప్తకము శ్రీసప్తగోదావరంబు
వలయాచలేంద్రంబు వజ్రపుఱాకోట
కులపర్వతంబులు గోపురములు
తిరుచుట్టుమాలియ యరవిందజాండ మ
మర్త్యలోకము నాట్యమండపంబు
పరివారదేవతా భవనంబు లీచతు
ర్దశభువనమ్ములు (వా) రకములు

గీ కనకకుంభతతులుగాఁగ దాక్షారామ
మన్నపీ (పోత?) వేమనానుజుండు
కడు నపూర్వసృష్టిగావించి వాసన
కెక్క (శ్రీవేమ నియతయశుఁడు?)

—ప్రికాశభారతీయోగి కావ్యము.



శృంగారశ్రీనాథము

# కొన్ని సవరణలు

| | పుట. | పంక్తి |
|---|---|---|
| శృంగారశ్రీనాథము | 9 | |
| సౌష్ఠవము | 20 | 2 |
| నుదోగ్ధ | 20 | 13 |
| ఘోషించె | 58 | 2 |
| సాధకము | 65 | 23 |
| ప్రధాన | 80 | 23 |
| సుగంధ | 81 | 2 |
| గృతి ఇప్పుట సంగత | 240 | 23 |
| మగను. | 241 | 1 |
| ధారము | 260 | 13 |
| మన్నం | 264 | 18 |

